# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 15 సంచిక : 4 హైదరాబాద్ 189 ఏప్రిల్ 2017 పేజీలు : 68 రు. 20

* భావ ప్రకటనా స్వేచ్ఛకు జీవిత ఖైదు
* భ్రమల కల్పనలో తెలంగాణ బడ్జెట్
* అప్పులే ఆధారంగా ఆంధ్రప్రదేశ్ బడ్జెట్
* దేవతలకు మొక్కులు - లౌకిక పాలన
* ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు
* ఎచ్ 1 వీసాలపై అమెరికా ఆంక్షలు
* విద్వేషాన్ని పెంచుతున్న ఫాసిస్టు నేతలు

189 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఏప్రిల్ 2017
సంపుటి : 15
సంచిక : 04



| | | | |
|---|---|---|---|
| ❖ పాఠకుల వీక్షణం | | | 4 |
| ❖ సంపాదకీయం | ◆ నాజీజం విస్తరణ ఉత్తరప్రదేశ్ ఉదాహరణ | | 5 |
| ❖ సంపాదకీయ వ్యాఖ్యలు | ◆ తిరోగమన చిహ్నాల తెలంగాణ బడ్జెట్ ◆ మాటల్లో కోటలు దాటిన ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ | | 6 |
| | ◆ ప్రపంచానికి సిరియా నేర్పుతున్న పాఠాలు | | 7 |
| ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు | | | 8 |
| ❖ దేశీయం | - అబద్ధాల కేసులో అన్యాయమైన తీర్పు | - ఎన్. వేణుగోపాల్ | 9 |
| ❖ సంస్మరణ | - వకుళాభరణం లలిత | | 12 |
| ❖ " | - భారత న్యాయ వ్యవస్థ పయనమెటు? | - చిమ్మె జాన్ బర్నబాస్ | 13 |
| ❖ ప్రాంతీయం | - భ్రమపెట్టే తెలంగాణ బడ్జెట్ | - డా. అక్కెనపల్లి పున్నయ్య | 14 |
| ❖ " | - అప్పులే ఆధారంగా ఎపి బడ్జెట్ | - షేక్ కరిముల్లా | 18 |
| ❖ దేశీయం | - నిరాశపరిచిన విద్యారంగ బడ్జెట్ | - డా. సిలువేరు హరినాథ్ | 21 |
| ❖ " | - ఐదు రాష్ట్రాల ఎన్నికలు - హిందూత్వ ఎజెండా | - బైరెడ్డి సతీష్ | 22 |
| ❖ వ్యాఖ్య | - ఎన్నికల ఫలితాలు - గమనించాల్సిన విషయాలు | - ఎం. కృష్ణ ఆదిత్య | 25 |
| ❖ దేశీయం | - మారుతి కార్మికులకు జీవిత ఖైదు | - పి. ప్రసాద్ | 27 |
| ❖ " | - భయమే దాడులకు మూలకారణం | - దేవి | 29 |
| ❖ ప్రాంతీయం | - దేవతలకు మొక్కులు - లౌకిక పాలన | - గొడితాల వెంకటేశ్వర్లు | 32 |
| ❖ దేశీయం | - ఎవరు దేశ ద్రోహులు? | - బి. రామకృష్ణ | 34 |
| ❖ అంతర్జాతీయం | - జాతి విద్వేషాన్ని పెంచుతున్న ఫాసిస్టు నేతలు | - ఎ. నర్సింహా రెడ్డి | 38 |
| ❖ " | - ఎచ్ 1 వీసాలపై అమెరికా ఆంక్షలు | - జి. కిరణ్ | 41 |
| ❖ దేశీయం | - తమిళ తంబి చెవిలో పూలు | - రాజేంద్రబాబు అర్విణి | 42 |
| ❖ " | - దేశ పునర్నిర్మాణమే అంబేద్కర్ స్ఫూర్తి | - డా. కత్తి పద్మారావు | 46 |
| ❖ ప్రాంతీయం | - ప్రైవేట్ ట్రావెల్స్ ప్రమాదాలు | - ఎం.కె. కుమార్ | 48 |
| ❖ చరిత్ర | - మళ్లీ పెరుగుతున్న మార్క్స్ ప్రాధాన్యత | - ఇ.ఎస్. బ్రహ్మచారి | 51 |
| ❖ చర్చ | - కులం-బహుజన ప్రజాస్వామిక విప్లవ దశ-2 | - డా. పట్టా వెంకటేశ్వర్లు | 56 |
| ❖ దేశీయం | - డచ్ రోగం - 'జనతన' వాక్సిన్ - 2 | - వెన్నెలకంటి రామారావు | 60 |
| ❖ ఈనేల | | - వై. రామచంద్రం | 63 |
| ❖ ఇరుగు-పొరుగు | | - వై. రామచంద్రం | 64 |
| ❖ భూగోళం | | - సి. రాజశేఖర్ | 65 |
| ❖ అసహజ మరణాలు | | - ఎస్. వెంకటేష్ | 66 |



**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫ్యాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 మార్చ్ నెలలో వచ్చిన విరాళాలు - డా. డి. ప్రవీణ్, వరంగల్ - రు. 6,000; సూరపనేని జనార్దన్ రావు మెమోరియల్ ట్రస్ట్, విజయవాడ - రూ. 5000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

ఫిబ్రవరి సంచికలో 'విస్ఫోటన అంచుకు చేరుతున్న అంతరాల వ్యవస్థ' సంపాదకీయం వాస్తవికతకు అద్దం పట్టింది. 'నోట్ల రద్దు అవివేక చర్య' అమర్త్యసేన్ వ్యాసం ఆకట్టుకోవడమే గాకుండా ఆద్యంతం చదివింపజేసింది.

**– బిక్కునూరి రాజేశ్వర్**
పొన్కల్, జిల్లా నిర్మల్

నేను అప్పుడప్పుడు వీక్షణం చదువుతుంటాను. నేను ఇంటర్‌మీడియెట్ తెలంగాణ రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల సర్వేల్‌లో చదువుతున్నాను. ఇప్పుడున్న యువత వెళ్తున్న దారి పత్రికలో వస్తున్న అంశాల తీరును మనసులో అనుకొని పత్రికను నా మిత్రులకు పరిచయం చేయడానికి సంకోచించాను. నేను నా బాక్స్ సదురుతున్నప్పుడు అనుకోకుండా పత్రిక నా మిత్రులు వంశీ, నవీన్‌ల కంట పడింది. వాళ్లు దాన్ని చదివి, ఇది 'ప్రజాపత్రిక' అని కితాబిచ్చారు. ఈ పత్రిక మీకు ఎందుకంత నచ్చిందని అడిగితే వారి సమాధానం 'ఈ పత్రికకు ముక్కుసూటిగా, నిక్కచ్చిగా నిజాలు చెప్పేతత్వం ఉంది. ఈ వ్యవస్థ అసలు స్వభావం తెలిసిన ఎంతో మంది మేధావుల అభిప్రాయాలు ఈ పత్రికలో వ్యాసాలుగా రూపుదాలుస్తున్నాయి. ఈ పత్రికకు మేము చందాదారులం అవుతాం. వీక్షణాన్ని మా ప్రాంతాల్లోని ప్రజలకు కూడా పరిచయం చేస్తాం' అన్నారు. అప్పుడు నేను మిగతా విద్యార్థులకు కూడా పత్రికను పరిచయం చేశాను. వారి నుండి విశేష స్పందన లభించింది. సెల్‌ఫోన్‌లు, సినిమాలు, ఫ్యాషన్ అంటూ తిరిగే నేటి యువతకు ఈ పత్రికను అవగాహన చేసుకునే ఓపిక అసలు ఉందా? అనే నా సందేహాన్ని పటాపంచలు చేస్తూ నా మిత్రుల నుండి వచ్చిన స్పందన ఈ పత్రిక విశిష్టతకు నిదర్శనం. నేను హాస్టల్లో ఉన్న రెండు సంవత్సరాల్లో వీక్షణాన్ని ట్రంక్ పెట్టెకే పరిమితం చేసినందుకు సిగ్గుపడుతున్నాను. ఇకనైనా ఈ పత్రికను నా పరిచయంలోకి వచ్చిన మిత్రులకు పరిచయం చేస్తాను.

**– రవి**
తంగళ్లపల్లి

వీక్షణం మార్చ్ సంచికలో నిరుద్యోగుల ఆందోళనపై దమననీతి వ్యాసం ఉద్యమ పార్టీ అని పేరు చెప్పుకొని అధికారంలోకి వచ్చిన టిఆర్ఎస్ పార్టీ అసలు స్వభావాన్ని తేటతెల్లం చేసింది. తాము అధికారంలోకి వచ్చాక నీళ్లు, నిధులు, నియామకాలను తెలంగాణ ప్రజలకు అందుబాటులోకి తెస్తామని వాగ్దానం చేసింది. ఆ వాగ్దానాన్ని నెరవేర్చకపోగా, నిరుద్యోగుల నిరసనను కూడా కంటగింపుగా భావించి అణచివేసి, శ్మశాన శాంతిని స్థాపించే ప్రయత్నం చేస్తోంది. ఉద్యమం ఆశించిన, గత ప్రభుత్వాలు మూసివేసిన ప్రభుత్వ రంగ సంస్థలను తెలంగాణ ప్రభుత్వం తిరిగి తెరిపించకపోవడమనేది గత ప్రభుత్వాలకు తీసిపోమని నిరూపించింది. ఇలాంటి వ్యాసాలు పాలకుల స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడతాయి. ఆ వైపుగా కృషి చేస్తున్న వీక్షణం పత్రికకు కృతజ్ఞతలు.

**– పి. యాదయ్య**
ధర్మపురి

'ట్రంప్ చర్యలు – ప్రపంచ పరిణామాలు' వ్యాసం బాగుంది. అటు యూరప్‌లో జరిగిన పరిణామాలు, ఇటు అమెరికా అధ్యక్ష ఎన్నికల ఫలితాలపై విశ్లేషణాత్మకంగా రాశారు. అయితే అంతర్జాతీయ పరిణామాలపై వచ్చే వ్యాసాలు కేవలం అమెరికాకే పరిమితం కావడం లోటుగా కనిపిస్తోంది. ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న పరిణామాలపై, వాటి ప్రభావం భారతదేశంపై ఎలా ఉండబోతుంది అనే విషయాలపై వివరణాత్మకంగా, విశ్లేషణలతో వ్యాసాలు వస్తే ఉపయోగకరంగా ఉంటుంది. ఒకే అంశంపై ఇద్దరు ముగ్గురు రచయితల అభిప్రాయాలు రావడం బాగుంది. అట్లాగే అంతర్జాతీయ వార్తలపై దృష్టి సారించాలని విజ్ఞప్తి.

**– బి. నాగరాజు**
మిర్యాలగూడ

బోరేవాలా ముస్లింల బతుకు చిత్రం గురించిన వ్యాసం చదివిన తరువాత వారి జీవన పరిస్థితుల గురించి తెలుసుకొని చాలా ఆశ్చర్యమేసింది. ముస్లింలలో కూడా వర్గాల వారీ విభజన ఉంటుందని తెలుసుకోగలిగాను. వారికి ఆ పేరు వారి కుల వృత్తి ద్వారా వచ్చింది. బోరేవాలాల గురించి వివరణ చాలా బాగుంది. వారి జీవనశైలి, వారి మూలాలు, వారి పట్ల ముస్లిం మతంలోనే ఉన్న వైరుధ్యాలు, వారి ఆర్థిక పరిస్థితి, ఒక చోట స్థిర నివాసం లేకుండా వారి సంచార జీవితాన్ని చక్కగా వివరించారు. భారతదేశంలో ఇంకా ఎన్నో సంచార జాతులు ఉన్నాయి. వాటి మూలాలు, ఇప్పుడు వారి జీవన శైలి గురించి వివరంగా వ్యాసాలు ప్రచురిస్తే పరిశోధక విద్యార్థులమైన మాకు ఉపయోగకరంగా ఉంటుంది. వీక్షణంకు ధన్యవాదాలు.

**– పి. రవికుమార్**
ఖమ్మం

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా కల్పిస్తామని ప్రతి రాజకీయ పార్టీ ఎన్నికల వాగ్దానంలో ప్రకటించింది. అధికారానికి వచ్చిన తెలుగుదేశం పార్టీ పది సంవత్సరాల ప్రత్యేక హోదా తెస్తానని ఎన్నికలకు ముందు ప్రకటించింది. కాని అధికారంలోకి వచ్చాక దాని ఊసే ఎత్తడం లేదు. కేంద్ర మంత్రి వర్గంలో స్థానం సంపాదించిన ఎంపిలు ఇప్పుడు ఆ మాటను దాటవేస్తున్నారు. 'ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక హోదా' వ్యాస రచయిత డా. గోవాడ వీర్రాజు అన్నట్లు తమిళనాడు ప్రజలు జల్లికట్టు కోసం మెరీనా బీచ్‌లో ఆందోళనలు జరిపినట్టు ఆంధ్రప్రదేశ్ ప్రజలు కూడా విశాఖ తీరంలో ఆందోళన నిర్వహించినా అది ఒక సినిమా షోగా ముగిసిపోయింది. మనకు కావాల్సింది సినిమా హీరోలు కాదు. నిజమైన ప్రజా నాయకులు, ప్రజలను ముందుకు నడిపించే నాయకులు కావాలి. రచయిత చెప్పినట్లు ప్రత్యేక హోదా కోసం ప్రజలంతా ఐక్యంగా ఉద్యమించి సాధించుకుందాం.

**– సిఎచ్. విద్యాధర రావు**
విశాఖపట్నం

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# నాజీజం విస్తరణ ఉత్తరప్రదేశ్ ఉదాహరణ



భారత ఫాసిజానికి యూరపియన్ ఫాసిజంతో స్థలకాలాలను బట్టి తేడాలు ఉన్నట్టే, స్థలకాలాలను అధిగమించిన పోలికలూ ఉన్నాయి. మతావేశం, పెట్టుబడి ప్రోత్సాహం, హింసారాధన, భిన్నాభిప్రాయం పట్ల అసహనం, ప్రజాస్వామ్యాన్ని తిరస్కరించడానికి తొలిదశలో పార్లమెంటరీ ఎన్నికలను వాడుకోవడం, మధ్యతరగతిలోని భ్రమలు, తప్పుడు చైతన్యం వంటి అంశాలలో ఆ పోలికలు బాగా కనబడుతున్నాయి. మత విద్వేషాలను రెచ్చగొట్టి, హింసా దౌర్జన్యాలతో మైనారిటీ మతస్తులను భయభీతావహంలో ముంచి, మెజారిటీ మతానికి తానే గుత్తేదారునని ప్రకటించుకుని అధికారానికి రావడానికి ప్రయత్నించిన సంఘ పరివారం, అధికారంలోకి రాకముందు చూపిన ఫాసిజం చిహ్నాలనే అధికారంలోకి వచ్చాక మరింత పెద్ద ఎత్తున చూపుతున్నది. ఉత్తరప్రదేశ్ ఎన్నికల విజయం, విజయానంతర చర్యలు, ప్రసంగాలు సరిగ్గా నాజీజం–ఫాసిజం విస్తరించిన 1930ల జర్మనీ – ఇటలీల సామాజిక పరిస్థితులను గుర్తు తెస్తున్నాయి.

భారత దేశంలో పార్లమెంటరీ ఎన్నికలనే ప్రజాస్వామ్యంగా భ్రమపడే వారి కళ్లు తెరిపించేలా ఉత్తరప్రదేశ్‌లో అత్యధిక స్థానాలు సాధించిన భారతీయ జనతా పార్టీ విజయాన్ని ఫాసిజం – నాజీజం నేపథ్యంలో, భారత సామాజిక స్థితి నేపథ్యంలో అర్థం చేసుకుంటేనే గాని సరైన అవగాహనకు రాలేము. మొదటి ప్రపంచానంతరం జర్మనీ మీద మిత్ర రాజ్యాలు విధించిన ఆంక్షలతో జర్మన్ సమాజంలో పెరిగిన రాజకీయార్థిక సంక్షోభాన్ని, ప్రజల అసంతృప్తిని వాడుకుని క్రమక్రమంగా బలపడి పద్నాలుగు సంవత్సరాలలో అఖండ విజయం దాకా సాగిన హిట్లర్ నాజీ పార్టీ లాగనే, ప్రపంచీకరణ యుగంలో యువతరంలో పెరుగుతున్న నిరుద్యోగాన్ని, అసంతృప్తిని, అభివృద్ధి ఆకాంక్షలను వాడుకుంటూ, బూటకపు శత్రువులను కారణంగా చూపుతూ మత విద్వేషాలు రెచ్చగొడుతూ సంఘ పరివార్ శక్తులు ఎన్నికల విజయం దాకా వచ్చాయి. భారత సమాజంలో పార్లమెంటరీ ఎన్నికలు ఎప్పుడూ నిజమైన ప్రజాభిప్రాయ చిహ్నాలుగా లేకపోయినప్పటికీ, అతి తక్కువ మంది ప్రజల అభిప్రాయాలను మార్చి, ఏమార్చి, ఇతరేతర తక్షణ, అవాంఛనీయ, అసాధ్యమైన ప్రలోభాలకు గురిచేసి, భావోద్వేగాలు రెచ్చగొట్టి ఓట్లు సంపాదించడం పాలకవర్గ పార్టీలన్నీ నేర్చుకున్న విద్యే. సరిగ్గా అదే విద్యను పుణికి పుచ్చుకున్న భారతీయ జనతా పార్టీ ఒకవైపు అభివృద్ధి ఆకాంక్షలను, మరోవైపు హిందుత్వ మతవాదాన్ని ఆయుధాలుగా పట్టుకుని ఎన్నికల రణరంగంలోకి దిగింది. కేంద్ర ప్రభుత్వ పగ్గాలు చేపట్టింది. రెండున్నరేళ్ల పాలనలో మరింత ఎక్కువ అసంతృప్తినే మూట గట్టుకున్నప్పటికీ, రానున్న కేంద్ర ఎన్నికలకు రిహార్సల్ వంటి ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో అది మరొక ప్రయోగం చేసింది. జనాభాలో ఇరవై శాతం ఉన్న ముస్లింలకు నాలుగువందల స్థానాలలో ఒక్క స్థానం కూడ ఇవ్వకుండా తాను అధికారానికి వస్తే వారి పట్ల ఎటువంటి వైఖరి ఉంటుందో చూపింది. అప్పటికే బహుజనుల పార్టీగా పేరున్న సమాజ్ వాద్ పార్టీని, దళితుల పార్టీగా పేరున్న బహుజన్ సమాజ్ పార్టీని ఆర్థికంగా, రాజకీయంగా బలహీన పరచడానికి అన్ని ఎత్తుగడలూ పన్నింది. ఆయా వర్గాలలోనే ఆ పార్టీల పట్ల ఉన్న అసంతృప్తిని తనకు అనుకూలంగా మలచుకోవడానికి ప్రయత్నించింది. ఒక్క మాటలో చెప్పాలంటే సామ, దాన, భేద, దండోపాయాల చాణక్య నీతిని అనుసరించింది. మొత్తానికి 403 స్థానాలలో ఎవరూ ఊహించని విధంగా 312 స్థానాలు సంపాదించింది. ఆ 312 మంది శాసనసభ్యులలో ఉత్తరప్రదేశ్ ను పాలించగల నాయకుడు ఒక్కరూ లేనట్టు, పార్లమెంటు సభ్యుడైన కాషాయ యోగిని, ఒక సంపన్న మఠాధిపతిని, యోగి ఆదిత్యనాథ్ (అజయ్ సింగ్ బిష్త్) ను ముఖ్యమంత్రిని చేసింది.

ఆదిత్యనాథ్ చరిత్రకెక్కిన వివాదాస్పద నాయకుడు. "ఒక హిందువును ఒక ముస్లిం చంపితే రాజ్యం దగ్గరికి వెళ్లి దేహీ అని ఎఫ్ఐఆర్ రాయించం, పది మందిని చంపుతాం" అన్నవాడు. "ముస్లింలు ఒక హిందూ యువతిని తీసుకుపోతే హిందువులు వందమంది ముస్లిం యువతులను తీసుకురావాలి" అన్నవాడు. "యోగ చేయనివారు, శివుణ్ణి పూజించని వారు దేశం వదిలిపోవాలి" అన్నవాడు. "స్త్రీలను అదుపులో ఉంచకపోతే విధ్వంసకరంగా, పనికి మాలినవారుగా తయారవుతారు" అన్నవాడు, "పురుషుడు స్త్రీ లక్షణాలను సంతరించుకుంటే దేవుడు అవుతాడు, స్త్రీ పురుష లక్షణాలను సంతరించుకుంటే మాత్రం రాక్షసి అవుతుంది" అన్నవాడు. మనుస్మృతిలో స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వగూడదన్న శ్లోకాన్ని సానుకూలంగా ఉటంకించినవాడు. 2007లో తన పార్టీ అభిప్రాయానికి కూడ భిన్నంగా మహిళల రిజర్వేషన్ బిల్లును లోకసభలో వ్యతిరేకించిన వాడు. అయోధ్యలో బాబ్రీ మసీదు విధ్వంసాన్ని సమర్థించినవాడు, రామమందిర నిర్మాణం చేస్తామని అన్నవాడు – ఒక్క మాటలో చెప్పాలంటే హిందూ బ్రాహ్మణ మనువాద దౌర్జన్య సంస్కృతికి సంపూర్ణ ప్రతినిధి. ఆయన అధికారం చేపట్టి ఇది రాస్తున్న సమయానికి ఇంకా వారం పూర్తి కాలేదు గాని, ఉత్తర ప్రదేశ్‌లో రానున్న పాలన ఎలా ఉంటుందో చూపడానికా అన్నట్టు ఈ వారం రోజుల్లోనే, ఒక్క మంత్రివర్గ సమావేశం కూడ జరపకుండానే, తనదే సర్వాధికారమన్నట్టుగా ఎన్నెన్నో నిర్ణయాలు, చర్యలు ప్రకటించాడు.

మంత్రుల ఆదాయాలు ప్రకటించాలని, శుభ్రత పాటించాలని, ప్రభుత్వ కార్యాలయాలలో, ఆస్పత్రులలో, విద్యాలయాల్లో పాన్ వాడగూడదని, రహదారుల మీద గుంతలన్నీ మరమ్మత్తు చేయాలని ఆదేశిస్తూ మధ్యతరగతిని ఆకర్షించే కొన్ని చర్యలు ప్రకటించాడు గాని, వాటి కన్న ముఖ్యంగా పశు వధశాలలను మూసివేస్తూ, వీధుల్లో యువతీ యువకులు కలిసి తిరగడాన్ని నిషేధిస్తూ, మైనారిటీ వ్యతిరేక చర్యలు, స్త్రీ పురుష సమానత్వానికి వ్యతిరేక చర్యలు ప్రకటించాడు.

ముఖ్యమంత్రి అయిన కొద్దిగంటల్లోనే బహుజన సమాజ్ పార్టీ నాయకుడి కాల్చివేత, రాష్ట్రవ్యాప్తంగా రోమియో వ్యతిరేక బృందాల పేరుతో అధికారాన్ని, చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకుని యువతీ యువకుల్ని వేధించే తుంటరుల బృందాల విజృంభణ, చట్టవ్యతిరేక పశువధశాలల మూసివేత పేరుతో ముస్లింల ఆహారపుటలవాట్ల మీద, ఉత్తరప్రదేశ్‌లో అతి ఎక్కువగా సాగే మాంసం వ్యాపారం మీద దాడులు చేయడం మొదలయ్యాయి. హిట్లర్ పాలనా విధానాలకు వ్యతిరేకత ఇంకెంత మాత్రమూ నినాదంగా మాత్రమే మిగిలిపోవడానికి వీలులేదు, ఆచరణాత్మక ప్రతిఘటనకు సమయం ఆసన్నమవుతున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# తిరోగమన చిహ్నాల తెలంగాణ బడ్జెట్

ఆర్థిక వ్యవహారాలలో చెప్పిన మాటకు కట్టుబడి ఉండకపోవడం, కేటాయింపులలో కోత విధించడం, అవసరమైన రంగాలకు కేటాయించక పోవడం, అనవసరమైన రంగాలకు కేటాయించడం, భారీ అంకెలు ప్రకటించి మాయ చేయడానికి ప్రయత్నించడం, వర్తమానానికీ, భవిష్యత్తుకూ కూడ ప్రమాదకరమైన అప్పుల ఊబిలోకి దించడం, ఆర్థిక నిర్వహణ, అభివృద్ధి పేరుతో కాలం చెల్లిన సామాజిక ధర్మానికి పెద్దపీట వేయడం తిరోగమన చిహ్నాలైతే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వపు 2017-18 బడ్జెట్ అక్షరాలా ఆ పనులన్నీ చేసి తిరోగమన దిశలో తాను ఎంతదూరం వెళ్లదలచుకున్నదో చూపింది. ఏ ఒక్క అంకెలోనూ హేతుబద్ధమైన, ఆచరణసాధ్యమైన, విశ్వసనీయమైన ప్రవర్తన లేకపోవడం సాధారణంగా దేశంలోని పాలకవర్గాలన్నీ అనుసరిస్తున్న ఆర్థిక నీతియే గనుక కోతలు, అవసరమైన రంగాలకు తక్కువ కేటయింపులు, అనవసరమైన రంగాలకు ఎక్కువ కేటాయింపులు వంటి వాటి గురించి పెద్దగా మాట్లాడనక్కర లేదు. కాని, తెలంగాణ సమాజ చైతన్యానికి వ్యతిరేకమైన రెండు అంశాలను మాత్రం ఎత్తిచూపక తప్పదు. మొదటిది రుణభారం. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు నాయుడు పాలనా కాలంలో రుణభారం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతుండగా వ్యతిరేకించినదీ, నిరసించినదీ తెలంగాణ సమాజం. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ క్రమంలో బలంగా వెలికి వచ్చిన నినాదం ప్రపంచ బ్యాంకు అప్పుల పట్ల వ్యతిరేకత. 2004 ఎన్నికల్లో చంద్రబాబు ఓటమికి ప్రధాన కారణాలలో అది ఒకటి. కాని, తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ఉమ్మడి రాష్ట్ర వారసత్వంగా వచ్చిన రు. 60,000 కోట్ల అప్పును రెండున్నర సంవత్సరాలలో రు. 1,40,000 గా పెంచి ఘనత సాధించింది. ఏటా కనీసం ఇరవై వేల కోట్ల అప్పు తెచ్చి, దాంట్లో పదివేల కోట్లు అసలు వాయిదాలకూ, వడ్డీలకూ చెల్లిస్తూ, అభివృద్ధి పథకాల కోసమే అప్పు తెస్తున్నామని ప్రజలను మభ్యపెడుతూ, తెలంగాణ ప్రభుత్వాధినేత తన రాజకీయ గురువును మించిన శిష్యుడినని రుజువు చేసుకుంటున్నారు. అప్పుల కన్న ఎక్కువ తిరోగమన చర్య, అభివృద్ధి మార్గమనే ప్రగల్భాలతో వస్తున్న చర్య గ్రామీణాభివృద్ధి పేరుతో, ఆయా కులాల నుంచి పెత్తందారీ, దళారీ వర్గాన్ని తయారు చేయడానికి జరుగుతున్న ప్రయత్నం. ధ్వంసమైన, ధ్వంసమవుతున్న వృత్తులను తప్పకుండా ప్రోత్సహించవలసిందే, కాని కులాలను, కుల అసమానత లను, వివక్షను కాదు. ఏ కుల ధర్మం ఆ కులమే పాటించాలనీ, అలా పాటించడానికి ఆర్థిక సహాయం అందిస్తామనీ అనడం వర్ణధర్మాన్ని యథాతథంగా కాపాడతామని చెప్పడమే. ఆ పేరు మీద కేటాయించే నిధులు ఎట్లాగూ ఆయా కులాల్లో, వృత్తుల్లో ఉన్నవారందరికీ సరిపోవు, ఒక అత్యల్ప సంఖ్యాక కుల పెద్దల సమూహానికి అంది, అధికార పార్టీకి నమ్మకస్తులైన, వోటు బ్యాంకుల గుత్తేదార్లయిన దళారీలను తయారు చేయడానికి ఉపయోగపడతాయి. ఇంత తిరోగమనాన్ని పురోగమనమని ప్రజలను నమ్మించడంలోనే తెలంగాణాధీశుల వంచనా శిల్పపు బలం ఉంది. దాన్ని ఎదిరించలేని ప్రగతిశీల శక్తుల బలహీనత మరొకసారి కనబడుతున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# మాటల్లో కోటలు దాటిన ఆంధ్రప్రదేశ్ బడ్జెట్

రాజకీయాల్లో చక్రం తిప్పడం ప్రారంభించిన నాటి నుంచీ చంద్రబాబు నాయుడుకు భారీ అంకెల మీద, అబద్ధాల మీద, అతిశయోక్తుల మీద చాలవోజు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిత్వంలో, శ్వేతపత్రాలలో, విజన్ 2020లో ఎన్నోసార్లు రుజువైన ఆ విషయాన్ని 2017-18 బడ్జెట్ మరొకసారి మరింత ఎద్దఎత్తున చూపుతున్నది. గత సంవత్సరం ప్రకటించిన బడ్జెట్ అంచనాలలో చాలవరకు ఏడాది తిరిగేసరికి సవరించిన అంచనాలలో భారీగా తగ్గిపోయినా మళ్లీ మరింత భారీగా రు. 1,56,999 కోట్ల బడ్జెట్ ప్రవేశపెట్టడం ఆయనకే చెల్లింది. ఆర్థిక మంత్రి ఉపన్యాసంలో ఎన్ని ఆచరణ సాధ్యం కాని, ఆచరణలోకి తేదలచుకోలేని ప్రగల్భాలు, పైపైన ప్రకటించిన సంక్షేమ పథకాలు ఉన్నా అన్నిటికన్న మిన్నగా ఈ బడ్జెట్ రాష్ట్రపు రుణభారాన్ని దారుణంగా పెంచింది. రాష్ట్ర విభజన జరిగినప్పుడు, ఆంధ్రప్రదేశ్ వాటాగా రు. 86,348 కోట్ల అప్పు రాగా, ఇంకా మూడేళ్లు నిండకుండానే ఆ అప్పును రు. 2,16,026 కోట్లకు పెంచారు. అంటే మూడు సంవత్సరాలలో రు. 1,29,678 కోట్లు పెంచారు. ఈ రుణభారాన్నంతా అంతిమంగా మోయవలవసింది సాధారణ ప్రజలే. ఇలా ప్రజల మూపుల మీద అప్పుల కుప్పను పెంచడం మాత్రమే కాదు, మరెన్నో విషయాల్లో కూడ ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ అంకెల గారడీని, మాటల గారడీని, అతిశయోక్తులను, అబద్ధాలను సాగించింది. ఉదాహరణకు, జిఎస్‌డిపి పెరుగుదల దేశ జిడిపి పెరుగుదల రేటును, అన్ని రాష్ట్రాల జిఎస్‌డిపి పెరుగుదల రేట్లను మించి పోతూ 11.6 శాతంగా ఉన్నదని బడ్జెట్ లో చెప్పుకున్నారు. ఇది అసాధ్యమైన, అబద్ధపు గారడీ గణాంకం. అలాగే రుణమాఫీ, ఉపాధి హామీ పథకం, విద్యుత్ సబ్సిడీ, ఉద్యానవన, పశు సంవర్ధక, మత్స్య శాఖలకు, వ్యవసాయ, సహకార మార్కెటింగ్ శాఖలన్నిటికీ కలిపి ఒక పెద్ద అంకె ప్రకటించి ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్ అని చెప్పుకున్నారు గాని అవన్నీ విడదీసి చూస్తే ఏ ఒక్క రంగానికీ అవసరమైన కేటాయింపులు లేవని, సంక్షోభంలో మునిగి, ఆత్మహత్యలకు నిలయంగా మారిన వ్యవసాయ రంగానికి ఈ ప్రభుత్వం ఏమీ చేయడం లేదనే వాస్తవం బైట పడుతుంది. అలాగే సాంఘిక సంక్షేమ రంగంలోని విడివిడి పద్దులను చూస్తే, అన్ని పద్దులలోను కేటాయింపుల పెరుగుదల ద్రవ్యోల్బణానికి అటూ ఇటూగా మాత్రమే ఉంది. అంటే వాస్తవ పెరుగుదల ఏమాత్రం లేకుండానే ఉందన్నమాట. అదే విధంగా ఇళ్ల నిర్మాణం, మరుగుదొడ్ల నిర్మాణం వంటి పథకాల ప్రకటన, పది లక్షల ఇళ్లు, ఏడున్నర లక్షల మరుగుదొడ్లు అనే భారీ లక్ష్యాల ప్రకటన జరిగింది గాని, ఆయా పద్దుల కింద కేటాయింపులు చూస్తే ఆ లక్ష్యాలలో పదో వంతు పూర్తి చేయడానికి అవసరమైన నిధుల కేటాయింపు కూడ జరగలేదు. కేటాయింపులు తగినన్ని ఉండకపోవడం ఒక ఎత్తయితే, గత సంవత్సరం చేసిన కేటాయింపులలో, ముఖ్యంగా షెడ్యూల్డ్ కులాల, తెగల ఉప ప్రణాళికలలో సగం మాత్రమే ఖర్చు చేశారని బడ్జెట్ పత్రాలలో సవరించిన అంచనాలే చెపుతున్నాయి. మాటలు కోటలు దాటడం అనే సామెతను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అక్షరాలా నిజం చేస్తున్నది. వీ

# ప్రపంచానికి సిరియా నేర్పుతున్న పాఠాలు

**చం**దమామ కథల్లో ప్రాచీన డమాస్కస్ నాగరికత గురించీ, డమాస్కస్ రాకుమారుల గురించీ చదివి ఉన్నవారికి ఆ నగరం రాజధానిగా గల చిన్నారి దేశం సిరియా గత ఆరు సంవత్సరాలుగా ఎంత అల్లకల్లోలమవుతున్నదో చూస్తే విచారం కలుగుతుంది. అక్కడ నిరాటంకంగా సాగుతున్న, నానాటికీ పెచ్చరిల్లుతున్న అంతర్యుద్ధం, ఘర్షణలు, హత్యలు, బాంబుదాడులు, వేలాది మంది అమాయకుల, విభిన్న సాయుధ బలగాల సైనికుల మరణాలు, చిన్నారి పిల్లల దుర్మరణాలు, వేలాది మంది శరణార్థులు ఒక భయంకరమైన మానవ విషాద దృశ్యం. సామ్రాజ్యవాద కుట్రలు, మతోన్మాదం, జాతి వైరాలు, ప్రపంచీకరణ విధానాలు కలగలిసి ఎంత విధ్వంసానికి దారితీస్తాయో సిరియా ప్రపంచానికి చూపుతున్నది. పశ్చిమాసియాలోని చిన్నారి దేశమైన సిరియా రెండు లక్షల చ.కి.మీ. లోపు విస్తీర్ణంతో ఒక కోటీ డెబ్బై లక్షల జనాభాతో ఇంత ప్రాధాన్యత సంతరించుకోవలసిన ప్రాంతమేమీ కాదు. కాని లెబనాన్, టర్కీ, ఇరాక్, జోర్డాన్, ఇజ్రాయెల్‌లు సరిహద్దులుగా ఉన్న ఈ మధ్యధరా సముద్రతీర దేశం సామ్రాజ్యవాదుల చమురు దాహానికీ, యుద్ధోన్మాదానికీ కీలక వ్యూహాత్మక స్థలంలో ఉండడమే అది చేసుకున్న పాపం. సారవంతమైన మైదానాలతో, ఎత్తైన పర్వతాలతో, ఎడారులతో నిండిన ఈ దేశం అరబ్బులు, గ్రీకులు, ఆర్మీనియన్లు, అస్సీరియన్లు, కుర్దులు, సర్కేషియన్లు, మాండియన్లు, తుర్కులు వంటి విభిన్నమైన జాతులు, సున్నీలు, క్రైస్తవులు, అలావీలు, డ్రూజ్‌లు, మాండియన్లు, షియాలు, సలాఫీలు, యాజ్దీలు వంటి విభిన్న మత సమూహాలతో సుదీర్ఘకాలం ఆటోమన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఫ్రెంచి అధీనంలోకి వచ్చి, 1945లో పేరుకు స్వాతంత్ర్యం పొందినప్పటికీ ఆ తర్వాత గడిచిన చరిత్రంతా ఈజిప్ట్‌తో విలీనం, అది త్వరలోనే విచ్ఛిన్నం కావడం, సైనిక కుట్రలు, హత్యాకాండలు, నిరంకుశ పాలనలు, పొరుగుదేశాలతో, ముఖ్యంగా ఇజ్రాయెల్‌తో యుద్ధాలు వంటి సంక్షుభిత చరిత్రే. ఈ నేపథ్యంలో 1970లో అధికారానికి వచ్చిన హఫీజ్ అల్ అస్సాద్ గాని, 2000లో ఆయన మరణానంతరం అధికారానికి వచ్చిన బషర్ అల్ అస్సాద్ గాని పాలనలో స్థిరత్వాన్ని తెచ్చినా, దేశాన్ని సామ్రాజ్యవాద రథచక్రాలకు కట్టేశారు. ముఖ్యంగా బషర్ దేశంలోకి ప్రపంచీకరణ విధానాలను తీసుకువచ్చి సామాజిక ఆర్థిక వ్యవస్థలలో సంక్షోభానికి కారకుడయ్యాడు. 2011లో అరబ్ దేశాలన్నిట్లో చెలరేగిన కోపోద్రిక్త యువతరం నేపథ్యంలో అసద్ పట్ల వ్యతిరేకత సంఘటితం కావడం మొదలయింది. ఇదే అవకాశంగా తీసుకున్న వివిధ తీవ్రవాద ఇస్లామిక్ శక్తులు, సామ్రాజ్యవాద దళారీలు కూడ అంతర్యుద్ధాన్ని ప్రోత్సహించారు. దేశం ముక్కలు చెక్కలైపోయి 34 శాతం ప్రభుత్వాధీనంలో, 33 శాతం ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ లెవాంట్ (ఐఎస్ఐఎస్ లేదా ఐఎస్ఐఎల్) అధీనంలో, 20 శాతం సిరియన్ ప్రతిపక్షాల చేతుల్లో, 13 శాతం కుర్దులతో సహా అనేక చిన్న తిరుగుబాటు బృందాల చేతిలో ఉంది. ఈ భిన్నవర్గాల ఘర్షణలో ఆరు సంవత్సరాలలో కనీసం రెండు లక్షల మంది చనిపోయారని, కోటి మంది నిరాశ్రయులయ్యారని, అనేక వ్యాధులు విజృంభించాయని, అన్ని పక్షాలూ దారుణమైన మానవహక్కుల హననానికి పాల్పడ్డాయని నివేదికలు తెల్పు తున్నాయి. సామ్రాజ్యవాద జోక్యాలను అరికట్టకపోతే, జాతి, మత విభేదాల సమస్యను సక్రమంగా పరిష్కరించకపోతే ఎంత విస్ఫోటకమైన మహా మానవ విషాదం జరుగుతుందో సిరియా ప్రపంచానికి పాఠం నేర్పుతున్నది.

వీ





❖ **కార్మికవర్గ విప్లవం – విప్లవ ద్రోహి కౌట్స్కీ** – లెనిన్ సుప్రసిద్ధ గ్రంథం – క్లుప్తీకరణ: నాగభూషణ్, విరసం ప్రచురణ – 103 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60



❖ **వెన్నెలవనం** –కవిత్వం – సూర్యచంద్ర, విరసం ప్రచురణ – 72 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50
పై రెండు ప్రతులకు: డి.వి. రామకృష్ణారావు, ఎంఐజి-14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్-500 040; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **ఎర్ర దుక్కి** – కథలు – ఎం. నారాయణ – పాలమూరు ప్రచురణలు – 96 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: ఎం. నారాయణ, ఇ.నెం. 20-150/1ఎఫ్, వెంకటేశ్వర కాలనీ, అచ్చంపేట, నాగర్‌కర్నూల్ జిల్లా, ఫోన్: 9505302939; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – ప్రజాస్వామిక విశ్లేషణ** – దిక్సూచి ప్రచురణలు – 158 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **కసువు పువ్వులు** – కవితల కూర్పు; సంకలనం: అగరం వసంత్; బస్తి యువక బృందం ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: డా. ఎన్. వసంత్, 2/1097, బస్తి, ఆవులపల్లి రోడ్, హోసూరు – 635 109, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు; ఫోన్: 09488330209



❖ **ఇరినా మలెంకో** – సోవియట్ రష్యన్ మహిళ ('సోవియటికా' పుస్తక రచయిత) ఇంటర్వ్యూ – అనువాదం: ల.లి.త., మాతృక ప్రచురణ – 22 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 10, ప్రతులకు: కా. సి.పి. భవన్, ఇ.నెం. 2-1-594, (బి-34, ఎఫ్-1), రైల్వే స్టేషన్ రోడ్, విజ్ఞానపురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్-44; ఫోన్: 040 27668471; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **దోసెడు పల్లీలు** – మరికొన్ని కథలు – ఉదయమిత్ర – పాలమూరు ప్రచురణలు – 175 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 120, ప్రతులకు: ఉదయమిత్ర, ఇ.నెం. 9-24, చైతన్యనగర్, జడ్చర్ల – 509 301; మహబూబ్‌నగర్. ఫోన్: 9985203376 అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **పరోపకారార్థం** – కథలు – పంజాల జగన్నాథం – 50 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: పంజాల జగన్నాథం, ఇ.నెం. 7-2-92, మంకమ్మతోట, కరీంనగర్-505001; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **పాదముద్రలు** – కవిత్వం – స్ఫూర్తి – తెలంగాణ సాహితి – 62 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: స్ఫూర్తి, క్వార్టర్ నెం. బి1/283, బిడిఎల్ టౌన్‌షిప్, భానూర్ పోస్ట్ & గ్రా., పటాన్‌చెరు మం. సంగారెడ్డి జిల్లా; సెల్: 9490098694, 08455-227864
email:indraodf@gmail.com



❖ **జంగమ దేవర** – నవల – జొన్నవిత్తుల శ్రీరామచంద్ర మూర్తి – పాలపిట్ట బుక్స్ – 368 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200, జె.ఎస్.ఆర్. మూర్తి, తెలకోవెల, 1-2-9/104, దేవి నిలయం అపార్ట్‌మెంట్స్, ఓల్డ్ మారుతి నగర్, కొత్తపేట, హైదరాబాద్-500035



❖ **పనామా బీచ్‌లో...** – కథలు – తరానా – పాలపిట్ట బుక్స్ – 124 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100,
పై రెండు పుస్తక ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నెం: 2, బ్లాక్-6, ఎం.ఐ.జి-2, ఎపిఎచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500044; ఫోన్: 040-27678430
ఈమెయిల్: palapittabooks@gmail.com



❖ **అన్నపూర్ణా వారి చిత్రాలలో శ్రీశ్రీ గీతాలు** – శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి – 32 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30, ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ-520 004. ఫోన్: 0866-6617375, సెల్: 9246277375;



❖ **మార్క్సిజం మార్గం** – రెండు సంపుటాలు – అక్కినేని చంద్రరావు – 104 పేజీలు, 1/8 డెమీ, వెలలేదు, ప్రతులకు: అక్కినేని చంద్రరావు, 40-6-3/2, 2వ అంతస్థు, సిద్ధార్థ పబ్లిక్ స్కూల్ ఎదురు రోడ్డు, మొఘలరాజపురం, విజయవాడ – 520 010; ఫోన్: 9441406331
ఈమెయిల్: questforjustice.5@gmail.com



❖ **కామన్ స్కూల్ కల** – అధ్యాపక జ్వాల సంపాదకీయాలు – డెమొక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ – 175 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: డెమొక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్, 3-4-376/2/1-డి, పై అంతస్థు, లింగంపల్లి, కాచిగూడ, హైదరాబాద్ – 500 027



❖ **తడి ఆరని గాయాలు** – వసంత కన్నబిరాన్ – సంపాదకత్వం: ఓల్గా – అస్మిత ప్రచురణ – 400 పేజీలు,1/8 డెమీ, వెల రు. 250, ప్రతులకు: అస్మిత, టీచర్స్ కాలనీ, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్ – 500026, ఫోన్ : 27733229, 9849038926; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **పర్ఫెక్ట్ – 27** – ముక్తవరం పార్థసారథి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 222 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్-500 068, తెలంగాణ ఫోన్ : 040-24224453/54

# అబద్ధాల కేసులో అన్యాయమైన తీర్పు

***ప్రొ. జి.ఎన్. సాయిబాబాతో సహా ఐదుగురికి యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తూ గడ్చిరోలి జిల్లా సెషన్స్ జడ్జి ఇచ్చిన తీర్పు ఎంత హాస్యాస్పదంగా, అన్యాయంగా ఉన్నదో వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా సెషన్స్ జడ్జి సూర్యకాంట్ ఎస్ షిండే మార్చ్ 7న ఇచ్చిన తీర్పులో జి.ఎన్. సాయిబాబా, హేమ్ మిశ్రా, ప్రశాంత్ రాహీ, మహేశ్ టిర్కి, పాండ్ నరోటే లకు యావజ్జీవ కారాగార శిక్ష, విజయ్ టిర్కికి పది సంవత్సరాల శిక్ష విధించారు. ఏదైనా నేరం, హింస చేశారని ఏ ఒక్క ఆధారం లేకుండా కేవలం భావాలు కలిగి ఉన్నందుకు, ఆ భావాలు ప్రచారం చేసినందుకు ఇంత కఠినమైన శిక్ష విధించడం అసాధారణమైన విషయం.

ప్రొఫెసర్ జి.ఎన్. సాయిబాబా గురించీ, ఆయన అంగవైకల్యం గురించీ, ప్రశాంత్ రాహీ, హేమ్ మిశ్రాల గురించీ, వారి కృషి గురించీ మీకు ఏ మాత్రం తెలిసి ఉండకపోవచ్చు. ఈ ముగ్గురూ ఎన్నో సంవత్సరాలుగా బహిరంగ ప్రజా జీవితంలో ఉన్నారు. సాయిబాబా అధ్యాపక వృత్తిలో, ప్రశాంత్ రాహీ పాత్రికేయ వృత్తిలో, హేమ్ మిశ్రా విద్యార్థి సంఘ కార్యకర్తగానూ, గాయకుడిగానూ ఉన్నారు. అయినా వారి గురించే తెలియదంటే, మిగిలిన ముగ్గురు ఆదివాసులు మహేశ్ టిర్కి, పాండు నరోటె, విజయ్ టిర్కిల గురించి ఇంక ఎంత మాత్రమూ తెలిసి ఉండకపోవచ్చు. వారి మీద కేసు ఏమిటో, వారి కార్యకలాపాలు ఏమిటో, వారి పట్ల రాజ్యం ఎందుకు కక్షపూనిందో కూడ మీకు తెలియక పోవచ్చు. కాని ఒక్కసారి ఓపిక చేసుకుని, గడ్చిరోలి జిల్లా జడ్జి సూర్యకాంత్ ఎస్ షిండే రాసిన 827 పేజీల తీర్పు చదివి చూడండి. ఆ 1014 పేరాగ్రాఫుల తీర్పు, 24 పేరాగ్రాఫుల అంతిమ ఉత్తర్వులు చదివితే, పోలీసు ప్రాసిక్యూషన్ ఎన్ని అబద్ధాలు కల్పించిందో, ఎన్ని దొంగ సాక్ష్యాలు సృష్టించిందో, ఎన్ని నిరాధారాలను ఆధారాలుగా చూపడానికి ప్రయత్నించిందో అర్థమవుతుంది. ఆ అబద్ధాలనూ, సాక్ష్యాలనూ, "ఆధారాలనూ" డిఫెన్స్ న్యాయవాది సురేంద్ర గాడ్లింగ్ ఎంత ప్రతిభావంతంగా తుత్తునియలు చేశారో కనబడుతుంది. ఆ వాదనలన్నీ విన్నతర్వాత కూడ న్యాయమూర్తి ప్రాసిక్యూషన్ అబద్ధపు వాదనలనే ఆమోదిస్తూ, చట్టంలో నిర్దేశించిన గరిష్ఠ శిక్షను ఎట్లా విధించారో అర్థమవుతుంది. వర్గ సమాజంలో న్యాయస్థానం అనేది పాలకవర్గపు చేతిలో పనిముట్టుగా, వ్యవస్థ పరిరక్షణకు సాధనంగా పని చేస్తుందనే అవగాహన అందరికీ తెలిసిన నిజమే గాని, ఈ తీర్పు చదివితే ఆ అవగాహన ఎట్లా నూటికి నూటయాభై పాళ్లు వాస్తవమైనదో అర్థమవుతుంది.

మహేశ్ టిర్కి, పాండు నరోటె, హేమ్ మిశ్రా, ప్రశాంత్ రాహీ, విజయ్ టిర్కి, జి.ఎన్. సాయిబాబాలు భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధం సాగించడానికి నేరపూరితమైన కుట్ర పన్నారనీ, ఆ ఉద్దేశ్యంతో ప్రజలను సమీకరించారనీ, మహారాష్ట్ర ప్రభుత్వాన్నీ, భారత ప్రభుత్వాన్నీ నేరపూరితమైన బలప్రయోగం ద్వారా కూలదోయడానికి ప్రయత్నించారనీ, ప్రజల ప్రాణాలనూ ఆస్తులనూ విధ్వంసం చేసే భారీ హింసాకాండ ద్వారా ప్రజాస్వామిక ప్రభుత్వం పట్ల సాధారణ ప్రజల విశ్వాసాన్ని చెదర గొట్టడానికీ, తగ్గించడానికీ ప్రయత్నించారనీ, తద్వారా చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వ వ్యవస్థను అస్థిరం చేయడానికీ ప్రయత్నించారనీ, వేర్పాటువాద, తిరుగుబాటు భావాలను రెచ్చగొట్టడానికి బహిరంగ, రహస్య సమావేశాలు ఏర్పాటు చేశారనీ, తమ నేరపూరిత కుట్ర లక్ష్యాలను సాధించడం కోసం భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు), దాని అనుబంధ సంస్థ అయిన రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్ (ఆర్‌డిఎఫ్)ల ద్వారా చట్టవ్యతిరేక కార్యకలాపాలు సాగించారనీ, హింసాపూరిత తీవ్రవాద చర్యలను, చట్టవ్యతిరేక చర్యలను సాగించడానికి కుట్ర పన్నడం, ప్రచారం చేయడం, రెచ్చగొట్టడం, ప్రోత్సహించడం, ఉద్దేశపూర్వకంగా అవకాశాలు కల్పించడం అనే నేరాలకు పాల్పడ్డారనీ ప్రాసిక్యూషన్ అభియోగం. ఈ నేరాలన్నీ చట్టవ్యతిరేక కార్యకలాపాల (నిరోధక) చట్టం 1967లోని సెక్షన్లు 13, 18, 20, 38, 39 ప్రకారం, భారత శిక్షాస్మృతి లోని సెక్షన్ 120-బి ప్రకారం శిక్షార్హమైన నేరాలని ప్రాసిక్యూషన్ వాదించింది.

ఈ అభియోగపత్రంలో ఆరోపించిన నేరాలు నిజంగా నేరాలేనా, అధికారంలో ఉన్న వ్యవస్థ, ప్రభుత్వం తమ అక్రమాలను వ్యతిరేకించే ఆలోచనలనూ ఆచరణలనూ నేరాలుగా ప్రకటిస్తున్నదా అనే అనే తాత్విక, సామాజిక, రాజకీయార్థిక చర్చ ఎంతో చేయవలసి ఉంది. ఆ చర్చను కాసేపు పక్కన పెట్టి, ఉన్న వ్యవస్థను ఆమోదించేవారైనా అంగీకరించక తప్పని వాస్తవమేమంటే, ఈ ఆరుగురు వ్యక్తులూ పైన చెప్పిన నేరాలు ఎక్కడ, ఎప్పుడు, ఎలా చేశారో నిస్సందేహమైన సాక్ష్యాధారాలతో నిరూపించి, ఆ ఆరోపణలను తేల్చడం ప్రాసిక్యూషన్ బాధ్యత. కాని ఈ కేసులో ప్రాసిక్యూషన్ భారీ నేరారోపణలు చేసిందే తప్ప ఆ ఆరోపణలను నిర్ద్వంద్వంగా, సందేహాతీతంగా రుజువు చేయలేక పోయింది. సాక్ష్యాధారాలుగా ప్రాసిక్యూషన్ చూపించిన వాటన్నిటి బోలుతనాన్ని, అబద్ధాన్ని, దురుద్దేశాలను డిఫెన్స్ న్యాయవాది అద్భుతంగా ఎత్తిచూపారు. అయినా న్యాయమూర్తి ప్రాసిక్యూషన్ ఆరోపణలను నమ్మి తీర్పు తయారు చేశారు.

మొట్టమొదట ఈ తీర్పును భారీగా 827 పేజీలు రాయడం 'తిలకాష్టమహిషబంధనం' లాగ తయారుచేసి భయపెట్టడానికే తప్ప, ఎక్కడా హేతుబద్ధమైన, సకారణమైన, తార్కికమైన వాదనలు లేవు. చెప్పిందే చెప్పడం, అనవసరమైన అంశాలు చెప్పడం ఎంత ఎక్కువగా సాగిందంటే కనీసం ఇరవై అంశాలు ఒక్కొక్కటి పదిసార్ల పైన చెప్పారు. ప్రాసిక్యూషన్ న్యాయవాది ఉటంకించిన ఇతర కోర్టుల తీర్పుల సారాంశం చెపితే సరిపోయేదానికి, ఆ తీర్పుల నుంచి అవసరమైనవీ కానివీ చాల ఎక్కువ భాగాలు ఉటంకించి పేజీలు నింపారు. డిఫెన్స్ న్యాయవాది ఉటంకించిన కేసుల గురించి మాత్రం పైపై వ్యాఖ్యలు చేసి

ఆ వాదనలను కొట్టివేశారు. సాయిబాబా దగ్గర కంప్యూటర్ హార్డ్ డిస్కులలో దొరికాయని ప్రాసిక్యూషన్ చెప్పిన పత్రాలను, ఉత్తరాలను మొత్తానికి మొత్తం ఒకటికి నాలుగుసార్లు ఉటంకించి పేజీలు నింపారు. ఆర్‌డిఎఫ్ ప్రణాళిక – నిబంధనావళి మొత్తానికి మొత్తం, ఆర్‌డిఎఫ్ మొదటి మహాసభల నివేదిక మొత్తానికి మొత్తం, హేమ్ మిశ్రా దగ్గర దొరికిన పెన్‌డ్రైవ్‌లో ఉన్నాయని ప్రాసిక్యూషన్ చెప్పిన కరపత్రాలు, ఉత్తరాలు మొత్తానికి మొత్తం ఎన్నోసార్లు ఉటంకించారు. చివరికి మావోయిస్టు పార్టీ చరిత్ర అని తనకు తోచినదీ, ప్రాసిక్యూషన్ చెప్పినదీ రాశారు. అంటే, మొత్తం మీద ఈ 827 పేజీల తీర్పును నాలుగో వంతుకు, 200 పేజీలకు కుదించినా సారాంశంలో ఏమీ మార్పు ఉండేది కాదు. ఎంతో పరిశోధన చేసి, ఎన్నో పత్రాలు, ఆధారాలు చదివి, ఉటంకించి తీర్పు తయారుచేశారని అభిప్రాయం కలిగించడానికి మాత్రమే ఈ 'తిలకాష్టమహిషబంధనం' తయారయింది.

ప్రాసిక్యూషన్ అల్లిన కథ ఏమంటే, మహేశ్ టిర్కి, పాండు నరోటె అనే ఇద్దరు ఆదివాసులు మావోయిస్టు పార్టీతో పని చేస్తున్నారని, అజ్ఞాత నక్సలైట్లకు సమాచారం, సరుకులు చేరవేస్తున్నారనే సమాచారంతో గడ్చిరోలి స్పెషల్ బ్రాంచి వారి మీద నిఘా పెట్టిందట. ఆ నిఘాలో భాగంగా 2013 ఆగస్ట్ 22న అహెరి బస్ స్టాండ్ దగ్గర మారుమూల ఎవరూ లేనిచోట, వారిద్దరూ, వారితోపాటు మరొకరూ ఉండగా పట్టుకున్నారట. ఆ మూడో వ్యక్తి హేమ్ మిశ్రా అని తెలిసిందట. ఆయన దగ్గర ఒక పెన్ డ్రైవ్, కెమెరా, ఇతర సమాచారం దొరికిందట. హేమ్ మిశ్రాను తీసుకురమ్మని నర్మదక్క చెపితే బల్లార్షా వెళ్లి తీసుకుని వస్తున్నామని మహేశ్ టిర్కి, పాండు నరోటే తమ కన్ఫెషన్ స్టేట్ మెంట్ (ఒప్పుదల ప్రకటన) లో చెప్పారట. అదే సమయంలో చిచ్‌గడ్ టి పాయింట్ దేవ్రీ దగ్గర అనుమానాస్పద స్థితిలో ఉండగా దొరికిన ప్రశాంత్ రాహీకి, విజయ్ టిర్కికి ఈ కేసుతో సంబంధం ఉందని తేలిందట. హేమ్ మిశ్రాను, ప్రశాంత్ రాహీని విచారించే క్రమంలో ఈ కేసుతో సాయిబాబాకు సంబంధం ఉందని తేలిందట. సాయిబాబా ఇంటిని జప్తు చేస్తే ఐదు హార్డ్ డిస్కులు, ఆరు సిడిలు, ఇరవై నాలుగు డివిడిలు, మూడు పెన్‌డ్రైవ్‌లు, ముప్పై రెండు మెమొరీ కార్డులు, ఒక లాప్‌టాప్, మూడు మొబైల్ ఫోన్లు, పుస్తకాలు, పత్రికలు, తుపాకి పట్టుకున్న ఒక మహిళా నక్సలైట్ ఫోటో, వగైరా దొరికాయట. ఆ హార్డ్ డిస్కులలో ఒకటి క్రాష్ అయిందట. మిగిలిన హార్డ్ డిస్కులలోను, పెన్‌డ్రైవ్‌ల లోను వందల పేజీల సమాచారం దొరికిందట. ఆ సమాచారంలో సాయిబాబా మావోయిస్టు పార్టీ అనుబంధ సంస్థ ఆర్‌డిఎఫ్ తరఫున పని చేస్తున్నట్టు, మావోయిస్టు పార్టీ కొరకు అంతర్జాతీయ సంబంధాలు నెరపుతున్నట్టు, హింసా కార్యకలాపాలను ప్రోత్సహిస్తున్నట్టు, ప్రచారం చేస్తున్నట్టు తేలిందట.

ఈ కథంతా తప్పుల తడక. ఈ ఆరుగురు నిందితులనూ అరెస్టు చేసిన స్థలాలూ సమయాలూ అబద్ధం. వారు ఇచ్చారని చెపుతున్న ఒప్పుదల ప్రకటనలు అబద్ధం. వారి దగ్గర దొరికాయని చెపుతున్న సమాచారం, ఆధారాలు అబద్ధం. ఆ సమాచారం, ఆధారాలు వారిదగ్గర దొరికినప్పుడు చేసిన పంచనామా నివేదికల మీద సాక్షి సంతకాలు చేసినవారందరూ పోలీసులు అన్ని కేసుల లోను ఉపయోగించే నిలువ సాక్షులే తప్ప గౌరవనీయమైన, విశ్వసనీయమైన సాక్షులు కాదు. వారిలో ఒక సాక్షి అయితే గతంలో హోం గార్డుగా పనిచేసి, ప్రస్తుతం పోలీసులు పెట్టే అన్ని కేసులలోను సాక్షిగా సంతకాలు చేస్తున్నవాడు. వారి మీద ఆరోపించిన నేరాలు అబద్ధం. హేమ్ మిశ్రాను ప్రాసిక్యూషన్ చెపుతున్నట్టు ఆగస్ట్ 23న అహెరిలో కాదు, ఆగస్ట్ 20న బల్లార్షా రైల్వే స్టేషన్‌లో అరెస్టు చేశారు. అంగవికలుడైన హేమ్ మిశ్రా బల్లార్షా సమీపంలోని బాబా ఆమ్టే ఆశ్రమంలో నడిచే ఆస్పత్రికి వెళుతుండగా అరెస్టు చేశారు. ఆయన దగ్గర దొరికాయని చెపుతున్నవి ఆయనను పట్టుకున్నప్పుడు నిజంగా ఆయన దగ్గరే దొరికాయనడానికి సాక్ష్యమేమీ లేదు.

వీటిలో మొదటి అరెస్టు చూపిన ఎఫ్ఐఆర్ అసలు ప్రతి మీద ఉన్న పదాలూ వాక్యాలూ తేదీలూ వేరు, కార్బన్ కాపీ మీద ఉన్న పదాలూ వాక్యాలూ తేదీలూ వేరు. మొదట రాసిన వాటిని మార్చి తర్వాత కొత్తవి రాయడం జరిగిందని క్రాస్ ఎగ్జామినేషన్ లో పోలీసు సాక్షి ఒప్పుకున్నాడు. ఒకే పంచనామా పత్రం మీద వేరువేరు చోట్ల వేరువేరు ఇనస్పెక్టర్ల సంతకాలు ఉండడంతో ఆ పంచనామా పత్రమే ఒక్కసారి తయారయినది కాదని, అసలు వాస్తవికమైనది కాదని రుజువైంది. ఆ ముగ్గురి అరెస్టు ఒక్కసారి జరగలేదని, హేమ్ మిశ్రాను బల్లార్షాలో అరెస్టు చేసి, మూడు రోజుల పాటు చిత్రహింసలకు గురిచేసి, ఆతర్వాత ఇద్దరు ఆదివాసులతో కలిపి కేసు బనాయించారని డిఫెన్స్ న్యాయవాది నిరూపించారు. సాక్షుల వాంగ్మూలాలలో, ఎఫ్ఐఆర్‌లో, పంచనామా నివేదికలో ఎన్ని వైరుధ్యాలున్నాయో చూపించారు. 'వందమంది అపరాధులు తప్పించుకుపోయినా ఫరవాలేదు గాని ఒక నిరపరాధికి శిక్ష పడగూడదు' అనే న్యాయసూత్రం ప్రకారం ప్రాసిక్యూషన్ సాక్షుల వాంగ్మూలాలలో వైరుధ్యాలున్నా, వారు ఒక అబద్ధం చెప్పారని రుజువైనా వారు చెప్పిన మిగిలిన అంశాలను సాక్ష్యాధారాలుగా ఆమోదించనక్కరలేదని న్యాయశాస్త్రం భావిస్తుంది. కాని ఈ తీర్పు రాసిన గడ్చిరోలి సెషన్స్ జడ్జి మాత్రం 'ఒక తప్పు చెపితే మిగిలినవన్నీ అనుమానాస్పదమే అనే సూత్రం భారతదేశంలో వర్తించద'ని అంటూ, ఎన్నో అబద్ధాలు చెప్పారని స్పష్టంగా రుజువైన ప్రాసిక్యూషన్ సాక్షుల అబద్ధాలను ఆమోదించారు. ఆ అబద్ధాల ఆధారంగా శిక్షలు విధించారు.

ఎప్పుడైనా ఎవరి మీదనైనా నేరం ఆరోపించినప్పుడు వారి మొబైల్ ఫోన్ల నుంచి ఎవరెవరికి ఫోన్లు చేశారో జాబితాలు సేకరించి వాటి ఆధారంగా నేరారోపణ చేయడం ప్రాసిక్యూషన్ ఆనవాయితీ. హేమ్ మిశ్రా, మహేశ్ టిర్కిల మొబైల్ ఫోన్లు జప్తు చేసుకుని, కేసులో ఆధారాలుగా చూపినప్పటికీ వారి కాల్‌డాటాను మాత్రం సేకరించి చూపకపోవడం, ఆ డాటా ద్వారా వారి మీద నేరారోపణకు అవకాశం లేకపోవడం వల్లనే అని డిఫెన్స్ న్యాయవాది చేసిన వాదనకు న్యాయమూర్తి డొంకతిరుగుడు జవాబు చెప్పారు. ఆ జాబితాలు ప్రాసిక్యూషన్ ఇవ్వకపోయినా వారే ఇచ్చి ఉండవలసిందని, ప్రాసిక్యూషన్ ఇవ్వలేదు గనుక ప్రాసిక్యూషన్‌కు దురుద్దేశం అంటగట్టలేమని ఆయనే ప్రాసిక్యూషన్ తరఫున వకాల్తా పుచ్చుకున్నారు. హేమ్ మిశ్రా దగ్గర దొరికిన వస్తువులలో ఆగస్ట్ 20 లోక్ మత్ దినపత్రికను కూడ చూపారని, అంటే ఆయనను ఆగస్ట్ 20న అరెస్టు చేశారని రుజువవుతున్నదని డిఫెన్స్ న్యాయవాది చేసిన వాదనకు కూడ న్యాయమూర్తే జవాబు చెపుతూ, నిందితుడి దగ్గర మూడు రోజుల కిందటి పత్రిక ఉండవచ్చునని, మావోయిస్టుల కలయికలకు చేతిలో పత్రిక ఉండడం, అరటి పళ్లు పట్టుకోవడం అనే సంకేతం ఆనవాయితీ ఉందని, సి వనజ అనే జర్నలిస్టు రాసిన వ్యాసంలో ఉన్నదని, ఆ వ్యాసం సాయిబాబా హార్డ్ డిస్క్ లో దొరికిందని, అందువల్ల డిఫెన్స్ వాదన చెల్లదని అన్నారు.

ఇటువంటి ఎన్నెన్నో స్పష్టమైన, నిర్దిష్టమైన తప్పులు, వైరుధ్యాలు, అసంగతాలు చూపి ప్రాసిక్యూషన్ చెపుతున్నవి అబద్ధాలు కావచ్చునని డిఫెన్స్ న్యాయవాది వాదిస్తే, సాధారణంగా ఏ న్యాయస్థానమైనా బెనిఫిట్

ఆఫ్ డౌట్ (అనుమానించడానికి ఆస్కారం) అనే ప్రాతిపదికపై ప్రాసిక్యూషన్ వాదనను కొట్టివేస్తుంది. కాని గడ్చిరోలి న్యాయమూర్తి మాత్రం ప్రాసిక్యూషన్ అబద్ధాలు కళ్ల ముందు నగ్నంగా కనబడుతుంటే అవన్నీ "స్వల్పమైన వైరుధ్యాలు" అని అభివర్ణించి, అవి ప్రధాన ఆరోపణ లకు అడ్డురావని అన్నాడు. ఆ స్వల్పమైన వైరుధ్యాల మీద ఆధారపడే మొత్తం కేసు నిర్మాణమైందని, ఆ స్వల్పమైన వైరుధ్యాలను నిజాలుగా నమ్మినందువల్లనే తాను గరిష్ట శిక్ష విధిస్తున్నానని మరిచిపోయాడు.

పోలీసులు చూపే ఒప్పుదల ప్రకటనలు చెల్లవని, మెజస్ట్రీటు దగ్గర చేసిన ఒప్పుదల ప్రకటనలు మాత్రమే చెల్లుతాయని న్యాయవ్యవస్థలో ఒక సూత్రం. మెజస్ట్రీటు దగ్గర చేసిన ప్రకటన కూడ ఒత్తిడి మీద చేశానని, దాన్ని ఉపసంహరించుకుంటున్నానని, ఇంకా పైన విచారణ జరిగే న్యాయస్థానంలో నిందితులు చెప్పుకోవచ్చు. మహేశ్ టిర్కి, పాండు నరోటే ఇద్దరూ తమ ఒప్పుదల ప్రకటనలుగా పోలీసులు రాసిన ప్రకటన లనే మెజస్ట్రీటు దగ్గర కూడ చెప్పమని ఒత్తిడి చేశారని, మెజస్ట్రీటు కోర్టులో పోలీసులు తలుపు దగ్గర నిలబడి తమను బెదిరించారని చెప్పాక కూడ, గడ్చిరోలి జడ్జి పోలీసులు రాసిన ఒప్పుదల ప్రకటనలనే యథాతథంగా అంగీకరించి, వాటి ఆధారంగానే వాదనలు చేశారు, శిక్షలు విధించారు.

ఇక సాయిబాబా గురించి చేసిన ఆరోపణల్లో ఒక్కటి కూడ పూర్తి నిజం లేదు. అబద్ధాలు, అర్ధసత్యాలు, వక్రీకరణలు, జరిగినది ఒకటైతే మరొకటి చెప్పడం వంటి ఎన్నెన్నో అసంగతాలు ప్రాసిక్యూషన్ ఆరోపణల్లో ఉన్నాయి. సాయిబాబా ఇంటి మీద దాడికి అనుమతి లేదు. సాక్షులు లేరు. అటువంటి దాడికి వీడియో సాక్ష్యం ఉండవలసి ఉండగా, సమయానికి వీడియోగ్రాఫర్ దొరకలేదని, అప్పటికీ పోలీసు అధికారులు తమ మొబైల్ ఫోన్లలో జప్తును చిత్రీకరించడానికి ప్రయత్నించారని, కాని వారి ఫోన్ల సామర్థ్యం సరిపోలేదని ప్రాసిక్యూషన్ ఆకుకు అందని, పోకకు పొందని కథలెన్నో చెప్పింది. జప్తు చేశామని చెపుతున్న సామాన్లు జప్తు చేస్తున్నప్పుడు పోలీసు సాక్షులను మాత్రమే తీసుకున్నారు. ఇంటిబైట పౌరసమాజ ప్రముఖులు, ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లు, విద్యార్థులు ఎందరో ఉండగా వారినెవరినీ సాక్షులుగా పిలవలేదు. జప్తు చేసిన వస్తువులకు సాక్షుల ముందర సీల్ వేయలేదు. సీళ్ల మీద సాక్షుల సంతకాలు లేవు. జప్తు చేసిన వస్తువులే న్యాయస్థానంలో ప్రవేశపెట్టారా, మరేవైనా చేర్చారా చెప్పలేని స్థితి ఉంది. చివరికి ఆ జప్తు సమయంలో ఆ వస్తువులన్నీ ఏ పెట్టెలో పెట్టామని పంచనామా నివేదికలో రాశారో, ఆ పెట్టె గడ్చిరోలి న్యాయస్థానానికి చేరలేదు. ఆ వస్తువులు మరొక రూపంలో చేరాయి. కంప్యూటర్ హార్డ్‌వేర్‌కు సంబంధించి జప్తు చేసిన వస్తువుకు చెందిన నిర్దిష్ట గుర్తింపు సంఖ్యను నమోదు చేయవలసి ఉండగా అటువంటిదేమీ జరగలేదు. అక్కడ 41 వస్తువులను జప్తు చేసినప్పుడు సాక్షి సంతకాలు పెట్టిన ఇద్దరికీ కంప్యూటర్ వస్తువుల గురించి కనీస అవగాహన కూడ లేదు. వారిలో ఒక సాక్షికి తన పేరు సంతకం పెట్టడం మినహా మరే భాష చదవడం, రాయడం రాదు. ఏ పుస్తకాలు, పత్రాలు జప్తు చేశారో, పంచనామాలో ఏ జాబితా రాశారో తెలియదు. ఆ సాక్షి న్యాయస్థానంలో సాక్ష్యం చెప్పడానికి గడ్చిరోలి వచ్చినప్పుడు, పోలీసులే వసతి కల్పించారని నిండు కోర్టులో ఒప్పుకుని తాను స్వతంత్ర సాక్షిని కానని, పోలీసులు చెప్పమన్నట్టు చెప్పే సాక్షినని చూపుకున్నాడు. ఈ సాక్షులు చెప్పిన విషయాల ఆధారంగా డిఫెన్స్ న్యాయవాది, అసలు జప్తు అనేదే జరగలేదని, సాయిబాబా ఇంటి మీద దాడి చేసి ఎత్తుకొచ్చిన వస్తువులలో కొన్నిటిని మాత్రమే చూపుతున్నారని, కొన్నిటిని మార్చి చూపుతున్నారని, అక్కడ దొరకని వస్తువులను దొరికినట్టు చూపుతున్నారని వాదించారు. కాని సాక్షులు ఒకటి రెండు చోట్ల తడబడినందువల్ల, పొరబడినందువల్ల వారి సాక్ష్యాన్ని నమ్మకుండా ఉండనక్కరలేదని అంటూ ఆ అబద్ధపు సాక్ష్యాల ఆధారంగానే శిక్ష విధించారు.

ఇక హార్డ్ డిస్కులలో ఏమి ఉన్నదనే విషయం, అది ఎలా తేల్చారనే విషయం చూస్తే హాస్యాస్పదంగా ఉంటుంది. ముంబైలోని సెంట్రల్ ఫొరెన్సిక్ సైన్స్ లాబరేటరీలో సైంటిఫిక్ ఆఫీసర్‌నని చెప్పుకుని వచ్చిన భవేశ్ నికమ్ అనే సాక్షి ఆ హార్డ్ డిస్కులను ఎన్కేస్ అనే ఒక సాఫ్ట్‌వేర్ ద్వారా పరీక్షించి వాటిలో ఉన్న సమాచారాన్ని బైటికి లాగానని చెప్పుకున్నాడు. సాయిబాబా మీద నేరారోపణలకు ప్రధాన ఆధారంగా చూపినవన్నీ ఈ సాంకేతిక ఆధారాలే. ఆ ఎన్కేస్ సాఫ్ట్‌వేర్ వినియోగించడానికి 'ఎన్కేస్ సర్టిఫైడ్ ఎగ్జామినర్' పరీక్ష పాసయి, ఆ సర్టిఫికెట్ పొంది ఉండాలి. కాని ఈ భవేశ్ నికమ్ ఆ పరీక్ష రాయలేదు. ఎన్కేస్ సర్టిఫైడ్ ఎగ్జామినర్ కాదు. అసలు సిఎఫ్ఎస్ఎల్ దగ్గర అవసరమైన ఎన్కేస్ సాఫ్ట్ వేర్ లేనేలేదు. ఇటువంటి పరీక్ష జరపడానికి ఎనిమిది వేరువేరు ప్రక్రియలుండగా ఆ సైంటిఫిక్ ఆఫీసర్ ఆ ప్రక్రియలలో ఏ ఒక్కటీ అమలు జరపలేదు. పోలీసులు రాసి ఇచ్చిన నివేదిక మీద సంతకం చేయడం మినహా ఆ సైంటిఫిక్ ఆఫీసర్ చేసిందేమీ లేదు. అసలు ఆ సైంటిఫిక్ ఆఫీసర్ అవసరమైన పరీక్షలే జరపలేదని డిఫెన్స్ న్యాయవాది నిస్సందేహంగా రుజువు చేశారు. ఈ డిఫెన్స్ వాదనలోని కొన్ని అంశాలను తీర్పులో న్యాయమూర్తి కూడ ఒప్పుకున్నారు. నిజానికి అవి ఒప్పుకున్నారంటే, సాయిబాబా మీద నేరారోపణకు తగిన ఆధారాలు లేవని ఒప్పుకున్నట్టే. కాని అలా ఒప్పుకున్న న్యాయమూర్తే తన నిర్ధారణకు భిన్నంగా తానే శిక్ష విధించారు.

ఆ సాంకేతిక పరీక్ష సంగతి ఎలా ఉన్నా, సాయిబాబా మీద మొత్తం నేరారోపణకు ప్రాతిపదిక హార్డ్ డిస్క్ లలో ఉన్నదంటున్న సమాచారమే. ఆ సమాచారంలో అత్యధిక భాగం విప్లవోద్యమం గురించి వివిధ పత్రికల్లో వచ్చిన వార్తల, వ్యాసాల, కరపత్రాల ప్రతులు, ఆర్‌డిఎఫ్‌కు సంబంధించిన సమాచారం, ఆర్‌డిఎఫ్ ఉప ప్రధాన కార్యదర్శిగా సాయిబాబా వివిధ మిత్రులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు. వాటితో పాటు సాయిబాబా, సహచరి వసంత, కూతురు మంజీర ల వ్యక్తిగత సమాచారం, సినిమాలు, విడియోలు. వీటిలో ఏ ఒక్కటీ నేరారోపణకు వీలు కల్పించేవి కావు. విప్లవోద్యమానికి సంబంధించిన సమాచారమంతా స్వయంగా విప్లవోద్యమం నడుపుతున్న వెబ్ సైట్ల నుంచి తీసుకున్నదేనని, అలాగే వేరువేరు పత్రికల వెబ్ సైట్లలో విప్లవోద్యమానికి సంబంధించిన సమాచారం వచ్చినప్పుడు కాపీ చేసి భద్రపరచుకున్నదని డిఫెన్స్ న్యాయవాది చూపారు.

మొత్తంగా సాయిబాబా విడిగా గాని, ప్రశాంత్ రాహీ, హేమ్ మిశ్రా లతో కలిసి గాని అజ్ఞాత నాయకులకు రాసిన ఉత్తరాలు, లేదా అజ్ఞాత నాయకుల నుంచి వచ్చిన ఉత్తరాలు అని ప్రాసిక్యూషన్ నాలుగైదు ఉత్తరాలను సాయిబాబా హార్డ్ డిస్క్ లలో ఉన్నట్టుగా చూపింది. అవి నిజంగా సాయిబాబా రాసినవేనా, పోలీసులు చొప్పించినవా చెప్పడానికి అవకాశం లేదు. వాటిని పోలీసులు చొప్పించిఉంటారని అనుమానాలు వ్యక్తం చేస్తారనే ఉద్దేశంతోనే ఆ హార్డ్ డిస్కులలో వ్యక్తిగత సమాచారాన్ని యథాతథంగా ఉంచారు. జడ్జి కూడ ఆ వ్యక్తిగత సమాచారాన్ని ఒకటికి రెండుసార్లు ప్రస్తావించి, అవి ఉన్నాయంటే ఈ హార్డ్ డిస్కులు సాయిబాబావేనని తేలుతున్నదన్నారు. పోలీసులు తామే హార్డ్ డిస్కులు

# వకుళాభరణం లలిత



తెలుగు సమాజంలోని అరుదైన మానవ శాస్త్రవేత్త, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ఆదివాసి జాతుల మీద పరిశోధన చేసి విస్తృతంగా పుస్తకాలు రచించిన డా. వకుళాభరణం లలిత (1937–2017) మార్చ్ 14న మరణించారు. ప్రస్తుత ప్రకాశం జిల్లా వెంకంపాడులో 1937లో పుట్టిన లలిత నాగపూర్ విశ్వవిద్యాలయం నుంచి పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్‌లో, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు, సోషియాలజీలలో ఎం.ఎ., శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి తెలుగులో ఎం.ఫిల్., కలకత్తాలో మానవ శాస్త్రం (ఆంత్రోపాలజీ)లో పిఎచ్.డి. చేశారు. డిగ్రీలో సహ విద్యార్థి, ప్రఖ్యాత చరిత్రకారుడు వకుళాభరణం రామకృష్ణను పెళ్లి చేసుకొని ఆయనతో పాటే కావలి జవహర్ భారతిలో అధ్యాపకురాలిగా పనిచేశారు. తెలుగు అకాడమీలో కూడా పనిచేసిన లలిత ప్రజాపాలన శాస్త్రం మీద, రాజనీతి శాస్త్రం మీద ఎన్నో పుస్తకాలు, పరిశోధనా పత్రాలు ప్రచురించారు. భారత చరిత్ర కాంగ్రెస్‌తోనూ, ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్‌తోనూ సన్నిహితంగా పనిచేశారు. ఆదివాసి తెగల జీవిత విధానం పట్ల, ప్రత్యేకించి స్త్రీల దుస్థితి పట్ల తీవ్రమైన వ్యగ్రతతో పనిచేసి, రాష్ట్ర వ్యాప్తంగా ఆమె కలవని ఆదివాసి తెగ లేదనే పేరు తెచ్చుకున్నారు. మాజీ నేరస్త జాతుల సమగ్ర పరిశీలన, జోగినీ వ్యవస్థ, దేవదాసీలు, దుర్గాబాయి దేశముఖ్ జీవిత చరిత్ర, నటరాజ రామకృష్ణ జీవిత చరిత్ర, హేమలత లవణం జీవిత చరిత్ర, రఘుపతి వెంకటరత్నం నాయుడు జీవిత చరిత్ర వంటి తెలుగు పుస్తకాలతో పాటు, 'ది మేకింగ్ ఆఫ్ క్రిమినల్ ట్రైబ్స్', 'ఎడ్యుకేటింగ్ ట్రైబల్ చిల్డ్రన్' వంటి ప్రామాణిక గ్రంథాలెన్నో రచించారు. దాదాపు నలభై సంవత్సరాల క్షేత్ర పరిశోధన అనుభవాలలో ముఖ్యమైన వాటితో 'నా జ్ఞాపకాలు' అనే పుస్తకం ప్రచురించారు. అస్మిత, నవ వికాస్, సంస్కార్ వంటి ఎన్నో ఆదివాసుల, స్త్రీల సహాయ, పునరావాస సంస్థలకు, కేంద్రాలకు వెన్నుదన్నుగా నిలబడ్డారు. శ్రీకాకుళం సవరల నుంచి ఆదిలాబాద్ గోండుల దాకా పద్దెనిమిది ఆదివాసి తెగల నృత్య రీతుల మీద పరిశోధన చేయించారు. కొంతకాలంగా అనారోగ్యంగా ఉన్నప్పటికీ 'వూంబ్ టు టూంబ్' పేరుతో స్త్రీల సమస్యల గురించి ఒక పుస్తకం రాయాలని, ఎరుకల వారి మీద ఒక పుస్తకం రాయాలని, తెలుగు రాష్ట్రాల్లోని ముప్పై ఐదు గిరిజన తెగల స్త్రీల మీద ఒక పుస్తకం రాయాలని ప్రణాళికలు పెట్టుకున్నారు. ప్రజలను ప్రేమించే క్షేత్ర పరిశోధకులు, బుద్ధిజీవులు, రచయితలు ఎంత నిర్విరామమైన, నిబద్ధమైన కృషి సాగించాలో ఆమె తన కృషినే ఆదర్శంగా నిలిపి చూపారు. వీక్షణం ప్రారంభమైనప్పటి నుంచి శ్రేయోభిలాషులలో ఒకరైన లలిత గారికి వీక్షణం వినమ్రంగా జోహార్లు పలుకుతోంది. వీ

పెట్టి ఉంటే ఈ వ్యక్తిగత ఉత్తరాలు, సినిమాలు ఎట్లా వస్తాయని ప్రశ్నించారు. సాయిబాబాకు పార్టీలో ప్రకాశ్ అనే రహస్యపేరు ఉన్నదని చెప్పిన ప్రాసిక్యూషన్, ఇచ్చిన సమాచారంలో ప్రకాశ్ రాసిన ఉత్తరంలో "నా హార్డ్ డిస్క్ క్రాష్ అయింది" అనే మాట ఉంది గనుక, ఇప్పుడు జప్తు చేసిన ఐదు హార్డ్ డిస్కులలో ఒకటి క్రాష్ అయి ఉంది గనుక అదీ ఇదీ ఒకటేనని ప్రాసిక్యూషన్ అల్లిన కథను జడ్జి యథాతథంగా అంగీకరించాడు. ఈ "నిస్సందేహమైన ఆధారాలను బట్టి జప్తు చేసిన ఎలక్ట్రానిక్ వస్తువులన్నీ సాయిబాబావేనని, వాటిలో పోలీసులు మార్పులు చేర్పులూ చేయలేదని చెప్పవచ్చు" అని కితాబు ఇచ్చాడు.

ఇటువంటి హాస్యాస్పదమైన విషయాలెన్నో ఉన్నాయి గాని, ఒక మచ్చుతునక చూపాలి. సాయిబాబా హార్డ్ డిస్క్ లో, 2010లో ప్రభుత్వానికీ మావోయిస్టు పార్టీకీ చర్చలు జరగాలని కోరుతూ చేసిన ఒక విజ్ఞప్తిపై ప్రొ. రణధీర్ సింగ్, జస్టిస్ రాజేందర్ సచార్, బి డి శర్మ, ప్రొ. మనోరంజన్ మొహంతీ, అరుంధతీ రాయ్, ప్రొ. అమిత్ భాదురి, సుమిత్ చక్రవర్తి, ప్రశాంత్ భూషణ్ వంటి మేధావులతో పాటు జి.ఎన్. సాయిబాబా సంతకం కూడ ఉండడం చూపి అది ఆయన మావోయిస్టు అనడానికి ఆధారమని ప్రాసిక్యూషన్ వాదించింది. జడ్జి ఆమోదించారు.

ప్రాసిక్యూషన్ అల్లిన కట్టుకథల గురించీ, ఆ కట్టుకథలను నమ్మి శిక్ష విధించిన న్యాయమూర్తి తీర్పు గురించి మరెన్నో విషయాలు చెప్పవచ్చు గాని ఇక్కడ ఆపి, అసలు ఇవి నేరాలేనా అనే ప్రశ్న చర్చించవలసి ఉంది. వ్యవస్థ ఉన్న తీరు మీద, పాలన నడుస్తున్న తీరు మీద ప్రజలకు, బుద్ధిజీవులకు అసంతృప్తి, భిన్నాభిప్రాయం ఉండడం కొత్త విషయం కాదు. ప్రస్తుత దుర్భర వ్యవస్థ రద్దయి మరొక మంచి వ్యవస్థ రావాలని కోరుకోవడమూ కొత్త కాదు. అలాంటి భిన్నాభిప్రాయం ఉండడమే, దాన్ని ప్రకటించడమే, అలా ప్రకటించే ఇతరులతో సంఘీభావం ప్రకటించడమే నేరాలవుతాయా అని ప్రశ్నించవలసి ఉంది. అవి నేరాలయితే, అలా ఆలోచించే, ఆచరించే వారిని ఇలా శిక్షలకు గురి చేస్తూ పోతే సామాజిక చలనమే ఉండేది కాదు. సమాజ పురోగమనమే ఉండేది కాదు. అందువల్లనే భిన్నాభిప్రాయాలు ఉంచుకునే స్వేచ్ఛను, భావ ప్రకటనా స్వేచ్ఛను ఆధునిక నాగరిక సమాజాలన్నీ అంగీకరించాయి, గౌరవిస్తామని ప్రకటించాయి. చివరికి భారత రాజ్యాంగం కూడ దాన్ని ప్రాథమిక హక్కులలో భాగం చేసింది. కాని చట్టవ్యతిరేక కార్యకలాపాల (నిరోధక) చట్టం ఈ భారత రాజ్యాంగపు ప్రాథమిక హక్కును కూడ కాలరాస్తూ అభిప్రాయాలు ఉండడమే, ప్రకటించడమే శిక్షార్హమైన నేరాలుగా ప్రకటించింది. ఆ చట్టాన్ని ఇవాళ గడ్చిరోలి న్యాయస్థానం ఒక ప్రయోగంగా అమలు చేయడం ప్రారంభించింది. తక్షణమే ఈ తీర్పును, చట్టవ్యతిరేక కార్యకలాపాల (నిరోధక) చట్టాన్ని ప్రతిఘటించే ఒక విశాల ప్రజా ఉద్యమాన్ని సంఘటితం చేయకపోతే ఈ దేశంలో భిన్నాభిప్రాయం ఉండడానికి వీలులేని స్థితి వస్తుంది. సృజనాత్మక జీవులైన మనుషులు తమ సృజన శక్తినంతా చంపుకుని యంత్రాలలో ఏకాభిప్రాయాన్ని, అది కూడ పాలకుల అభిప్రాయాన్ని మాత్రమే నమ్మవలసి వస్తుంది, ఆచరించవలసి వస్తుంది. అంటే ఇది కేవలం జి.ఎన్. సాయిబాబా, ప్రశాంత్ రాహీ, హేమ్ మిశ్రా, మహేశ్ టిర్కి, పాండు నరోటే, విజయ్ టిర్కిలకు విధించిన శిక్ష సమస్య మాత్రమే కాదు. ఇది భారత రాజ్యాంగంలో హామీ ఇచ్చిన ప్రాథమిక హక్కుల, వాక్సభాస్వాతంత్ర్యాల సమస్య. ఇది మానవత్వం మీద దాడి. సృజన మీద, ఆలోచన మీద దాడి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# భారత న్యాయ వ్యవస్థ పయనమెటు?

*భారత నేరమయ, దళారీ రాజకీయ వ్యవస్థను, పెట్టుబడిదారీ విధానాన్ని వెనకేసుకొస్తున్న న్యాయవ్యవస్థ, న్యాయమూర్తుల తీరు సాయిబాబాకు జీవిత ఖైదు విధించడం ద్వారా మరోసారి రుజువైందని అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ సాయిబాబాకు మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా సెషన్స్ కోర్టు 2017 మార్చ్ 7న జీవిత కాలం శిక్ష విధించింది. భారతదేశ న్యాయ వ్యవస్థకు, తన వర్గ స్వభావాన్ని, దేశంలో అధికారంలో ఉన్న భారతీయ జనతా పార్టీ ప్రభుత్వ అజెండాను అమలు చేసినట్లయింది. 90 శాతం అంగ వైకల్యం ఉన్న వ్యక్తికీ, అందులోనూ 'ఎలక్ట్రానిక్' సాక్ష్యం ఆధారంగా యావజ్జీవ కారాగార శిక్ష విధించడం ఇదే ప్రప్రథమం. ప్రొఫెసర్ సాయిబాబాతో పాటుగా మరో నలుగురికి కూడా అదే శిక్ష విధించారు. ఇందులో ఇద్దరు ఆదివాసులు. విజయ టిర్కీ అనే ఆదివాసికి 10 సంవత్సరాల జైలు శిక్ష విధించింది. మొత్తం కేసులో ఆరుగురు నిందితులు. ఇందులో మనం రెండు విషయాలు గమనించాలి. 1) భారతదేశంలో న్యాయ వ్యవస్థ పనితీరు, 2) భారత రాజ్యాంగ మౌలిక ప్రమాణాల ఆధారంగా న్యాయ వ్యవస్థ పనితీరు.

'నేర న్యాయ వ్యవస్థ' కేవలం 'ఇన్వెస్టిగేటివ్ ఏజెన్సీ' అంటే పోలీసుల పనితీరు అనగా వ్యక్తిపై ఆరోపించబడిన నేర పూరిత సెక్షన్‌ల చార్జిషీట్ ఆధారంగా అవి సాక్ష్యాలు నిరూపించబడిన తీరు ఆధారంగా శిక్షలు విధించడం. ఒక వ్యక్తి మావోయిస్ట్ పార్టీ సిద్ధాంతాలకు ప్రచారం చేయడంలో భాగంగా, కొంత మంది విద్యార్థులను తయారు చేస్తున్నాడనీ, అందుకై కంప్యూటర్లనూ, ఆండ్రాయిడ్ సెల్ ఫోన్‌లనూ వినియోగించాడనీ ప్రధాన ఆరోపణ. తద్వారా ఈ దేశంలో ఉన్న పరిపాలనా వ్యవస్థను ధ్వంసం చేసే శక్తులకు ఉపయోగపడుతున్నాడనేది ప్రధాన అభియోగం. అందులో భాగంగానే అన్‌లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్ (యుఎపిఎ) లోని సెక్షన్ 13,18,20,38,39లు ప్రొ. సాయిబాబాపై ఆరోపించబడిన నేర అభియోగం. అంతే కాకుండా ఐపిసి సెక్షన్ 120 బి (కుట్ర చేయడం) క్రిమినల్ కాన్స్పిరసి కూడా మరో అభియోగం. ఇవి రుజువయ్యాయని కోర్టు భావన.

ఏ నిందితుడి మీద అయినా నేరం రుజువు చేయడానికి పోలీసులకు సాక్ష్యాలను ప్రవేశపెట్టడం, వాటిని కోర్టులో చెప్పించడం చాలా తేలిక. కాని అందులో వాస్తవం ఏమిటి? కేసులో పోలీసుల ఇంట్రెస్ట్, యాంగ్జయిటి ఏమిటి? అనేది కోర్టులో నిశితంగా పరిశీలించాలి. దానిని కనుగొనాలి. ఆ విధంగా కాకుండా, కేవలం పోలీసులు సాక్ష్యాలను ప్రవేశపెట్టారు, సిడిలూ, సెల్ ఫోన్ సిమ్‌లూ కోర్టుకిచ్చారు కాబట్టి శిక్ష విధిస్తున్నానని కోర్టు చెప్పడం కేవలం తీర్పు ఏకపక్షంగా ఇచ్చినట్లయింది.

న్యాయమూర్తి తీర్పు ఇచ్చే సమయంలో నిందితుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితి, నేపథ్యం, వారి మీద ఆధారపడిన కుటుంబ సభ్యుల జీవితాలన్నీ కూడా చూడాలి. ఆ విధంగా ఈ కేసులో న్యాయమూర్తి సూర్యకాంత్ షిండే చూసినట్లు లేరు. అసలు ఈ దేశంలో నేర న్యాయ వ్యవస్థ ఒక పెద్ద ఫార్స్ (బూటకం). ఈ దేశంలో సామాన్యునికీ, నిజాయితి పరునికీ, న్యాయం కోసం పోరాడే వారికీ, అవినీతికి వ్యతిరేకంగా నిలబడిన వారికీ, మొత్తం వ్యవస్థ మారాలని కోరుకునే ఉద్యమకారులకూ ఈ కోర్టులు, న్యాయమూర్తులు 90 శాతం మంది వ్యతిరేకమే. అందులోనూ ఇటీవల న్యాయమూర్తులలో పెట్టుబడిదారీ తత్వం, ముఖ్యంగా ఉద్యమకారులను, సంఘ విద్రోహ శక్తులుగా చూసే అలవాటు ఎక్కువైంది. అధికారంలో ఉన్న వారిని కీర్తించే ధోరణి పెరిగిపోయింది. పోలీసుల మీద ఆధారపడుతూ, న్యాయమూర్తులు ఎక్కువ మంది విలాసవంతమైన జీవితాలకు అలవాటు పడడం ద్వారా సామాన్య పౌరుల, ముఖ్యంగా పేద, దళిత వర్గాల వ్యతిరేక ధోరణి న్యాయమూర్తులలో బహిరంగంగానే కనబడుతున్నది. ఒక దశలో పోలీసులంతా చేస్తున్నది కరెక్ట్ అనే న్యాయమూర్తులు కూడా ఉన్నారు.

మొత్తం భారత న్యాయ వ్యవస్థలో ప్రమాదకరమైన, అశాస్త్రీయమైన, అప్రజాస్వామిక, అమానవీయ ధోరణులు చోటుచేసుకుంటున్నవి. ఈ ధోరణులు కేవలం మావోయిస్టు పార్టీ సానుభూతి పరులకు లేదా వారిని నమ్మే వారికి మాత్రమే కాదు, దాదాపుగా ఈ 'రాజ్య వ్యవస్థ'ను వ్యతిరేకించే ప్రతి ఒక్కరికీ కూడా భవిష్యత్తులో చాలా ప్రమాదకరమైన పరిస్థితికిది నిదర్శనంగా చెప్పుకోవచ్చు. కాబట్టి ఈ విషయమై అందరూ రాజకీయాలకతీతంగా ఆలోచించాలి.

రెండవ అంశం, భారత రాజ్యాంగ మౌలిక ప్రమాణాలకు ఈ తీర్పు పూర్తిగా వ్యతిరేకం, విరుద్ధం. భారత రాజ్యాంగ మౌలిక ప్రమాణాలనగా అవి స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ఆధారంగా నిర్మించబడిన ఒక లిఖిత రాజ్యాంగ రూపం. ఇది గొప్ప ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద స్ఫూర్తిని ప్రస్ఫుటించే విధంగా తయారు చేయబడి, భారతదేశ పౌరులందరికీ అందించబడిన ఒక గొప్ప ఉద్గ్రంథం. అయితే దాని పేరు మీద జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు ఈ రాజ్యాంగ ప్రమాణాలకు పూర్తిగా విరుద్ధమైనపటికీ, దాని ఆమోదంతోనే జరుగుతుండడం విచారించాల్సిన విషయం. పూర్తిగా రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. ఈ తీర్పు కూడా ఆ కోవలోకి చెందినదే. ప్రొ. సాయిబాబాకు 90 శాతం అంగవైకల్యం ఉన్నప్పటికీ, అతనికి శిక్ష విధించడమనేది ఈ దేశంలో 'వ్యక్తి స్వేచ్ఛ'కు ఏ విధమైన సంకెళ్లు విధించబడుతున్నాయో తెలుపుతుంది. దేశంలోని మధ్యతరగతి వర్గాలను, విద్యావంతులను, మావోయిస్ట్ పార్టీకే కాకుండా ఏ రకమైన ప్రజాస్వామ్య ఉద్యమానికి సహకారం అందించేవారికి కూడా ఇదే విధమైన శిక్ష విధిస్తామని ఒక హెచ్చరిక చేసినట్లు ఈ న్యాయ వ్యవస్థ (మూర్తి) భావించినట్లుంది. దీనిని ప్రజాస్వామిక శక్తులన్నీ ముక్త కంఠంతో తీవ్రంగా ఖండించాలి.

ఏ నిందితునికైనా శిక్ష వేసే సమయంలో కొన్ని ప్రమాణాలు చూడాలి. నేర విచారణ క్రమంలో ప్రవేశపెట్టబడిన సాక్షులు ఇచ్చిన సాక్ష్యం,

# భ్రమపెట్టే తెలంగాణ బడ్జెట్

***ప్రజలకు ఎన్నో ఆశలూ, భ్రమలూ కల్పిస్తూ ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో సామాన్యులకు ఆశించినంతగా కేటాయింపులు జరగలేదనీ, ఈ బడ్జెట్ రాబోయే ఎన్నికల కోసం ప్రారంభించిన కసరత్తుగా ఉందనీ అంటున్నారు*** **డా. అక్కెనపల్లి పున్నయ్య**

సుదీర్ఘ కాలంగా ఉమ్మడి రాష్ట్రంలో అన్ని రంగాల్లో నిర్లక్ష్యానికి గురి అయిందనుకున్న ఆర్థిక వ్యవస్థను చక్కదిద్ది తెలంగాణ భవిష్యత్ చిత్రాన్ని అందించే దిశలో, ప్రజలే మా ప్రభువులు, వారికోసం పనిచేయడం మా కర్తవ్యమని తెలంగాణ ఆర్థిక మంత్రి ఈటెల రాజేందర్ మార్చ్ 13న శాసనసభలో బడ్జెట్ ప్రవేశపెడుతూ అన్నారు. వలసబాట పట్టిన తెలంగాణ ప్రజా జీవనం తిరిగి పల్లెకు పయనం కావాలన్నదే మా ఆకాంక్ష అంటూ నాల్గవసారి ప్రవేశపెట్టారు. తెలంగాణ బడ్జెట్ అందుకనుగుణంగా పల్లెబాట పట్టిందని సాగునీటికి నిధుల వరద పారిస్తున్నామని ప్రభుత్వం గొప్పగా చెప్పుకుంది. చితికిన బతుకుల మధ్య అడుగంటిన కుల వృత్తులు, కాలి కూలిన జీవితాలను నిలబెట్టేందుకు అత్యంత వెనుకబడిన అట్టడుగు వర్గాల సంక్షేమానికి పెద్దపీట వేస్తున్నట్లు భరోసా భ్రమను కల్పిస్తోంది.

రెండేళ్ల ముందే ఎన్నికల బడ్జెట్‌ను తలపించే విధంగా దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దుకున్నట్లుగా ఉంది. అధికారం ఉండగానే ఓట్ల కూర్పుకు ఈ బడ్జెట్ నేర్పుగా దిగువ మధ్య తరగతి అమాయక బడుగు జీవులకు వరాల వర్షం కురిపించింది. ఉద్యమ నినాదమైన నీళ్లు, నిధులు, నియామకాలు ప్రాధాన్యతను కోల్పోగా నిధులు, నియామకాల కోసం నిరంతరం సంఘర్షిస్తున్న తెలంగాణ సమాజానికి తాత్కాలిక తాయిలాలను ప్రకటించింది ఈ బడ్జెట్. ఆ పేరుతో సంక్షేమానికి ప్రభుత్వం అధిక ప్రాధాన్యత కల్పించే ప్రయత్నం ఈ బడ్జెట్‌లో కనిపిస్తుంది.

దీంట్లో ఉన్న దీర్ఘకాలిక వంచనా శిల్పం బహుశా చాలా మందికి అర్థం కాకపోవచ్చు. రాష్ట్రం ఏర్పడిన మూడేళ్ల కాలంలో ప్రపంచం చుట్టి వచ్చిన ప్రభుత్వాధినేతలు చుక్కలనంటే సాంకేతిక పరిజ్ఞానాన్ని రాష్ట్ర అభివృద్ధికి అనుసంధానం చేస్తామని అంటున్నారు. ఒకవైపు అలా చెప్పుకుంటూ, సాంకేతికతకి అత్యంత దూరంగా ఉన్న బడుగు బలహీన వర్గాలను చైతన్యపరచి తనతోపాటు పయనింపచేయాల్సిన ప్రగతి

---

స్వచ్ఛందంగా ఇచ్చినదా? లేదా పోలీసు అధికారులు కక్షతో, ప్రలోభాలకు లోబర్చుకొని, సాక్షులను కోర్టులో ప్రవేశపెట్టి చెప్పబడినదా? అనే ఒక సామాన్య విషయాన్ని కూడా పరిగణనలోనికి తీసుకోకుండా ఈ కేసులో నేర విచారణ జరిపినట్లుగా కనిపిస్తున్నది. నిందితుల సామాజిక కోణంగా, వారి రాజకీయ విశ్వాసాల ప్రమాణంగా శిక్ష విధించడం సరికాదనేది గతంలో సుప్రసిద్ధ జడ్జి (రిటైర్డ్) జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి గారి తీర్పులున్నాయి. కనీసం వాటి ఆధారంగానైనా శిక్ష విధించకుండా ఉండవలసింది. ఆ విధమైన ప్రమాణాలను ఏమీ పాటించినట్లు కనబడడం లేదు. ఈ తీర్పు ద్వారా అధికార రాజ్యవ్యవస్థ– పోలీసులు – న్యాయవ్యవస్థ అనుసంధానం, వారి మధ్య ఉన్న అవినాభావ సంబంధం స్పష్టమవుతున్నది.

ఇక్కడ మరో విషయం చెప్పవలసి ఉంది. ప్రస్తుతం దేశంలో ఉన్న న్యాయమూర్తులలో అనగా జుడీషియల్ ఫస్ట్ క్లాస్ మెజిస్ట్రేట్ (జెఎఫ్‌సిఎం) కోర్టు నుంచి మొదలు సుప్రీం కోర్టు న్యాయమూర్తుల వరకు కూడా ఎక్కువ శాతం మంది న్యాయమూర్తులు వ్యాపార ధోరణి, అప్రజాస్వామిక దృక్పథం, అన్నింటికన్నా మించి అహంకారం, ధనాకాంక్ష లాంటి అవలక్షణాలు కలిగి ఉన్నారు. దీనివల్ల వారికి సమాజంలో జరుగుతున్న అన్యాయాలనూ, అక్రమాలనూ, అవినీతినీ ప్రశ్నించే వారంతా ఈ సమాజానికి పనికిరాని వారిగా భావిస్తున్నారు. అధికారంలో ఉన్న వారిని కీర్తించడం లేదా కాపాడే ధోరణి కనబడుతున్నది.

ఉదాహరణకు తెలంగాణలో ఎంఎల్‌సి ఎన్నికల సందర్భంగా స్టీఫెన్‌సన్ అనే ఆంగ్లో ఇండియన్ కోటాలోని ఎంఎల్ఎ ఓటును కొనుగోలు చేయడానికి ప్రయత్నించిన కేసులో ఎలక్ట్రానిక్ వీడియో రికార్డింగ్‌లో వాయిస్ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుది అని ఫోరెన్సిక్ సైన్స్ లేబోరేటరీ నిర్ధారించింది. కానీ ఇంతవరకు ఆయనపై ఎలాంటి చర్యలు చేపట్టకపోగా, హైకోర్టు స్టే కొనసాగుతున్నది. అది కూడా 'ఎలక్ట్రానిక్ డివైస్' సాక్ష్యమే కదా, దానిని ఎందుకు పరిగణనలోనికి తీసుకోవడం లేదు. ఇంకా విచారణ కింది కోర్టులో చేపట్టలేదు కాబట్టి స్టే ఇస్తున్నామని చెబుతున్నారు.

ఇది ఈ దేశంలో న్యాయ వ్యవస్థలో కొనసాగుతున్న ధోరణులు. ఇలాంటివి ఎన్నో సంఘటనలు ఈ దేశంలో. మధ్యప్రదేశ్‌లోని వ్యాపం కుంభకోణం, గుజరాత్‌లోని విధ్వంసాలపై ఇంత వరకూ 'న్యాయం' అందని ద్రాక్షయే.

ఉద్యమకారులు, ప్రజాస్వామికవాదులు ఇంతవరకు న్యాయ వ్యవస్థలో జరుగుతున్న అనేక అవినీతి, అక్రమాలపై స్పందించలేదనేది నా అభిప్రాయం. న్యాయ వ్యవస్థపై నమ్మకంతోనో, లేదా భయంతోనో చాలామంది ఎక్కువ గౌరవం ఇచ్చారు. కాని మనమంతా ఇప్పటికైనా స్పందించాలి. న్యాయం కోసం అనేక రూపాలలో న్యాయ వ్యవస్థ లోపాలను, వారి ఆకృత్యాలను నిరసిస్తూ, మరింత శక్తితో, దీక్షతో పోరాడాలి. ఈ దేశంలో ఐఎఎస్/ఐపిఎస్‌లు, న్యాయమూర్తులు, రాజకీయ నాయకులు అందరూ ఏదో ఒక రూపంలో ఈ నేర వ్యవస్థను కాపాడాలనే దీక్షతో ఉన్నవారే. మరి మనం ఈ వ్యవస్థను మార్చాలని కోరుకునే వారిగా, వారిని ప్రతిఘటించకుంటే మనకు మనమే అన్యాయం చేసుకున్నవారమవుతాం.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ఆలోచనలను పక్కకు పెట్టి అత్యంత ప్రాచీనమైన ఆలోచనలతో, చైతన్యవంతమైన తెలంగాణ సమాజాన్ని కులాలుగా వర్గీకరించి, ప్రాచీన వృత్తులకు ప్రాధాన్యతను ఇస్తున్నట్లు భ్రమింపచేస్తున్నారు. ఆ వర్గాల కోసం కోట్ల రూపాయలను అప్పుగా తెచ్చి అయినా వారిని ఉద్ధరిస్తామని బడ్జెట్‌లో ఊదరగొట్టారు.

ఈ మూడేళ్ల కాలంలో మిగులుతో మొదలైన రాష్ట్రాన్ని ఆరు దశాబ్దాలుగా లేని అప్పుల స్థాయిలో నిలబెట్టారు. 2014 జూన్ 2 నాటికి రు. 61,711 కోట్ల అప్పు ఉంటే 2017 - 18 నాటికి రు. 1,40,523 కోట్లకు చేరుకుంది. అంటే రు. 78,812 కోట్ల రూపాయల భారీ అప్పుతో అత్యంత భారీ బడ్జెట్ అని గొప్పకుపోయిన తలకొక్కంటికి 41 వేల రుపాయల అప్పులు మిగిల్చిన బడ్జెట్ ఇది. ఈ విషయం బడ్జెట్ కేటాయింపులు పరిశీలిస్తే అర్థం అవుతుంది.

**గత బడ్జెట్ల తీరు**

| సంవత్సరం | ప్రణాళిక పద్దు | ప్రణాళికేతర పద్దు | మొత్తం (కోట్లల్లో) |
|---|---|---|---|
| 2015-16 | 52,383.00 | 63,306.00 | 1,15,689.00 (బి.ఇ) (97922.00) (ఆక్చువల్స్) |
| 2016-17 | 67,630.73 | 62,785.14 | 1,30,415.87 (బి.ఇ) (112101.06) (ఆర్.ఇ) |
| 2017-18 | 88,038.00 (ప్రగతి పద్దు) | 61,607.00 (నిర్వహణ పద్దు) | 1,49,646.00 (బి.ఇ) |

(సోర్స్ తెలంగాణ బడ్జెట్ 2017-18)

అప్పులపై ఆశలతో, కేంద్రం వైపు చూపులతో రాబడులతో నిమిత్తం లేకుండా ఏటికేడు గుణశ్రేణిలో ఘనంగా బడ్జెట్ మొత్తాలను పెంచుకుంటూ పోతుంది. 2016-17 కేటాయించిన బడ్జెట్ మొత్తంలో సవరించిన అంచనాల ప్రకారం 86 శాతం నిధులనే వినియోగించుకున్న ప్రభుత్వం మరొక్కసారి నేల విడిచి సాము చేయాలని చూసింది. గత అనుభవాలను పరిగణలోకి తీసుకోలేదు సరికదా కేంద్రం నుంచి రావాల్సిన నిధులు రాలేదని, భూముల అమ్మకాలు నిలిచిపోయాయని, వాణిజ్య పన్నుల శాఖకు రావాల్సిన బకాయిలు వసూలు కాలేదని చెప్పుకుంటూనే అంచనాలకు మించిన అడుగు వేయాలని చూసింది.

రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఏకరూప బడ్జెట్‌తో వ్యవహరించాలనే పేరుతో కేంద్ర ప్రభుత్వ మార్గదర్శకాలను అనుసరించి ప్రణాళిక, ప్రణాళికేతర వ్యయాల స్థానంలో ప్రగతి పద్దు, నిర్వాహణ పద్దుల పేరిట ఈ ఆర్థిక సంవత్సరానికి వరుసగా రు. 88,038 కోట్లు, రు. 61,607.20 కోట్ల కేటాయింపులతో రు. 1,49,646 కోట్లతో భారీ బడ్జెట్‌ను ప్రవేశపెట్టింది. కేంద్ర ఆలోచన సరళి దాగి ఉన్న ఈ బడ్జెట్ భావనలో గతంలో ఉన్న ప్రణాళికా, ప్రణాళికేతర పద్దులకు బదులుగా రెవెన్యూ, క్యాపిటల్ పద్దులుగా విభజన జరిగిందని ప్రకటించారు.

కాగా పై పట్టికను పరిశీలించినప్పుడు వాస్తవాలను గ్రహించవచ్చు. ప్రతి ఆర్థిక సంవత్సరానికి బడ్జెట్ ప్రవేశపెట్టినప్పుడు గత సంవత్సరానికి కేటాయించి సవరించిన మొత్తాలతో పాటు ఈ సంవత్సరానికి కేటాయించిన మొత్తాలు కూడా ఉంటాయి. కాని ప్రభుత్వం వాస్తవ కేటాయింపుల వినియోగం ప్రజలకు పూర్తిగా తెలియాలంటే మూడు సంవత్సరాల కాలం పడుతుంది. గణాంకాలను పై పట్టికలో గ్రహించవచ్చును.

### వనరుల అంచనాలు

గతంలో మాదిరిగానే 2017-18 సంవత్సరానికి ప్రభుత్వం వాస్తవానికి మించిన ఆదాయ వనరులను అంచనా వేసింది. రాష్ట్రానికి వచ్చే ఆదాయ వనరులను రెవెన్యూ రాబడుల ద్వారా 1,13,083.04 కోట్లుగా అంచనా వేసింది. ఇందులో కేంద్ర ప్రభుత్వం ఇచ్చే పన్నుల వాటా, రాష్ట్రాలు వసూలు చేసే పన్నుల గ్రాంట్-ఇన్-ఎయిడ్ వంటి ఆదాయాలున్నాయి. ప్రభుత్వ రుణాల ద్వారా రు. 29,380 కోట్లు, రుణాల రికవరి నుండి రు. 5807.17 కోట్లు ప్రభుత్వం దగ్గర నిల్వ ఉన్న మొత్తం రు. 1050 కోట్లు కలిపి రు. 1,49,320.21 కోట్లుగా అంచనా వేసింది.

### వ్యయాలు

రెవెన్యూ వ్యయాలనబడే పరిపాలన సేవల ఖర్చు రు. 6,672.52 కోట్లు, పన్నుల వసూళ్ల చార్జీలు రు. 717.53 కోట్లు, రుణ సేవలకు రు. 11,338.61 కోట్లు మొత్తం అభివృద్ధి వ్యయాలపై చెల్లింపులు రు. 77,160.32 కోట్లు, తదితర ఖర్చులకు రు. 12,622.75 కోట్లు కలిపి రెవెన్యూ వ్యయానికి మొత్తం రు. 1,08,511.73 కోట్లు. మూలధన వ్యయం రు. 30,929.94 కోట్లు. ప్రభుత్వం చెల్లించే రుణాలు రు. 4659.48 కోట్లు. అప్పులు, ముందస్తు చెల్లింపులకు రు. 5,544.85 కోట్లతో కలిపి మొత్తం వ్యయం రు. 1,49,646 కోట్లు కాగా నికర లోటు రు. 325.79 కోట్లుగా అంచనా వేసింది. స్థూలంగా ఈ బడ్జెట్‌ను పరిశీలిస్తే అంకెల్లో వృద్ధి తప్ప వాస్తవ అభివృద్ధి కనిపించడం లేదు.

### వ్యవసాయ రంగం

రాష్ట్ర స్థూల జాతీయోత్పత్తిలో వ్యవసాయం దాని అనుబంధాల వాటా 14.7 శాతమే అయినప్పటికి 54 శాతం మందికి జీవనోపాది కల్పిస్తుంది. పరోక్షంగా 73 శాతం మందికి ఈ రంగంతో సంబంధముంది. ఇంత ప్రాధాన్యత ఉన్న ఈ రంగానికి గత బడ్జెట్‌లో రు. 6610.79 కోట్లు కేటాయించిన ప్రభుత్వం ఈ ఏడాది రు. 5942.97 కోట్లకు కుదించింది. గత బడ్జెట్ కంటే రు. 627.82 కోట్లు తగ్గించింది. ఈ మొత్తంలో రు. 4000 కోట్లు రుణమాఫికి పోగా వాస్తవంగా కేటాయించింది రు. 1942 కోట్లు మాత్రమే. ఇంత మొత్తంగా జీవనోపాధి కల్పిస్తున్న ఈ రంగాన్ని ఎట్లా ముందుకు తీసుకుపోతుందో ప్రభుత్వం దగ్గర సమాధానం వెతకాలి. రాష్ట్రాన్ని విత్తన భాండాగారంగా చేస్తామని చెప్పిన మాటలు నీటి మూటలుగా మిగిలినాయి. ఈ సంవత్సరం నకిలీ విత్తనాల వల్ల రైతులు మోసపోయి ఆత్మహత్యలు చేసుకున్న ఉదంతాలు వరంగల్, ఖమ్మం జిల్లాలలో ఉన్నాయి. రైతుల రుణాలను మొత్తంగా నాలుగు విడతలుగా చెల్లించి రైతులకు పాసు పుస్తకాలను అందిస్తామన్న ఈ ప్రభుత్వం నాలుగవ విడత 4,000 కోట్లు కేటాయింపు కేవలం వడ్డీకి మాత్రమే సరిపోతుంది. అసలు రుణం ఎప్పటికి తీరుస్తారోననే అయోమయ స్థితిలో రైతాంగాం ఉన్నారు. రైతుల ఆత్మహత్యల నివారణ కొరకు వ్యవసాయాన్ని మరింత దీమాగా, చైతన్య వంతంగా ముందుకు తీసుకుపోవుటకు కేంద్ర

ప్రభుత్వం 'ఫసల్ భీమా' పథకానికి బడ్జెట్‌లో కేటాయింపులు చేసింది. ఈ పథకం వర్తించాలంటే రైతులు, కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రీమియం చెల్లించాల్సి ఉంటుంది. దీనికి అనుగుణంగానే కేంద్రం, రైతులు తమ వాటా ప్రీమియాన్ని చెల్లించినప్పటికీ రాష్ట్రం చెల్లించాల్సిన 30 కోట్ల రూపాయలు చెల్లించకపోవడం వల్ల రాష్ట్ర రైతులకు రావాల్సిన రు. 300 కోట్ల నిధులు కేంద్రం వద్దే ఉండే స్థితి దాపురించింది.

**నీటి పారుదల రంగం**

కోటి ఎకరాల మాగాణి మా కళ. రైతుల కళ్లలో ఆనందం తొణికిసలాడాలనేదే ఈ ప్రభుత్వ లక్ష్యమని రాష్ట్ర ప్రభుత్వం హోర్డింగులు, వార్త పత్రికల్లో ప్రకటనల గొప్పే కాని, కేటాయింపుల్లో కాదు. 2016-17 బడ్జెట్‌లో నీటి పారుదల రంగానికి పెద్దపీట వేస్తున్నామని బడ్జెట్ అంచనాల్లో 37 శాతం నిధులుగా రు. 25,000 కోట్లు కేటాయించి వాటిలో నేటికి నికరంగా ఖర్చు చేసింది కేవలం 11 వేల కోట్లు కాగా పెండింగ్ బిల్లులు మరో మూడు వేల కోట్లతో కలిపి 14 వేల కోట్లు మాత్రమే మొత్తం ఖర్చు చేసింది. పోయిన బడ్జెట్‌లో ఎందుకు ఖర్చు చేయలేదో కారణాలను సమీక్షించకుండానే ఈ సంవత్సరానికి రు. 23,675.73 కోట్లను కేటాయించింది. ప్రాజెక్టు నిర్మాణాలకు అవసరమైన భూసేకరణ చట్టం, రైతులకు ఇచ్చే పరిహారం గురించి స్పష్టత లేకుండా ప్రాజెక్టులు నిర్మించాలనుకోవడం ఈ ప్రభుత్వానికి అత్యాశే అవుతుంది.

**విద్యా, వైద్య రంగాలు**

విద్య మనిషికి మూడో కన్ను. సామాజిక గౌరవం, సాధికారత విద్యతోనే సాధ్యమని బడ్జెట్ ప్రసంగంలో నమ్మబలికినారు. కొఠారీ కమిషన్ మొదలుకొని సుబ్రమణ్యన్ కమిషన్ వరకు చెప్పిన రాష్ట్రాల బడ్జెట్‌లో 30 శాతం నిధులుండాలనే నిబంధనలను తుంగలోకి తొక్కి 8.7 శాతంగా రు. 12,705 కోట్లను కేటాయించింది. ఈ నిధులతో మొత్తం విద్యారంగాన్ని ముందుకు తీసుకుపోవడం సాధ్యం కాదు. అసలే ప్రైవేట్ విద్యాసంస్థలతో పోటీపడలేక, వసతుల్లో కునారిల్లిపోతున్న ప్రభుత్వ విద్యారంగం చాలిచాలని నిధులతో మరింత దుర్భరస్థితికి పోయే పరిస్థితి ఉంది. నేటికి తరగతి గదులు లేకుండా, మరుగుదొడ్ల సౌకర్యాలు లేకుండా పాఠశాల విద్య కొనసాగించడమంటే విద్యారంగం పట్ల పాలకుల చిత్తశుద్ధి అర్థమవుతుంది.

'కామన్ స్కూల్ విద్యా విధామే నా కల' అని కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యనందిస్తానని, ప్రపంచం గర్వించే విద్యా విధానాన్ని ప్రవేశపెడతానన్న ప్రకటనలు పాలకులకు గుర్తున్నట్లే లేదు. కులాలుగా, మతాలుగా జ్ఞానాన్ని విడగొట్టే విద్య ఏ విలువలను అందిస్తుందో ఏలే పెద్దలే సమాధానం ఇవ్వాలి. గత బడ్జెట్ కంటే ఈ బడ్జెట్‌లో సాంకేతిక విద్యకు 15 శాతం నిధులను తగ్గించి రు. 379.85 కోట్లు కేటాయించడమంటే ఈ ప్రభుత్వం ఎంత అశాస్త్రీయతకు దగ్గరవుతుందో అర్థమవుతుంది.

వైద్య రంగానికి 2017-18 బడ్జెట్‌లో ఏడు వేల కోట్లు అవసరం ఉంటాయని వైద్య ఆరోగ్య శాఖ వాళ్లు అంచనా వేయగా రు. 5976.17 కోట్ల కేటాయింపుకే పరిమితమైనారు. ఇందులో నిర్వాహణ పద్దు కింద రు. 3,310.09 కోట్లు, ప్రగతి పద్దు రు. 2,666.08 కోట్లు కేటాయించింది. పెరిగే జనాభాకు వచ్చే రోగాలకు ఏమాత్రం సరిపోవు. మెడికల్ విద్యకు ఈసారి భారీ కోత విధించారు. గత బడ్జెట్‌లో రు. 784.87 కోట్లు ఉంటే ఈసారి రు. 505.18 కోట్లకు పరిమితం చేశారు.

గత బడ్జెట్‌లో గాంధీ, ఉస్మానియా ఆస్పత్రులకు ఒక్కొక్క దానికి రు. 100 కోట్లు కేటాయించినా ఒక్క రూపాయి ఖర్చు చేయకపోవడం విశేషం. కాగా, ఈ బడ్జెట్‌లో వాటి గురించి కనీసంగా మాట్లాడకపోవడం విచారకరం. ప్రజలందరికీ మెరుగైన వైద్యం అందించేందుకు బడ్జెట్‌లో ఈ రంగానికి భారీగా నిధులు కేటాయించి ఉపయోగించేలా చేయాల్సిన కనీస కర్తవ్యం ఈ ప్రభుత్వానిది. నగరంలో నాలుగు కొత్త ఆస్పత్రుల ఏర్పాటుకు, ఉస్మానియా ఖాళీ స్థలంలో ట్విన్ టవర్స్ నిర్మాణం, గాంధీని సూపర్ స్పెషాలిటీగా మారుస్తామని, అన్ని జిల్లాల్లో 40కి పైగా డయాలసిస్ సెంటర్లను ప్రవేశపెడతామని వేదికల మీద ప్రకటించిన ప్రభుత్వం ఈ బడ్జెట్‌లో ఆ వైపు అడుగులు వేయకపోవడం ఈ ప్రభుత్వ దీర్ఘకాలిక జబ్బుగా అర్థమవుతుంది.

**దళితులకు మూడెకరాల భూమి**

రాష్ట్ర ప్రభుత్వం మెనిఫెస్టోలో పెట్టి ఎన్నికల్లో గెలిచిన అనంతరం అనేక వేదికల మీద రాష్ట్రంలోని మొత్తం దళిత, గిరిజన కుటుంబాలకు 3 ఎకరాల భూమినిచ్చి ఆదుకుంటామని ప్రకటించింది. అధికారంలోకి వచ్చిన అనంతరం ఒక రోజు సర్వేను ప్రతిష్టాత్మకంగా నిర్వహించింది. ఈ సామాజిక సర్వే ప్రకారంగా మన రాష్ట్రంలో 3 లక్షల మంది దళితులు, ఒక లక్ష మంది గిరిజనులున్నట్లు గుర్తించారు. ఒక్కొక్క కుటుంబానికి 3 ఎకరాల చొప్పున 4 లక్షల కుంటుంబాలకు 12 లక్షల ఎకరాల భూమి అవసరంగా ఉంది. భూమి కొనుగోలుకు ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించింది. భూమి లభించడం లేదన్న సాకుతో దాటవేస్తుంది. కాని దళితులను దారిద్ర్యం నుండి కాపాడాలంటే నేడు ప్రభుత్వ లెక్కల ప్రకారం ఏ మారుమూల ప్రాంతంలోనైనా కనీసం ఎకరానికి ధర రు. 5 లక్షల వరకు ఉంది. ఒక్కొక్క ఎకరానికి 5 లక్షల చొప్పున ఒక కుటుంబానికి 15 లక్షల రూపాయలను ప్రభుత్వం బ్యాంకులో జమచేస్తే వడ్డీతోనే ఆ కుటుంబాలు ముందుకు పోతాయనేది యదార్థం.

**రెండు పడక గదుల ఇండ్లు**

ప్రభుత్వం అధికారంలోకి రావడానికి అత్యంత కీలకంగా ప్రజలను ఆకర్షించింది రెండు పడక గదుల ఇంటి నిర్మాణం. గతంలో రాష్ట్రంలో పేర్కొన్నట్లు 2,60,000 ఇండ్ల నిర్మాణం త్వరలో పూర్తి చేస్తామని ప్రకటించింది. నేటివరకు పూర్తి స్థాయిలో పూర్తి అయిన ఇండ్లు 1,426 కాగా, పాక్షికంగా మరో 1,600 పూర్తయినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఈ సంవత్సరం మరో 50 వేల ఇండ్లను పెంచాలని అధికారులు ప్రభుత్వానికి నివేదించినారు. కాని బడ్జెట్‌లో రు. 1,000 కోట్లు మాత్రమే కేటాయించింది. అందులో రాష్ట్ర ఖజానా నుండి రు. 500 కోట్లు కాగా, ఎస్‌సి సంక్షేమ శాఖ నుంచి రు. 315 కోట్లు, ఎస్‌టి సంక్షేమ శాఖ నుంచి రు. 185 కోట్లు ఖర్చు చేయాలని నిర్ణయించింది. మరో 1,330 కోట్లు కేంద్రం నుంచి వస్తుందని అంచనాలతో రు. 2,330 కోట్లు ఈ బడ్జెట్‌లో చూపింది. నేటి వరకు నిర్మించిన ఎర్రవల్లి, నర్సన్నపేట్ గ్రామాల 1,426 ఇండ్లు మినహాయిస్తే 1,48,574 ఇండ్లు ఈ సంవత్సరానికి పూర్తి కావాలి. ప్రభుత్వ లెక్క ప్రకారం గ్రామాల్లో ఒక్కొక్క ఇంటికి రు. 5 లక్షల 40 వేలు. ఈ లెక్క ప్రకారం 1,48,574 ఇండ్లకు రు. 78 వేల కోట్లు అవసరముంది. ఈ లెక్కల ఆధారంగా బడ్జెట్ కేటాయించ

కుండా బడ్జెటేతర వనరుల ద్వారా ఇండ్లను నిర్మిస్తామనడాన్ని ఎట్ల విశ్వసించాలో ప్రభుత్వమే చెప్పాలి. సిఎం దత్తత గ్రామాలైన ఎర్రవల్లి, నర్సన్నపేట్ గ్రామాలలో ఒక్కొక్క ఇంటికి 8 లక్షల 50 వేలు ఖర్చు అయిందని అధికారులు అనధికారికంగా సెలవిచ్చారు.

**సంక్షేమ రంగం**

2017-18 బడ్జెట్‌లో గత బడ్జెట్ కంటే 39 శాతం అధిక నిధులతో రు. 30,592.46 కోట్లు కేటాయించారు. ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనార్టీ, వికలాంగులకు, మహిళా శిశు సంక్షేమ శాఖలకు కలిపి ఈ మొత్తాన్ని కేటాయించారు. బడ్జెట్ కేటాయింపులు అంకెల కంటే పదాల కూర్పులో భారీగా మార్పు తీసుకొచ్చాయి. ఈ ప్రభుత్వం ఎస్‌సి సబ్‌ప్లాన్ గొప్ప ఆవిష్కరణగా పేర్కొని, దళితులు అభివృద్ధికి అగుపడనంత దూరంలో ఉన్నారని, వారి అభివృద్ధి కొరకే ఈ ప్రభుత్వం అత్యంత శక్తివంతంగా పనిచేస్తుందని నమ్మబలికిన ఈ ప్రభుత్వం నిధుల కేటాయింపుకే పరిమితమైంది. నిధుల వినియోగాన్ని మరిచింది. దానికి కారణాలను చర్చించడానికి ఇష్టపడకపోగా నేటి బడ్జెట్‌లో సబ్‌ప్లాన్ స్థానంలో ప్రత్యేక అభివృద్ధి నిధిగా ప్రకటించింది. దీనికి కేటాయించిన నిధులను పూర్తి స్థాయిలో ఖర్చు చేస్తామని పేర్కొనడంతో పాటు ఖర్చు కాని నిధులను వచ్చే ఏడాదికి క్యారీ ఫార్వడ్ పేరుతో మరోమారు మోసానికి తెరలేపింది. ఎస్‌టి సబ్‌ప్లాన్‌ను కూడా ఇదే విధంగా మార్చింది. ఈ బడ్జెట్‌లో ఎస్‌సిల కోసం రు. 14,375.12 కోట్లు కేటాయించారు. గతం కంటే ఈ కేటాయింపులు రు. 3,891.16 కోట్లు అధికం.

గతంలో కేటాయించినవి వినియోగిస్తే ఈ సంవత్సరం కేటాయింపుల పరిధి అర్థమయ్యేది. కాని, గతంలో సింహభాగం ఖర్చు కాలేదు. ఈ సంవత్సరం ఎంత భాగం ఖర్చుపెడతారో తెలియాలి. గిరిజన సమగ్రాభి వృద్ధి లక్ష్యంగా ఈ అభివృద్ధి ఫండ్‌ను ఏర్పాటు చేశారు. ఈ బడ్జెట్‌లో దీనికి రు.8,165.87 కోట్లను కేటాయించింది. కేటాయింపులే పాలకులకు లక్ష్యం కాకుండా పారదర్శకంగా లబ్దిదారులకు నిధుల ఫలాలు అందితేనే ప్రయోజనాలు ఉంటాయన్న నిజాన్ని పాలకులు గుర్తించాలి. బిసి సంక్షేమానికి భారీ నిధులు కేటాయించినట్లు ప్రభుత్వం ప్రకటించింది. తెలంగాణ రాష్ట్రంలో సామాజిక సర్వే ఆధారంగా 52 శాతానికి అధికంగా ఉన్న బిసిలకు కేటాయించిన నిధులు ఏ మేరకు సరిపోవు.

3 శాతం నిధులుగా రు. 5,070.36 కోట్లు కేటాయించింది. దీంట్లో వెయ్యి కోట్లు అత్యంత వెనుకబడిన కులాల కార్పొరేషన్ ఏర్పాటుకు కేటాయించింది. బిసిలకు కేటాయింపుల్లో అత్యంత ప్రాచీనమైన వృత్తులకు ప్రాధాన్యతనివ్వాలని గొప్పగా ప్రకటించినారు. రాష్ట్రంలో ఉండే యాదవులకు 'మేకలను' ఇవ్వాలనే ప్రతిపాధన తప్పా ఒప్పా అనేది చర్చకంటే ఇన్ని లక్షల మేకలను మేపుటకు ప్రస్తుతం భూమి ఉన్నదా? అనేది ప్రభుత్వం ఆలోచించిందా? ఆచరణ సాధ్యం కాని హామీలుగానే మిగులుతాయా?

మహిళా శిశు, వికలాంగ సంక్షేమ శాఖకు గత బడ్జెట్ కంటే 11 శాతం అధికంగా రు. 1,731.50 కోట్లు కేటాయించింది. ఏడాదికేడాది స్త్రీ పురుష నిష్పత్తి తగ్గుముఖం పడుతూ, ఎన్ని చట్టాలు వచ్చినా ఆడ శిశువును గర్భంలోనే మట్టుబెడుతున్న ఈ దశలో ఈ కేటాయింపులతో మహిళల సామాజిక భద్రత, సంక్షేమం, పౌష్టికాహార పంపిణీ లాంటి పథకాలకు ఏ మేరకు సరిపోవు. మహిళలకు ఇచ్చే ప్రాధాన్యత మన రాష్ట్ర మంత్రి వర్గంలాగే ఉంటుందనేది జగత్ విదితమే.

**తలసరి ఆదాయ భావన**

మొత్తం స్థూల ఆదాయాన్ని జనాభా పంచుకుంటే వచ్చేది తలసరి ఆదాయం భావనగా పేర్కొంటారు. ఇది కేవలం భావన మాత్రమే. తలసరి ఆదాయ భావనకు నిజజీవితంలో ప్రజల జీవన వికాసానికి మరింత వ్యత్యాసం ఉంటుంది. కోటీశ్వరుని మొదలుకొని కటిక దారిద్రుని వరకు, బిలియనీరు నుండి బిచ్చగాడి ఆదాయాలు సమానంగా చూపిస్తారు. రాష్ట్ర ప్రభుత్వం స్వయంగా విడుదల చేసిన సామాజిక-ఆర్థిక సర్వే ఆధారంగా ఈ రాష్ట్ర తలసరి ఆదాయం జాతీయ సగటు కంటే అధికం గాకా, ఇది గత సంవత్సరం కంటే 12.6 శాతం అధికం. జిల్లాల వారిగా తలసరి ఆదాయాన్ని పరిశీలిస్తే విభజనకు ముందున్న వ్యత్యాసాలే నేటికి కనిపిస్తున్నాయి.

రాజధానితో సహా చుట్టున్న మెదక్, రంగారెడ్డి జిల్లాలతో పోలిస్తే ఆదిలాబాద్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాల తలసరి ఆదాయం అంతంత మాత్రమే పెరిగింది. 2013-14లో రు. 1,14,669, 2014-15లో రు. 1,29,000 కాగా 2015-16లో రు. 1,40,000కు పెరిగి నేడది రు. 1,58,360కి పెరిగింది. వ్యత్యాసాలు వెనుకబడిన జిల్లాల్లో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

జిల్లాల పునర్ వ్యవస్థీకరణలో భాగంగా పలు కొత్త జిల్లాలు తెర మీదికి రావడంతో ఈ వ్యత్యాసాలు మరింత పెరిగాయి. గణాంకాలు ఇలాగే కొనసాగుతుంటే ఘనమైన అభివృద్ధని పాలకులు పదే పదే వల్లెవేయడం వృథా ప్రయాసే.

**ముగింపు**

దేశంలో ఏ రాష్ట్రం ప్రవేశపెట్టనంత భారీ బడ్జెట్ అని గొప్పలు చెప్పుకోవడం కాకుండా బడ్జెట్ వాస్తవాలకు దగ్గరగా ఉండాలి. కొత్తగా ప్రారంభించిన కంపెనీలు, చిన్న, మధ్య తరహా కంపెనీలను ప్రోత్సహించేలా ఈ బడ్జెట్ లేదు. వ్యవసాయ సంక్షోభ నివారణ, రైతుల ఆత్మహత్యల నివారణకు నిర్దిష్ట కేటాయింపులు లేవు. రుణమాఫీ పైన రైతులు పెట్టుకున్న ఆశలన్నీ ఆవిరైనాయి. కాయిలా పడిన పరిశ్రమల పునరుద్ధరణ చర్యలు లేవు. నీటి పారుదల రంగ ప్రాజెక్టుల నిర్మాణంలో భూసేకరణ సమస్య, పరిహారం, పునరావాస విధానాల్లో జిఒ 123, 2013 భూసేకరణ చట్టాల మధ్య నేటికైనా ప్రభుత్వం స్పష్టత కలిగి ఉండాలి.

గతంలో ఎన్నడు లేని విధంగా బడ్జెట్‌లో కులాల వారిగా కేటాయింపులు ప్రజల్లో విభేదాలకు సామాజిక అనైక్యతకు దారితీయకుండా జాగ్రత్త పడాల్సి ఉంది. అధిక జనాభా ఉన్న ఈ రాష్ట్రంలో మానవ మనరుల అభివృద్ధి అయిన విద్యా రంగానికి అధిక నిధులు కేటాయించాలి.

రాష్ట్ర జనాభాలో 30 శాతంగా ఉన్న యువతలో ఐదుగురిలో ఒకరు నిరుద్యోగిగా ఉండడం ఆందోళన కలిగిస్తుంది. రాష్ట్రంలోని 96 శాతం యువతకు ఎలాంటి సాంకేతిక విద్య లేదు. 4 శాతం సాంకేతిక విద్యనందిస్తుంటే ఆ నిధులపై కోత విధించడం విచారకరం. ప్రతి పైసా సామాన్యుడికి చేరేలా చూడాలి. సమీకృత అభివృద్ధికి బడ్జెట్ బాటలు వేసేలా ఉండాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం)*

వీ

# అప్పులే ఆధారంగా ఎపి బడ్జెట్

***రాష్ట్ర విభజన తరువాత ప్రవేశపెట్టిన మూడవ బడ్జెట్‌లో చంద్రబాబు నాయుడు ప్రభుత్వం మళ్లీ మళ్లీ అవే ఎన్నికల వాగ్దానాలను వల్లె వేస్తోందనీ, రాష్ట్రాన్ని పూర్తిగా అప్పులపైనే ఆధారపడేట్టుగా చేస్తోందనీ అంటున్నారు* షేక్ కరిముల్లా**

స్థూలంగా ఒక ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ ఆదాయ వ్యయ పట్టిక. సర్కారు ఆర్థిక విధాన పత్రమే బడ్జెట్. ఆర్థిక సంవత్సరం ఏప్రిల్ 1 నుంచి మొదలై మార్చ్ 31తో ముగుస్తుంది. ఈ సంవత్సర కాలంలో ప్రభుత్వం చేసే ఆదాయ వ్యయాల వివరాలు బడ్జెట్‌లో ఉంటాయి. ప్రభుత్వం ప్రజల నుంచి పన్నుల రూపంలో వసూలు చేసిన ధనాన్ని వారికోసం ఎలా వినియోగించబోతున్నదో వివరించే కార్యాచరణ ప్రణాళిక.

అప్పులే ఆధారంగా ఎపి ఆర్థిక శాఖ మంత్రి యనమల రామకృష్ణుడు 2017-18 బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. బడ్జెట్ నిండా రుణ వితరణ సంస్థల జపమే. ప్రపంచ బ్యాంకు, జైకా, హెడ్కో, నాబార్డు ఇచ్చే అప్పులతో అభివృద్ధి విందు భోజనాలను వండి వార్చారు నారావారు. ఒక్క మాటలో చెప్పాలంటే అంతా అప్పులే 'అప్పు చేసి పప్పు కూడు తింటాము' అంటున్నారు ఆర్థిక మంత్రి. భారీ బడ్జెట్‌లో భారీ కేటాయింపులు చూపించిన ఆర్థిక మంత్రి, ఆదాయానికి మాత్రం అప్పుల మీద, కేంద్ర గ్రాంటుల మీద ఆధార పడ్డారు. సుమారు 1.57 లక్షల కోట్ల రూపాయల జంబో బడ్జెట్‌లో వాస్తవ ఆదాయం అందులో సగమే. మిగిలినదంతా అప్పుల గ్రాంటుల ద్వారా రావాలనడం అంటే గాలిలో దీపం పెట్టినట్లే. లేదంటే అల్లా ఉద్దీన్ అద్భుత దీపం అన్నా ఉండాలి. ఇప్పటికే నూతన రాష్ట్రం అప్పుల ఊబిలో మునిగి ఉంది. గతేడాది సుమారు ఒకటిన్నర లక్షల కోట్ల రాష్ట్ర అప్పు నేడు రు. 2.16 లక్షల కోట్లకు పెరిగింది. ఇది చాలదన్నట్లు ప్రస్తుత బడ్జెట్‌లో ఆర్థిక మంత్రి సుమారు రు. 30 వేల కోట్లు అప్పులు తెచ్చి నెట్టుకొస్తామంటున్నారు. ఈ వైఖరి చూస్తే ఈ ప్రభుత్వం పూర్తిగా అప్పులపై ఆశలు పెట్టుకొని బతుకుతున్నట్లు కనిపిస్తోంది. నూతన రాష్ట్రానికి రాజధాని నిర్మాణానికి కేంద్రం చెల్లించాల్సిన నిధుల గురించి ఒక్క మాట మాట్లాడకుండా నవ్యాంధ్ర రాజధానిని అప్పులతో నిర్మిస్తామనడం నయవంచనే అవుతుంది.

**ఎపి రాష్ట్ర బడ్జెట్-2017-18 (రు. కోట్లలో)**

| | |
|---|---|
| మొత్తం బడ్జెట్ | 1,56,999 |
| రెవెన్యూ వ్యయం | 1,25,912 |
| కేపిటల్ వ్యయం | 23,078 |
| రుణాల చెల్లింపు | 8,009 |
| కేంద్ర పన్నుల వాటా | 29,139 |
| గ్రాంట్స్ ఇన్ ఎయిడ్ | 37,548 |
| రాష్ట్ర సొంత పన్నులు | 53,717 |
| రాష్ట్ర పన్నేతర ఆదాయం | 5,092 |
| రెవెన్యూ లోటు | 516 |
| ద్రవ్యలోటు | 23,054 |
| జిఎస్‌డిపి | 7,68,546 |

ఇది స్థూలంగా రాష్ట్ర బడ్జెట్ రూపం. ఇక రంగాల వారీగా బడ్జెట్ స్వరూపాన్ని చూద్దాం.

**వ్యవసాయ రంగం**

ఆంధ్రప్రదేశ్‌కు వెన్నెముక వ్యవసాయ రంగం. రాష్ట్ర జనాభాలో 60 శాతం మంది ప్రజలు ప్రాథమిక రంగంపైనే జీవనోపాధికి ఆధార పడుతున్నందున, వ్యవసాయ అనుబంధ రంగాలపై శ్రద్ధ పెట్టాల్సిన అవసరం ఎంతో ఉంది. 2017-18 సంవత్సరానికి వ్యవసాయ బడ్జెట్‌ను ఉభయ సభల్లో చంద్రబాబు సర్కారు ప్రవేశపెట్టింది. ఎప్పటిలాగే సాధారణ బడ్జెట్‌లో వ్యవసాయం అనుబంధ రంగాలకు కేటాయించిన నిధులతో పాటు ఆర్థిక శాఖ పరిధిలోని రుణమాఫీ, కేంద్రానికి చెందిన ఉపాధి హామీ నిధులు, విద్యుత్ సబ్సిడీలను ఒక దగ్గరకు చేర్చి దాన్నే ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్‌గా మంత్రి ప్రత్తిపాటి పేర్కొన్నారు. ఇవన్ని కలిపి ఈ రంగానికి 2017-18లో రు. 18,214 కోట్లతో ప్రత్యేక బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. ఇందులో రుణమాఫీ పథకానికి రు. 3,600 కోట్లు, రైతుల విద్యుత్ సబ్సిడీకి రు. 3,300 కోట్లు, ఉపాధి హామీ పథకానికి రు. 6,040 కోట్లు కేటాయించారు. మొత్తం వ్యవసాయ బడ్జెట్‌లో పై ఖర్చులకు పోగా మిగిలేది కేవలం రు. 5,274 కోట్లు మాత్రమే. ఈ మొత్తాన్ని వ్యవసాయానికి, దాని అనుబంధ రంగాలైన ఉద్యానవన, పశు సంవర్ధక శాఖలకు పంచాలి. ఉద్యానవన విభాగానికి రు. 1015 కోట్లు. పశు సంవర్ధక మత్స్య శాఖకు రు. 1238 కోట్లు, యూనివర్శిటీలకు రు. 512 కోట్లు పోతే వ్యవసాయ, సహకార మార్కెటింగ్ శాఖకు మిగిలేది కేవలం రు. 2,509 కోట్లు. ఈ మొత్తంలోనే విత్తనాలు, రెయిన్ గన్స్, పంటల భీమా ప్రీమియం, జీత భత్యాల లాంటివన్నీ చెల్లించాలి. ఇది ఆచరణకు సాధ్యం కాదని నిపుణులు వ్యాఖ్యానిస్తున్నారు. అయినా సరే 2022 నాటికి రైతు ఆదాయం రెట్టింపు చేస్తామని, రైతును రాజు చేస్తామని గొప్పలు చెప్పడం విడ్డూరం. రుణమాఫీని ఎప్పటికి పూర్తి చేస్తారో చెప్పలేదు. రుణమాఫీ అందని 35 వేలకు పైగా రైతులకు ఎలా న్యాయం చేస్తారో చెప్పలేదు. గత రెండేళ్లుగా రాష్ట్రంలో సకాలంలో వానల్లేక కరువు కమ్మేసింది. ప్రభుత్వమే 333 మండలాలను కరువు ప్రాంతాలుగా ప్రకటించింది. ఈ కరువు కారణంగా అనంతపూర్, ప్రకాశం జిల్లాల ప్రజలు కేరళ, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలకు ఉపాధికై వలస

పోతున్నారు. కౌలు రైతుల కష్టాలు, రైతుల ఆత్మహత్యలు, నీటి నివారణ బడ్జెట్‌లో ఎక్కడా ప్రణాళికలు లేవు. ఉత్తరాంధ్ర, రాయలసీమ, ప్రకాశం, గుంటూరు, మొత్తం 9 జిల్లాలు తాగు నీటికి కటకటలాడుతున్నాయి. వీటి గురించి ప్రణాళికలు లేవు. డ్వాక్రా మహిళలను రుణమాఫీ అనేది చంద్రబాబు ప్రభుత్వం మహిళలకు ఇచ్చిన పెద్ద హామీ. దానికి ఈ ఏడాది బడ్జెట్‌లోను ఒక్క పైసా కూడా కేటాయించలేదు. మొత్తంగా గత ఏడాది సవరించిన బడ్జెట్‌లో 6.4 శాతం నిధులు కేటాయిస్తే ప్రస్తుతం దాన్ని 5.7 శాతానికి తగ్గించారు. వ్యవసాయ రంగాన్ని నీరుగార్చుతూ ప్రభుత్వం సేవ, ఐటి రంగాల వైపు చూస్తుందని స్పష్టమవుతుంది.

**గ్రామీణాభివృద్ధి**

ఈ బడ్జెట్‌లో గ్రామీణాభివృద్ధికి 19,565 కోట్లు కేటాయించారు. మొత్తం బడ్జెట్ కేటాయింపులలో ఇది 12.46 శాతం కావడం విశేషం. ఇందులో ఫించన్లు, ఉపాధి హామీ పథకాలకు కలిపి 10,937 కోట్లు ప్రతిపాదించారు. గ్రామీణ తాగు నీటికి రు. 1,575 కోట్లు, ఎన్‌టిఎ సుజల స్రవంతి పథకానికి రు. 100 కోట్లు, చంద్రన్న చేయూత పథకం కిందా డ్వాక్రా మహిళల కోసం రు. 1600 కోట్లు, వృద్ధులు వితంతు, చేనేత, కల్లుగీత కార్మికులు, దివ్యాంగులకు ఫించన్లు చెల్లింపునకు రు. 4,376 కోట్లు, గ్రామీణ రహదారుల అభివృద్ధికి రు. 197 కోట్లు, స్వచ్ఛ భారత్ మిషన్ కిందా 3,000 పంచాయితీల్లో బహిరంగ మల విసర్జన నివారణకు రు. 7,50,000 కోట్లు, వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణానికి రు. 100 కోట్లు, ఎన్‌టిఆర్ జలసిరి పథకానికి రు. 44 కోట్లు కేటాయించారు.

**విద్యా రంగానికి మొండి చెయ్యి**

ఈ బడ్జెట్‌లో పాఠశాల ఉన్నత విద్యకు కలిపి రు. 20,710 కోట్లు, మొత్తం బడ్జెట్‌లో 13.65 శాతం కేటాయించారు. గత ఏడాదితో పోలిస్తే రు. 917 కోట్లు తగ్గించారు. మౌలిక సదుపాయాల మాటేలేదు. ఏదో అరకొర విదిలింపులతో సరిపుచ్చారు. సాంకేతిక వినియోగం గురించి నిరంతరం గొప్పలు చెప్పే రాష్ట్ర ప్రభుత్వం, సాంకేతిక విద్యకు మాత్రం బడ్జెట్ నిధులకు కోత పెట్టింది. గతేడాది రు. 825 కోట్లు కేటాయించగా ఈ బడ్జెట్‌లో రు. 765 కోట్లు ఇచ్చింది. గత ఏడాది కన్నా రు. 60 కోట్లు తగ్గించారు. ఆంధ్రప్రదేశ్‌ను నాలెడ్జ్ హబ్‌గా మారుస్తామని గొప్పలు చెబుతూ వస్తున్న ప్రభుత్వం అందుకు తగిన విధంగా చర్యలు తీసుకోవడం లేదు. వరుసగా నాలుగోసారి బడ్జెట్‌లో కూడా విద్యా రంగానికి అన్యాయం జరిగింది. గత బడ్జెట్‌లతో పోలిస్తే కేటాయింపులు భారీగానే తగ్గాయి. పాఠశాల విద్యతో పాటు ఉన్నత విద్య, సాంకేతిక విద్యకు కేటాయింపులు తగ్గాయి. జాతీయ విద్యా సంస్థలకు సంబంధించి కేంద్ర నిధులపైనే ఆధారపడినట్లుగా అర్థమవుతుంది. గత బడ్జెట్‌ల తరహాలోనే ఈ ఏడాది కూడా సంక్షేమ హాస్టల్స్, కొత్త గురుకులాల ఏర్పాటుకు సంబంధించి ఎలాంటి కేటాయింపులు లేవు.

**వైద్య, ఆరోగ్యంపై నిర్లక్ష్యం**

వైద్య, ఆరోగ్య కుటుంబ సంక్షేమానికి బడ్జెట్ కేటాయింపులలో గతేడాదికి పెద్దగా మార్పు కనిపించలేదు. ఈ బడ్జెట్‌లో ఈ రంగానికి రు. 7.020.6 కోట్లు కేటాయించారు. మొత్తం బడ్జెట్‌లో 4.47 శాతం కేటాయించారు. ప్రజలకు ఎంతో కొంత ఉపయోగపడే ఆరోగ్యశ్రీ (ఎన్‌టిఆర్ వైద్య సేవ)కు ఇప్పటికే రు. 400 కోట్లకు పైగా గత బకాయిలున్నాయి. ఈ ఏడాది కనీసం రు. 1,450 కోట్లు అవసరమని ఆ శాఖ అధికారులు ప్రతిపాదన ఇచ్చారు. కానీ రు. 1000 కోట్లు మాత్రమే ఇచ్చారు. ఈ నిధులు గత బకాయిలకే సరిపోవు. పైగా 2016-17లో ఆరోగ్యశ్రీకి రు. 300 కోట్లు సిఎం రిలీఫ్ ఫండ్ ఇస్తామని ఇవ్వలేదు. ఈ పరిస్థితుల్లో పథకం మనుగడ ప్రశ్నార్థకమైంది. ఇక ఆపదలో ఆదుకునే 108 పథకానికి అరకొరగానే నిధులు కేటాయించారు. అంబులెన్స్‌లకు ఈ ఏడాది రు. 62.4 కోట్లు కేటాయించారు. 430 అంబులెన్స్‌లున్న ఈ పథకానికి నెలకు కనీసం రు. ఆరు కోట్లు ఖర్చవుతుంది. అంటే ఏడాదికి రు. 72 కోట్ల నుంచి 75 కోట్లు అవుతుంది. 104 (చంద్రన్న సంచార చికిత్స)కు ఏడాదికి రు. 64.95 కోట్లు కేటాయించారు. ఇక జననీ సురక్ష యోజనకు ఈ ఏడాది రాష్ట్ర గ్రాంటు కింద కేవలం రు. 7.6 కోట్లు ఇచ్చారు. ఇక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, సామాజిక ఆరోగ్య కేంద్రాలకు, ఏరియా ఆసుపత్రులకు ఈ ఏడాది కేటాయింపులే లేవు.

**సాంఘిక సంక్షేమానికి రిక్త హస్తం**

ఎస్‌సి, ఎస్‌టి, బిసి మైనార్టీల సంక్షేమానికి ప్రభుత్వం కట్టుబడి ఉందని చెప్పుకుంటున్న ప్రభుత్వం వారి పట్ల నిర్లక్ష్యంగానే వ్యవహరిస్తుంది. ఈ ఆర్థిక సంవత్సరంలో ఆయా శాఖలకు కేటాయించిన నిధులే అందుకు నిదర్శనం. నామమాత్రంగానే నిధులు కేటాయించి చేతులు దులుపుకుంది. గత ఏడాదితో పోల్చుకుంటే సాంఘిక సంక్షేమ శాఖకు రు. 627 కోట్లు పెంచింది. పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్‌లకు గత ఏడాది కంటే రు. 107 కోట్లు అదనంగా కేటాయించిన ప్రభుత్వం ప్రీ మెట్రిక్ స్కాలర్‌షిప్‌లకు కోత పెట్టింది. ఉచిత విద్యుత్ కోసం కూడా పెంచిందేమీ లేదు. గిరిజన విద్యార్థుల ప్రీ మెట్రిక్ స్కాలర్‌షిప్‌లలో కూడా కోతలు విధించారు. కేవలం రు. 33 కోట్లే కేటాయించి చేతులు దులుపుకున్నారు. బిసిల సంక్షేమానికి పెద్దగా పెంచిందేమీ లేదు. 2016 – 17తో పోల్చుకుంటే ఈ ఆర్థిక సంవత్సరం రు. 583 కోట్లు అదనంగా కేటాయించారు. పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్‌ల్లో బిసి విద్యార్థులకు కోత పెట్టారు. రు. 274 కోట్లే కేటాయించారు. వడ్డెర ఫెడరేషన్‌కు రు. 3 కోట్లు, వాల్మీకీ లేదా బోయ ఫెడరేషన్‌కు రు. 8 కోట్లు, విశ్వ బ్రాహ్మిణ్ ఫెడరేషన్‌కు రు. 8 కోట్లు, భట్రాజు ఫెడరేషన్‌కు రు. 5 కోట్లు అదనంగా

(రు. కోట్లలో)

| శాఖల వారిగా కేటాయింపులు | 2016-17 | 2017-18 |
|---|---|---|
| సాంఘిక సంక్షేమం | 2308.91 | 2936.36 |
| సాంఘిక సంక్షేమ గురుకులాలు | 920.64 | 749.01 |
| గిరిజన సంక్షేమం | 1336.14 | 1566.84 |
| గిరిజన సంక్షేమ గురుకులాలు | 207.84 | 227.43 |
| బి.సి. సంక్షేమం | 4428.44 | 5011.64 |
| మైనార్టీ సంక్షేమం | 707.77 | 837.38 |

పెంచారు. మైనార్టీ విద్యార్థులకు పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్‌ల కోసం రు. 64 కోట్లు, విదేశీ విద్య కోసం రు. 5 కోట్లు అదనంగా నిధులు కేటాయించారు.

**సబ్‌ప్లాన్‌లకు పెరిగిన నిధులు**

ఈ ఆర్థిక సంవత్సరం కూడా సబ్‌ప్లాన్‌లకు నిధుల కేటాయింపులో కొంత నిర్లక్ష్యం కనిపించింది. మూడు సబ్‌ప్లాన్‌లకు కలిపి ఈ ఆర్థిక సంవత్సరంలో పెరిగిన నిధులు కేవలం రు. 1720 కోట్లు అంటే ఎస్‌సి సబ్‌ప్లాన్‌కు రు. 1123 కోట్లు, ఎస్‌టి సబ్‌ప్లాన్‌కు రు. 429 కోట్లు, బిసి సబ్‌ప్లాన్‌కు రు. 168 కోట్లు అదనంగా కేటాయించిన ప్రభుత్వం వారి వారి జనాభా దామాషా ప్రకారం నిధులు కేటాయించడంలో వైఫల్యం చెందింది. రాష్ట్ర జనాభాలో 17 శాతానికి పైగా ఎస్‌సిలు ఉన్నారు. రాష్ట్ర బడ్జెట్‌లో అంతే శాతం నిధులు సబ్‌ప్లాన్‌కు కేటాయించాల్సి ఉంది. ఈ లెక్కన చూస్తే రు. 26 వేల కోట్లకు పైగా నిధులు కేటాయించాల్సి ఉంది. కానీ అందుకు భిన్నంగా కేవలం ఆరు శాతం నిధులు కేటాయించి చేతులు దులుపుకుంది. అదే విధంగా ఎస్‌టి, బిసి సబ్‌ప్లాన్‌లకు నిధులు కేటాయించడంలో కూడా అన్యాయం జరిగింది. 2011 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర జనాభాలో 52 శాతానికి పైగా వెనుకబడిన తరగతుల వారున్నారు. ఆరు శాతానికి పైగా గిరిజనులున్నారు. రాష్ట్ర బడ్జెట్‌లో జనాభా నిష్పత్తి ప్రకారంగానే నిధులు కేటాయించాలి. కానీ అలా ఎప్పుడూ జరగలేదు.

**సబ్‌ప్లాన్ నిధుల కేటాయింపులు (రు. కోట్లలో)**

| సబ్‌ప్లాన్ పేరు | 2016-17 | 2017-18 |
|---|---|---|
| ఎస్‌సి సబ్‌ప్లాన్ | 8,724.25 | 9,847.00 |
| ఎస్‌టి సబ్‌ప్లాన్ | 3,099.00 | 3,528.00 |
| బిసి సబ్‌ప్లాన్ | 8,832.00 | 1,000.00 |

గత మూడు బడ్జెట్‌లను పరిశీలిస్తే ఎప్పటికప్పుడు కేటాయింపులు పెరుగుతున్నాయి. అయితే కేటాయించిన మేరా ఖర్చు మాత్రం చేయడం లేదు. దీంతో బడ్జెట్ కేటాయింపులకు అర్థం లేకుండా పోయింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిరుడు బిసిల సంక్షేమానికి రు. 4,430 కోట్లు కేటాయించి అందులో రు. 183.74 కోట్లు ఖర్చు చేయలేదు. బిసి కులాల స్థితిగతులు చూస్తే ముఖ్యంగా పాముల, గంగిరెద్దుల, దొమ్మర వంటి అనేక కులాలు బిసిల్లో అత్యంతగా వెనుకబడి ఉన్నారు. ఈ కేటాయించిన నిధులు ఏ మూలకు చాలవని అర్థమవుతుంది. మరి నిధులు మిగిలిపోవడమేమిటి? నిరుడు ఎస్‌సిలకు కేటాయించిన ఉప ప్రణాళిక నిధులు రు. 8,724.25 కోట్లయితే అందులో రు. 291.31 కోట్లు ఖర్చు కాకుండా మిగిలిపోయాయి. వాటిని కాస్తా పంచాయితీ రాజ్ శాఖకు మళ్లించారు. ఎస్‌టి సబ్‌ప్లాన్ కింద కేటాయించిన నిధులదీ ఇదేకదా. అందులో దాదాపు 15 కోట్లు మిగిలిపోయాయి. ఖర్చయిన నిధులు నిజమైన లబ్ధిదారులకు చేరాయనుకోవడానికి లేదు. టిడిపి కార్యకర్తలకు, వారు చెప్పిన వారికి మాత్రమే అందులో అధిక భాగం అందాయని క్షేత్రస్థాయి వాస్తవాలు చెబుతున్నాయి. ఇక బడ్జెట్ కేటాయింపులకు అర్థమేముంది.

**మహిళ శిశు సంక్షేమానికి కోత**

జండర్ దృక్పథం నుంచి ఈ బడ్జెట్‌ను రూపొందించినట్లు చెప్పినప్పటికీ, మహిళా సాధికారతకు కేటాయించింది రు. 400 కోట్లు మాత్రమే. స్త్రీ శిశు సంక్షేమానికి రు. 1773 కోట్లు, శిశు మరణాల రేటును ప్రతి 1,000 జననాలకు 16 కన్న తక్కువకు తీసుకురావడానికి, పౌష్టికాహారలేమి నుంచి విముక్తి కలిగించడానికి ఈ మొత్తం ఏ మేరకు సరిపోతుందో అర్థం కాదు.

ఆడ పిల్లలను ప్రోత్సహించేందుకు రాష్ట్ర ప్రభుత్వం 'మా ఇంటి మహాలక్ష్మి' పథకాన్ని తీసుకొస్తామని చెబుతుంది కాని, రెండేళ్లుగా బడ్జెట్‌లో ఆ పథకానికి కేవలం రు. 15 కోట్లు ఇస్తూ కాగితాలకే పరిమితం చేస్తుంది.

**అప్పులతో 'అ'భ్రమరావతి'**

ప్రపంచ స్థాయి రాజధాని నిర్మిస్తామని నిత్యం ఊదరగొడుతున్న రాష్ట్ర ప్రభుత్వం బడ్జెట్‌లో మాత్రం దానికి తగిన నిధులు కేటాయించలేదు. అమరావతిలో వివిధ ప్రాజెక్టులకు రు. 1,061 కోట్లు మాత్రమే కేటాయించారు. అవి ఏ మూలకు సరిపోవు. హబ్కో, ప్రపంచ బ్యాంకు అప్పులు తప్ప కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిధులు లేకపోవడం విడ్డూరం.

అలాగే 2029 నాటికి 50 శాతం రాష్ట్రాన్ని పట్టణీకరణ చేస్తామని చెబుతున్న ప్రభుత్వం 2017-18 బడ్జెట్‌లో ఈ రంగానికి కేవలం రు. 5,207 కోట్లు కేటాయించి చేతులు దులుపుకున్నది. సింగపూర్, మలేషియా, జపాన్‌ల మాదిరిగా రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో నడుపుతామని చెబుతున్న ప్రభుత్వం గృహ నిర్మాణానికి కేటాయించింది రు. 1475 కోట్లు. రెండేళ్లలో 10 లక్షల ఇళ్లు కట్టిస్తామని చెబుతున్న ప్రభుత్వం ఈ కొద్దిపాటి నిధులతో లక్ష్యాన్ని ఎలా సాధిస్తుంది?

చంద్రబాబు ఇచ్చిన ఎన్నికల హామీలో నిరుద్యోగ భృతి ఒకటి. మూడు సంవత్సరాలుగా ఊరిస్తూ వచ్చిన నిరుద్యోగ భృతికి ఈ బడ్జెట్‌లో రు. 500 కోట్లు వెచ్చించారు. కాని దాన్ని ఎలా ఖర్చు చేస్తారో చెప్పలేదు. ప్రతి నిరుద్యోగికి నెలకు 2,000 భృతి ఇస్తామని ప్రభుత్వం హామీ ఆచరణలో ఎలా సాధ్యమవుతుంది? ఈ మూడేళ్లలో హామీ ప్రకారం రు. 2,50,000 కోట్లు కావాలి. కాని రు. 500 కోట్లు కేటాయించి చేతులు దులుపుకున్నారు.

ఉద్యోగుల సంక్షేమానికి తమ ప్రభుత్వం కట్టుబడి ఉందని పదేపదే ప్రకటించే ఆర్థిక మంత్రి వేతన జీవుల ఆశలపై నీళ్లు చల్లారు. 10వ పిఆర్‌సి బకాయిలెప్పుడు చెల్లిస్తారో చెప్పలేదు. హెల్త్ కార్డుల స్కీమ్‌ను అటకెక్కించారు. ఉద్యోగులందరు వ్యతిరేకిస్తున్న కాంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీమ్ విషయంలో తమ వైఖరి వివరించలేదు.

ఈ రకంగా అసంబద్ధంగా, అప్పులు, పన్నులు, స్థూలంగా 'పేరు గొప్ప - ఊరుదిబ్బ' అన్న చందంగా ఉంది ఆంధ్రప్రదేశ్ బడ్జెట్. ఆచరణలోకి వచ్చేసరికి కోతలు, మార్పులు ఆనవాయితీగా మారిపోతుంది. కేటాయింపులకు, ఖర్చులకు పొంతన ఉండడం లేదు. వాస్తవ పరిస్థితి ప్రతిబింబించని పద్దే బడ్జెట్ అనే అర్థం స్థిరపడిపోయింది. కాబట్టి ప్రజలకు దానిపై ఆసక్తి తగ్గి, క్రమంగా విలువ తగ్గుతూ వస్తుంది.

*(రచయిత ఆర్థిక శాస్త్ర విద్యార్థి, సామాజిక విశ్లేషకులు)* వీ

# నిరాశపరిచిన విద్యారంగ బడ్జెట్

*విద్యారంగానికి కేంద్రం బడ్జెట్‌లో కేటాయించిన నిధులు, ఇతర దేశాలు విద్యకు కేటాయిస్తున్న నిధులను పరిశీలిస్తే ఎక్కడా పొంతన లేదనీ, అందుకే ప్రాథమిక విద్యలోనే డ్రాపౌట్స్ సంఖ్య పెరిగిపోతున్నదనీ అంటున్నారు* **డా. సిలువేరు హరినాథ్**

కేంద్ర ప్రభుత్వం 2017-18 ఆర్థిక సంవత్సరానికి 21.47 లక్షల కోట్లతో వార్షిక బడ్జెట్ ప్రవేశపెట్టింది. ఈ బడ్జెట్‌లో గ్రామీణాభివృద్ధికి, వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత ఇచ్చింది. కాని దేశ అభివృద్ధిలో కీలకపాత్ర పోషించే విద్యారంగానికి మాత్రం సరిపడా బడ్జెట్ కేటాయించలేదు. గత 2016-17 ఆర్థిక సంవత్సరంలో విద్యారంగానికి 72,374 కోట్ల రూపాయలు కేటాయించింది. అందులో పాఠశాల విద్యారంగానికి 43,554 కోట్ల రూపాయలు, ఉన్నత విద్యారంగానికి 28,820 కోట్ల రూపాయలు కేటాయించింది ప్రభుత్వం. మొత్తం వార్షిక బడ్జెట్‌లో గత సంవత్సరం కేవలం 3.5 శాతం నిధులు మాత్రమే విద్యారంగానికి కేటాయించింది. అయితే 2017-18 వార్షిక బడ్జెట్‌లో 79,675.96 రూపాయలు విద్యారంగానికి కేటాయించింది. ఇందులో పాఠశాల విద్యకు 46,356.26 కోట్లు కేటాయించగా ఉన్నత విద్యారంగానికి 33,3239.70 కోట్లు మాత్రమే కేటాయించింది అంటే మొత్తం డిజిపి లో ఇది కేవలం 3.8 శాతం మాత్రమే. ఇలాంటి అరకొర బడ్జెట్‌తో విద్యారంగం ఏవిధంగా అభివృద్ధి చెందుతుందనేది ప్రశ్నార్థకమే.

దేశ జనాభా శరవేగంగా పెరుగుతుండడంతో ప్రపంచంలోనే రెండవ స్థానంలో భారత్ చోటు సంపాదించింది. కానీ స్వాతంత్ర్యం వచ్చి 70 సంవత్సరాలు దాటినా దేశ అక్షరాస్యత 74.04 శాతమే! ప్రపంచంలో అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాలు సైతం విద్యారంగ అభివృద్ధిపై ప్రత్యేక దృష్టి సారించి అత్యధిక నిధులు కేటాయిస్తున్నాయి. కానీ మన దేశ పాలకులు విద్యారంగంపై చిన్నచూపు చూస్తూ నిర్లక్ష్యానికి గురిచేస్తున్నారు. ప్రపంచంలో డెన్‌మార్క్ 8.8 శాతం, మాల్డోవ 8.3 శాతం, ఘనా 7.9 శాతం, నార్వే 7.4 శాతం, స్వీడన్ 7.4 శాతం, చెక్ రిపబ్లిక్ 7.4 శాతం, న్యూజిలాండ్ 7.3 శాతం, ఐస్‌ల్యాండ్ 7.2 శాతం నిధులు విద్యారంగానికి కేటాయించి పెద్దపీట వేసి విద్యా అభివృద్ధికి నాంది పలుకుతున్నాయి. కానీ విద్యారంగంలో డెన్‌మార్క్ దేశం కేటాయించే నిధులల్లో మనదేశం 50 శాతం కూడా కేటాయించ లేకపోతున్నది. అందువల్లనే మన విద్యారంగం అభివృద్ధి నమూనా సూచికలో అట్టడుగు స్థాయిలో స్థానం సంపాదిస్తున్నది.

ప్రస్తుతం పాఠశాల విద్యారంగానికి ప్రభుత్వం 46,356.26 కోట్లు కేటాయించి జబ్బలు సరుస్తుంది. ఈ రోజుల్లో విద్యా ప్రాముఖ్యత విస్తరించడం ద్వారా ప్రజలు విద్యారంగం వైపు మక్కువ చూపిస్తున్నారు. ఏసర్ రిపోర్ట్ 2016 ప్రకారం ఎన్‌రోల్‌మెంట్ 2016లో 96.9 శాతం ఉంది. దేశంలో ఎన్‌రోల్‌మెంట్ పెరిగినప్పటికీ బాలికల డ్రాపౌట్స్ కొనసాగుతుంది. ఉత్తరప్రదేశ్‌లో 9.9 శాతం, రాజస్థాన్ 9.7 శాతం, మధ్యప్రదేశ్‌లో 8.5 శాతం బాలికల డ్రాపౌట్స్ ఉన్నారు. ఈ డ్రాపౌట్స్ కారణం ప్రధానంగా స్కూల్ ఆవరణలోని మౌలిక సమస్యలే అని చెప్పవచ్చు. ఎందుకంటే దేశంలో 39.1 సర్కార్ బడులల్లో మరుగుదొడ్లు అందుబాటులో లేవు. దీనివల్ల ముఖ్యంగా బాలికలు ఎన్నో అవస్థలు పడుతున్న పరిస్థితి. అందువల్ల వీరి డ్రాపౌట్స్ అధికశాతం కనిపిస్తుంది.

అలాగే 25.9 పాఠశాలల్లో పిల్లలు తాగడానికి మంచినీరు కూడా లభించడం లేదు. అంతేకాదు శాస్త్ర సాంకేతిక రంగాలకు ప్రాధాన్యత ఇస్తున్నామని చెప్పే పాలకులు విద్యార్థులకు కంప్యూటర్ విద్యను అందించలేకపోతున్నారు. అందువల్ల ప్రస్తుతం సర్కారు బడులల్లో కేవలం 20 శాతమే కంప్యూటర్ పరికరాలు విద్యార్థులకు అందుబాటులో ఉన్నాయి. విద్యార్థులకు జ్ఞానాన్ని ప్రసాధించే లైబ్రరీలు కేవలం 24.5 శాతం మేర ఉన్నాయి అంటే సర్కారు విద్యను ప్రభుత్వాలు ఏ మేరకు అభివృద్ధిని కోరుకుంటున్నాయో అర్థమవుతుంది. పాఠశాలల్లో అత్యాధునిక సదుపాయాలు లేకపోవడం వల్ల విద్యార్థులు నేర్చుకునే పాఠ్యాంశంపై దృష్టి సారించలేకపోతున్నారు. అందువల్ల 7వ తరగతి చదివే 54.8 శాతం విద్యార్థులు కనీసం ఆంగ్లభాషపై పట్టులేదంటే అధ్యాపకులు ఏ మేరకు విద్యార్థులను ఉన్నత విద్యార్థులుగా తీర్చిదిద్దుతున్నారో అర్థంచేసుకోవచ్చు.

పాఠశాల విద్యారంగానికి కేటాయించిన 46,356.26 కోట్ల రూపాయలల్లో ప్రధానంగా మెరిట్ స్కాలర్‌షిప్స్‌కి, బాలికల విద్యాభివృద్ధికి 602 కోట్లు కేటాయించడం జరిగింది. కేంద్రప్రభుత్వ గురుకుల విద్యాలయాలకు 700 కోట్లు కేటాయించగా ఎన్.సి.ఇ.ఆర్.టికి 230 కేటాయించారు. జాతీయ అక్షరాస్యత మిషన్‌కి, అడల్ట్ ఎడ్యుకేషన్‌కి 41 కోట్లు కేటాయించారు.

నేషనల్ ఎడ్యుకేషనల్ మిషన్ కింద 28,255.67 కోట్లు కేటాయించింది ప్రభుత్వం. అందులో ప్రధానంగా సర్వశిక్ష అభియాన్‌కి 23,500 కోట్లు కేటాయించగా రాష్ట్రీయ మాధ్యమిక శిక్ష అభియాన్‌కి 3,830 కోట్లు కేటాయించింది. టీచర్ ట్రైనింగ్, అడల్ట్ ఎడ్యుకేషనల్‌కి 925.67 కోట్లు కేటాయించగా మధ్యాహ్న భోజన పథకానికి కేవలం 10,000 కోట్లు మాత్రమే కేటాయించింది. అలాగే ఇతర సామాజిక కార్యక్రమాల అభివృద్ధి కోసం 7826.52 కోట్లు కేటాయించింది. అయితే ప్రభుత్వం పాఠశాల విద్యారంగానికి కేటాయించిన మొత్తం బడ్జెట్‌లో సర్వశిక్షా అభియాన్‌కి 50.7 శాతం నిధులు కేటాయించినప్పటికీ అవి ఏ మాత్రం సరిపోయే పరిస్థితి లేదు. ప్రభుత్వ పాఠశాలలన్ని కనీస మౌలిక వసతులు లేక సతమతమవుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం మరో లక్ష కోట్ల రూపాయలు కేటాయించి ఉంటే ఆయా రాష్ట్ర ప్రభుత్వాల సహకారంతో ప్రాథమిక విద్యా అభివృద్ధి చెందే అవకాశం ఉండేది. కానీ ఈ చాలీ చాలని నిధులతో పాఠశాలలు పనిచేస్తున్నప్పటికిని ఆశించిన మేర విద్యార్థులకు నాణ్యమైన విద్యా అందడం లేదు.

# ఎన్నికలు - హిందూత్వ ఎజెండా

***ఐదు రాష్ట్రాల్లో జరిగిన ఎన్నికల ఫలితాల అనంతరం జరుగుతున్న పరిణామాలు చూస్తుంటే బిజెపి, సంఘ్ పరివార్ హిందూత్వ శక్తులు తమ ఫాసిస్టు విధానాల అమలును వేగవంతం చేశాయని అంటున్నారు*** **బైరెడ్డి సతీష్**

ఐదు రాష్ట్రాల్లో 2 నెలల పాటు కొనసాగిన ఎన్నికల ప్రక్రియ ముగిసి ఫలితాలు వెలువడటం అనేది మాములు పరిస్థితిల్లో పెద్దగా విశేషమైన విషయమేమి కాదు. కేంద్రంలో బి.జె.పి ప్రభుత్వం ఏర్పడి రెండున్నర సంవత్సరాలు కావడమే కాకుండా రు. 500, రు. 1000 వంటి పెద్ద నోట్ల ఉపసంహరణ వంటి అతి పెద్ద ఆర్థిక నిర్ణయం, దేశవ్యాప్తంగా దళితులు, మైనారిటీల పైననే కాకుండా ప్రగతిశీలవాదులు, స్వేచ్ఛా ఆలోచనా పరులపై అన్ని రూపాల్లో దాడులు జరిగిన నేపథ్యంలో ఈ ఎన్నికలు జరగడం బహుశా దేశ వ్యాప్తంగా సాధారణ ప్రజల, విశ్లేషకుల, ఉద్యమకారుల దృష్టిని విశేషంగా ఆకర్శించడమనేది అలా ఉంచితే మీడియా నాన్‌స్టాప్‌గా వార్తలు, వ్యాఖ్యలతో ముంచెత్తడం కూడా ఈ ఆసక్తికి కారణం అయింది.

నిజానికి ఈ ఐదు రాష్ట్రాల్లో నాలుగు రాష్ట్రాలు జనాభ, వైశాల్యం, రాజకీయ ప్రభావాల రిత్యా దేశవ్యాప్త రాజకీయాలపై చెప్పుకోదగిన ప్రభావం వేసేవి ఏమి కావు. వీటిలో దేశ వైశాల్యంలో, జనాభాలో సింహభాగాన్ని అక్రమించి, మొత్తం దేశ రాజకీయ చిత్రపటాన్నే మార్చి వేయగలిగే ఉత్తర ప్రదేశ రాష్ట్రం ఉండటమే దేశవ్యాప్త ఆతృతకి, ఆసక్తికి కారణం అయింది. అస్తిత్వ ఉద్యమ రాజకీయాలకు, జాతీయ వాదం పేరుతో కొనసాగుతున్న మత రాజకీయాలకు నెలవుగా మారిన ఈ రాష్ట్ర ఎన్నికలు సహజంగానే మొత్తం రాజకీయ చిత్రాన్ని, భవిష్యత్ రాజకీయ గమన్నానే నిర్దేశిస్తాయి.

మొత్తం 5 రాష్ట్రాల్లో నాలుగింటిలో బి.జె.పి.నే అధికారంలోకి వచ్చింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయాలలో తను ప్రత్యేకమైన

---

ఇక ఉన్నత విద్యారంగ విషయానికి వస్తే ప్రభుత్వం కేవలం 33,329.70 కోట్లు మాత్రమే కేటాయించింది. ఇందులో 208.13 కోట్లు వివిధ సెంటర్ల నిర్వహణ, అభివృద్ధి కోసం కేటాయించారు. అలాగే వివిధ ప్రాజెక్ట్స్, స్కీమ్స్ కోసం 395.30 కోట్లు, విద్యార్థుల ఆర్థిక సహాయనిధి కింద 2,380 కోట్లు కేటాయించింది. అదేవిధంగా డిజిటల్ ఈ లర్నింగ్ కోసం 497 కోట్లు కేటాయించగా పరిశోధన రంగానికి 315.45 కోట్లు కేటాయించింది. స్వయం ప్రతిపత్తి గల్గిన యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్‌కి 4691.94 కోట్లు కేటాయించగా ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్‌కి 485 కోట్లు కేటాయించింది. కేంద్రీయ విశ్వవిద్యాలయాలకు 6485.93 కోట్లు కేటాయించింది.

ఇందులో నూతనంగా ఏర్పాటు కాబోయే ఆంధ్రప్రదేశ్ కేంద్రీయ విశ్వవిద్యాలయానికి 10 కోట్లు అలాగే ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలల్లో నెలకొల్పబోయే ట్రైబల్ విశ్వవిద్యాలయాలకు 20 కోట్లు కేటాయించింది. అలాగే ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజిస్‌కి 7856 కోట్లు కేటాయించింది. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ (ఎయిమ్స్) కి 1030 కోట్లు కేటాయించగా, అలాగే నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజికి 3440 కోట్లు కేటాయించింది. అలాగే ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఎడ్యుకేషన్, రిసర్చ్‌కి 1050 కోట్లు, ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ 379.45 కోట్లు కేటాయించింది. నేషనల్ ఎడ్యుకేషనల్ మిషన్ (రూస) కు 1300 కోట్లు, అదేవిధంగా అధ్యాపకుల వేతనాల కోసం 700 కోట్లు కేటాయించింది.

అయితే ఈ నేపథ్యంలో మనదేశంలో ఉన్నత విద్యారంగ పరిస్థితిని చూసినప్పుడు దేశంలో సుమారు 760 యూనివర్సిటీలు ఉన్నాయి. ఇందులో 261 ప్రైవేటు విశ్వవిద్యాలయాలు అయితే ఈ యూనివర్సిటీలు చాలామట్టుకు అధ్యాపకుల కొరతతో ఉన్నత ప్రమాణాలు పాటించలేని స్థితిలో ఉన్నాయి. ప్రపంచంలో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ, కాలిఫోర్నియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి, స్టాండ్‌పోర్డ్ యూనివర్సిటీ, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ, మాన్‌చెస్టర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి, హార్‌వార్డ్ యూనివర్సిటీ లాంటివి ప్రపంచంలో అత్యాధునిక విద్యాప్రమాణాలు కలిగి అత్యుత్తమ ఫలితాలు సాధించి ప్రపంచంలో అగ్రగామిగ నిలుస్తున్నాయి. కాని మన దేశంలోని ఏ ఒక్క యూనివర్సిటీ కూడ ప్రపంచంలో 200 లోపు ర్యాంకు కూడ సాధించలేకపోతుంది అంటే మన విశ్వవిద్యాలయాలు ఎలాంటి విద్యావిధానాన్ని అందిస్తున్నవో అర్థం చేసుకోవచ్చు. 2014 నాటికి మనదేశంలో 21,830 మంది విద్యార్థులు డాక్టరేట్ పట్టాను వివిధ కోర్సులలో తీసుకున్నారు. అంటే పరిశోధన వైపు విశ్వవిద్యాలయాలు ఏ మేరకు ప్రోత్సహిస్తున్నాయో అర్థమవుతుంది. స్వయం ప్రతిపత్తి హోదాగల యూనివర్సిటిలలో రాజకీయ జోక్యం ఎక్కువ అవడం కారణంగా ఈనాడు విద్యాభివృద్ధికి పాలకులు అటంకం కల్గిస్తున్నారు. దీంతో ప్రతిష్టాత్మకమైన పరిశోధనలు కూడ శోధించలేకపోతున్నారు.

ప్రస్తుతం ప్రభుత్వం ఐ.సి.టిల ద్వారా విద్యా విధానం అందించాలని, ప్రతిభ కల్గిన కళాశాలలను ప్రోత్సహించాలని ప్రతిపాదించింది. అలాగే సెకండరీ విద్యకు కూడా నిధులు ప్రత్యేకంగా కేటాయిస్తామంటుంది. అందులో భాగంగానే ఉపాధి అవకాశాలు చూపే కోర్సులను కూడా ప్రవేశపెట్టాలని భావిస్తుంది. విద్యారంగం కోసం ప్రత్యేకంగా డి.టి.హెచ్ చానల్ కూడ ఏర్పాటు చేయనుంది. కానీ వీటినన్నింటిని అభివృద్ధి చేయాలంటే ప్రస్తుతం కేటాయించిన బడ్జెట్ ఏ మాత్రం సరిపోదు.

*(రచయిత సోషల్ రీసెర్చ్ ఫోరమ్ కన్వీనర్)* వీ

విలువలున్న పార్టీ అన్ని చెప్పుకునే బి.జె.పి గోవా, మణిపూర్‌లలో మెజార్టి రాకపోయినా అధికారం ఆకర్శణతో తన వ్యతిరేక శిభిరంలోని శాసన సభ్యులను సైతం తన గూటిలో చేర్చుకొని ప్రభుత్వాలను ఏర్పాటు చేసి తన 'ప్రత్యేకత' ను చాటుకున్నది.

పంజాబ్‌లో బి.జె.పి – అకాళీలు 10 ఏళ్లు గా అధికారంలో ఉండి వ్యవసాయం ప్రధానంగా ఉండే రాష్ట్రంలో ఆ రంగమే తీవ్రమైన సంక్షోభంలో పడటం, 2014లో పంజాబ్‌లో 4 లోక్‌సభ స్థానాలు గెలుచుకొని మెరిసిన ఆప్ పార్టీ డిల్లీలో లాగా 'వాస్తవిక' దోరణితో కాకుండా, ప్రజల తక్షణ సమస్యలను పరిష్కరించే విజన్‌ను ప్రధర్శించకుండ గత అంశాలపై దృష్టి పెట్టడంతో అధికారంలోకి వచ్చేలా ప్రజాదరణ పొందలేకపొయింది.

నిజానికి 1984 నాటి సిక్కుల ఊచకోతను మర్చిపొలేకపొయినా, కాంగ్రెస్ గొప్ప అభివృద్ధిని ఏదో చేస్తుందని ప్రజలు విశ్వసించకపొయినా తక్షణమే మరో ప్రత్యామ్నాయం కాంగ్రెసే అన్నట్టు అధికారాన్ని ఆ పార్టీకి కట్టబెట్టారు. ఈ ఐదు రాష్ట్రాల ఎన్నికల అనుభవమంతా చావుతప్పి కన్ను లొట్టబొయింది అన్న చందంగా తయారయింది కాంగ్రెస్ పరిస్థితి. ఉన్న ఉత్తరాఖండ్‌ను కూడా కోల్పోయి ఊపిరి సలిపలేని స్థితిలోకి పడిపోయింది.

80 లోక్‌సభ, 403 రాష్ట్ర శాసన సభ స్థానాలను కల్గిన ఉత్తర ప్రదేశ్ కేంద్రలో ప్రభుత్వన్ని ఏర్పాటు చేయడంలో కీలక పాత్ర పోషిస్తుంది. నిజానికి ఇవాళ తన ఎదుగుదలకు కారణమైన ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో గత పదేళ్లుగా బి.జె.పి.అధికారానికి దూరంగా ఉంది. రాష్ట్ర ప్రభుత్వాన్నే కాదు లోక సభలో దాని స్థానాల సంఖ్య ఏక సంఖ్యకు పడిపోవడంతో కేంద్రంలో అధికారాన్ని కూడా పదేళ్ళ కోల్పోయింది.

2014 సాధారణ ఎన్నికల్లో అప్పటికే కేంద్రంలో అధికారంలో ఉన్న యు.పి.ఏ ప్రభుత్వం అనేక స్కాములు, కుంభకోణాలలో మునిగిపోవడం, ఉత్తర ప్రదేశ్‌లో అధికారంలో ఉన్న పార్టీలు ప్రజల ఆకాంక్షల మేరకు పనిచేయక పోవడంతో అప్పటికే అభివృద్ధి పేరుతో హిందూత్వ ఎజెండాకు పదును పెట్టడంతో బి.జె.పి. 71 లోక సభ స్థానాలను గెలుచుకున్నది. ఆ గెలుపు 2017 లో జరిగిన శాసనసభ ఎన్నికల్లో అతి పెద్ద రాష్ట్రంలో అధికారంలోకి రావడం అవసరమయ్యింది. ఏ ప్రధాని కూడా ఒక్క రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల కోసం తిరగనంతగా అధికారం అండతో హంగు, ఆర్భాటాలతో ప్రచారం చేయటం, అంతటా అభివృద్దో జరిగిపోతుందని ఆ అభివృద్ధికి ఉత్తర ప్రదేశ్ ఏదో ఆమడ దూరంలో ఉన్నట్టు దట్టమైన భ్రమలను ఏవో భాగా కల్పించారు.

ఒక్క లోకసభ నియోజకవర్గంలోనే ప్రధాని 3 రోజుల ప్రచార పర్యటణ జరిపాడంటే బి.జె.పి. శ్రేణులు గెలుపుకోసం ఎంత తీవ్రంగా దృష్టి నిలిపాయో అర్థం చేసుకోవచ్చు. 900 పైగా సాంస్కృతిక ప్రదర్శనలు, 10వేల వాట్సాప్ గ్రూపులు, లక్షకు పైగా సాంకేతిక నిపుణులు అంతర్జాలంలో ఎన్నికల ప్రచారాన్ని హెూరెత్తిస్తే, 67వేల బి.జె.పి. ఆర్.ఎస్.ఎస్. కార్యకర్తలు పూర్తి కాలం పనిచేసారు. 1.4 లక్షల బూత్ సమితులు ఏర్పాటయ్యాయంటే క్షేత్రస్థాయిలో ఏ మేరకు సంఘ్‌పరివార్ పనిచేసిందో అర్థం చేసుకోవచ్చు.

ఇంత యంత్రాంగాన్ని కలిగి ఉండడమే కాకుండా సాధారణ మీడియాకూడా మేనేజ్ చేయబడటమో లేదా నియంత్రణలోకి వెళ్లడమో జరిగి మొత్తంగా బి.జె.పి.కి 325 సీట్లు రావడానికి ఓటర్ల నిర్ణయాన్ని మానిఫాక్చరింగ్ చేసే పనిని అలుపెరగకుండా సర్వేల రూపంలో చేసాయి. డిమానిటైజేషన్ బి.జె.పి.కి వనరులపరంగా కలిసి రావడం మిగతా పార్టీలు వెనకబడటంతో ఈ ఎన్నికల ఫలితాలపైన కూడా ప్రభావం పడింది. బి.జె.పి వ్యతిరేక ఓట్లు చీలిపోవడంతో దాని గెలుపు సులభమయ్యింది.

సమాజ్‌వాద్ పార్టీ కాంగ్రెస్‌కు 28.2 శాతం, బి.ఎస్.పికి 22.2 శాతం, బి.జె.పి. 39.7 శాతం పోలైన ఓట్లలో దక్కినవి. పోలైన మొత్తం ఓట్లలో ఏ అభ్యర్ధికి ఎక్కువ ఓట్లు (ఫస్ట్ పాస్ట్ ది పోస్ట్) వస్తే వారే గెలిచే పద్ధతి కనుక ఓట్లశాతంలో ఎస్.పి. కాంగ్రెస్, బి.ఎస్.పి.కి మొత్తం పోలైన ఓట్లు 50 శాతం పైగానే అయినా సీట్లలో మెజారిటి బి.జె.పి. కైవసం చేసుకుంది. మొత్తం ఓట్లపరంగా చూస్తే బి.జె.పి. వ్యతిరేక ఓట్లశాతం ఎక్కువే అనేది సుస్పష్టం.

2014 సాధారణ ఎన్నికల్లో కూడా దేశవ్యాప్తంగా బి.జె.పి.కి వచ్చిన మొత్తం ఓట్లు 31 శాతం మాత్రమే అనేది గమనించదగినది. అంకెల ప్రజాస్వామ్యం కదా!.

బి.జె.పి. గెలుపుకు ఉపకరించిన అంశాల్లో ఆ పార్టీ చెబుతున్న అభివృద్ధి, నీతి వంతమైన పాలనకంటె ఈ పదేళ్ళ అధికారంలో ఉన్న పార్టీల ఘోర వైఫల్యంమే ఎక్కువ కనిపిస్తుంది. అభివృద్ధి ముసుగులో బి.జె.పి. సంఘ్ పరివార్‌ల హిందుత్వ రాజకీయాలు సాధారణ ఓటర్లపై ప్రభావం చూపి హిందూ మెజారిటి ఓట్లు ఆ పార్టీకి పడేలా వాతావరణం ఏర్పడింది.

ఉత్తరప్రదేశ్‌లో హిందువులకు అన్ని రంగాల్లో అన్యాయం, నిరాదరణ కొనసాగిందనే ప్రచారం విచ్చలవిడిగా జరిగింది. ప్రదానంగా సున్నితమైన మనోభావాలకు సంబంధించిన అంశాలపై ఇది మరింతగా జరగడంతో లౌకిక వాదం పేరుతో మైనార్టీలను ఈ పార్టీలు సంతృప్తిపరుస్తాయనే వాదాన్ని నమ్మి బి.జె.పి.కి ఓట్లు వేసారు. విద్యుత్ సదుపాయం కల్పించడంవంటి కనీస అవసరాల్లో సైతం హిందువుల పట్ల వివక్షను చూపుతున్నారనే ప్రచారాన్ని సంఘపరివార్ బలంగా చేసింది.

మతతత్వ ఎజెండాను అభివృద్ధి ముసుగులో జాతీయవాద రాజకీయాల పరిభాషలో బాగా ప్రచారం చేయడంతో దాని ప్రభావం కొంత మేరకు యువతపై పడింది. అస్తిత్వ ఉద్యమాలతో రాజకీయ అధికారంలోకి వచ్చిన పార్టీల పరిమితులు కూడా ఈ ఎన్నికల్లో బయటపడ్డాయి.

ఈ దఫా ముస్లింలు, దళితులు, బి.ఎస్.పి.వైపు మొగ్గు చూపుతారనే ప్రచారం కూడా తప్పని తేలింది. ప్రధానంగా మోస్ట్ బ్యాక్‌వర్డ్ కులాలు, యాదవేతర ఓ.బి.సిలు, జాతవేతర దళితులను కూడగట్టడంలో బి.జె.పి. కొంత సఫలమయ్యింది.

సమాజ్‌వాది పార్టీ ఏలుబడిలో ముస్లింల, యాదవుల పెత్తనం ఎక్కువైందనే భావన అత్యంత వెనకబడిన కులాలలో బలంగా ఏర్పడింది. సరిగ్గా ఈ స్థితిని అటునుంచి నరుక్కుంటూ వచ్చి ఓట్ల రూపంలో బాగా లాభపడింది బి.జె.పినే. వీటికి తోడు సమాజ్‌వాది పార్టీ కుటుంబ కలహాలు, ఆదిపత్య పోరుకూడా ఆ పార్టీకి ప్రతికూలంగా పరిణమించింది.

అసలే అంత బలంగాలేని కాంగ్రెస్‌తో జతకట్టడం కూడా ఆశించిన ఫలితాన్ని ఇవ్వకపోగా వ్యతిరేక ఫలితాన్నే ఇచ్చింది. కాంగ్రెస్, సమాజ్‌వాది పార్టీ గంపగుత్తగా పడతాయనుకున్న ముస్లింల ఓట్లు కూడా పూర్తిగా చీలిపోవడంతో ముస్లిం ఓటర్లు అధికంగా ఉన్న నియోజవర్గాల్లో సైతం అవి నెగ్గకురాలేకపోయినవి. సెక్యులర్ పార్టీలుగా పేరుపడ్డ పార్టీలు మైనార్టీలకు టికెట్లు ఇచ్చినచోట కూడా మైనార్టీ ఓట్లు చీలడం, మెజారిటి హిందూ ఓట్లు బి.జె.పి. ఖాతాలోకి వెళ్లడంతో దాని గెలుపు చాలా సులువైంది.

ఉత్తరప్రదేశ్‌లో 20 శాతం జనాభా కలిగిన ముస్లింలు 2012 శాసనసభలో 64 ఎం.ఎల్.ఎ. లను కలిగి ఉంటే ఆ సంఖ్య 2017 నాటికి 24 కి పడిపోయింది. 325 సీట్లు గెలుచుకున్న బి.జె.పి. ఒక్క ముస్లిం అభ్యర్థిని కూడా నిలబెట్టలేదంటే ఆ పార్టీ ఎవరికి ప్రతినిధిగా నిలబడుతుందో, ఏ రాజకీయాలను ముందుకు తీసుకెళ్తుందో అర్థం చేసుకోవచ్చు.

సబ్‌కా సాత్ – సబ్‌కా వికాస్ అని గొప్పగా నినాదాలిచ్చే బి.జె.పి. 20 శాతం జనాభా ఉన్న ముస్లిం పట్ల ఎన్నికల్లోనే కాదు అన్ని రంగాల్లో కూడా దురుద్దేశ్యపూరితంగా, పక్షపాత దృష్టితోనే వ్యవహరిస్తుం దంటే అవి ఏ మాత్రం అతిశయోక్తి కాదు.

లౌకిక భావజాలంతో ఉన్న పార్టీలతో కూడా ఉన్న ఇబ్బందంతా ఏంటంటే రాజ్య వ్యవహారాల్లో అన్ని మతాలకి సమాన దూరం, అన్నింటికి సమాన ఆదరణ కంటే మైనార్టీలలో ఉన్న పచ్చి మతతత్వ వాదుల్ని వెనుకేసుకొనిరావడం. మైనార్టీలకు భద్రతను ఇవ్వడమే అసలు సెక్యులరిజంగా చెప్పుకునే పార్టీలు వారి సమగ్ర అభివృద్ధిని నిర్లక్ష్యం చేసి మూల్యం చెల్లించుకుంటున్నాయి.

ఉత్తరప్రదేశ్‌లో అంత భారీ మెజారిటితో బి.జె.పి. గెలవడమే ఒక ఆశ్చర్యమైతే ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిగా పచ్చి హిందూ మతవాది, గోరఖ్‌పూర్ పీఠాధిపతియైన యోగి ఆదిత్యానాథ్‌ని ముఖ్యమంత్రిగా ఎన్నుకోవడం మరింత ఆశ్చర్యానికే కాదు ఆందోళనకు గురిచేస్తున్నది. లేని లవ్ జీహాదిని సృష్టించినవాడు, 'శుద్ధీకరణ' పేరుతో ఘర్‌వాపసీ అనే మతోన్మాద చర్యలకు తెరలేపిన వ్యక్తిని ముఖ్య పీఠంపై కూర్చోబెట్టడం హిందూ జాతీయవాద ఎజెండాను మరింత ముందుకుతోసే సంఘపరివార్ ఎజెండానే తప్ప మరేదీకాదు.

గుజరాత్ ముస్లింల మారణహోమానికి చింతించని, బాధ్యత వహించని ఏ మాత్రమూ లౌకిక విలువలు లేని మోడిని ప్రధానిని చేయడమే ఓ ప్రమాధ సంకేతమైతే, విషాన్ని చిమ్మే కాషాయయోగిని ముఖ్యమంత్రిని చేయడం అంటే ఈ దేశ భిన్నత్వం, సహనపూరితమైన సంస్కృతి, లౌకిక విలువలు, మైనార్టీల భవిష్యత్తు పెనుప్రమాదంలో పడినట్టే. మనుషులకంటే పశువులకే ఎక్కువ విలువనిచ్చే భావజాలికులు, అఖండ భారత్ హిందూ రాజ్య స్థాపనకై కలలుకంటున్నవాళ్లు బహుళ అస్తిత్వాలను అంతం చేసే ఉన్మాదపూరిత కుట్రలకు తెగబడతారనే సంకేతాలను 2014 అధికారం పొందిన అనతికాలంలోనే దేశవ్యాప్తంగా పంపించారు.

సాంస్కృతిక పోలీసింగ్, మైనార్టీలు, దళితులపై దాడులు క్యాంపస్‌లపై దాడులతో భావవ్యక్తీకరణ స్వేచ్ఛలపై సంకెళ్లు వేసి, ప్రగతిశీల ప్రశ్నల్ని అంతం చేసే వికృత పోకడలు విచ్చలవిడిగా సాగించే పనిలో ఉన్నాయి. అయోధ్య రామ మందిర నిర్మాణం కోసం మరో గుజరాత్ మారణ హోమాన్ని సృష్టించడానికైనా ఈ శక్తులు వెనకాడకపోవచ్చు. మైనార్టీలను హింసాయుతంగానైనా భీతావహుల్ని చేసి మరింత బలహీనపర్చి 'సంప్రదింపుల' ద్వారా రామ మందిర నిర్మాణం అనే దౌర్జన్యానికి దిగే సూచనలు ఉన్నాయి.

ఒక వైపు కేంద్రంలో, మరోవైపు మెజారిటీ రాష్ట్రాల్లో అధికారం పొంది హద్దులు లేని అధికారంతో ఇప్పుడున్నట్టు కాకుండా వారి ఊహలకు అనుగుణమైన అఖండ 'హిందూ భారత్' గా మార్చే పనిని రాజ్యాంగ సమీక్ష పేరుతో మొదలు పెట్టే ప్రయత్నం చేయొచ్చు.

వన్ ఇండియా వన్ ఎలక్షన్, వన్ ట్యాక్స్ సిస్టం, ఒక దేశం ఒకే చట్టం వంటి నినాదాల వెనక ఏకశిలా సదృశమైన భారత నిర్మాణ భావన తప్ప మరేమీ లేదు. మొదటి బి.జె.పి. సంకీర్ణ ప్రభుత్వ హాయంలోనే రాజ్యాంగ సమీక్ష ప్రయత్నం జరిగింది. భారీ మెజారిటితో కేంద్రంలోను, మెజారిటి రాష్ట్రాల్లోను అధికారంలో ఉంది కాబట్టి ఆ ప్రయత్నం తప్పక చేసే అవకాశాలున్నాయి.

రిజర్వేషన్ల హక్కును అగ్రకుల రిజర్వేషన్ల డిమాండ్ ఉద్యమాలతో నల్లిఫై చేసే ప్రయత్నం, మైనార్టీల ప్రత్యేక హక్కులను రద్దుపర్చే దిశగా బలమైన కుట్రలనే అమలు పరుస్తారు. 2022 నాటికి నవీన భారత్ అనే మోడి నినాదం సనాతన హిందూ తాత్విక పునాదిపై నిర్మించేదే. బాబాలు వ్యాపారం చేస్తారు, యోగులు పీఠాలెక్కుతారు, సాధువులు పాఠాలు చెబుతారు, మోడిలు అభివృద్ధిచేస్తారు. ఆ నవీన భారత్ లో దేశం హిందూ రాజ్యం అవుతుంది. భగవద్గీత జాతీయ గ్రంథం అవుతుంది. మనుస్మృతి పాలకులకు కరదీపికవుతుంది. మెజారిటి మత ప్రజల దయాదాక్షిణ్యాల మీద మైనార్టీలు మనుగడ కొనసాగించాలి. దేనిని ప్రశ్నించవద్దు. అంతా దైవ నిర్ణయమవుతుంది. మహిళలు పిల్లల్ని కని ఇంటికి, వంటకే పరిమితం కావాలి!

యోగి ఆదిత్యనాథ్ అదే ప్రవచిస్తున్నాడు. స్త్రీలకు భద్రత ఉండాలి కానీ స్వేచ్ఛా స్వతంత్రాలు కావట! జాతులు విముక్తి కోసం పోరుచేయొద్దు, ప్రజలు విప్లవాలు కోరుకోకుండా దైవ పారాయణ చేసి 'మోక్షం' సిద్దింపచేసుకోవాలి. ఈ దేశంలో ఉండాలంటే వందే మాతరం పాడాల్సిందే అనే బలవంతపు చర్యలు, సూర్య నమస్కారం చేయాలనే కట్టుబాట్లు యోగ ముద్రలో మునిగిపోవాలనే ఆజ్ఞలు కూడా వస్తాయి. చలన రాహిత్యాన్ని ఆమోదించి విధి వాదాన్ని శిరసావహించి జీవించాలి. టాకీసుల్లోనే కాదు ఉదయం లేవగానే జనగణమన మాత్రమే కాకుండా నమస్తే సదా వత్సలే అని కూడా పాడాల్సి వస్తుందేమో.

అంబేద్కర్ తాత్విక చింతన కలిగించిన చైతన్యంతో వ్యవస్థీకృతమైన ఏ విలువల్ని ప్రశ్నించకూడదంటూ మొత్తంగా అంబేద్కర్‌నే పూర్వపక్షం చేసే ప్రయత్నాలు బలంగానే జరుగుతాయి.

సమష్టి సంపద అయిన సకల సహజ వనరులను కార్పోరేట్లకు అప్పగిస్తాం కానీ శ్రమజీవుల చుట్టూ అల్లుకున్న శృంఖలాలను అలాగే కొనసాగిస్తామని గతంలోనే జీవించండని ఈ నవీన భారత్‌లో ఆదేశాలుంటాయేమో!

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# ఎన్నికల ఫలితాలు – గమనించాల్సిన విషయాలు

*గెలుపు ఓటములకూ ఆయా పార్టీల, అభ్యర్థుల విధానాలకూ ఏ సంబంధమూ లేదని ఎన్నికల ఫలితాలు చూపుతున్నాయని అంటున్నారు* **ఎం. కృష్ణ ఆదిత్య**

'ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు' శీర్షికతో వై.రామచంద్రం (వీక్షణం సహాయ సంపాదకులు) రాసిన వ్యాసాన్ని మార్చి 2017 సంచిక – 'ఈ ఐదు రాష్ట్రాల్లో ఆయాపార్టీల పాలనలో జరిగిన అవినీతి, హత్యలు, అత్యాచారాలు, మతకల్లోలాల వల్ల ప్రజలు ఏ పార్టీకీ కూడా పూర్తి మెజారిటీ ఇచ్చే పరిస్థితి లేదంటున్నారు' అన్న పరిచయ వాక్యాలను ముఖ్యాంశంగా ఎత్తిచూపారు. వాస్తవ పరిస్థితి ఆ తర్వాత స్పష్టమయింది. అసలు ఏం జరిగింది, ఎలా విశ్లేషించుకోవాలి? వీక్షణం సంపాదకుల ద్వారా ఇలాంటి విశ్లేషణ ఎందుకు, ఏ అవగాహనతో వెలువడింది? కొంత ఆలోచించుకోవాలని మనవి.

రెండు మూడు విషయాలకే పరిమితం ఈ ప్రస్తుత వ్యాఖ్య. నిజానికి 2014 లో "కార్పొరేట్లు తమ ప్రయోజనాల కోసం లక్షలకోట్లు ఖర్చుపెట్టి బిజేపీ అధికారంలోకి రావడానికి కృషి చేసిన విషయం కూడా గుర్తుంచుకోవాలి" అని వ్యాసకర్త ముగించారు. 2014లో దాదాపు పాతికేళ్ల తర్వాత ఏకపార్టీ రూపంలో (పేరుకి ఎన్‌డిఏ ఉన్నా) బిజెపి అధికారంలోకి వచ్చింది. అప్పుడూ చాలావరకు అనూహ్యంగానే జరిగింది. ఈ సారీ ఉత్తరప్రదేశ్ ఫలితాలను ఏ సర్వే కూడా ఊహించ లేదు. కాబట్టి వీక్షణంలో అంచనాల గురించి కాదు; వ్యాసంలో దానికి చెప్పిన కారణాల గురించి ఆలోచించాలి. ఉత్తరప్రదేశ్, ఉత్తరాఖండ్‌లలో బిజెపి, పంజాబ్‌లో కాంగ్రెస్ స్వంత బలంతో అధికారంలోకి వచ్చాయి. ఇప్పుడు ఎన్నికల ఫలితాలన్నీ మన ముందున్న తర్వాత విశ్లేషించుకోవటం కొంత తేలికే. అందువల్ల ఇదో గొప్ప విషయమేమీ కాదని చెప్పవచ్చు. అయినా పైన పేర్కొన్నరీతిలో సంపాదకులు ఎత్తిచూపి చేసిన వ్యాఖ్య సరైనది కాదని ఫలితాల ద్వారా స్పష్టమైంది. దీని వెనుక ఉన్న అవగాహన ఏమిటి? ఇది ఆలోచించుకోవాలని మనవి.

అవినీతి, హత్యలు, అత్యాచారాలు, మతకల్లోలాలు – ఇలాంటివన్నీ సాగించిన అభ్యర్థులు నిక్షేపంగా గెలిచారు. నిజానికి అలాంటి నాయకుడైన ఆదిత్యనాథ్ ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి కూడా అయ్యాడు. తమిళనాడు, బీహారుల్లో అవినీతి ఆరోపణలు రుజువైనా, జైళ్లకు వెళ్లివచ్చినా జయలలిత, లాలూప్రసాద్ యాదవ్ గెలిచారని గుర్తించాలి. మనదేశంలో గెలుపు, ఓటములకి వీటితో సంబంధం లేదు. ఉత్తరప్రదేశ్‌లో తమపై క్రిమినల్ కేసులు ఉన్నాయని చెప్పిన 143 మంది శాసనసభ సభ్యులుగా ఎన్నికైనారు. అలాగని మిగిలిన వారు నేరాలు చెయ్యలేదని కాదు. ఇలాంటి స్థితిలో పై శీర్షిక దేశంలోని బూటకపు ఎన్నికలపై భ్రమలు కల్పించే అవకాశం ఉంది.

322 మంది శాసనసభ్యులు (80 శాతం మంది) కోటీశ్వరులుగా ప్రకటించుకున్నారు. వారి సగటు ఆస్తి రు. 5.92 కోట్లు. 2012 ఎన్నికలలో 271 మంది (67 శాతం) కోటీశ్వరులు; వారి సగటు ఆస్తి రు. 3.36 కోట్లు. 2012లో ఎన్నికై, ఈసారి మళ్లీ ఎన్నికైన వారివి–92 మంది వివరాలను చూడగా– 2012లో వారి సగటు ఆస్తి రు.4.62 కోట్లు, ఇప్పుడు రు. 8.62 కోట్లు. ఈసారి అందరికన్నా ఎక్కువ ఆస్తి ప్రకటించింది బిఎస్‌పి ఎంఎల్ఏ షా ఆలం–రు.117 కోట్లు. అవినీతి ఎలా పెరిగిపోతున్నదో ఇవి రేఖా మాత్రంగా చూపెడ్తున్నాయి.

మనదేశంలో అవినీతికీ, గెలుపు ఓటములకూ సంబంధం లేదు. (ఆస్తులు, కేసుల వివరాలన్నీ ఎడిఆర్ విశ్లేషణలో ఉన్నాయి (ఎడిఆర్–అసోసియేషన్ ఫర్ డెమోక్రటిక్ రిఫార్మ్స్). నిజానికి అవినీతి డబ్బుతో పోటీ గెలుపూ కూడా సుసాధ్యమవుతున్నాయి. ఓటర్లను కూడా అవినీతిపాలు చేసి, ఇది మామూలే అనే భావం పెంచి గెలుస్తున్నారు. ఆ అవినీతి డబ్బులో మాకూ వాటా ఇవ్వండి అని అడగమని, వారి డబ్బు తీసుకుని మాకు ఓటు వేయండి అని బాహాటంగా పిలుపులు ఇచ్చారు కూడా. ఇది కోర్టు దాకా కూడా వెళ్లింది. కానీ పద్ధతేమీ మారలేదు. ఈ వాస్తవాలను మళ్లీ మళ్లీ చెప్పి భ్రమలు తొలగించాలే కానీ భ్రమలు పెంచకూడదు. అవినీతితోనైనా ఈ ప్రజాస్వామ్యంలో మెజారిటీ పాలన నడుస్తున్నదా? ఇదీ చూడాల్సిన విషయమే.

ఇక మరో విషయం 500–1000 రు.ల నోట్ల రద్దు మోదీ ప్రభుత్వం చెప్పుకున్నట్టు రాజకీయ అవినీతినీ, ఎన్నికల ఖర్చునీ ఏమీ తగ్గించలేదు. ఈ సారి ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో రు. 5500 కోట్లు ఖర్చు చేసినట్టు ఒక (సి.ఎం.ఎస్.) సర్వేలో అంచనా వేశారు. ప్రచార ఖర్చులు కాక, నేరుగా ఓటరు కిచ్చిన డబ్బే వెయ్యి కోట్లు అని, ఒక్కో ఓటరుకి సగటున 750 రు.లు ముట్ట చెప్పినట్టు తేల్చారు. ఓటర్లలో మూడో వంతు మంది తమకు డబ్బు, సారా వంటివి ముట్టినాయని చెప్పారు. సుమారు 200 కోట్లు స్వాధీనం చేసుకోబడింది. అయినా నోట్ల రద్దుని ప్రజలు బలపరిచారని ఈ ఎన్నికలు రుజువు చేసాయట! ఒక్కో అభ్యర్థి 25 లక్షలకి మించి ఖర్చు చేయరాదన్న నిబంధన మాట వరుసకే. తెలుగు రాష్ట్రాల్లో ఇది మామూలే. కాగా ఉత్తరప్రదేశ్‌లో ఈ ఖర్చు పెద్ద రికార్డు అని చెప్తున్నారు. మోదీ గాలి, ఆయనగారి అవినీతి వ్యతిరేకత, నోట్ల రద్దు నాటకం అర్థం చేసుకోటానికివి ఉపయోగపడుతాయి.

ఈ సారి ఐదు రాష్ట్రాల్లోనూ అధికారంలో ఉన్న పార్టీలు ఓడిపోయాయి. వరుసగా రెండోసారీ, మూడోసారీ ఒకేపార్టీ అధికారం లోకి రావడం అనేది జరగలేదు. గోవా, మణిపూర్లలో బిజెపి ప్రభుత్వం ఏర్పాటు చేసినా, అది అడ్డదారులు తొక్కడం ద్వారానే; తమ కేంద్ర

ప్రభుత్వం నియమించుకున్న గవర్నర్ల కుమ్మక్కుతోనే అది సాధ్యమైంది. కేంద్ర ప్రభుత్వ అధికార దుర్వినియోగం, కేంద్ర నిధులు, పథకాలు, కేంద్ర సాయుధ బలగాలు (ఇటీవలి కాలంలో ఎన్నికల్లో వాటిదే ప్రధానపాత్ర అయింది). ఇవి రాష్ట్రాల్లో ఎన్నికలని విశేషంగా ప్రభావితం చేస్తూనేవున్నాయి. ఇవి మన దేశంలోని 'నిరంకుశ ప్రజాస్వామ్యా లక్షణాన్ని- లేదా 'ప్రజాస్వామ్య నిరంకుశత్వాన్నీ- చూపెదుతున్నాయి.

ఓటింగు శాతాన్ని విశ్లేషించటం ద్వారా మనదేశ ఎన్నికల వ్యవస్థను కొంత అర్థం చేసుకోవటం ఈ వ్యాఖ్య ముఖ్య లక్ష్యం.

యుపిలో బిజెపిది అఖండ విజయం అంటున్నారు. కానీ అక్కడ వారికి 40 శాతం ఓట్లకు తక్కువే వచ్చాయి. అదీ పోలయిన 65 శాతం ఓట్లలో. ప్రధాని, డజను మంది కేంద్ర మంత్రులూ, నాలుగు పెద్ద పార్టీలూ, ఐదువేల కోట్ల డబ్బూ, సారా ఏరులూ - ఇన్ని ఉన్నా 65 శాతమే పోలింగ్ అంటేనే దీని పస ఎంతో అర్థం చేసుకోవచ్చు. పోలైన ఓట్లలో మాత్రమేకాక మొత్తం ఓటర్లలో చూస్తే, 26 శాతం లోపు ఓటర్లు మాత్రమే బిజెపికి, మోదీకి మద్దతిచ్చారు. దీన్నే అఖండ విజయం అంటున్నారు. ఇదే పంజాబ్‌లో కాంగ్రెస్‌కీ వర్తిస్తుంది.

ఏ రాష్ట్రంలో కూడా ఏ పార్టీకీ మొత్తం పోలయిన ఓట్లలో సగం (50 శాతం) ఓట్లు రాలేదు. బిజెపికి ఉత్తరాఖండ్‌లో 46.5 శాతం, యు.పి.లో 39.7 శాతం (మిత్రులతో కలిపితే 41.4 శాతం) వచ్చాయి. కాంగ్రెస్‌కి పంజాబ్‌లో 38.5 శాతం మాత్రమే ఓట్లు పోలయినాయి. 50 శాతం ఓట్లు రాకపోతే దాన్ని అనేక దేశాల్లో గెలుపుగా గుర్తించరు; కొన్నిదేశాల్లో అలాంటి ఎన్నికను రద్దుచేసి, మళ్లీ ఎన్నికలు జరుపుతున్నారు. కానీ మన దేశపు గొప్ప ప్రజాస్వామ్యంలో 1952 నుంచీ నేటి వరకూ ఏ పార్టీకీ 50 శాతం ఓట్లు రాలేదు. 1985లో ఇందిరా గాంధీ మరణం తరువాత సానుభూతితో రాజీవ్‌గాంధీ ఎన్నికప్పుడు మాత్రమే 50 శాతం బొటాబొటిగా దాటింది. ఇది మన ప్రజాస్వామ్యపు మరో విశిష్టత.

2014 లోకసభ ఎన్నికలతో పోలిస్తే, ఈసారి బిజెపికి పడిన ఓట్ల శాతం తగ్గింది. అప్పుడు 43.6 శాతం, ఇప్పుడు 41.4 శాతం (మిత్రులతో కలిపి). ఉత్తరాఖండ్‌లో 2014 లో 55.87 శాతం, ఇప్పుడు 46.5 శాతం. అంటే 9 శాతం ఓట్లు తగ్గాయి. సీట్లు కూడా 63 నుంచి 57కి తగ్గినాయి. అయినా బిజెపి, మోదీ అఖండ విజయం సాధించినట్టు చెప్తున్నారు. అలాగే గోవాలో బిజెపికి 2014లో 54 శాతం ఓట్లు రాగా, ఇప్పుడు వచ్చింది 32.5 శాతం. అంటే 22 శాతం తగ్గుదల ఉంది. ముఖ్యమంత్రీ, ఇంకా చాలామంది మంత్రులూ ఓడిపోయారు. అయినా అక్కడ మళ్లీ బిజెపి ప్రభుత్వం ఏర్పడింది. ఇదీ ఈ ఎన్నికలలో పోటీయే చేయని కేంద్రమంత్రి పర్రికర్ నాయకత్వంలో. ఆయన మిత్రపక్షాలనే కాదు, బిజెపికి వ్యతిరేకంగా పోటీ చేసి గెల్చిన పార్టీలనూ, సభ్యులనూ కూడా చేర్చుకుని మంత్రివర్గం ఏర్పాటు చేశారు. మణిపూర్‌లోనూ ఇదే చేశారు. అంతేకాదు. అక్కడ కాంగ్రెస్ సభ్యుడిగా గెల్చిన ఒక మాజీ మంత్రినీ బిజెపి మంత్రివర్గంలో చేర్చుకున్నారు. ఇవే ఇక్కడి 'ప్రజాస్వామ్యం' విశిష్ట లక్షణాలు. తక్కువ సీట్లు వచ్చి, ఓడిపోయినా "అన్ని రాష్ట్రాల్లో మాకు అధికారం ఇచ్చినందుకు కృతజ్ఞతలు" అని ప్రధాని, బిజెపి నాయకులూ ప్రకటించారు. ''సత్యాతీత'' -పోస్ట్ ట్రూత్-రాజకీయాలకిది నిదర్శనం.

మనదేశంలో ప్రజలు పూర్తి మెజారిటీ ఇచ్చినా, ఇవ్వకున్నా దానికి గెలుపు, ఓటములతో సంబంధం లేదు. నిజానికి ఏపార్టీకీ, ఏ రాష్ట్రంలోనూ మెజారిటీ - అంటే 50 శాతం కన్నా ఎక్కువ - ఓట్లు రాలేదు. అయినా ఆయా పార్టీలకు ఓట్లతో సంబంధం లేకుండా సీట్లు వచ్చాయి. ఓట్లు తగ్గినా సీట్లు పెరగడం కూడా జరుగుతుంది. ఉదాహరణకి సమాజ్‌వాదీ పార్టీకి 2014లో 22.4 శాతం ఓట్లు రాగా, ఈసారి తగ్గి 21.8 శాతం మాత్రమే వచ్చాయి. అయినా సీట్లు మాత్రం 42 నుంచి 47కి పెరిగాయి. 2014లో బిఎస్‌పికి 20 శాతం ఓట్లు వచ్చినా లోక్‌సభకి ఒక్కరు కూడా గెలవలేకపోయారు. గోవాలో ఈసారి కాంగ్రెస్ కన్నా (28.4 శాతం) బిజెపికి ఎక్కువ (32.5 శాతం) ఓట్లు వచ్చినా, సీట్లు తల్లకిందయ్యాయి. తక్కువ ఓట్లు వచ్చిన కాంగ్రెస్‌కి 17 సీట్లు, ఎక్కువ ఓట్లు వచ్చిన బిజెపికి 13 సీట్లు వచ్చాయి.

ఇలాంటి గెలుపుల ద్వారా తమకు ప్రజలు అధికారం ఇచ్చారని, కాబట్టి సంస్కరణల పేరిట తమ దోపిడీ విధానాలను ఇంకా వేగంగా కొనసాగిస్తామని పాలకులు ప్రకటిస్తున్నారు. యుపిలో గెల్చిన బిజెపి వారిలో 100 మందికి పైగా ఇతర పార్టీల నుంచి వచ్చిన వారే. విధానాల పరంగా ఈ పార్టీలకు మౌలిక తేడాలేమీ లేవని, అధికారంలో దోపిడిలో వాటాల కోసమే పోటీ అని ప్రజలు అర్థం చేసుకోవాలి.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

# మారుతి కార్మికులకు జీవిత ఖైదు

***పాలకులు, బహుళజాతి కంపెనీలు అమలుపరుస్తున్న ప్రజా, కార్మిక వ్యతిరేక విధానాలను కార్మికులు వ్యతిరేకించే క్రమంలో జరిగిన ఘర్షణలను సాకుగా చూపుతూ న్యాయస్థానాలు ఇస్తున్న తీర్పులను కార్మికవర్గం ఐక్య ఉద్యమాల ద్వారా ఎదుర్కోవాలని అంటున్నారు పి. ప్రసాద్***

**వా**రు పాతికేళ్ల క్రితం వరకూ వెనకబడ్డ గ్రామీణ ప్రాంతాలకు చెందిన రైతు కూలీల బిడ్డలే. సరళీకరణ వ్యవస్థ సృష్టించిన బడా పరిశ్రమలకు (ముఖ్యంగా విదేశీ బహుళజాతి సంస్థల పరిశ్రమలు) అవసరమైన మానవ వనరులకి ఆ పల్లె ప్రాంతాలు ఆటపట్టుగా నిలిచాయి. పొట్ట చేత పట్టుకొని కట్టుబట్టలతో లక్షలాది గ్రామీణ యువత పట్నం బాట పట్టింది. 'రాముడు మంచి బాలుడు' వంటి ఈ అమాయక గ్రామీణ భారతీయ యువత కొద్దికాలంలోనే నూతన పారిశ్రామిక కార్మికవర్గంగా రూపొందింది. అన్నెం పున్నెం ఎరుగని వారి అమాయక ప్రవృత్తి బడా పారిశ్రామిక యాజమాన్యాల శ్రమ దోపిడీకి నెలవైనది. వారి శ్రమ శక్తి మార్కెట్లో కారు చౌక ధరకు కొల్లగొట్టడం జరిగింది. ఆ నూతన కన్నీటి జీవితం వారికి నూతన రాజకీయ పాఠాలను బోధించింది.

ఒకనాడు పొట్ట కూటి కోసం పట్నమొచ్చి ఫ్యాక్టరీలో చేరారు. ఆనాడు పట్నపు బస్తీలో బిక్కు బిక్కు మంటూ ఎవరికి వారు ఒంటరి జీవితాన్ని ప్రారంభించారు. కానీ నూతన జీవితం వేల మంది శ్రమ తల్లి బిడ్డలను ఏకం చేసింది. పుట్టిన చోట తమ రక్త సంబంధీకులను వదిలేసి పట్నం వచ్చినోళ్లకు అంతకంటె నూరు రెట్ల సంఖ్యలో ఆత్మబంధువుల అండదండలు లభించాయి. రక్త బంధుత్వం కంటె నూరు రెట్లు దృఢమైన వర్గ బంధుత్వం వారినొక శక్తిగా తీర్చిదిద్దింది. దీనితో వాళ్లిప్పుడు 'రాముడు మంచి బాలుడు' వంటి అమాయకులు ఎంత మాత్రం కాదు. తమ శ్రమశక్తిని కారుచౌకకు అమ్ముకోవడానికి సిద్ధంగా లేరు. బడా ధన శక్తిపై పోరాడుతున్న మేటి జనశక్తిగా మారారు. ఈ నేల తల్లి మీద నిలబడి విదేశీ, స్వదేశీ బహుళజాతి బడా పారిశ్రామిక యాజమాన్యాలపై పిడికిళ్లు బిగించారు. ఈ దేశంలోని సహజ వనరులతో పాటు సమస్త సంపదలను కొల్లగొడుతున్న విదేశీ, స్వదేశీ కార్పొరేటు రాబంధులపై వర్గ పోరాటానికి దిగారు.

వాళ్లకు తెలియకుండానే వాళ్లిప్పుడు దండకారణ్యంలోని ఆదివాసులకూ, సముద్ర తీరాలలోని మత్స్య కారులకూ, విశాల గ్రామీణ ప్రాంతాల రైతు కూలీలకూ కొత్త బంధువులయ్యారు. వాళ్లిప్పుడు గురుగావ్, ఘజియాబాద్, మానేసర్, నోయిడా, చెన్నై, కోయంబత్తూర్, బెంగుళూరు, పూణెలలో నిలబడి అమెరికా యూరప్, జపాన్ ద్రవ్య పెట్టుబడులను సవాలు చేస్తున్నారు. నూతన భారత స్వాతంత్ర్య పోరాటానికి నూతన సైనికులుగా మారుతున్నారు. 'ప్రపంచీకరణ' సాగిస్తున్న నూతన శ్రమ దోపిడీపై నూతన పోరాటాల ద్వారా రేపటి స్వాతంత్ర్య పోరాటానికి వెలుగులు అందిస్తున్నారు. వారు నేడు పోషిస్తున్న చారిత్రక పాత్రకు రాజకీయ ప్రాధాన్యత ఉంది. అలాంటి నూతన చారిత్రక శక్తులను నేడు రాజ్యం గొంతు నులమ జూస్తుంది. మారుతీ సుజుకీ ఫ్యాక్టరీ కార్మికులకు గురుగావ్ జిల్లా సెషన్స్ కోర్టు విధించిన తాజా యావజ్జీవ శిక్షలు అందుకు నిదర్శనం.

చాలీ చాలని జీతభత్యాలు, సమాన పనికి అసమాన వేతనాలు, కాంట్రాక్టు కార్మిక వ్యవస్థ, అధికారుల వేధింపులు, యాజమాన్య నిరంకుశత్వం మానేసర్ (హర్యానా) పారిశ్రామిక ప్రాంతంలోని మారుతీ సుజుకీ ఫ్యాక్టరీ కార్మికవర్గాన్ని సంఘటితం చేసింది. సంఘ నిర్మాణం జరిగింది. దాదాపు దశాబ్ద కాలంగా ఉద్యమిస్తున్నది. అణిచివేత చర్యల నుంచి ఆత్మరక్షణకై అనేకసార్లు అనివార్యమైన మెరుపు సమ్మెలకు దిగింది. రెండు సార్లు సుదీర్ఘ సమ్మె పోరాటాలను సాగించింది. తద్వారా గురుగావ్, మానేసర్ (హర్యానా), ఘజియాబాద్, నోయిడా (యు.పి) వంటి అతి పెద్ద పారిశ్రామిక వాడలకు చెందిన లక్షలాది పారిశ్రామిక వర్గానికి మారుతీ కార్మికవర్గం పోరాట స్ఫూర్తినిచ్చింది. అది సాగించిన సంఘటిత పోరాటాల చరిత్ర ఒక గ్రంథంగా రాయదగింది. అయితే అది ఇప్పుడు సందర్భం కాదు. కానీ అది అనేక అణచివేతలకూ, అవమానాలకూ, వేధింపులకూ, బాధింపులకూ, అక్రమ సస్పెన్షన్లకూ గురైన నేపథ్యంలో ఒకరోజు ఒక అసంకల్పిత సంఘటన జరిగింది. 2012 జూలై 18న ఫ్యాక్టరీ చీఫ్ ఎగ్జిక్యూటివ్ అవనీష్ కుమార్ దేవ్ ఒక అసంకల్పిత ప్రతీకార చర్యకు బలయ్యాడు. సంఘటిత కార్మికవర్గాన్ని సాంప్రదాయ నిర్బంధ పద్ధతులతో అణచివేయడం సాధ్యం కాదని పరిస్థితులు నిర్ధారించిన నేపథ్యంలో ఇది జరిగింది. ఇలాంటి దుర్ఘటనను సృష్టించాల్సిన అవసరాన్ని గుర్తించిన యాజమాన్యమే ఒక కుట్ర పన్నిందన్న కథనం ఉంది. తమ దగ్గర కొలువు చేస్తున్న ఒక అధికారిని చంపించే పరిస్థితులను యాజమాన్యమే ఒక పథకం ప్రకారం సృష్టించిందని కార్మికవర్గం విశ్వసిస్తున్నది. కారణాలు ఏవైనప్పటికినీ ఆ రోజు దుర్ఘటన జరిగిపోయింది. దాన్ని అసరా చేసుకొని యాజమాన్యం తన రహస్య రాజకీయ ఎజెండాను అమలు చేయించుకున్నది. రాజ్యాన్ని రంగంలోకి దింపింది. ఒకవైపు యాజమాన్యం అదే రోజు ఫ్యాక్టరీని లాకౌట్ చేసింది. మరోవైపు కార్మిక బస్తీలపై పోలీసు దాడులు చేయించింది. వందలాది మందిని పోలీసులు నిర్బంధించారు. లాకప్పు చిత్రహింసలు సాగించారు. పి.యు.డి.ఆర్. విచారణ కమిటీ నివేదిక కార్మికవర్గం పట్ల పోలీసు భీభత్సకాండ తీరు తెన్నులను వెల్లడించింది. శ్మశాన ప్రశాంతతను సాధించిన తర్వాత ఐదువందల మందికి పైగా పర్మినెంటు కార్మికులతో సహా తత్కాలిక కార్మికులను పని నుంచి తొలగించింది. ఆ తర్వాత పోటీ కార్మికుల నియామకాన్ని కూడా చేపట్టింది. ఫ్యాక్టరీలోనూ, గేటు బయటా రెండున్నర వేల మంది సాయుధ పోలీసులతో ఫ్యాక్టరీని నడిపించింది. సుమారు నాలుగు వేల మంది కార్మికులు పని చేసే ఫ్యాక్టరీకి రెండున్నర వేల తుపాకులతో కాపలా కాయడం గమనార్హం. ఇదంతా ఒక ఎత్తుకాగా, 148 మంది కార్మికుల మీద హత్యానేరం, విధ్వంసం, దాడి, దగ్ధం వంటి సెక్షన్ల కింద కేసులు పెట్టించి, నిర్బంధింప జేయించడం మరో ఎత్తు.

గురుగావ్ జిల్లా సెషన్స్ కోర్టు విచారణలో ముద్దాయిలపై నేరారోపణలను ప్రాసిక్యూషన్ నిరూపించలేకపోయింది. కోర్టు హాల్‌లో విచారణ ప్రక్రియను పరిశీలించిన న్యాయవాదులందరూ కేసు కొట్టవేయదగినదిగానే చెప్పారు. అక్కడ ఏ న్యాయవాదిని అడిగినా ఇదే జవాబు వస్తుంది. అయితే ఈ సందర్భంగా దేశంలో న్యాయవ్యవస్థ ఇటీవల అనుసరిస్తున్న విధానాన్ని గుర్తు చేసుకోవాలి. రామజన్మ భూమి వివాధం కేసులో ఎలాంటి చారిత్రక ఆధారాలు అలహాబాదు హైకోర్టు ఎదుట లేవు. అయినా 'దేశంలో మెజార్టీ ప్రజల మనోభావాలను సంతృప్తిపరిచే ఉద్దేశ్యం'తో తాము తీర్పు ఇస్తున్నట్లు అలహాబాదు కోర్టు ప్రకటించడం తెలిసిందే. అప్జల్‌గురు కేసులో కూడా ఇదే ధోరణి వ్యక్తమైనది. అంతెందుకు 2017 మార్చ్ 7న జి.ఎన్. సాయిబాబా మరో నలుగురిపై కేసులో గడ్చిరోలి కోర్టు కూడా ఇదే విధమైన తీర్పునిచ్చింది. ఇప్పుడు మన న్యాయవ్యవస్థకు సాక్ష్యాలూ, ఆధారాలూ అవసరం లేదు. ముందుగా మనస్సుల్లో ఏర్పడి ఉన్న విశ్వాసాలూ, అభిప్రాయాలే ముఖ్యమైనవి. విదేశీ పెట్టుబడిదారులను సంతృప్తిపరచడం భారత రాజ్య లక్ష్యంగా ఉంది. రాజ్యంలో భాగమైన న్యాయ వ్యవస్థదీ అదే దారి.

2017 మార్చ్ 10న గురుగావ్ సెషన్స్ కోర్టుతీర్పును వెలువరించింది. మొత్తం 148 మంది ముద్దాయిలతో 117 మందిని నిర్దోషులుగా నిర్ధారించింది. 31 మందిని ముద్దాయిలుగా నిర్ధారించింది. ముద్దాయిలకు విధించాల్సిన నిర్దిష్ట శిక్షలను ఖరారు చేసి ప్రకటించడానికి 2017 మార్చ్ 18న మరోసారి తీర్పు వెలువరిస్తానని ఆరోజు న్యాయస్థానం ప్రకటించింది. ఆ ప్రకారం మార్చ్ 18న సదరు 31 మందిలో 13 మందికి యావజ్జీవ శిక్ష విధించింది. నలుగురికి ఐదేళ్ల శిక్ష విధించింది. మిగిలిన 14 మందికి విధించిన శిక్షాకాలం అప్పటికే రిమాండులో ముగిసినందున విడుదల చేస్తున్నట్లు ప్రకటించింది. నిర్దోషులని రుజువైన 117 మందికి బెయిల్ లేకుండా రెండున్నర ఏళ్ల నుంచి నాలుగున్నర ఏళ్ల వరకూ జైలు జీవితం సాగించారు. బూర్జువా రాజ్యాంగం ప్రకారం కూడా నిరపరాధులు బెయిల్ లేకుండా ఏళ్ల తరబడి శిక్ష అనుభవించడం నేరమే. ఇదీ ఈనాటి భారతదేశ న్యాయవ్యవస్థ తీరు.

సరళీకరణ విధానాల ద్వారా ఉనికిలోకి వచ్చిన విదేశీ బహుళజాతి సంస్థల బడా పరిశ్రమల కార్మికవర్గ పోరాటాల పట్ల మన న్యాయవ్యవస్థ అత్యంత అప్రజాస్వామికంగా ఉంది. ఇతరులకు చింపనవసరం కూడా ఇవ్వని రీతిలో తన ముసుగును తానే స్వయంగా చింపి వేసుకుంటున్నది. దీనికి మరో ఉదాహరణగా కోయంబత్తూరు సంఘటనను ప్రస్తావించాల్సివుంది. ఆటోమొబైల్ అనుబంధ పరిశ్రమ అయిన 'ప్రికోల్ ఇండస్ట్రీస్' కార్మికులు ఎఐసిసిటియు ద్వారా సంఘటితపడి యూనియన్‌ను స్థాపించుకున్నారు. ఇది కూడా విదేశీ బహుళజాతి పరిశ్రమే. ఇదే యాజమాన్యంలో కోయంబత్తూర్‌తో పాటు పూణె, గురుగావ్ వంటి చోట్ల మొత్తం 7 యూనిట్లు ఇండియాలో ఉన్నాయి. పైన మారుతిలో పేర్కొన్న దారుణ పరిస్థితులే కార్మికవర్గాన్ని ప్రతిఘటించే విధంగా చేసింది. వారు యూనియన్‌ను స్థాపించుకున్నందుకు కక్షకట్టి అనేక మందిని సుదూర ప్రాంతంలోని ఉత్తరాంచల్ యూనిట్‌కు బదిలీ చేసింది. దీన్ని నిరసించినందుకు 2009 సెప్టెంబర్ 19న 42 మంది క్రియాశీల కార్మికులను ఉద్యోగం నుంచి సస్పెండ్ చేసింది. ఈ సమస్య పై 21వ తేదీన చర్చల సందర్భంగా ఒక దుర్ఘటన జరిగింది. ఫ్యాక్టరీ ఉపాధ్యక్షుడు రాయ్‌జార్జి మరణించాడు. ఇక్కడ కూడా ఒక పథకం ప్రకారం విదేశీ యాజమాన్యమే ఈ తరహా అసంకల్పిత ప్రతీకార చర్యను సృష్టించిందన్న కథనం ఉంది. ఎఐసిసిటియుకు చెందిన ఇద్దరు కార్మికేతర నాయకులతో సహా 27 మంది మీద పోలీసు శాఖ ద్వారా కేసును బనాయింపజేసింది. నిర్బంధం, లాకప్ చిత్రహింసలు, అణచివేత, బెయిల్ తదితర అంశాలన్నింటా మారుతీ విషాధకథే కోయంబత్తూర్‌లోనూ పునరావృతమైనది. ఇందులో నలుగురు మహిళా కార్మికులు కూడా ఉండడం గమనార్హం. వీరు సైతం నాలుగు నెలల పాటు బెయిలుకు నోచుకోలేదు. మారుతీ వలెనే ముద్దాయిలపై నేరారోపణలను ప్రాసిక్యూషన్ రుజువు చేయలేకపోయింది. అయినా షరా మామూలుగానే 2015 డిసెంబర్ 3న 8 మందికి 'డబుల్ లైఫ్' శిక్షలు విధిస్తూ కోయంబత్తూరు సెషన్ కోర్టు తీర్పు ఇచ్చింది. వీరికి అండగా తమిళనాడు రాష్ట్ర కార్మికవర్గం అసాధారణంగా సంఘీభావం ప్రకటించింది.

ఆయా పారిశ్రామిక యాజమాన్యాలు వ్యూహాత్మకంగా దిగువ స్థాయిలోని తమ ఉద్యోగులను తామే బలిపశువులను చేసి చంపిస్తున్నాయో, లేదంటే అలా చంపించే పరిస్థితులను సృష్టించడం ద్వారా కార్మికుల ద్వారా అసంకల్పిత ప్రతీకార చర్యలను ప్రోత్సహిస్తున్నాయో పరిశీలించాల్సిందే. అవి ఏమైనప్పటికీనీ ప్రత్యక్షంగా లేదంటే పరోక్షంగా వాస్తవ హంతకులు యాజమాన్యాలే. అట్టి నేరాన్ని సమరశీల కార్మికవర్గానికి అంటగట్టి క్రూరశిక్షల ద్వారా అణిచివేయడం బడా పారిశ్రామిక యాజమాన్యాల విధానంగా మారింది.

2008 సెప్టెంబర్‌లో నోయిడా పారిశ్రామికవాడ (యు.పి)కు చెందిన ఇటలీ బహుళజాతి ఆటో మొబైల్ యూనిట్‌లో కూడా ఇలాంటి దుర్ఘటనే జరిగింది. అందులో కూడా పైన పేర్కొన్న కార్మికవ్యతిరేక విధానమే అమలు జరిగింది. అదే చరిత్ర, అదే దుర్ఘటనలు పునరావృతమయ్యాయి. గ్రాజియానో ట్రాన్స్‌మిషన్ ఇండస్ట్రీస్ అను పేరు గల ఈ ఫ్యాక్టరీ చీఫ్ ఎగ్జిక్యూటివ్ లలిత్ కిషోర్ చౌదరి కూడా ఇలాగే మృతి చెందాడు. కాకినాడ సమీపంలోని సిరామిక్ ఫ్యాక్టరీ కార్మిక నేత మచ్చ మురళీమోహన్‌ను పోలీసుల ద్వారా యాజమాన్యం హత్య చేయించింది. తిరిగి అసంకల్పిత ప్రతీకార చర్యను సృష్టింపజేసి చంద్రశేఖర్ అను తన ప్రతినిధి హత్యకు కారణమైనది. అక్కడ నేటికీ 176 మంది వివిధ కేసుల్లో కాకినాడు నుంచి చెన్నై ఆవల గల పాండిచ్చేరికి కోర్టు వాయిదాలకు తిరుగుతున్నారు. (అటు ప్రయాణం ఒక రోజు, తిరుగు ప్రయాణం ఒక రోజు, కోర్టు కోసం ఒక రోజు చొప్పున ఒక్కొక్క వాయిదాకు మూడు రోజులు చొప్పున దూరభారాలు భరించలేక తల్లడిల్లుతున్న వీరందరూ దళిత బహుజనులే). అదే విధంగా 2001లో పశ్చిమ బెంగాల్‌లోని బారానగర్ జూటు మిల్లు చీఫ్ ఎగ్జిక్యూటివ్ జె.పి. తివారీ, 2012లో నార్త్ బ్రూక్ అను మరో జూటుమిల్లు ఎగ్జిక్యూటివ్ కూడా ఇలాంటి దుర్మరణానికే గురయ్యారు. ఇవే కాకుండా ఢిల్లీ పరిసరాలలోని గురుగావ్, మానేసర్, ఘజియాబాద్, నోయిడా వంటి అతిపెద్ద పారిశ్రామిక వాడలలో యాజమాన్యాల గూండాల దాడుల్లో అనేక మంది కార్మిక నేతలు, కార్మికులు గాయపడడం, మృతి చెందడం సర్వసాధారణమైపోయింది. ఈ అన్ని పరిణామాలూ ఒక వాస్తవాన్ని వెల్లడిస్తున్నాయి. బడా పారిశ్రామిక రంగానికి చెందిన (ముఖ్యంగా విదేశీ పరిశ్రమల) భారత కార్మికవర్గం ఇప్పుడిప్పుడే ఒక వర్గంగా తనకు తాను సంఘటితపడుతున్నదని ఈ పరిణామాలు నిరూపిస్తున్నాయి.

న్యాయవ్యవస్థ తన వర్గ స్వభావాన్ని అనేకసార్లు వెల్లడించుకుంటున్నది. దేశ సంపదలను లూటీ చేస్తున్న స్వదేశీ, విదేశీ కార్పొరేట్ శక్తుల దోపిడీ విధానాన్ని వ్యతిరేకిస్తూ మన న్యాయవ్యవస్థ ఒక్క తీర్పు కూడా ఇచ్చింది లేదు. బూటకపు ఎదురు కాల్పులతో సహా పౌరహక్కులను ఉల్లంఘిస్తున్న ప్రభుత్వ విధానాన్ని నియంత్రిస్తూ తీర్పులిచ్చిందిలేదు. కేవలం వ్యక్తిగత బాధితులకు అధిక నష్టపరిహారాలనూ, కొన్ని సంక్షేమ చర్యల పట్ల అతిగా

# భయమే దాడులకు మూలకారణం

***గాయకురాలు నహీద్ అఫ్రీన్ పాడకూడదని ముస్లిం మత పెద్దలు ఫత్వా జారీ చేయడం, 'పద్మావతి' సెట్‌పై రాజపుత్రుల గుంపు దాడిచేయడం పునాది లేని భావజాలం ప్రశ్నకు నిలబడదనే భయ ఫలితాలే అంటున్నారు*** **దేవి**

**ముం**దుగా టీనేజి గాయకురాలు నహీద్ అఫ్రీన్‌పై ఫత్వా జారీ చేశారు.. 'కాలేజీలో పాడకూడదు.. టీవీల్లో పాడడం పాపం.. తప్పు చేస్తే ఫలితం అనుభవించాల్సి వస్తుంది జాగ్రత్త' ఇట్లా ఓ బుల్‌బుల్ పిట్ట గొంతు నొక్కేసి మతం పట్టును బిగించాలనుకుంటున్నారు సదరు మౌల్వీలు. ఖురాన్, ప్రవక్త ఎవ్వరూ పాడడానికి వీల్లేదని చెప్పారా? అయితే ఖవ్వాలీల్లో రాత్రంతా ఖుదా గురించి ఆ గానాలెందుకు? ఆడవాళ్లు మాత్రం పాడకూడదని ఎక్కడయినా రాసుందా? ఆడవాళ్ల గురించిన ఈ ఆంక్షలన్నీ తమ పట్టు సడలకుండా ఉండడం కోసం, వారి చేతుల్లోంచి జారిపోతున్నారనే భయం పెరిగి పోయినప్పుడల్లా ఛాందస వాదం మతఛాందసవాదం ఫత్వాలు జారీ చేస్తుంది.

వెంటనే అస్సాం భాజపా ప్రభుత్వం అంతా కదిలి ఆ అమ్మాయి రక్షణకు తరలి వెళ్లింది. ముంబాయి సినీ ప్రపంచం మద్దతు ప్రకటించింది. కొంతమంది ఇంకొంత ముందుకు పోయి 'అవార్డులు తిరిగిచ్చిన మేధావులు ఏమయ్యార'ని ప్రశ్నించారు. ఉత్తరప్రదేశ్‌లో ఒక ముస్లిం కుటుంబంపై ఆధారం కూడా లేకుండా పుకార్లను నమ్మి దాడి చేసి గాయపర్చి ఒకర్ని చంపినపుడు, ముజాఫర్‌నగర్‌లో మతకల్లోలాలు రేపినపుడు ఎవరు బాధ్యులో వారిపై భాజపా ఎందుకు చర్య తీసుకోలేదు? ఇప్పటిలా బాధితుల్ని ఆదుకోవడానికి బదులు కేంద్ర భాజపా దాడిచేసిన వారి తరఫున ఎందుకు నిలబడ్డారనే ఆనాడు మేధావులు ప్రశ్నించారు. అది ఈ మేతావులకు అర్థం కావడం లేదా? ఇస్లాంలో మార్పులు కావాలి వైదిక బ్రాహ్మణత్వంలో వద్దు. మౌల్వీల ఫత్వాలు మతఛాందసం ఎదిరిస్తే ఆధునికత.. ఖాప్ పంచాయితీలు కులాంతర వివాహాలు చేసుకుంటే చంపుతాం, సెల్‌ఫోన్లు వాడద్దు, 16 ఏళ్లకే అమ్మాయిల పెళ్లిళ్లు చేయాలని తీర్మానాలు చేసి అమలు చేస్తే అది సాంప్రదాయం. దాన్ని వ్యతిరేకిస్తే అది హిందూ సమాజానికి ద్రోహం.. ఇదీ భాజపా వ్యవహారం.

మరోవైపున సంజయ్‌లీలా బన్సాలీ 'పద్మావతి' సెట్‌పై రాజపుత్రుల గూండా గుంపు దాడి చేస్తే ఆ నిర్మాతకు సానుభూతి తప్ప దాడి చేసిన వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి, భావ ప్రకటనా స్వేచ్ఛనూ, సృజనాత్మక స్వేచ్ఛనూ కాపాడ్డానికి కేంద్ర ప్రభుత్వం కదలాలి" అని మాత్రం గట్టిగా ముంబాయి ఫిల్మ్ దునియాలో అడిగిన నాథుడు లేదు. అదేమంటే

---

స్పందిస్తూ తన క్రియాశీలత (జుడీషియల్ యాక్టివిజం)ను చాటుకుంటున్నది. విషవృక్ష వ్యవస్థను మౌలికంగా బలపరుస్తూ దానికి కాసిన ఒకట్రెండు విషఫలాల పట్ల తీవ్ర నిరసన వ్యక్తం చేసే తీర్పులిస్తున్నది. తద్వారా మధ్య తరగతి, విద్యాధిక వర్గాలను ఆకర్షించుకోజూస్తున్నది. కేవలం నిజనిర్ధారణ కోసం వెళ్లిన దుడ్డు ప్రభాకర్, చిక్కుడు ప్రభాకర్, బల్ల రవీంద్రనాథ్ వంటి ప్రజాస్వామిక ఉద్యమకారులను సుక్మా జైలులో నిర్బంధించి మూడు నెలలైనా బెయిల్ మంజూరు చేయలేదు. తద్వారా న్యాయవ్యవస్థ తన వర్గ స్వభావాన్ని వెల్లడి చేసుకుంటున్నది. చక్రాల కుర్చీ మీదతప్ప కదలలేని వికలాంగుడైన ప్రొఫెసర్ జి.ఎన్. సాయిబాబా పట్ల కూడా తన నిజరూపాన్ని అతి నగ్నంగా వెల్లడించుకున్నది. అయోధ్య రామ జన్మభూమి వంటి సున్నిత వివాదాన్ని రాజ్యాంగబద్ధంగా తీర్పు ఇవ్వాల్సిన సుప్రీం కోర్టు ఉభయ మతాల పెద్దల మధ్య పరిష్కారం కావాలని తాజాగా సూచించడం దేనికి సంకేతం ? మెజార్టీ హిందూవాదాన్ని జాతీయ వాదంగా భావిస్తున్న హిందుత్వ శక్తుల దగ్గర పరిష్కరించుకోవాలని మైనార్టీలకు బోధిస్తున్నది. ఇది వీధుల్లో కత్తులూ, రక్తపుమడుగులతో పరిష్కరించుకోండని సూచించడం తప్ప మరొకటి కానే కాదు.

మారుతీ కార్మికులు 13 మందికి నేడు యావజ్జీవ శిక్షలు పడవచ్చు. కానీ మార్చ్ 10న తీర్పు వెలువడటానికి 10 రోజుల ముందు మార్చ్ 1న (మారుతీ సుజుకీ వర్కర్స్ యూనియన్ ఆవిర్భావదినం) సుమారు 25 వేల మంది కార్మికులతో భారీ నిరసన సభ జరిగింది. తీర్పు వెలువడే రోజు గురుగావ్ సెషన్స్ కోర్టు హాలు చుట్టూ వెయ్యి మంది సాయుధ బలగాలను రాజ్యం కాపలా పెట్టింది. వివిధ పారిశ్రామికవాడలను సాయుధ బలగాలతో ముంచెత్తింది. అదే రోజు సాయంత్రం స్థానిక కమలా నెహ్రూ పార్కులో 150 పరిశ్రమలకు చెందిన యూనియన్ల ప్రతినిధులు సమావేశమై పై శిక్షలకు నిరసన సూచకంగా హోలీని నిర్వహించకూడదని తీర్మానించాయి. మార్చ్ 18న రెండవ దఫా తీర్పుకు ఒక రోజు ముందు మొత్తం పారిశ్రామిక వాడల కార్మికవర్గం తమ ఫ్యాక్టరీలలో మధ్యాహ్న భోజనాన్ని నిరాకరించారు. శిక్షలు పడ్డ మరునాడు తమ సాటి 13 మంది కార్మికుల శిక్ష పట్ల విషాద సూచకంగా నల్లబ్యాడ్జీలు ధరించి మరో సారి లంచ్ బహిష్కరించారు. సరిగా ఈ వ్యాసం రాస్తున్న రోజు (మార్చి 23-భగత్‌సింగ్ వర్ధంతి రోజు) వివిధ యూనియన్ల ప్రతినిధులు వెయ్యి మందితో మారుతీ ఫ్యాక్టరీ సమీపాన వివిధ కేంద్ర, స్థానిక కార్మిక సంఘాల ఆధ్వర్యంలో సంఘీభావ సభ జరిగింది. ఈ యావజ్జీవ శిక్షలను వ్యతిరేకిస్తూ ఏప్రిల్ 4న అఖిల భారత స్థాయిలో నిరసన పిలుపునివ్వడం జరిగింది. ఆ 13 మందికి యావజ్జీవ శిక్షలు విధించి కటకటాల వెనుక బంధించవచ్చునేమో కానీ వారికి సంఘీభావం గా ఆ రోజు లంచ్ బహిష్కరణ పిలుపు ద్వారా చేపట్టిన నిరాహార నిరసన ముమ్ముందు రాజ్యవ్యతిరేక రాజకీయ పోరాటానికి దారితీయక తప్పదు. వర్తమాన భారత పారిశ్రామిక కార్మికవర్గం ఆధునిక ద్రవ్య పెట్టుబడి కుంభస్థలంపై పంజా విసరడానికి పిడికిళ్లు బిగిస్తున్నది. అది యావజ్జీవ శిక్షల తీర్పులతో ఆగిపోయేది కాదు. అది సమ్మె పోరాటాల పాఠశాలలో నూతన పాఠాలతో ముమ్ముందుకు పురోగమించి తీరుతుంది.

*(రచయిత - ఐ.ఎఫ్.టి.యు. జాతీయ కార్యదర్శి)* వీ

"గాయపడిన మనోభావాలు", రాజపుత్రులు – రకరకాల కులాల వారికి సంబంధించి మనోభావాలు గాయపడ్డప్పుడల్లా వాళ్లు చేసిన దాడుల న్నింటికీ హిందూత్వ మద్దతు లభించింది. లభిస్తూనే ఉంది.. మరి ఆ లెక్కన గాయపడిన ముస్లింల మనోభావాలు కూడా పరిగణనలోకి తీసుకోవాలిగా?

అసలు దేశం పేరిట, కులం, మతం, ప్రాంతం, గుర్తింపుకు సంబంధించి ప్రజల మనోభావాలు గాయపడడం అంటే ఏమిటి? సెట్టును ధ్వంసం చేసిన 20 మంది గూండాలు రాజపుత్రులందరికీ ప్రతినిధులా? ఫత్వా జారీ చేసిన 40 మంది మొత్తం ముస్లిం సమాజానికి ప్రాతినిధ్యమా? ఒక్క ఊరిలో ఒక్క కులంలో వందరకాల మనోభావా లుంటాయి. అసలీ దేశంలో ఏ ఒక్క ఆచారాన్ని, క్రతువునీ, సాంప్రదాయాన్ని సార్వజనీనంగా సాధారణీకరించడం సాధ్యం అవుతుందా? పోనీ ఎవరైనా ఏ సమాజం అయినా ఆరాచక గూండా మూకల్ని వారికి ప్రతినిధులుగా భావిస్తున్నారా? నియమిస్తున్నారా? అదేం లేదు. వారే స్వయంగా రక్షకులమని ప్రకటించుకుని తమ ప్రయోజనాలు నెరవేర్చుకోడం.

చిత్రమైన విషయం ఏమంటే పుస్తకాలు, నాటకాలు తర్వాతి కాలంలో సినిమాలపై నిషేధం విధించడానికి బ్రిటిష్ పాలకులు ఈ మనోభావాలు గాయపడడం అనే అస్త్రాన్ని మొదటగా ఉపయోగించుకున్నారు. ప్రజానీకం స్వేచ్ఛ మనోభావాలు మలినం కాకుండా చూడడం అనే పేరిట సెన్సార్‌షిప్‌ను విధించారు వలస పాలకులు. రకరకాల అంటువ్యాధులు ప్రబలకుండా చర్యలు తీసుకోవడం పట్ల శ్రద్ధలేని వాళ్లు, జనం చచ్చినా పట్టించుకోలేదు కాని వాళ్ల మనసులు కలుషితం కాకుండా అనేక నిషేధాలు విధించారు.

నిజానికి ఆనాటి పత్రికలు, నాటకాలు దిగజారిపోయిన బ్రిటిష్ విలువల్ని, వారి దేశంలో ప్రజాస్వామ్యాన్ని మన దేశంలో వారే అమలు జరుపుతున్న నియంతృత్వాన్ని పోల్చడం, వారి దేశంలోని అభ్యుదయ చట్టాలు మనదేశంలో ఎందుకు అమలు చేయరు అని ప్రశ్నించి ద్వంద ప్రమాణాల్ని వెల్లడి చేయడం, వారి విలాస విశృంఖల జీవితాల్ని ప్రశ్నించి వీరా మనకు నాగరికత నేర్పేది అని ఎండగట్టడం ప్రారంభించాయి. అట్లా జరిగిన ప్రతి సందర్భం నిషేధానికి గురయ్యింది.

ఆనాటి నుండి ఈనాటికీ డ్రమెటిక్ పెర్‌ఫార్మెన్స్ చట్టంతో సహా, నిషేధాలు నియంత్రణలు గల చట్టాలన్నీ యథాతథంగా కొనసాగు తున్నాయి. నిజానికి ఈ ప్రభుత్వ నిషేధాలు ప్రభుత్వం చేసే అరాచకాలను కప్పిపెట్టుకోవడానికి చక్కటి ఆయుధం.. ప్రజల మనోభావాలతో దానికి నిమిత్తం లేదు.

ఇక ప్రశ్న ఇపుడు వీధిలో విహారం చేస్తున్న 'మంద నిషేదాలు'. ఒక కులం, ఒక మతం, ఒక పురాణం, ఒక దేవుడు, ఒక ఆచారం, ఏదయినా కావచ్చు దానిపై వీసమంత విమర్శ, ప్రతికూల వ్యాఖ్య వచ్చినా కించిత్తు భంగం వాటిల్లినా అవమానం జరిగిందనీ, మనోభావాలు గాయపడ్డాయనీ ఈ రౌడీ మూకలు దాడులకు తెగబడుతున్నాయి. వీటిపై చట్టప్రకారం చర్యలు తీసుకోవల్సిన ప్రభుత్వాలు మౌనం పాటించడమో లేదా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సమర్థించడమో చేస్తున్నాయి.

వలస పాలకుల లాగా నేరుగా నియంతృత్వంగా నిషేధాలు విధించి తమ అసలు రూపం బయట పడకుండా చూసుకోవడానికి సిగ్గుబిళ్ల లాగ 'ప్రజాస్వామ్యం' అనేది కాస్త అడ్డం పడుతున్నది. విస్తారంగా పెరిగిన మీడియా గొల్లుమంటున్నది. దానితో ప్రభుత్వం యాడ్లు ఆపడం, అనుమతులు నిరాకరించడం, ఆదాయం రాకుండా చేయటం లేదా మీడియాలో ఇంతమందిని లేదా గుండుగుత్తగా ఛానళ్లని, పత్రికల్ని కొనేయడం వంటి చర్యలతో అనేక విషయాలపై అప్రకటిత నిషేధం అమలు జరుపుతోంది. గతంలో ప్రజాస్వామ్యాన్ని భుజానెత్తుకు మోసిన మీడియా సంస్థలు కొన్ని కార్పొరేట్ల చేతుల్లోకి పోవటం లేదా వాటి యాజమాన్యం తమ ప్రయోజనాల కోసం పాలకులను సమర్థించడంతో ఈ నిషేధం అనేక అంశాలపై వ్యూహాత్మక మౌనంగా సాగుతున్నది. ఇది ఒక రకం అయిన భయోత్పాతం.

అయితే పైవాటిలో భాగం కాకుండా, ఏ రాజకీయ పార్టీలకూ చెందని అసంఖ్యాక రచయితలు, కళాకారులు వారి సృజనలో భాగంగా ఒక పాత కథను కొత్తగా వ్యాఖ్యానించడం కోసం చేసే ప్రయత్నాలను ఆపడానికి ప్రభుత్వానికి ప్రస్తుతం నేరుగా అవకాశం లేదు. కాబట్టి కండలు బలిసిన మూకల్ని వీరిపైకి పంపుతోంది. వీళ్ల ఏకైక లక్ష్యం ఈ వ్యక్తులుగా పనిచేసే సృజనకారులను భీతిల్ల చేసి నోరు మూయించడమే.. పెరుమాళ్ మురుగన్ లాగ.

భావ ప్రకటనా స్వేచ్ఛతో తమ తమ అభిప్రాయాల్ని అనేక భిన్న కోణాల్లో వెలువరించే హక్కు మేధావులకూ, సృజనకారులకూ జీవించే హక్కు వంటిది. ఇదే ప్రజాస్వామ్య మూలాల్ని బలోపేతం చేస్తుంది.

ఈ మూకలు సాగించే దౌర్జన్యాలు నేటి పాలకుల బహిరంగ మద్దతును పొందుతున్నాయి. ప్రభుత్వం, మూకల నిషేధాల మధ్య సరిహద్దులు చెరిగి పోతున్నాయి. రాజపుత్రుల మంద "రాణి పద్మావతి" సెట్లను ధ్వంసం చేయడంపై ఏదో పై పై ప్రకటనలు, అక్కడక్కడా చిన్న వార్తలు తప్ప చర్య లేదు. యాంత్రిక కేసు నమోదు తప్ప చురుకయిన విచారణ లేదు. వారిని పట్టుకుని శిక్షించే పని జరగదు. ఒకవేళ జరిగినా దశాబ్దాలు పడుతుంది. అసలు ఈ రాజపుత్రులు ఎందుకు విధ్వంసానికి పాల్పడ్డారు?

రాణి పద్మావతి ఒక ముస్లిం పాదుషాపై మనసు పడిందనే సంకేతం వచ్చేలాగ సినిమా ఉందనే పుకారు వల్ల ఈ దాడి జరిగింది. సినిమా చిత్రీకరణ కూడా పూర్తి కానీయకుండా ఇలాంటి వాటిని మొగ్గలోనే తుంచేసే ప్రయత్నం ఇది. సినిమా వాళ్లకు ఒక బెదిరింపు. మీ దారిని మీరు అశ్లీల స్టంటు చిత్రాలు తీసుకుంటూ సొమ్ము చేసుకోండి వంద అత్యాచారాల్ని వివరంగా గ్రాఫిక్‌గా చూపుకోండి.. ఐటంసాంగ్స్‌తో రెచ్చగొట్టుకోండి సొమ్ము చేసుకోండి కాని "భిన్నం"గా ఆలోచిస్తే ఖబడ్దార్.. ఆర్థికంగా తగలబెడతాం.. అనేదే అసలు సందేశం.

ముస్లిం పాలకుడు మోజు పడేంత అందం గల హిందూరాణి (హిందూ వనితల అందం మాత్రమే సమ్మోహనంగా ఉంటుంది. ఇతర మతాల స్త్రీలంతా వికారంగా ఉంటారు. అందులోనూ అగ్రవర్ణాల వారి సౌందర్యం వర్ణనాతీతం. కింది కులాల స్త్రీలు ఆదివాసీలు మురికిగా వికృతంగా ఉంటారు గదా) తన మానం కాపాడుకోవడానికి మంటల్లో దూకింది. ఏ చారిత్రక ఆధారం లేకున్నా ఈ కథ ఎంత బాగుంది. ముస్లింలు ఈ దేశంలో స్త్రీలపై జరిపిన అత్యాచారాలకు, పతివ్రతలైన హిందూ స్త్రీలు మానం కోసం ప్రాణత్యాగాలు చేయడానికి సరైన సాక్ష్యం ఇది. ఇపుడు ముస్లిం యువకులు హిందూ అమ్మాయిలపై వల పన్నడానికి ఎంత బాగా అతుకుతుంది ఇది. అబ్బ ఆకాలం నుండి ఇంతే అనుకుని తమ కూతుళ్లు అలాకాకుండా కాపాడుతున్న హిందూ 'లవ్ జిహాద్' కుటుంబ గౌరవం కోసం జనాలు కావలికార్ల గొడుగు కిందికి చేరతారు..

లేదా ప్రేమించుకునే వారిపై జరిగే పోలీసింగ్‌ను, దాడుల్ని సమర్ధిస్తారు గౌరవ హత్యలపై మౌనం పాటిస్తారు. తమ కుల గౌరవం, మత మర్యాద ఎంతకు తెగించైనా హిందూత్వ మూకలు కాపాడతాయని నమ్ముతారు జనం.

ఏకీకృతంగా మలచాల్సిన హిందూ సమాజంలో భిన్నంగా ఆలోచించడం మాట్లాడడం అవమానించడంగా తయారవుతుంది. ముస్లిం పాలన కాలం నుండి హిందూ స్త్రీలపై జరిగే అకృత్యాలను అరికట్టడానికి (ముస్లింలు హిందూ అమ్మాయిల్ని ఎత్తుకుపోకుండా ఉండడం కోసం బాల్య వివాహాలు వచ్చాయని చెప్పే అజ్ఞానులకు కొదవలేదు. పెద్దగా ముస్లిం పాలన లేని దక్షిణాదిలో "తాళి" అందుకే వచ్చిందని చెప్పే నీతిమంతులకూ కొదవలేదు) ఇపుడు ముస్లింలపై దాడి చేసి లొంగదీసి అదుపు చేయడం. రెండో జాతి పౌరులుగా నోర్మూసుకుని బతికేలా చేయడం లేదా దేశం నుండి తరిమేయడం ఒక్కటే దారని జనాల్ని నమ్మించే ప్రయత్నం (ఇతర మతాలు లేకపోతే స్త్రీలపై అత్యాచారాలు ఆగిపోతాయంట. వారేవా!) ఇది ఒక పెద్ద హిందూ రాజ్యస్థాపన ఎజెండాలో భాగం..

ఈ పథకానికి బీటలు కొట్టేలా 'రాణి పద్మావతి' ఇబ్రహీం లోడీని క్రీగంట చూసినా అది నేరమే అవుతుంది. 13వ శతాబ్దంలో ఓ కవి రాసిన ఒక జానపద గేయం ఆధారంగా ఆయా సమాజాల్లో ఆమోదింప బడని ప్రేమ వల్ల వేదనకు గురయిన ప్రేమ జంట గురించి కథ సినిమాగా తీస్తే ఏమన్నా ఉందా? అగ్రవర్ణ హిందూ స్త్రీలు మహాసాధ్వులు (అలా కాకుంటే వారిని గౌరవం కోసం చంపి ఆనవాళ్లు లేకుండా పూడ్చి పెడతాం గదా) వాళ్లసలు పర పురుషుల వైపే కన్నెత్తి చూడరు ఇక ముస్లింల వైపా? ఏ కాలంలోనయినా సూర్పణక రాముడిపై మోజు పడ్డట్టు కింది కులాల స్త్రీలు ఇతర మతాల స్త్రీలు అందగాళ్లయిన హిందూ పురుషులపై మోజు పడతారు .. హిందూ పురుషులు విగ్రహం గల రుష్యశృంగులు .. భార్య తప్ప వేరే జోలికి పోరు.. (లైంగిక దాడులన్నీ ఎవరు చేస్తున్నారో అంతు బట్టదు) ఇక కులీన హిందూ స్త్రీల సంగతి వేరే చెప్పాలా!

కాబట్టి అణగారిన తరగతులకూ, ఆదివాసీలకూ, ఇతర మతాల వారికీ మాన మర్యాదలు లేవు.. ఉండనవసరం లేదు కూడా. కాబట్టి వారి గురించి మీరు ఎన్నయినా తీసుకోవచ్చు (బాహుబలిలో ఆదివాసీ తెగల్ని చిత్రించినట్టు) ఎన్నికల కాలంలోనయినా కాస్త సముదాయిస్తారు. లేకుంటే అరచి అరచి వాళ్లే ఊరుకుంటారు. తద్వారా భారతీయ సమాజపు ఆధిపత్యపు నిచ్చెన అంతరాయం లేకుండా నడుస్తుంటుంది.

ఈ మొత్తం దాడి వ్యవహారం నేటి పరిపాలకుల హిందూ ఆధిపత్య సాంస్కృతిక భావజాలానికి అతికినట్టుగా సరిపోతుంది. కాబట్టి ఈ చర్య ఒక్క రోజులో ఆగిపోయింది. నిర్మాత, దర్శకుడు కూడా నోర్మూసుకుని పడున్నారు.

కబీర్ కళా మంచ్ గాయనీ గాయకులను అరెస్టులు చేసి జైల్లో పారేయడం.. రాజద్రోహ నేరం మోపడం, వారి ప్రదర్శనలపై అధికారిక నిషేధం విధించడం, వారు ప్రదర్శన చేసిన చోటల్లా మూకలతో భౌతిక దాడికి దిగడం వంటి వాటితో పాడే వాళ్ల గొంతు నొక్కుతున్న శివసేన భాజపా వారు అస్సాంలో అకస్మాత్తుగా పాడేవారి హక్కుల్ని కాపాడ్డానికి ముందుకురికారు. తమిళనాడులో మద్యంపై పాట రాసిన గాయకుడిని రాజద్రోహ నేరంపై జైలుకు పంపినా మాట్లాడని వాళ్లు ఇవ్వాళ గాయకుల స్వేచ్ఛ గురించి వాపోతున్నారు.

బహుశా వీరు 'ఇండియన్ ఐడల్' టివి పోటీల్లోనే చేరి ఉంటే వీరికీ కష్టాలు ఉండేవి కాదు. ఎంత ప్రతిభ అని మురిసిపోయి పట్టం గట్టేవారు. కాని ప్రజల కోసం ప్రజల మధ్య పాటకు పదును పెట్టడానికి అంకితం కావడం వంటి భయంకర నేరం ఈ గాయకులు చేశారు. వ్యక్తిగత ప్రమోషన్ జీవితాశయంగా మారిపోతున్న సృజన రంగంలో వాళ్లు కనీసం గుర్తింపుని కూడా ఆశించడం లేదు. ఎంత వెనకబాటుతనం.. కాబట్టే హిందూత్వమైన డిజిటల్ యుగం వీరిని శిక్షించింది.

వీరికి అద్దంలో ప్రతిబింబాలు మౌల్వీలు.. వారికీ ఏదో ఒక నియంత్రణ విధించే అవకాశం రావాలిగా! రానే వచ్చింది. ఫత్వా జారీ చేశారు. ఫత్వాపై హిందూత్వ జూలు విదిలించింది. దాంతో భయపడ్డ మైనారిటీలు మరింతగా మతకట్టుబాట్ల నీడలోకి రక్షణ కోసం చేరతారు. మేము తప్ప సాంస్కృతిక మూకలేవీ బజార్లకెక్కే దౌర్జన్యం చేయరాదని హిందూ మందలు తమ కండబలపు గుత్తాధిపత్యాన్ని స్థిరీకరించు కుంటాయి. అటు మౌల్వీలు ఇటు హిందూత్వ రెండు ప్రయోజనాలు ఒకే దెబ్బతో నెరవేరతాయి.

ఈ ఫత్వాలతో స్ఫూర్తి పొందిన మూఢుడు క్రూరుడెవడైనా ఆ గాయని నోరు శాశ్వతంగా మూయిస్తే అపుడు మైనారిటీలపై దాడిచేసే నైతిక హక్కు లభిస్తుంది. నరేంద్ర దబోల్కర్, గోవింద పన్సారే, కల్‌బుర్గి... వంటి వారి హత్యలను ప్రశ్నించిన వారందరికీ ఈ హత్యతో జవాబు చెప్పవచ్చు.

అయితే హిందూత్వకున్న మందబలం, వనరులు, మీడియా మద్దతు అన్నింటి కంటే ముఖ్యంగా రాజ్యాధికారపు మద్దతు పాపం ఈ మైనారిటీ ఛాందసులకు లేకపోవడం వలన వారు భారీ ఎత్తున ప్రత్యక్షదాడులు చేయలేక పోతున్నారు. ఛాందసత్వానికి ప్రభుత్వ సహకారం ఉండేట్లయితే సమానత్వ సూత్రం ప్రకారం మా ఫత్వాలకు కూడా రాజ్యం మద్దతు ఇవ్వాలి గదా అని వాళ్లు వాపోతున్నారు.

కాని ప్రభుత్వం రంగంలోకి దిగడం ద్వారా జరిగేది అదే... మైనారిటీలు మరింతగా మెజారిటీ నుండి దూరం అవుతుంటారు. దూరం పెరిగే కొద్దీ వారిని శత్రువులుగా, ప్రమాదకారులుగా చిత్రించి అణిచి ఉంచడం తేలిక. అణిచివేత పెరిగేకొద్ది హక్కుల కోసం పెనుగులాట తీవ్రవాదంగానో, ఉగ్రవాదంగానో చూపించి మరింత తొక్కేయవచ్చు. ఈ ఆధిపత్యం స్థిరపడేకొద్దీ భీతిల్లిన మైనారిటీలు మత పెద్దల్ని మరింతగా ఆశ్రయిస్తారు.

మెజారిటీ ప్రజల (మందస్వామ్యంతో) రక్షకులుగా హిందూత్వం, మైనారిటీ ప్రజలకు దిక్కుగా ఆయా మత పెద్దలు బలమైన పట్టు సాధిస్తారు. రెండు తరగతులు ఒకరిపై ఒకరు అనుమానాలు పెంచుకుని నిరంతర ఉద్రిక్త వాతావరణంలో ఉంటారు. ఈ రకం అయిన వాతావరణం రెచ్చిపోయిన మూకల బలంతో నడిచే మత రాజకీయాలకు చక్కటి ఆవాసం.

కాబట్టి సాంస్కృతిక నిషేధాలు.. మూకల దౌర్జన్యపు దాడులు నిజానికి ప్రభుత్వాల లొసుగుల్ని, డొల్లతనాన్ని, వారి అక్రమాల్ని కాపాడే ముసుగులు.. ప్రభుత్వాలకు, ఆధిపత్య వర్గాలకు గల పునాదిలేని వారి భావజాలం ప్రశ్నకు నిలబడదనే విపరీతం అయిన భయమే ఈ దాడులకు మూలం. ఛాందసత్వానికి చాంధసత్వం జవాబు కాదు. ఒక ఆధిపత్య ప్రయోజనం మరో ఆధిపత్యపు పట్టును బిగిస్తుంది తప్ప సడలించదు. పైన జరిగిన రెండు నిషేధాలూ ఒకే నాణానికి రెండు కోణాలు.

*(రచయిత సాంస్కృతిక కార్యకర్త)* వీ

# దేవతలకు మొక్కులు - లౌకిక పాలన

***ప్రజా చైతన్యంతో ఉద్యమించి సాధించుకున్న తెలంగాణలో యాగాలు, మొక్కుబడులతో పాలకులు ప్రజల చైతన్యాన్ని, త్యాగాలను మరుగుపరుస్తున్నారనీ, ఇది రాజ్యాంగ లౌకిక స్ఫూర్తికి విరుద్ధమనీ అంటున్నారు* గొడితాల వెంకటేశ్వర్లు**

ప్రపంచానికి పోరాట పాఠాలు నేర్పిన జాతి చైతన్యాన్ని నిలువునా నీరుగార్చే కౌటిల్యం ఒకటి వేళ్లూనుకోవడం గురించి తెలంగాణ సమాజం చర్చించుకోవాల్సిన చారిత్రక సందర్భం ఏర్పడింది. చైతన్యం అనేది ఒక జీవధార. ప్రత్యేకంగా అది తెలంగాణ ప్రజల రక్తంలోనే ఉంది. మూడు తరాల పోరాట వారసత్వంలో నిరంతరంగా ప్రవహించిన ధార మహోజ్వలంగా ఉప్పొంగి తమ కల సాకారం చేసుకున్నదాకా సాగి ఆగింది. ఇప్పుడది నివురుగప్పిన నిప్పు.

ఏ చైతన్యమైతే కుల, మత, వర్గ వైషమ్యాలను పక్కనపెట్టి ఏకరూపమై నిలబడి కలబడిందో, ఏ జాతి చైతన్యమైతే నిరంకుశ వలస పాలనపై అంకుశమై అవతరించి అధఃపాతాళానికి తొక్కి నిలబడిందో ఆ జాతి ఐక్యతా రాగమై, తమ అస్తిత్వ పోరాటానికి ఒకింత ఆలంబనగా నిలబడిన విశ్వాసానికి తెరాసను అధికార పీఠమెక్కించింది. అందలమెక్కిన ఏలికలు ఇప్పుడు సబ్బండ వర్ణాల సమైక్యతపై సునిశితంగా ఆలోచించడం మొదలు పెట్టారు. అధికార పీఠం కాలం దగ్గర పడుతున్న కొద్దీ ఆ ఆలోచనలకు మరింత పదును పెట్టడం మొదలయింది. సకల జనుల సమైక్యతా ఫలితమే అధికారమైతే అదే సమైక్యత మరే సమూహానికైనా అధికారాన్ని కట్టబెట్టగలదని గ్రహించిన పాలకులు, ఐక్యతను దెబ్బగొట్టే వ్యూహ రచనకు తెరతీశారు. ఇంకెంతో కాలం సెంటిమెంట్‌తో కాలం గడపలేమన్న సత్యాన్ని అర్థం చేసుకున్న అధినాయకత్వం రాష్ట్రావతరణ లక్ష్యసిద్ధిలో సబ్బండ వర్ణాల పాత్రను నామమాత్రం చేసి అమర వీరుల త్యాగాలను, బలిదానాలను మరుగుపరిచి కొందరి వ్యక్తుల పలుకుబడి వల్లనో, లేదా దేవుళ్ల మొక్కుబడి వల్లనో సిద్ధించినట్లు ప్రజా చైతన్యాన్ని, అమరుల పోరాటాన్ని తక్కువ చేసి చూపే ప్రయత్నానికి ఒడిగట్టారు. ఈ దశలో ప్రజా చైతన్యం నిద్రపోతే తెలంగాణ చరిత్రలో అతిపెద్ద చారిత్రక తప్పిదంగా మిగిలిపోతుంది.

**ఏం జరుగుతుంది?**

నిజానికి మూడు తరాల పోరాట ఫలితాన్ని, అమరుల త్యాగాల ఫలితాన్ని రాష్ట్రం అవతరించిన తొలినాళ్లలోనే కించపరిచే ప్రయత్నం జరిగింది. రాష్ట్రం సిద్ధించగానే సరాసరి ఢిల్లీకి వెళ్లి సోనియాగాంధీ పాదాల దగ్గర ఫలితాన్నుంచి 'మీ దయా దాక్షిణ్యాల పైననే, మీరు తలచుకుంటేనే రాష్ట్రం సిద్ధించిందని' అందుకు కృతజ్ఞతలు చెప్పుకొని రావడం జరిగింది. ఈ చర్య అమరుల ఆత్మక్షోభకు దారి తీస్తుందని, తెలంగాణ పౌర సమాజం మృత వీరుల కుటుంబ సమాజంతో పాటు సొంతింటి నాయకులు కూడా గొంతెత్తడంతో మళ్లీ మళ్లీ ప్రకటించడానికి సాహసం చేయలేకపోయారు. తెలంగాణ బిడ్డల బలిదానాలకు కాంగ్రెస్ నిర్లక్ష్య ధోరణి కారణమన్న సంగతి ప్రజలు మరిచిపోలేదన్న సంగతి గ్రహించి వెంటనే మాట మార్చారు. వీరుల త్యాగాన్ని పలుచన చేస్తున్నారన్న అభిప్రాయం మొగ్గతొడగగానే, తెలంగాణ అమర వీరుల త్యాగ ఫలితమేనని, మనందరి పోరాట ఫలితమే రాష్ట్రం సిద్ధించిందని చెప్పుకోవడం ప్రారంభించారు. ఐతే ఇలా చెప్పుకుంటూ పోతే మన మనుగడ ఎక్కడ ప్రశ్నార్థకమవుతుందోనని ఉమ్మడి ఫలితాన్ని సొంతం చేసుకునే ప్రయత్నం చేశారు. అదేమిటంటే కెసిఆర్ నిరాహార దీక్ష చేయడం వల్లనే అనే వాయిస్‌ను ప్రచారంలో పెట్టారు. ప్రాణత్యాగానికి సిద్ధపడి రాష్ట్రాన్ని సాధించుకున్నామని, రాష్ట్ర పునర్నిర్మాణం అంతా నా బాధ్యతేనని తన ప్రతిష్టను పలుసార్లు సభలోపల, వెలుపల చెప్పుకోవడం ఆరంభించారు. ఈ సమయంలో కేవలం కెసిఆర్ ప్రాణత్యాగానికి మాత్రమే సిద్ధపడ్డారని, ఎంతో మంది విద్యార్థులు తమ ప్రాణాలను ఉద్యమ దీపానికి చమురుగా సమర్పించారని, కెసిఆర్ నిరాహారదీక్ష ఉద్యమంలో ఒక భాగం మాత్రమేనని, సింహభాగం అమరుల త్యాగమని ఒకవైపు పౌర సమాజం, మరోవైపు ప్రతిపక్షాలు ప్రవచించడం, పునర్నిర్మాణ ప్రగతిలో మేం కూడా భాగస్వాములమవుతామంటే సహించే స్థితిలో లేరు. ఇట్లా పలు దశలలో, ప్రజల్లో చైతన్యపు చేవ ఇంకా చావలేదని మరో సెంటిమెంట్‌తో మరుగు పరిచే ప్రయత్నం మొదలు పెట్టారు. అదే ఆధ్యాత్మిక భావన.

**యజ్ఞ యాగాలు - వాస్తు శిల్పాలు**

తెలంగాణ భాష, సంస్కృతీ కుదురులోకి చొరబడ్డ కెసిఆర్ ప్రజల నాడిని పట్టుకున్నారు. నూటికి 80 శాతం నిరక్షరాస్యులైన వివిధ కులాల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకోవడం ప్రారంభించారు. మిగిలిన 20 శాతం మేధావుల, విద్యావంతుల చైతన్యంపై అమాయకుల అమాయకత్వపు మెజారిటీతో పైచేయి సాధించాలనుకున్నారు. అందుకే కనీవిని ఎరుగని రీతిలో వేలాది మంది బ్రాహ్మణులతో, కోట్ల రూపాయల ఖర్చుతో ప్రభుత్వ యంత్రాంగాన్ని ఒక మత ఆచార సంప్రదాయాలకు అనుగుణంగా వాడుకొని ఆయుత చండీయాగం చేశాడు. ఈ యాగం కేవలం తన వ్యక్తిగత ప్రతిష్టను పెంచవచ్చు గాని, రాష్ట్ర ప్రయోజనాలకు ఏమాత్రం ఉపయోగపడేది కాదు. ప్రజలను శాస్త్రీయ ఆలోచనల వైపు, సాంకేతిక విప్లవం వైపు పయనింపచేయాల్సింది పోయి, మూఢ నమ్మకాలకు, బ్రాహ్మణీయ భావజాల వ్యాప్తికి పురికొల్పడం ప్రజలను మూఢ విశ్వాసాల్లోకి నెట్టడం తప్ప మరొకటి కాదు. పైగా ఈ క్రతువులో మరొక అజ్ఞాత సత్యం దాగి ఉంది. అప్పటి వరకు ప్రజల చైతన్యం గురించి, వీరుల బలిదానాల గురించి చర్చించుకునే పౌర సమాజం ఈ

ఆధ్యాత్మిక గందరగోళం గురించి చర్చించుకునేలా చేయడం, కెసిఆర్ కేంద్రంగా రాష్ట్రంలో చర్చ జరిగేలా చేయడం. అంతేగాక యజ్ఞ యాగాలు ప్రజల కోసమే చేసినట్లు, వర్షాలు కూడా యాగాల వల్లనే కురుస్తాయనే భ్రమను ఆ 80 శాతం ప్రజల్లో కలిగించేలా తన సహచర వర్గంతో ప్రచారం చేసుకోవడం కూడా దాగి ఉంది. అనుకున్నట్లు గానే చర్చ ఆ దిశగా సాగింది. దాంతో అమాయక ప్రజలను కులాలుగా వర్గీకరించడం, అట్టడుగు కులాలుగా కూడా మరొకటి కాయించడం, వారికి ప్రత్యేక నిధులు, పాఠశాలల సౌకర్యం పేరుతో తాత్కాలిక తాయిలాల పాచికలు విసరడం మొదలు పెట్టారు. ప్రజలను అందునా అమాయక జనాన్ని తాత్కాలిక ఆనందంలో ముంచెత్తి తాము మాత్రం దీర్ఘకాలిక ప్రయోజనాలు పొందడానికి మార్గం సుగమం చేసుకోవడంలో వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి కాలాన్ని తలపిస్తోంది. అంతేగాక వాస్తు పేరుతో వాహనాల దగ్గర నుండి నివాసం ఉండే ఇంటిదాకా అంతా పునర్నిర్మాణమే అనుకోవడం మరో విచిత్రం. బుల్లెట్ ప్రూఫ్‌తో నిర్మించిన అధికార నివాసానికి కోట్ల రూపాయలు ఖర్చు చేయడం ఏ ప్రగతికి, ప్రగతిశీల భావాలకు తార్కాణమో అధినాయకులకే తెలియాలి. యజ్ఞ యాగాలు రాష్ట్ర సంక్షేమం కోసమేనన్న నాయకులకు యజ్ఞ రక్షణ, వాస్తు పురుషులుండగా ఈ బుల్లెట్ ప్రూఫ్ రక్షణ ఎందుకో? మొత్తంగా చైతన్యం నిండిన రాష్ట్రాన్ని, ఐక్యతకు మారుపేరుగా నిలిచిన రాష్ట్రాన్ని తారుమారు చేసేందుకు విఫల ప్రయత్నం జరుగుతోంది.

**లౌకిక తత్వానికి తూట్లు**

యజ్ఞ యాగాల పేరుతో ప్రజలను భ్రమల్లో ముంచెత్తడమే గాక, రాజ్యాంగాన్ని సైతం లెక్కచేయకుండా ఒక రాష్ట్రానికి రాజ్యాంగబద్ధ పదవిలో ఉండి యథేచ్ఛగా ఒక్క మత సంప్రదాయాలకు మాత్రమే కట్టుబడినట్లు వ్యవహరించడం రాజ్యాంగ విరుద్ధం. ఈ దేశంలో ఉన్నది రాచరిక పాలన కాదు. ఫక్తు ప్రజాస్వామ్య వ్యవస్థ. ఈ వ్యవస్థ పటిష్టతకు మనకో గొప్ప రాజ్యాంగం ఉంది. దాన్ని అనుసరించే పాలకులు నడుచుకోవాల్సి ఉంది. రాజ్యాంగంలోని లౌకిక భావన ఏం చెపుతుందో చూద్దాం.

1976లో 42వ రాజ్యాంగ సవరణ ద్వారా రాజ్యాంగ ప్రస్తావనలో 'లౌకిక రాజ్యం' అను పదం చొప్పించబడిన తర్వాత, రాజ్యాంగంలోని 25 నుండి 28 వరకు గల ఆర్టికల్స్‌లో అంతరాత్మననుసరించి స్వాతంత్ర్యం, స్వేచ్ఛాయుత మతావలంబన, ఆచరణ ప్రచారాల స్వేచ్ఛకు హామి ఇవ్వబడింది. ప్రభుత్వం అన్ని మతాల పట్ల తటస్థతను, నిష్పాక్షికతను చూపాల్సి ఉంది. అదే విధంగా లౌకిక రాజ్యం (ప్రభుత్వం) మనిషికి మనిషికి మధ్యగల సంబంధాలను చూస్తుందే గాని, మనిషికి భగవంతునికి మధ్యగల సంబంధాన్ని పట్టించుకోదు. ఈ లౌకిక భావన గురించి సుప్రీంకోర్టు సెయింట్ జెవిఅర్ కాలేజ్ వర్సెస్ స్టేట్ ఆఫ్ గుజరాత్ (ఏఐఆర్ 1974 ఎస్‌సి 1389) కేసులో 'రాజ్యం లౌకిక స్వభావంతో ఎట్టి నాస్తికత లేదు. లౌకికత్వం అంటే భగవంతునిపై ద్వేషం గాని, భగవంతుని పట్ల అనుకూలత చూపని స్వభావం. ఇది భక్తుని, భగవంతుని పట్ల వైరం గల వ్యక్తిని ఒకే విధంగా చూస్తుంది. ఇది ప్రభుత్వ వ్యవహారాల నుండి భగవంతుని విషయాలను మినహాయించింది. ఏ వ్యక్తిని గాని అతను అవలంబిస్తున్న మతం కారణంగా అతని పట్ల వివక్ష చూపరాదు' అని చెప్పింది. పైగా ఆర్టికల్ 25 క్లాజ్ (1)లో స్వేచ్ఛగా మతావలంబనకు, ఆచరణకు వ్యక్తులందరికి సమాన హక్కు ఉందని, అయితే అది రాజ్యాంగంలోని 3వ భాగంలో గల ప్రజాశాంతి, నైతిక ఆరోగ్యమునకు ఇతర నిబంధనలకు లోబడి ఉంటుందని చెప్పింది. ఆర్టికల్ 25 (2) ఎ. రాజ్యం (ప్రభుత్వం) మతాచరణలో సంబంధమున్న ఏదేని ఆర్థిక, విత్తీయ, రాజకీయ లేదా ఇతర లౌకిక కార్యకలాపాలను క్రమబద్ధీకరిస్తూ పరిమిత పరుస్తూ ఒక చట్టాన్ని తీసుకొచ్చే అధికారం ఉంటుందని కూడా పేర్కొంది.

పై రాజ్యాంగ వివరణలను, సుప్రీంకోర్టు వ్యాఖ్యానాలను పరిశీలిస్తే వ్యక్తిగా ఎవరైనా తన నమ్మకాలను, ఆచరణను స్వేచ్ఛగా నిర్వహించు కోవచ్చు. అదే ప్రభుత్వం లౌకిక భావనకు కట్టుబడి ఉండాలన్న వాస్తవం అవగతమవుతుంది. ఈ నేపథ్యంలో ఇటీవల రాష్ట్ర ముఖ్యమంత్రి హోదాలో అంటే ప్రభుత్వం లౌకిక భావనకి తూట్లు పొడిచి యథేచ్ఛగా రాజ్యాంగ ఉల్లంఘన జరిగినట్లు స్పష్టమవుతుంది. ఈ క్రమంలో వ్యక్తిగా మొక్కుల చెల్లింపులకు, దైవ దర్శన యాత్రలకు ఎవరికీ అభ్యంతరం ఉండవలసిన అవసరం లేదు. ప్రభుత్వాధినేతగా, ప్రభుత్వ పరంగా ఒక మతానికి ప్రతినిధిగా ఉన్న దైవంపై అనుకూలత స్వభావమే అభ్యంతరకరం. ఇది రాజ్యం లౌకిక స్వభావానికి విరుద్ధం.

కాగా 2010లో ఉద్యమ కాలంలో తిరుపతికి వెళ్లిన చంద్రశేఖరరావు తన ఆకాంక్ష (రాష్ట్ర సిద్ధి కావచ్చు, సిద్ధించిన రాష్ట్రానికి తాను ముఖ్యమంత్రి కావాలనే కోరిక కావచ్చు) నెరవేరాలని వ్యక్తిగతంగా మొక్కి ఉండవచ్చు. అలాగే తెలంగాణ ప్రాంతంలోని, భద్రకాళి, కొరివి వీరన్న, ఆంధ్రలోని కనకదుర్గ, పద్మావతి అమ్మవార్లకు మొక్కి ఉండవచ్చు. నిజానికి రాష్ట్రం సిద్ధించి ముఖ్యమంత్రి అయిన తర్వాత తొలి రోజుల్లోనే వ్యక్తిగతంగా వెళ్లి తన స్వీయ ఖర్చులతో కానుకలు సమర్పించి వస్తే ఎవరైనా హర్షించేవారేమో. అంతేగాని కుటుంబ సపరివార సమేతంగా ఎంపిలు, ఎంఎల్ఏలు, ఎంఎల్‌సిలు, మంత్రులు అధికార గణంతో రెండు విమానాల్లో వెళ్లి పద్మావతి దేవికి 47 గ్రాముల బంగారు ముక్కు పుడక, 19.72 కిలోల స్వర్ణాభరణాలు తిరుపతి వెంకన్నకు, విజయవాడ కనకదుర్గకు 75 వేల బంగారు ముక్కు పుడక సమర్పించుకొని వచ్చారు. ప్రభుత్వం ఇందుకోసం రాజ్యాంగంలోని 25 (2)ఎ నిబంధనను కావచ్చు మరొకటి కావచ్చు వినియోగించుకొని 2015 ఫిబ్రవరి 24న జిఒ 22, 23 తీసి ఆంధ్ర దేవతలకు 5 కోట్ల 90 లక్షల రూపాయలు అప్పనంగా సమర్పించింది. పనిలో పనిగా తెలంగాణలోని భద్రకాళి అమ్మవారికి 57 లక్షలు, కొరవి వీరభద్రుని మీసాలకు 75 వేల బంగారంతో మొత్తం కలిపి 57 లక్షల 75 వేలు ఖర్చు పెట్టి మొక్కు చెల్లించుకున్నారు. మరి ప్రభుత్వం అంటే ప్రజలే కదా! ఉద్యమ కాలంలో ప్రజలు స్థానిక దేవతలకు ఎన్ని మొక్కులు మొక్కి ఉంటారు. ఈ లెక్కన మన నల్లపోచమ్మకు, మహంకాళి ముత్యాలమ్మకు, గండి మైసమ్మకు, వేములవాడ రాజన్నకు, యాదాద్రి యాదన్నకు ప్రజల పక్షాన ఆ దేవతలందరికి ఎన్ని కోట్లు, ఎంత బంగారం సమర్పించాలి. ఆ పని చేస్తుందా ప్రభుత్వం?

నిజానికి రాష్ట్ర ఏర్పాటుకు, దేవునికి ఏంటి సంబంధం? కావాలని కోరుకున్నవారు ఎందరో, వద్దని కోరుకున్నవారు అంతే మంది ఉన్నారు. దేవుడు రాష్ట్ర ఏర్పాటుకు సహకరించాడంటే అవతలి వారికి అన్యాయం చేసినట్లే గదా! అందరిని సమానంగా చల్లగా చూస్తాడనుకున్న దేవుడు కొందరి కొమ్ముకాస్తాడనుకోవడం అవివేకం కాదా!

సరిగ్గా రెండున్నరేళ్ల తర్వాత ఈ మొక్కుబడుల పర్వానికి తెర

# ఎవరు దేశ ద్రోహులు?

***ప్రజాస్వామిక భావాలు ప్రకటించడం కూడా దేశద్రోహంగా పరిగణించి, ప్రజాస్వామిక స్వేచ్ఛపై ఆంక్షలు, నిర్బంధాలు అమలవుతున్న నేటి ప్రమాదకర పరిస్థితుల్లో ప్రజలందరూ చైతన్యంతో, ఐక్యంగా ఉద్యమించాలని అంటున్నారు బి. రామకృష్ణ***

"**నా** పేరు గుర్ మెహర్ కౌర్. మాది జలంధర్. పాకిస్తాన్ అన్నా, పాకిస్తానీయులన్నా ద్వేషించేదాన్ని. వాళ్లు 1999లో మా నాన్నను కార్గిల్ యుద్ధంలో చంపారు. అప్పుడు నా వయసు రెండేళ్లు. ముస్లింలను ద్వేషించాను. ముస్లింలందరూ పాకిస్తానీయులే. నా ఆరేళ్ల వయస్సులో బురఖా వేసుకున్నామెను కత్తితో పొడవబోయాను. ఆమె మా నాన్న చావుకు కారణం అని అనుకున్నాను. నాన్నను యుద్ధం చంపిందని, పాకిస్తాన్ కాదని అమ్మ అర్థం చేయించింది. ద్వేషం సరైంది కాదని నేర్చుకున్నాను. ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య శాంతి కోసం పోరాడుతాను. ఎందుకంటే వీటిమధ్య యుద్ధం లేకపోతే మానాన్న చనిపోయేవాడుకాదు.

ఈ రెండు ప్రభుత్వాలు తమ కపటత్వాలను ఆపి సమస్యను పరిష్కరించాలి. ఫ్రాన్స్, జర్మనీ అలాగే జపాన్, అమెరికాలు కలిసిపోయాయి కదా. మరి మనమెందుకు కలవొద్దు? అధిక సంఖ్యలో భారత, పాకిస్తానీయులు శాంతిని కోరుతున్నారు. యుద్ధాన్ని కాదు. రెండు దేశాధినేతల శక్తి సామర్థ్యాలను ప్రశ్నిస్తున్నాను. పరస్పరం చర్చించి పరిష్కరించండి. రాజ్య ప్రేరేపిత తీవ్రవాదం, గూఢచర్యం, విద్వేషం చాలు. రెండు దేశాల సరిహద్దుల్లో ప్రజలు చనిపోయింది చాలు. ఇక చాలంటే చాలు. తండ్రిని పోగొట్టుకున్న గుర్‌మెహర్ కౌర్‌లు లేని ప్రపంచంలో జీవించాలని అనుకుంటున్నాను" అని 20 ఏళ్ల ఢిల్లీ విశ్వ విద్యాలయ విద్యార్థిని గుర్ మెహర్ కౌర్ 2016 ఏప్రిల్‌లో ఫేస్‌బుక్‌పై ప్లకార్డులు చూపుతున్న ఒక నిశ్శబ్ద వీడియోను పోస్ట్ చేసింది.

కేంద్రమంత్రులు కొందరికి ఇది అసహనాన్ని కలిగించింది. ఆమె దేశానికి వ్యతిరేకంగా మాట్లాడుతున్నదని, ఆమె ప్లకార్డుకు రాజకీయ వాసనలు పులుముకున్నాయని, ఆమె మనసును ఎవరో కలుషితం చేశారని తమ అక్కసును వెళ్లగక్కారు. విద్వేషపూరిత విషాలను చిమ్ముతూ రాజకీయాధికారం వెలగబెడుతున్న వారికి గుమ్మడి కాయల దొంగ నానుడి గుర్తుకు రాకుండా ఉంటుందా?

ప్రజల్లో పాకిస్తాన్ పట్ల, పాకిస్తానీయుల పట్ల, ఇతర మతస్తుల పట్ల విద్వేషాలను రెచ్చగొడుతున్న సత్యం చెప్పబడే సరికి సంఘ్ పరివార్ దాని రాజకీయ, విద్యార్థి, తదితర అన్ని విభాగాల వారు జాతి వ్యతిరేకత, దేశ ద్రోహం అనే ఆయుధాలను బయటకు తీస్తున్నారు. దొంగే దొంగా! దొంగా! అన్నట్లున్నది వీరి వ్యవహారం.

దేశాభిమానం, దేశభక్తి అంటే దేశంలోని ప్రజలందరికి దేశ సంపదలపై సమాన హక్కులుండడం కోసం తపించడం కాదా? ప్రజలందరి ఆత్మగౌరవం రక్షించబడడం, సామాజిక గౌరవం, భద్రత, విద్య, ఉపాధి, ఉద్యోగాలు, సమానత్వం, సాధించడానికి అవసరమైన పోరాటాల్లో భాగస్వాములవ్వడం కాదా? కొందరు కార్పొరేట్లు,

---

తీయడంలోని అసలు ఆంతర్యం ఏమిటి? మరొకసారి తన వ్యక్తిగత ప్రతిష్టపై చర్చ జరిగేలా చూడడమే ప్రధానాంశం. అమరుల త్యాగాలను మొక్కుబడుల కింద నొక్కచూడడం, అమర వీరుల త్యాగ ఫలితాన్ని, ప్రజా పోరాట చైతన్య ఫలాన్ని దేవుని ఖాతాలో వేయడం, తెలంగాణ ప్రజల చైతన్యాన్ని రూపుమాపాలనుకోవడమే తప్ప మరొకటి కాదు. నిజానికి దేవుడే రాష్ట్రం ఇచ్చాడనుకుంటే వందల ప్రాణాల్ని బలిగొన్న దేవున్ని ఉద్యమంలో 'రాతి బొమ్మల్లోన కొలువైన శివుడా రక్తబంధం విలువ నీకు తెలియదురా' అంటూ నిందించినట్లు తిరుపతి వెంకన్నను కూడా నిందించకుండా ఉండగలమా?

ఏది ఏమైనా రాజ్యాంగ స్ఫూర్తికి భిన్నంగా కోట్లు కుమ్మరించి మొక్కుబడులు చెల్లించడం ప్రజాస్వామ్య ప్రభుత్వానికి తగదు. అంతేగాక లౌకికతత్వానికి చెల్లుచీటి రాసినట్లే. రాష్ట్రంలోని దేవాలయాల పునరుద్ధరణకు, సంస్కరణకు, నిత్య నైవేద్యాలకు, అర్చకులకు ఉపయోగించాల్సిన కామన్ గుడ్ ఫండ్ (సిజిఎఫ్) నుండి కోట్ల రూపాయాలు తమ మొక్కులు చెల్లించడానికి వాడుకోవడం, ఒక రాష్ట్ర ప్రభుత్వమే స్వయంగా ఇటువంటి పనికి పూనుకోవడం లౌకిక భారతావనిలో ఇదే ప్రథమం.

బహుశా మాటలు నేర్చిన ఏలికలు తమ లౌకిక వాదాన్ని ఇట్లా సమర్థించుకోవచ్చు. మసీదుల్లో కుర్తా పైజామాలు, ఇఫ్తార్ విందులు, చర్చీల్లో కొత్త బట్టలు, పండగ సామాన్లు, దేవాలయాల్లో ముత్యాల తలంబ్రాలు సమర్పించి మేం లౌకిక వాదులం అని చెప్పుకోవచ్చు. కాని ఆ ముసుగులో ఏకదాటిపై నిలిచిన తెలంగాణ సమాజాన్ని నిట్టనిలువున క్రమంగా మతాలుగా, కులాలుగా, వర్గాలుగా విభజించి ఏలుబడికి వీలునామా రాసుకుంటున్నారు. ప్రజా పోరాటాల వారసత్వానికి, ప్రజాస్వామ్య విలువలకు పాతరేసే పనికి పూనుకున్నారు. వ్యక్తి పూజకు ప్రాధాన్యమిస్తూ విలువలకు తిలోదకాలిస్తున్నారు. అయితే ఆత్మీయతతో అక్కున చేర్చుకునే తెలంగాణ ప్రజలు నివురుగప్పిన నిప్పు రవ్వలా నిరంతర చైతన్యజ్వాలై ప్రజ్వరిల్లుతూనే ఉంటారు.

నిజంగా అమరుల పట్ల చిత్తశుద్ధి ఉంటే వారినే దైవంగా భావిస్తే గనుక (భావించాలి కూడా) వేలాది మంది గర్భశోకానికి కారణమైన దేవునికిచ్చే కానుకలకన్నా, తెలంగాణ తల్లి కన్నబిడ్డల ఆత్మశాంతికి స్మృతి చిహ్నంగా ఆ కోట్లాది రూపాయలతో నియోజకవర్గానికొక్క నిలువెత్తు అమర వీరుల స్థూపాన్ని నిర్మిస్తే ప్రజలు నీరాజనం పడ్తారేమో!

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

పెట్టుబడిదారులు, భూస్వామ్య, ఆధిపత్య వర్గాల ప్రయోజనాలు కాకుండా ప్రజలందరి ప్రయోజనాలు నెరవేర్చడానికి, కృషి చేయడం కాదా? సకల సంపదలున్న ఈ దేశంలో దారిద్ర్యం ఎందుకున్నదో ప్రశ్నించడం కాదా? విద్య, వైద్యం అమ్మకపు సరుకు కాకుండా చూడడం కాదా?

అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ (ఎబివిపి) కు భయపడను, నేను ఒంటరిని కాదు అన్న ప్లకార్డు పట్టుకుని ఫేస్‌బుక్‌పై గుర్ మెహర్ కౌర్ ఫిబ్రవరి 2017లో పోస్ట్ చేసింది. దీనికి ప్రతిగా ఆమెను అత్యాచారం చేస్తామని, చంపేస్తామని బెదిరింపు మెయిల్స్ పెట్టారు. స్త్రీని పూజించే సంస్కృతి అని చెప్పే పరివార శక్తులు, అధికారంలో ఉన్నవారు ఈ బెదిరింపులపై వెంటనే స్పందించి దోషులను గుర్తించిన వార్త ఇప్పటికైతే రాలేదు. దీన్ని ఏమనాలి? తన అభిప్రాయాలను మౌనంగా వెల్లడించిన అమ్మాయిని ఇలా భయపెట్టడం అనేది ఏ స్త్రీలను గౌరవించడాన్ని సూచిస్తుంది? ఒకవేళ ఆ బెదిరింపుకు పాల్పడిన వారిని పట్టుకున్నా సరే ఈలోగా వారనుకున్న విషయాన్ని ఎలాగు చేరవేశారు. భీతావహ వాతావరణాన్ని ప్రేరేపించారు. ఇది చాలు వారికి.

2017 ఫిబ్రవరి 22న ఢిల్లీ యూనివర్సిటీ రాంజాస్ కాలేజిలో ఇంగ్లిష్ శాఖ సెమినార్ నిర్వహించ తలపెట్టారు. దానికి జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీ పరిశోధక విద్యార్థులైన ఉమర్ ఖలీద్, షెహ్లా రషీద్‌లను ఆహ్వానించారు. వీరు నిరసన సంస్కృతి (కల్చర్ ఆఫ్ ప్రొటెస్ట్) పై మాట్లాడాల్సి ఉంది. గత సంవత్సరం ఉమర్ ఖలీద్‌పై దేశద్రోహ నేరం కేసు మోపబడింది. అది నేటివరకు నిరూపించబడలేదు. అది కేవలం ఆరోపణ మాత్రమే. రాంజాస్ కాలేజీ పై దాడి చేసి ఆ సెమినార్‌ను ఎబివిపి వారు రద్దు చేయించారు. ఈ దాడికి నిరసనగా తరువాత రోజు ఊరేగింపుగా వెళ్లడానికి సమావేశమయిన విద్యార్థులు, అధ్యాపకులపై ఎబివిపి దాడి చేసింది. ఆ దాడిలో జర్నలిస్టులకు కూడా దెబ్బలు తగిలాయి.

దాడి జరుగుతున్నప్పుడు అక్కడే ఉన్న పోలీసులు ఏమి చేయలేకపోయారు. ఈ దాడికి సంబంధించి ఎబివిపి వారిపై ఎఫ్ఐఆర్ కూడా నమోదు చేయలేదు. కాని నిరసన తెలుపుతున్న వారిపై లాఠీఛార్జి జరిగింది. ఇదంతా రాజ్య ప్రేరేపిత చర్య కాకుంటే ఏమిటి? ఇది ప్రజలపై, ప్రజాస్వామ్యంపై దాడి కాకుండా పోతుందా? పాలకుల భావజాలానికి వ్యతిరేకంగా ప్రతిధ్వనించే ఏదైనా కూడా ఇవ్వాళ జాతి వ్యతిరేక చర్యగా చిత్రీకరిస్తున్నారు.

ఎంఎస్‌సి బయోటెక్నాలజి మొదటి సంవత్సరంలో చదువుతున్న నజీబ్ అహ్మద్ అనే జెఎన్‌యు విద్యార్థి 15 అక్టోబర్ 2016 నుండి కనిపించకుండా పోయాడు. 14 అక్టోబర్ 2016న నజీబ్ ఉంటున్న యూనివర్సిటీ హాస్టల్ రూమ్‌కు హాస్టల్ మెస్ ఎన్నికల్లో ఓట్ల గురించి ఎబివిపి వారు వచ్చినప్పుడు ఘర్షణ జరిగింది. అతనిపై వాళ్లు దాడి చేశారని సమాచారం. నజీబ్ ఆచూకి గురించి యూనివర్సిటీ అధికారులపై జెఎన్‌యు విద్యార్థులు వత్తిడి పెంచారు. ఒక దశలో యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్, ఇతర అధికారులను దాదాపుగా ఒక దినమంతా దిగ్బంధనం చేశారు.

నజీబ్ అదృశ్యమై ఐదు నెలలు కావస్తున్నప్పటికీ ఆ ఘటనలో అనుమానింపబడుతున్న సంఘ్ పరివార్ అనుబంధ విద్యార్థి విభాగం బాధ్యులపై ఎటువంటి చర్యలు తీసుకోలేదు. సరికదా నజీబ్ బంధువుల ఇళ్లపై ఢిల్లీ పోలీసులు రైడ్‌లు చేస్తున్నారు. నజీబ్ ఆచూకీపై కేంద్ర హోంమంత్రి రాజ్‌నాథ్ సింగ్ పోలీసులను ఆదేశించినట్లుగా వార్తలు వచ్చాయి. కాని అందుకు బాధ్యులుగా అనుమానింపబడుతున్న వారిపై ఏ చర్యలు లేకపోవడం వల్ల ఆ ఆదేశాలకు విలువలేకుండా పోయింది. తూతూ మంత్రంగా దర్యాప్తును చేయలేదన్నట్లుగా చేస్తుండడం కనిపిస్తున్నది.

అదే ఎబివిపి విద్యార్థి ఎవరైనా ఇలా మాయం చేయబడితే పరిస్థితి ఎలా ఉండేది? ఎంతమంది విద్యార్థులపై పోలీస్ మార్క్ హింసలుండేవి. కేసులు నమోదయ్యేవి. ఎంతమంది జైళ్లకు నెట్టివేయబడేవారో అర్థం చేసుకోవడం సులభమే. మోడీని వికాస పురుషుడుగా చెప్పుకుంటున్న బిజెపి వాళ్లను రోహిత్ వేముల, నజీబ్‌లు లేని వికాసం, వికాసం కాదని జెఎన్‌యు విద్యార్థులు నిలదీస్తున్నారు.

చెన్నై ఐఐటిలో అంబేద్కర్, పెరియార్‌ల భావజాలాన్ని చర్చించడాన్ని భరించలేని హిందూత్వశక్తులు అక్కడ అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్‌ను 2015లో నిషేధింపచేశాయి. కాని విద్యార్థుల పోరాటంతో అది నిలబడలేదు. పూణె ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో కూడా విద్యార్థుల ప్రజాస్వామిక భావాలపై దాడి చేశారు. దేశవ్యాప్తంగా అనేక విశ్వవిద్యాలయాల్లో ప్రజాస్వామిక స్వేచ్ఛలపై ఆంక్షలు, నిర్బంధాలు అమలవుతున్నాయి. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ (యుఓఎచ్)లో కుల వివక్ష కారణంగా గత సంవత్సరం రోహిత్ వేముల ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఆత్మహత్య వెనుక యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ అధికారులు, అలాగే వారిపై కేంద్ర మంత్రుల వత్తిళ్లు పనిచేశాయన్నది అక్కడి విద్యార్థిలోకం చెబుతున్న విషయమే.

2017 మార్చ్ 13న జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీలో ఎంఫిల్ చేస్తున్న విద్యార్థి ముత్తు కృష్ణన్ ఆత్మహత్య చేసుకున్న విషాద సంఘటన జరిగింది. ఈ ఆత్మహత్యకు ప్రత్యక్ష బాధ్యులెవరనే కంటే యూనివర్సిటీల్లో దళిత ఆదివాసీ మిగతా అట్టడుగువర్గాల విద్యార్థులపై పరోక్షంగా, ప్రత్యక్షంగా అమలయ్యే నిరాదరణ, నిరాకరణ, చిన్నచూపులను తెలుసుకోవలసి ఉంటుంది.

అట్టడుగు స్థాయి నుండి, సామాజిక, రాజకీయ, ఆర్థిక వివక్షతల నుండి అతికష్టం మీద ఎన్నో అడ్డంకులను ఎదుర్కొంటూ అన్ని రకాల కనీస వసతులకు, ప్రోత్సాహక వాతావరణాలకు దూరంగా ఉండి ఉన్నత చదువులను అందించే యూనివర్సిటీ స్థాయికి, ఆపై పరిశోధన స్థాయికి చేరుకోవడం మామూలు విషయమేమి కాదు. ఆంగ్ల భాషపై పట్టులేకపోవడం, దూరభారాల ప్రయాసలు, వారిని ప్రోత్సహించి, దారిచూపే వారి లోటు, ఆర్థిక వెసులుబాటు లేకపోవడం, ఇంటివద్ద తగిన చదువుల వాతావరణం కొరవడడం ఇలా ఎన్నో అడ్డంకులను అధిగమించడం అనేది ఎంతో శ్రమతో కూడుకున్నది. అలా డక్కామొక్కీలు తిని ఎదిగి వచ్చిన తరానికి విశ్వవిద్యాలయాల్లో గౌరవ ఆదరణలు లభించడం, ఆత్మస్థైర్యం నింపి భద్రతను ఇచ్చి ప్రోత్సహించే విద్యా వాతావరణం, భరోసానిచ్చే ఆత్మీయ చెలిమి, అధ్యాపకుల వాత్సల్యం, ఎంతో అవసరం. అవి లోపించడం వల్లే రోహిత్ వేముల, ముత్తు కృష్ణన్ లాంటి వారు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. అందుకే ఇవి వ్యవస్థాగత హత్యలు.

ఇటీవల కాలంలో యూనివర్సిటీల్లో జరిగిన దళిత విద్యార్థుల ఆత్మహత్యలు యూనివర్సిటీల్లో ఉండాల్సిన విద్యా వాతావరణాన్ని ఉండకూడని వివక్షలు, నిరాదరణలు, నిర్బంధాలను ఫోకస్ చేస్తున్నాయి. వ్యవస్థాగత వివక్షతలను రూపు మాపడం ద్వారా వీటిని నివారించవచ్చు. యూనివర్సిటీలు, విద్యాసంస్థల్లో ప్రత్యేకించి దళిత, ఆదివాసీ ఇతర

అట్టడుగు వర్గాల విద్యార్థులను అక్కున చేర్చుకొని వారి విద్యా వికాసం పురోగమించేలా దోహదపడే అన్ని రకాల అవకాశాలను కల్పించేందుకు కృషి జరగాల్సి ఉంది.

గత సంవత్సరంలో జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీలో అక్కడి విద్యార్థి సంఘ నాయకుడు కన్హయ్య కుమార్‌పై కుట్ర కేసు నమోదు చేయించారు. అతన్ని దేశద్రోహిగా, జాతి వ్యతిరేకిగా చిత్రీకరించి వేధింపులకు గురిచేశారు. ఒక దశలో సస్పెండ్ కూడా చేశారు. అలాగే ఉమర్ ఖలీద్‌పై కూడా తప్పుడు కేసులు మోపారు. ఇప్పటివరకు వారిపై మోపబడిన ఆరోపణలేవి రుజువుకాలేదు.

కాని బిజెపి ప్రభుత్వం, దాని విద్యార్థి విభాగం ఎబివిపి తదితర సంఘ్ పరివార్ శక్తులు వీరిపై విరుచుకుపడుతూనే ఉన్నారు. భారతమాతకి జై అని నినాదాలిచ్చే వాళ్లు కన్హయ్యకుమార్‌ను బెదిరించే క్రమంలో ఆయన తల్లిని తిడుతూ ఎస్ఎంఎస్ చేశారు. దానికి బదులుగా కన్హయ్యకుమార్ నా తల్లి, చెల్లి, ఆదివాసీ, దళిత మహిళలు భారతమాతలు కాదా అని స్పందించాడు.

కశ్మీర్‌లో జరుగుతున్న హక్కుల ధ్వంసంపై, బస్తర్‌లో ఆదివాసులపై భారత, చత్తీస్‌గడ్ ప్రభుత్వాలు చేస్తున్న చట్ట వ్యతిరేక, రాజ్యాంగ వ్యతిరేక చర్యలు సరైనవి కాదంటే చాలు వారినందరిని దేశ ద్రోహులుగా ప్రకటిస్తున్నారు. రాజ్యాంగాన్ని గౌరవిస్తామని దాని ప్రమాణంగా పదవులు చేపట్టిన వాళ్లే రాజ్యాంగాన్ని కాల రాస్తున్నప్పుడు ఎవరు దేశ వ్యతిరేకులో, చట్ట వ్యతిరేకులో మరి.

సెంట్రల్ యూనివర్సిటీ ఆఫ్ హర్యానాలో గత సంవత్సరం సెప్టెంబర్‌లో జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత మహాశ్వేతదేవి 1970లలో రాసిన బషాయిటుడు నవలికలోని 'ద్రౌపది' ఇతివృత్తం ఆధారంగా నాటిక వేశారు. అందులో ఆదివాసి మహిళపై సైనికుల అఘాయిత్య ఘట్టం ఉంటుంది. ఇది సైనికులను కించపరుస్తున్నదని ఈ ఘటనల్ని చూపడం దేశద్రోహం అని, ఆ నాటక నిర్వాహకులపై దేశద్రోహం కేసు పెట్టాలని ఎబివిపి డిమాండ్ చేసింది.

ఈశాన్య రాష్ట్రాల్లో మహిళలపై సైనిక దుశ్చర్యలను నిరసిస్తూ మణిపూర్‌లో 12 మంది మహిళలు 'మమ్మల్ని రేప్ చేయండి' అని బ్యానర్ పట్టుకుని పూర్తినగ్నంగా 2004లో చేసిన నిరసన ప్రదర్శన చరిత్రలో రికార్డ్ అయింది. ఇదెంత ఆవేదనాభరితమో మాటల్లో చెప్పడం చాలా కష్టం. కశ్మీర్‌లో ప్రభుత్వమే ఒప్పుకున్న విషయం 1989 నుండి మూడు వేలకు పైగా(3,744) కశ్మీరీలు అదృశ్య మయ్యారని, నిజానికి 8,000–10,000 ఉంటారని అక్కడి అసోసియేషన్ ఆఫ్ పేరెంట్స్ ఆఫ్ డిసప్పియర్డ్ పర్సన్స్ (ఎపిడిపి) చెబుతున్నది.

బస్తర్‌లో 16 మంది మహిళలపై లైంగిక అత్యాచారాలు జరిగాయని దీనికి భద్రత దళాలు కారణమని జాతీయ మానవహక్కుల కమిషన్ జనవరి 2017లో ఒక ఆర్డర్‌ను విడుదల చేసింది. ఇవన్నీ వర్తమాన నిజాలే కదా! ఈ నేపథ్యంలో ద్రౌపది నాటకంలో చూపిన ఘటన చిన్నదిగానే ఉంటుంది. దానిని దేశద్రోహంగా పరిగణించాలంటే ఈశాన్య రాష్ట్రాల్లో గాని, కశ్మీర్‌లో గాని, బస్తర్లో గాని రికార్డు అయిన సంఘటనలకు బాధ్యులైన వారిని ఏమనాలి?

ఫిబ్రవరి 2017లో జోధ్‌పూర్‌లోని జయనారాయణ్ వ్యాస్ యూనివర్సిటీ క్యాంపస్‌లో జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ (జెఎన్‌యు) ప్రొ. నివేదిత మీనన్ కశ్మీర్‌పై మాట్లాడినందుకు ఆమెపై జోధ్‌పూర్ యూనివర్సిటీ రిజిస్ట్రార్ పోలీస్ కంప్లైంట్ ఇచ్చాడు. ఆమె ఉపన్యాసాన్ని వ్యతిరేకిస్తూ ఆమెను జాతి వ్యతిరేకి (యాంటీ నేషనల్) అని ఎబివిపి నిరసనలు తెలిపింది. ఈ ఉపన్యాసాన్ని ఏర్పాటు చేసిన ఇంగ్లిష్ డిపార్ట్‌మెంట్‌లోని అసిస్టెంట్ ప్రొ. రాజశ్రీ రనావత్‌ను సస్పెండ్ చేశారు.

భారతదేశం ఇప్పుడున్న చిత్రపటంగా ఎప్పటి నుండి ఉందో చరిత్రలో కెళ్లి చూడాలి. బ్రిటిష్ పాలనకు పూర్వం నేటి భారత భూభాగం ఒకే రాజ్యాంగా ఉండిందా? ఒకే పాలన కింద ఉన్నదా? చిన్న చిన్న రాజ్యాలుగా, సంస్థానాలుగా ఉన్నాయా? ఎక్కడైనా ఒకే సంస్కృతి ఉన్నదా? ఇదొక భిన్న జాతుల, సంస్కృతుల, ప్రాంతాల, రాజ్యాల కలయిక. ఆ కలయిక బలవంతంగా జరిగిందా? స్వచ్ఛందంగా జరిగిందా? అనేది చరిత్ర పరిణామ కాల క్రమంలో ఏం జరిగిందో అధ్యయనం చేస్తే తెలిసిపోతుంది.

ఎన్నడూ ఈ రూపంలో ఒకే రాజ్యంగా, దేశంగా లేని ఈ ప్రాంతంలోని ఒకప్పటి స్వతంత్ర రాజ్యాలు తిరిగి ఆ స్వేచ్ఛను కోరుకోవడాన్ని లోతుగా చర్చించాల్సి ఉన్నది. చారిత్రక ఆధారాలను అధ్యయనం చేయాల్సి ఉన్నది. సామ్రాజ్యవాద కాంక్షతో చిన్న చిన్న ప్రాంతాలను తనలో బలవంతంగా కలిపేసుకుని వాటి స్వయం ప్రతిపత్తిని, స్వతంత్రను హరించివేయడం గురించి నిజాయితీ గానే చర్చించవల్సి ఉంది. అంతేకాని ఆ చర్చ అంటేనే దేశద్రోహం అనే స్థాయికి పిచ్చి ముదిరిందనిపిస్తున్నది. ఇది ప్రజాస్వామ్య ముసుగులో ఫాసిజాన్ని తలపిస్తున్నది.

2014లో పూర్తి మెజారిటితో బిజెపి అధికారంలోకి వచ్చాక ఆర్ఎస్ఎస్‌కు తన ఎజెండాను పకడ్బందీ పథకం ప్రకారం ప్రత్యక్షంగా, పరోక్షంగా అమలు చేసుకుంటూ పోవడం మరింత సులువయ్యింది. అందులో భాగంగానే ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రిసెర్చ్ (ఐసిఎచ్ఆర్) చైర్మెన్‌గా సుదర్శన్‌రావ్‌ను, ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌టిఐఐ) చైర్మన్‌గా గజేంద్రచౌహాన్‌ను, సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిల్మ్ సర్టిఫికేషన్ అధిపతిగా ముఖేష్ ఖన్నాను నియమించారు. వీరందరు ఆర్ఎస్ఎస్ భావజాల వ్యక్తులే. వీరు ఆయా సంస్థలను నడుపగలిగే శక్తి సామర్థ్యాలున్నవారు కాదని అక్కడి వారు చెబుతున్నారు.

కేవలం పరివార్‌కు అనుకూలంగా ఉండి వారు చెప్పిందానికి తందనాలు పాడే వారు కావడమే వారి అర్హత అని అంటున్నారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ (యుఒఎచ్), జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీ (జెఎన్‌యు) ల వైస్ ఛాన్సలర్లు నేరుగా ఆర్ఎస్ఎస్ భావజాలం ఉన్న వారు కానప్పటికి కేంద్ర ప్రభుత్వం చెప్పిన దాన్ని తూచ తప్పకుండా పాటించేవారే.

దేశవ్యాప్తంగా ఉన్నతస్థాయి సంస్థల్లో పరివార్ భావజాల వ్యక్తులను నియమిస్తూ తమకనుకూలమైన విధానపర నిర్ణయాలను చేపడుతున్నారు. అలాగే క్షేత్రస్థాయిలో ప్రజాస్వామిక భావాలను అడ్డుకోవడానికి ఎబివిపి లాంటి సంస్థలను వినియోగిస్తున్నారు. ఈ సంస్థలచే విశ్వ విద్యాలయాల్లో సృజనాత్మక ఆలోచనలు, శాస్త్రీయ అధ్యయనాలు, మేధోపర శక్తులపై భౌతిక దాడులను చేయిస్తున్నారు. సంఘ్ పరివార్ భావజాలాలకు వ్యతిరేకమైన భావ వ్యక్తీకరణలు, చర్చలు, సంవాదాలు జరుగకుండా అడ్డుకుంటున్నారు. భిన్నాభిప్రాయాలు వ్యక్తమైతే చాలు వాటిపై దేశద్రోహ ముద్రలు వేసి, 'రాజద్రోహనేరం' అనే కేసులను నమోదు చేయిస్తున్నారు.

ఒకప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఈ ఆరోపణలతో స్వాతంత్రోద్యమ

కాలంలో గాంధీతో సహా చాలా మందిపై నేరారోపణలు చేసింది. ఎంతో మందిని శిక్షించింది. భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను ఉరితీసింది. అల్లూరి సీతారామరాజును చంపారు. కుమురంభీంను నిజాం రాజు చంపించాడు. వారందరు నేడు మన చరిత్రలో పోరాట యోధులు. అత్యంత గౌరవనీయులు వారి బాటలు ఉన్నతమైనవిగా గుర్తించ బడుతున్నాయి.

భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం ఏం చెప్పినా, ఏం చేసినా, సాటి దేశంపై, ఇతర మతాలపై విషం కక్కినా, శత్రుత్వాన్ని ప్రకటించి భారత ప్రజల్లో రాజకీయ లబ్ధిపొందే ప్రయత్నాలన్నింటిని సమర్థించవల్సిందేనా? అలా కాకుండా ప్రత్యామ్నాయ రాజకీయాలను, భావజాలాలను, సమత, మమతలు, శాంతి సామరస్యాలను, ఆత్మగౌరవాలను ప్రకటిస్తే జాతి విద్రోహమవుతుందా?

ప్రత్యామ్నాయ సిద్ధాంతాలు, తాత్విక చింతనలను సమాజానికి అందించేవిగా విశ్వ విద్యాలయాలు ఉండాలి. అక్కడ జరిగే మేధో పరమైన ప్రక్రియలు సమాజంలోని సమస్యలను భిన్న కోణాల్లో వెలుగులోకి తేవడానికి, వాటికి పరిష్కారాలను భిన్న రీతుల్లో చూపడానికి సహకరించాలి. అందుకోసం శాస్త్రీయమైన, హేతుబద్ధమైన, ప్రజాస్వామిక చర్చలు దోహదపడతాయి.

సరైన ఆధారాలతో, రుజువులతో, సాక్ష్యాలతో, గతితార్కిక సంబంధాలను నిరూపించే పథంలో సాగడానికి అవసరమైన వాతావరణం విశ్వ విద్యాలయాల్లో, విద్యాసంస్థల్లో ఉండాలి. నేను చెప్పిందే సరైందనే ఒంటెత్తుపోకడలు కాకుండా ఎలా సరైందో నిరూపించగల సామర్థ్యాలను సముపార్జించుకోవడానికి ఇవి వేదికలుగా ఉండాలి. కొరడాలు ఝుళిపించి, కత్తులెగరేసి, జైళ్లు చూపించి కాదు. కండబలం, రాజ్య నిర్బంధాలు, అధికారిక భావజాల ఆధిపత్యం, నిర్బంధాలతో కూడినవి సరి కాదు.

సమాజంలో సమానత్వానికి, అందరికి కనీస అవసరాలైన కూడు, గుడ్డ, నీడ ఆపై హుందాగా, గౌరవంగా, సామాజిక భద్రతతో జీవించే పరిస్థితులను మెరుగుపడాలి. దానికి అలాగే ఆధిపత్య శక్తుల అహంకారాన్ని, అధికారాన్ని తొలగించి వారు అందరిలాగానే శ్రమ చేస్తూ దానికి తగిన ఫలితాన్ని అనుభవించే వ్యవస్థ నిర్మాణానికి దారులు వేసేలా మేధోపర కృషి జరగడానికి, మేధోపర సంఘర్షణలకు సముచిత వేదికలుగా విశ్వ విద్యాలయాలు ఉండాలి. అప్పుడే అవి సామాజిక సమిష్టి శ్రమ ఫలితాలను ప్రతిబింబించినవవుతాయి. అంతేగాని ఆధిపత్య శక్తులు, ఫాసిస్టు శక్తుల, భావజాలాలకు కేంద్రాలుగా మార్చే ప్రయత్నాలు ఎప్పుడూ ప్రమాదకరమే. అవి అశేష ప్రజలపై అణచివేత సాదనాలుగా మారతాయి.

మేధో వికాసాలకు చోటు లేకుండా విమర్శనాత్మక ప్రశ్నలకు, అనంగీకారాలకు, భిన్నాభిప్రాయాలకు తావు లేకుండా చేస్తున్న ఆర్‌ఎస్‌ఎస్, బిజెపి, ఎబివిపిల చెప్పు చేతుల్లో యూనివర్సిటీలు నడుస్తుండడం ఫాసిజాన్ని గుర్తుకు తెస్తున్నది. క్షేత్ర స్థాయిలో ఎబివిపి దాడులు, నిరసనలతో మొదలై అది చేస్తున్న డిమాండ్‌లపై సాధనకోసం, పై స్థాయిలో మంత్రులు, ప్రభుత్వం వత్తిడి తేవడం ఆ తరువాత భిన్నాభిప్రాయ వ్యక్తీకరణలపై, వ్యక్తులపై దేశద్రోహ కేసులు, సస్పెన్షన్‌లు అమలవుతున్నాయి.

విద్యా వ్యాపారీకరణ గురించి ఎబివిపి ఎన్నడూ మాట్లాడింది లేదు. నాణ్యమైన, గుణాత్మకమైన ఉచిత విద్య గురించి పోరాడింది లేదు. విద్య, వైద్యం వ్యాపార సరుకుగా మారడం అనేది ఏదేశంలోనైనా విలువల పతనానికి దారితీస్తుంది. అలాంటి విద్య ప్రభుత్వ పరంగానే కొనసాగాలని, దానికోసం, ఆందోళనలు చేయని సంస్థ ఎబివిపి. దేశ ప్రజలందరికి ఉచిత సమాన, గుణాత్మక విద్యగురించి మాట్లాడకుండా దళిత, ఆదివాసి, మైనారిటీ విద్యార్థులపై వారు కలిగి ఉన్న ప్రత్యామ్నాయ రాజకీయ విశ్వాసాలపై, ప్రజాస్వామిక భావాలపై దాడులు చేస్తూ, దేశద్రోహం అనే తప్పుడు ఆరోపణలతో భయానక వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. తప్పుడు కేసులు నమోదు చేయిస్తున్నారు, జైళ్లకు పంపిస్తున్నారు.

అధికార పార్టీ భావజాలాన్ని ఆమోదించని భావజాలాలను, రాజకీయాలను, ఉద్యమాలను, మేధోపర శక్తులను వ్యక్తులను, సమూహాలను, అణచివేసి వారి స్థానాన్ని కుచింపచేయడం ద్వారా విద్యా సంస్థలను తమ గుప్పిట్లో పెట్టుకునే ప్రయత్నం చేస్తున్నారు. చర్చలు, సంవాదాల ద్వారా కాకుండా, బల ప్రయోగాలు రాజ్య ప్రేరేపిత హింస, నిర్బంధాల ద్వారా దీన్ని సాధించాలని చూస్తున్నారు.

పాలకుల అభిప్రాయాలకు భిన్నమైన, వ్యతిరేకమైనటువంటి సృజనాత్మక, వివేచనాత్మక, తార్కిక, హేతుబద్ధ, అన్వేషణాత్మక, పరిశోధనాత్మక, సంవాదాలను ఎన్నింటినో జాతి వ్యతిరేక, దేశ వ్యతిరేకమైనవిగా పేర్కొంటూ వాటిపై నిర్బంధాలను, నిషేధాలను విధించే ప్రమాదకరమైన శక్తులు రాజ్యాధికారంను నడుపుతున్నాయి. ఈ ధోరణులను నిరసించవల్సి ఉన్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# జాతి విద్వేషాన్ని పెంచుతున్న ఫాసిస్టు నేతలు

***ఒకవైపు అమెరికాలో జాతి విద్వేషాన్ని రెచ్చగొట్టి అధికారంలోకి వచ్చిన ట్రంప్, మరోవైపు భారతదేశంలో కుల, మతాలను రెచ్చగొట్టి అధికారంలోకి వచ్చిన మోడీ అనుసరిస్తున్న ఫాసిస్టు విధానాలను వివరిస్తున్నారు* ఎ. నర్సింహా రెడ్డి**

అమెరికా అధ్యక్షుడిగా డొనాల్ట్ ట్రంప్ ఎన్నికతో నయా ఫాసిస్టు శక్తులు తమ విశ్వరూపం ప్రదర్శిస్తున్నాయి. ఎలాంటి రాజకీయ నేపథ్యం లేకపోయినా, అనేక అక్రమాలు, ఆరోపణలను ఎదుర్కొన్నా.. ట్రంప్ విజయం సాధించడం వెనుక జాతీయ ఉన్మాదమే ప్రధాన పాత్ర పోషించింది. మరో కోణంలో చూస్తే పెట్టుబడిదారీ వ్యవస్థ వైఫల్యం వల్ల తలెత్తిన నిరుద్యోగం, దారిద్ర్యం, వలసలు, అభద్రత తదితర కారణాల నుంచి ఈ నయా ఫాసిజం ఊపిరి పోసుకుంటుందని చెప్పవచ్చు. ఇలాంటి సమస్యలను అడ్డం పెట్టుకొని జాతీయ వాదమనే సెంటిమెంట్‌ను రెచ్చగొట్టడం ద్వారా విద్వేష, విధ్వంస భావజాలాన్ని భారత్‌లో ఆర్ఎస్ఎస్ మూకలు, అమెరికాలో ట్రంప్ నూరిపోస్తున్నారు.

భారత్‌లో మోడీ, అమెరికాలో ట్రంప్ ఇద్దరూ జాతీయవాదం ముసుగులోనే జాతి విద్వేషాలకు ఆజ్యం పోశారు. అప్పటి పాలకపార్టీలపై ప్రజల్లో పెరిగిపోయిన అసంతృప్తి, అసమ్మతిని సొమ్ము చేసుకోవడానికి వీరిద్దరూ అసహన భావజాలాన్ని ప్రచారాస్త్రంగా మార్చుకున్నారు. అంతేకాదు, ఉగ్రవాద భూతాన్ని చూపెట్టి ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టి మెజార్టీ ప్రజల ఓట్లను రాబట్టుకోగలిగారు. డొనాల్డ్ ట్రంప్ విజయం కోసం భారత్‌లో యజ్ఞాలు చేసి వికృతత్వం చాటుకున్నది ఆర్ఎస్ఎస్ మనువాద కాషాయ కూటమి. ట్రంప్ విజయంతో యూరోపియన్ దేశాలైన ఫ్రాన్స్, నెదర్లాండ్స్, జర్మనీ, హంగరీ, స్విట్జర్లాండ్, ఇటలీ, డెన్మార్క్, ఆస్ట్రియా, స్వీడన్ దేశాలలో ఈ శక్తులు విద్వేషాన్ని వెళ్లగక్కుతున్నాయి. యూరప్ అంతటా వలస వ్యతిరేకత, ఇస్లామో ఫోబియా బలంగా విస్తరించింది. ఫ్రాన్స్‌లో నేషనల్ ఫ్రంట్‌కు చెందిన మితవాద నేత, అధ్యక్ష పదవికి పోటీపడుతున్న లిపెన్ ఏకంగా ట్రంప్ విజయాన్ని 'స్వేచ్ఛకు లభించిన విజయం'గా అభివర్ణించాడు. 2017ను ప్రపంచ ప్రజా ఉత్తేజిత సంవత్సరంగా పేర్కొంటూ తన జాత్యహంకారాన్ని చాటాడు. ఫ్రాన్స్ అధ్యక్ష ఎన్నికలు ఏప్రిల్, మే నెలల్లో జరగనున్నాయి.

నెదర్లాండ్స్‌కు చెందిన డచ్ ఫ్రీడం పార్టీ నాయకుడు విల్టర్స్ ప్రజల్లో మత విద్వేషాన్ని నూరిపోశాడు. మసీదులను కూల్చేయాలనీ, ఖురాన్‌ను నిషేధించాలనీ ఉన్మాద ప్రేలాపనలకు పాల్పడ్డాడు. నెదర్లాండ్ పార్లమెంట్ ఎన్నికలు మార్చి 15న జరిగాయి. ఈ ఎన్నికల్లో డచ్ ఫ్రీడం పార్టీ అధిక స్థానాలు సాధించడానికి జాతి విద్వేష, మత ఉన్మాద ప్రచారమే ఏకైక అజెండాగా చేసుకున్నాడు. దీంతో గతంలో ఉన్న స్థానాలకంటే ఆ పార్టీ అధిక స్థానాలు గెలుచుకోగలిగింది. మార్క్ రుట్టె నాయకత్వంలోని లిబరల్ పార్టీ 33 స్థానాలు దక్కించుకోగా, గీర్ విల్డర్స్ ఫ్రీడమ్ పార్టీ 20 స్థానాలు దక్కించుకొని రెండవ స్థానంలో ఉంది.

జర్మనీలో విల్డర్స్ తరహాలోనే నయా నాజీలకు ప్రాతినిధ్యం వహించే 'ఆల్టర్‌నేట్ ఫర్ జర్మనీ' పార్టీ దేశంలోని 16 రాష్ట్రాల్లో పదింటిలో ప్రాతినిధ్యం వహిస్తోంది. సెప్టెంబర్‌లో జర్మనీలో ఎన్నికలు జరుగనున్నాయి. డొనాల్ట్ ట్రంప్ అమెరికా అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేసిన రోజున యూరప్‌లోని నయా ఫాసిస్టు శక్తులకు ప్రాతనిధ్యం వహించే నేతలందరూ జర్మనీలోని కోల్బెన్జ్‌లో సమావేశమై తమ బలాన్ని ప్రదర్శించారు. 'ప్రపంచం మారుతున్నది', 'నిన్న స్వేచ్ఛాయుత అమెరికా, నేడు కోల్బెన్జ్, రేపు నూతన యూరప్' అని కేరింతలు కొట్టారంటే... ఫాసిస్టు, జాత్యహంకార శక్తుల ముప్పు ఎంత ఉగ్రరూపంలో ముంచుకొస్తున్నదో అర్థం చేసుకోవచ్చు.

"అమెరికా అమెరికన్లకే, జర్మనీ జర్మన్లకే, బ్రిటన్ బ్రిటన్లకే" అన్న ఉద్విగ్న, ఉద్రేకపూరిత వాగాడంబరతకు యువత, మధ్యతరగతి ప్రజలు ఆకర్షితులవుతున్నారు. ప్రస్తుతం జాత్యహంకార నయా ఫాసిస్టులు, మతోన్మాద శక్తులు రెండు వైపుల నుంచి కమ్ముకొస్తున్నాయి. భారత్‌లో మోడీ ప్రభుత్వం జాతీయత పేరుతో ముస్లింలపై, గోరక్షణ పేరుతో దళితులపై, మనువాదం పేరుతో మహిళలపై దాడులకు తెగబడుతుంది. ఈ ఫాసిస్టు నేతలంతా ప్రజాస్వామ్య కనీస నైతిక సూత్రాలకు తిలోదకాలిచ్చి మారణకాండలకు తెగబడుతున్నాయి. ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, ప్రజాస్వామ్య వ్యవస్థలను ధ్వంసం చేయాలని చూస్తున్నాయి. వాస్తవానికి ఇవి రెండూ భిన్న ధ్రువాలుగా కనిపిస్తున్నా... అవి ఒకే నాణానికి రెండు ముఖాల్లాంటివి. నాగరిక ప్రపంచానికి పెను సవాల్ విసురుతున్నాయి.

2007 జనవరి 20న, డొనాల్ట్ ట్రంప్ ప్రమాణ స్వీకారోత్సవ వేళ 'ఈ అధ్యక్షుడు మాకొద్దు' అని నినదిస్తూ సుమారు పది లక్షల మంది అమెరికా వీథుల్లో కదం తొక్కారు. అమెరికాను మహోన్నతంగా నిలుపుతానన్న వ్యక్తిని అంతమంది వ్యతిరేకించడానికి కారణం–ఆయన ప్రవచించిన మార్గాలు జాతీయంగా, అంతర్జాతీయంగా ఏమి విపత్తు రానుందో, ఏలాంటి దుష్పరిణామాలు సంభవించనున్నాయోనన్న భయాందోళనలు అమెరికన్లలో కలిగించాయి. సంకుచిత ప్రయోజనా లను, పరిమితులను అధిగమించే విశాల దృక్పథం ట్రంప్‌కు లేదని స్పష్టమవుతోంది. మతాన్ని, జాతిని ప్రాతిపదిక చేసుకున్న ఫాసిస్టులు కేవలం అధికార పీఠం చేజిక్కించుకోవడంతోనే సరిపెట్టరు. అన్ని సామాజిక రంగాలను అదుపులోకి తీసుకోవడం ద్వారా తమ ఆధిక్యాన్ని నెలకొల్పుకొనేందుకు ప్రయత్నిస్తారు. ప్రజాస్వామ్యం కల్పించిన అవకాశాలను ఎలా ఉపయోగించుకోవాలో సైతం ప్రజలకు తామే బోధపరుస్తామన్న తరహా అహంభావం పెంచుకుంటారు.

గత రెండున్నరేళ్లుగా న్యాయస్థానాలను, మీడియాను, భిన్నాభిప్రాయాన్ని సహించలేని పరిస్థితి భారత్‌లో కొనసాగుతుండగా, నేడు అమెరికాలో అదే అసహనం కొనసాగుతోంది. ఏడు ముస్లిం దేశాలపై పరమ దారుణంగా డొనాల్డ్ ట్రంప్ విధించిన ఆంక్షలను న్యాయస్థానంలో వ్యతిరేకించిన అటార్నీ జనరల్‌ను గంటల వ్యవధిలోనే ఆ పదవి నుంచి తొలగిస్తూ ట్రంప్ సర్కారు ఉత్తర్వులు వెలువరించింది. న్యాయస్థానాలు ఇదే విధంగా వ్యవహరిస్తే భవిష్యత్తు పర్యవసానాలకు వాటిదే బాధ్యత అంటూ ట్రంప్ చేసిన తెంపరి వ్యాఖ్యలు జాత్యహంకారులు మరింత దుర్మార్గంగా వ్యవహరించడానికే ఊతమిచ్చాయి. మార్చి 6న ఇరాక్‌ను మినహాయిస్తూ ట్రంప్ మరో వలసల నిరోధక ఉత్తర్వుపై సంతకం చేశారు. ఈ ఉత్తర్వు సిరియా, ఇరాన్, లిబియా, సోమాలియా, యెమెన్, సుడాన్ దేశస్థులు 90 రోజులు అమెరికాలో

ప్రవేశించకుండా నిషేధాన్ని విధించింది. మరోవైపు మంత్రివర్గాన్ని శతకోటీశ్వరులతో నింపి, సొంత అల్లుడికి కీలక సలహాదారు పదవిని కట్టబెట్టిన ట్రంప్ బృందానికి వ్యాపారం చేసి డబ్బు సంపాదించడంపై ఉన్న అవగాహన పాలన ప్రాథమిక సూత్రాలపై లేదన్నది క్రమంగా తేటపడుతున్న సత్యం.

ట్రంప్ అధ్యక్షులుగా అధికారంలోకి వచ్చినా, గత అధ్యక్షులందరిలానే వ్యవహరిస్తాడని చాలా మంది అనుకున్నారు. కానీ తాను ఏది చెప్పాడో, అదే చేస్తున్నాడు. ముస్లింలపై నిషేధం, హిస్పానిక్‌ల దేశ బహిష్కారం, మెక్సికో సరిహద్దువెంట గోడనిర్మాణం, ఇస్లామిక్ టెర్రరిజంపై పోరాటంలో రష్యాతో మైత్రి, చైనా వస్తువులపై సుంకాల పెంపు, అమెరికా కంపెనీలు అమెరికాలోనే ఉత్పత్తి చేయకపోతే పన్నుల పెంపుదల, హెచ్1బి వీసాల కుదింపు, శాస్త్రీయంగా నిర్ధారణ అయిన వాతావరణంలో మార్పునకు చర్యలను తిరస్కరించడం, రక్షణ వ్యయం హెచ్చింపు తదితరాలన్నీ ఆగమేఘాల మీద అమలుచేసేందుకు ఉత్తర్వులు ఇచ్చాడు. ఈ క్రమంలో ప్రజాస్వామ్య విలువలకూ, ఇప్పటివరకు అమెరికా అనుసరిస్తున్న సంప్రదాయాలకూ అనుకూలంగా లేని ట్రంప్ భావాలను వ్యతిరేకిస్తున్న మీడియాను కూడా వదిలిపెట్టకుండా దానిపై 'నీతిరహిత' ముద్రవేశారు. ట్రంప్ ఏం కావాలని ఆశించాడో, ఏం లక్ష్యంగా ఎంచుకున్నాడో నేడదే అమెరికాలో జరుగుతున్నది. ఫలితంగా జాత్యహంకారం విషం గక్కుతూ అమానుష రాక్షసకాండకు తెరలేస్తోంది.

ఈ క్రమంలోనే శ్వేత జాతీయుడైన ప్యూరింటన్ తుపాకి గుళ్లకు ఓ బారులో కూచిబొట్ల శ్రీనివాసు ఫిబ్రవరి 22న ప్రాణాలు కోల్పోయాడు. శ్రీనివాసును కాల్చి చంపుతూ దుండగుడు ప్యూరింటన్ గట్టిగా అరుస్తూ, "అమెరికా మాది, ఎక్కడెక్కడి నుంచో వచ్చి మా పొట్ట గొడుతున్నారు. మా ఉద్యోగాలు కొల్లగొడుతున్నారు. విదేశీయులకు ఇక్కడ స్థానం లేదు. వెళ్లిపోవాల్సిందే" అనడం శ్వేతజాతి ఆక్రోశాన్ని తెలుపుతుంది. ఈ ఘటన విదేశీయులపై పెరుగుతున్న విద్వేషానికి నిదర్శనం. ఈ ఘటనతో అమెరికాలో స్థిరపడిన భారతీయుల్లో అభద్రత మరింతగా పెరిగింది. నిజానికి ఈ హత్యకు పాల్పడిన యాభై ఏళ్ల వ్యక్తి నిరుద్యోగి కాదు. ఆయన ఒక రిటైర్డ్ నావికాదళ ఉద్యోగి. ట్రంప్ ప్రమాణ స్వీకారం చేసిన తొలి పదిరోజుల్లో రోజుకు రెండువందల విద్వేషపూరిత దాడులు జరిగినట్లు ఒక అధ్యయనం తేల్చింది. ఈ విద్వేషాలను రెచ్చగొట్టే ముఠాలు 1999లో 457 ఉండగా ట్రంప్ ప్రచారంతో 2016 నాటికి ఈ ముఠాల సంఖ్య 1200కు పైగా ఉన్నట్లు చెబుతున్నారు.

కాన్సాస్‌లో జాత్యహంకారానికి బలైన శ్రీనివాస్ కూచిబొట్ల మృతి పట్ల దేశం నలుమూలల నుంచి నిరసనలు వ్యక్తమయ్యాయి. అమెరికాలో రగులుతున్న జాత్యహంకారం గురించి అందరూ మాట్లాడుతున్నారు. కానీ భారతదేశంలో వివిధ రూపాలలో కనిపిస్తున్న జాత్యహంకారాన్ని ఎవరూ నిరసించడంలేదు. ఎందుకు? చావు ఒక్కటే నిరసన తెలియజేయ డానికి కొలమానమా? మనుషులు సమానంగా చూడబడే హక్కు, సమాన అవకాశాలు పొందే హక్కు వీటికి ఒక వ్యక్తి పుట్టుక, ప్రవర్తన ఆధారంగా భంగం కలిగితే అది నిరసన యోగ్యం కాదా? 2015 మే లో ఢిల్లీలో అనేకమంది ఆఫ్రికా దేశస్థులపై భారతీయులు దాడి చేశారు. మసూద్ ఖాతాదా బలీవీయర్ అనే కాంగో దేశస్థుడిని కొంతమంది తాగుబోతులు కాల్చి చంపేశారు. 2016 ఫిబ్రవరిలో బెంగుళూరులో ఒక టాంజానియా యువతిని నడివీధిలో బట్టలు ఊడదీసి హింసించారు. అంతర్జాతీయంగా వీటినన్నింటినీ జాత్యహంకారంగానే నిర్ధారించినప్పటికీ భారతదేశం వీటిని జాత్యహంకారం సంఘటనలుగా గుర్తించలేదు.

మనదేశంలో జాతి, మతం, కులం, జెండర్ వంటి వివక్షలు కనిపిస్తాయి. వీటి తీవ్రరూపమే విద్వేషం. మోడీ ఎన్నికల సమయంలో ఇచ్చిన హామీలను నెరవేర్చక తన వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి, తన పాలన వైఫల్యాలను విమర్శిస్తున్న ప్రజాస్వామికవాదుల పైనా, మేధావులు పైనా, విద్యార్థి ఉద్యమాల పైనా నిస్సిగ్గుగా దాడులకు మోడీ ప్రభుత్వం తెగబడుతోంది. మతోన్మాదాన్ని రెచ్చగొట్టి ఘర్షణలు సృష్టించ డానికి ప్రయత్నం చేస్తోంది. తనకు తాను జాతీయవాదిగా ప్రకటించు కుంటూ మిగతావారందరిపై జాతి వ్యతిరేక ముద్ర వేస్తున్నది. ప్రశ్నించిన వారిపై నిరంకుశంగా భౌతికదాడులకు దిగుతున్నది. దేశంలో ఇలాంటి వాతావరణాన్ని సృష్టిస్తున్న బిజెపిని సహిస్తూ అమెరికాలో భారతీయులకు రక్షణ కావాలని అడిగే నైతిక ధైర్యం మనకు ఎట్లా వస్తుంది?

రెడ్ ఇండియన్ మూలవాసులను నిర్మూలించి, అక్రమ వలసల పునాదిపై నిర్మాణమైన ఆధునిక అమెరికాలో నేడు వలసవాద వ్యతిరేక పేరుతో జాత్యహంకార జాడ్యం జడలు విప్పి నగ్నంగా నర్తిస్తోంది. పెట్టుబడి లాభాల వేటలో ప్రజల బతుకులు ఛిద్రమై... అసమానతలు ఆకాశమంతై... ఒక్క శాతం శతాధిక కోటీశ్వర్లపై 99 శాతం ప్రజానీకం ఆకలికేకలతో అగ్రహోద్రులైన వేళలో... ట్రంప్ రెచ్చగొట్టిన జాతీయవాదం అనతికాలంలోనే జాతి విద్వేష రూపాన్ని సంతరించుకోవడంలో ఆశ్చర్యమేమీలేదు. అమెరికాలో జాతి దురహంకారం, వర్ణ వివక్ష అనేవి ట్రంప్ రాగానే పుట్టుకొచ్చిన కొత్త జాడ్యాలేమీ కావు.. 2001 ఉగ్రవాద దాడుల తర్వాత ముస్లింలపైనా, ఆర్థిక అసమానతలు పెరిగిపోయిన తరుణంలో వలస వచ్చిన వారిపైనా, ఉపాధి లేక వీధులపాలైన నల్ల జాతీయుల పైనా శ్వేతజాతి విషం గక్కుతూనే వస్తోంది. శ్వేతవర్ణ దురహంకారంతో అమెరికా పోలీసులే నల్లవాళ్లు ఎక్కడ కనిపిస్తే అక్కడే నిర్దాక్షిణ్యంగా కాల్చి పారేసిన ఘటనలు కోకొల్లలు. ట్రంప్ అధికారంలోకి వచ్చిన తర్వాత ఆ జాడ్యం సాధారణ పౌరుల్లో కూడా కనబడడం ఇప్పుడు అత్యంత ఆందోళన కలిగిస్తున్న అంశం. ప్రపంచం ముందు నిలిచిన పెను సవాలు కూడా అదే.

నిజానికి శతాబ్దాలుగా అనేక దేశాల ప్రజలు వలసవెళ్లి ఇటుక ఇటుక పేర్చి నిర్మించిన ఫలితమే నేటి అమెరికా! ట్రంప్‌తో సహా ఆయన మద్దతుదారులు, అమెరికన్లుగా జబ్బలు చరచుకుంటున్నవారు అంతా ఇతర దేశాలనుంచి వచ్చి ఆ గడ్డపై స్థిరపడినవారే. స్వయంగా డొనాల్డ్ ట్రంప్ తాత జర్మనీ నుంచి అమెరికాకు బతుకు దెరువుకోసం వలసవచ్చి అక్కడ పారిశ్రామికవేత్తగా ఎదిగారు. స్థానిక ఆదివాసీ తెగలకు చెందిన 'రెడ్ ఇండియన్లు' మినహా అసలైన అమెరికన్లుగా చెప్పుకోగలవారు అక్కడ లేనే లేరు! ఆ ప్రాతిపదికన అగ్రరాజ్యంలోని 99 శాతం జనాభాకు అమెరికా మూలాలు లేవన్నది అక్షర సత్యం. ఈ వాస్తవిక అవగాహన ఉండబట్టే అమెరికా పదహారో అధ్యక్షుడిగా పనిచేసిన రిపబ్లికన్ పార్టీకి చెందిన అబ్రహం లింకన్ వైవిధ్యానికి చోటు పెడుతూ నైపుణ్యాల సృజన కేంద్రంగా అమెరికా విస్తరించాలని ఆకాంక్షించారు. సామ్రాజ్యవాద ప్రయోజనం కోసం బెర్లిన్ గోడను బద్దలు కొట్టి ఉభయ జర్మనీలను ఏకం చేశారు. ఇప్పుడు అదే జర్మనీ మూలాలున్న ట్రంప్ దేశాల మధ్య అడ్డుగోడలు లేపేందుకు సిద్ధం అవుతున్నారు.

'ఒబామా కేర్'ను రద్దుచేసి అంతకంటే మెరుగైన ఆరోగ్య సేవల వ్యవస్థను నిర్మిస్తానని ఎన్నికల వేళ వాగ్దానం చేసిన ట్రంప్– అధ్యక్ష పగ్గాలు చేపట్టిన 40 రోజుల తరవాత 'రద్దు' గురించే మాట్లాడుతున్నారు. దేశ ఆరోగ్య వ్యవస్థను పునర్నిర్మించే ప్రత్యామ్నాయ ప్రణాళికను ఆయన ఇప్పటికీ వివరించలేకపోతున్నారు. అధ్యక్ష పదవి చేపట్టిన వెంటనే పర్యావరణ పరిరక్షణ సంస్థ గొంతు నులుముతూ దాని కేటాయింపులకు భారీ కోత పెట్టారు. ఆంక్షల కొరడా ఝుళిపించి అధ్యక్ష కార్యాలయ వెబ్‌సైట్ నుంచి వాతావరణ మార్పు అన్న పదమే లేకుండా తొలగించారు. కాలుష్య ఉద్గారాలతో భూగోళం భగభగలకు తన వంతు కారణమైన అమెరికా ఆ మేరకు మరింత బాధ్యతగా వ్యవహరించాల్సిన దశలో 'పారిస్ ఒప్పందం'

కుదిరింది. ఆనాటి అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా సైతం దానికి కట్టుబాటు చాటారు. ఈ నేపథ్యంలో వాతావరణం వేడెక్కుతోందన్న వాదనే అబద్ధమని వాచాలత్వం ప్రదర్శించిన ట్రంప్ ఆ ఒప్పందాన్ని కాలదన్నుతానని ప్రకటించారు. భూగోళంపై పచ్చదనం పెంచి మానవాళిని ఆదుకునే లక్ష్యంతో దేశాలన్నీ కదులుతున్న వేళ ట్రంప్ తీరు ప్రపంచానికే పెను ముప్పుగా పరిణమిస్తోంది!

అమెరికా ప్రభుత్వం కొత్త నిబంధనలతో వలసదారులపై కొరడా ఝుళిపించింది. అక్రమ వలసదారులను సాధ్యమైనంత త్వరగా దేశం నుంచి పంపించి వేసేందుకు అమెరికా అంతర్గత భద్రతా విభాగం (డిఎచ్ఎస్) కార్యదర్శి జాన్ కెల్లీ ఫిబ్రవరి 20న తాజాగా రెండు ఆదేశాలను జారీ చేసింది. గత నెలలో ట్రంప్ జారీ చేసిన ఎగ్జిక్యూటివ్ ఆర్డర్, డిఎచ్ఎస్ విడుదల చేసిన ఎన్‌ఫోర్స్‌మెంట్ మెమోల నేపథ్యంలో అక్రమ వలసలపై అమెరికా విధానాలు మరింత కఠినతరం అవుతున్నాయి. ఈ ఆదేశాల ప్రకారం అక్రమంగా సరిహద్దు దాటిన వారిని, ట్రాఫిక్ నిబంధనల ఉల్లంఘన సహా ఏ చిన్న తప్పు చేసినా, నేరం చేయబోతాడనే అనుమానం వచ్చినా దేశం నుంచి బహిష్కరిం చేందుకు అమెరికా ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది. క్రిమినల్ కేసులున్న అక్రమ వలసదారులే ప్రస్తుతం తమ లక్ష్యమని అమెరికా ప్రభుత్వం చెబుతున్నప్పటికీ, రానున్న కాలంలో ఇది క్రమంగా అందరికీ వర్తిస్తుంది. అమెరికాలో వివిధ దేశాలకు చెందిన కోటి యాభై లక్షల మంది ప్రజలపై ట్రంప్ ప్రభుత్వ కొత్త నిబంధనల ప్రభావం పడనుంది. ఇది భారత్‌లో తల్లిదండ్రులకు, ఎచ్-1బి, ఎల్-1 వీసాల కోసం పడిగాపులు గాసే వారికి పిడుగుపాటై పోయింది.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ శాంతిని కాపాడడం కోసం ఏర్పాటు చేసుకున్న ఐక్యరాజ్య సమితినే కాలక్షేపం క్లబ్బుగా ట్రంప్ తీర్మానించేశారు. 'సమితి' తరపున ప్రపంచవ్యాప్తంగా మానవ హక్కుల పరిరక్షణకు కృషి చేస్తున్న వివిధ విభాగాలకు నిధులు తెగ్గోస్తాననీ హెచ్చరించారు. 'నాటో'కి కాలం చెల్లిందని, పసిఫిక్ వాణిజ్య భాగస్వామ్య ఒడంబడిక (టిడిపి)పై వేటు వేస్తామన్న దుందుడుకు ప్రకటనల ద్వారా ట్రంప్ అంతర్జాతీయంగా నిరసనల తుట్టె కదిపారు. మెక్సికోతో ఉన్న స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాన్ని రద్దు చేసుకుంది. మరోవంక సిరియా గగనతలాన్ని 'నో ఫ్లై జోన్'గా ప్రకటిస్తామన్న అమెరికా ప్రకటనపట్ల రష్యా, ఇరాన్‌లు అసహనం వ్యక్తం చేశాయి. అల్‌ఖైదా ఉగ్రమూకలను మట్టుబెట్టే పేరిట యెమెన్ మధ్య ప్రాంతంపై అమెరికా గగనతల దాడులకు తెగబడింది. అధ్యక్ష పగ్గాలు చేపట్టాక విదేశీ గడ్డపై ట్రంప్ సర్కారు నిర్వహించిన మొట్టమొదటి దాడి అది. ఆ దాడిలో కొందరు ఉగ్రవాదులతోపాటు పెద్ద సంఖ్యలో మహిళలు పిల్లలు మరణించారు.

యెమెన్‌పై అమెరికా దుందుడుకు చర్య ప్రపంచవ్యాప్తంగా పలు విమర్శలకు తావిచ్చింది. ఇక ఎట్టి పరిస్థితుల్లోనూ తమ గడ్డపై దాడులకు దిగేందుకు అమెరికాకు అనుమతి ఇవ్వబోమని యెమెన్ సర్కారు తెగేసి చెప్పింది. ట్రంప్ తెంపరితనం నిద్రాణంగా ఉన్న విద్వేషాల్ని తట్టిలేపుతూ, ప్రపంచవ్యాప్తంగా కల్లోల కుంపట్లు రగిలిస్తోంది. అమెరికాలో శాంతి భద్రతలను నెలకొల్పడమే తన లక్ష్యమని ప్రమాణ స్వీకారోత్సవ వేళ డొనాల్డ్ ట్రంప్ ప్రకటించాడు. పనిగట్టుకుని ప్రజాస్వామ్యానికి తూట్లు పొడవడం ద్వారా ఆయన చేస్తోంది అంతటా అశాంతిని ఎగదోయడమే.

ట్రంప్ ప్రభుత్వ అనుచిత, అనాలోచిత, అప్రజాస్వామిక చర్యల వలన అసమ్మతి ప్రపంచ పరివ్యాప్తమవుతున్న క్రమంలో ఫిబ్రవరి 28న ఉభయ సభలను ఉద్దేశించి ట్రంప్ చేసిన ప్రసంగంలో మాటలకూ చేతలకూ మధ్య సంపూర్ణ వైరుధ్యం కనిపించింది. యుద్ధాలు, సంక్షోభం బొత్తిగా పట్టించుకోని ట్రంప్ కేవలం శాంతి సుస్థిరతలనే కోరుకుంటున్నానని ధర్మపన్నాలు వల్లించాడు. ఆ మాట అన్న వెంటనే అమెరికా సైనిక బడ్జెట్‌కు 5,400 కోట్ల డాలర్లు అదనంగా కేటాయిస్తున్నట్లు ప్రకటించి అందరినీ నిర్ఘాంతపరచాడు. తాను ప్రపంచ ప్రతినిధిని కాదని, కేవలం అమెరికా అధ్యక్షుడిగా మాత్రమే మాట్లాడుతున్నానని పరమ సత్యం వెల్లడించిన ట్రంప్ మిత్ర రాజ్యాల భద్రత కోసం చేస్తున్న వ్యయానికీ కోత పెడతానని తేల్చి చెప్పాడు. ప్రపంచవ్యాప్తంగా అమెరికా మిలిటరీ వ్యయం తగ్గిస్తామని చెబుతూ మరోవైపు రక్షణ బడ్జెట్‌కు కొత్త కేటాయింపులు చేయడం శాంతి కాముకులకు ఏమాత్రం అంతుచిక్కని విషయం.

ప్రపంచ వ్యాప్త భౌతిక, బౌద్ధిక శక్తుల పునాదిపై విస్తరించిన బహుళత్వ సమాజం ప్రపంచ ఆర్థిక సంక్షోభం పర్యవసానంగా నేడు సామాజికార్థిక ఆత్మరక్షణ విధానాలవైపు మొగ్గుతుంది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం అగ్రరాజ్యంగా అవతరించిన నాటి నుంచి అమెరికా అనుసరించిన భౌగోళిక రాజకీయాలు, దురాక్రమణ యుద్ధాలు, ఉగ్రవాద వ్యతిరేక యుద్ధం పేరుతో సాగించిన నేరాలు, ఎకనామిక్ హిట్ మాన్‌ల సహకారంతో సాగించిన కార్పొరేట్ కుట్రలు, దేశ ప్రజల జీవితాల్ని పణంగా పెట్టి అమలు చేసిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలే అమెరికాలో అలుముకున్న నేటి అస్థిరతకు ప్రధాన కారణం. దాన్ని దాచిపెట్టి పొట్టచేతబట్టుకుని వలస వచ్చిన వారిని దోషులుగా చేసి, వారిపైకి స్థానిక అమెరికన్ల విద్వేషాన్ని రెచ్చగొట్టడం వల్ల సామాజిక సమస్యల పరిష్కారాల్ని కొంతకాలం వాయిదా వేయవచ్చునేమో కాని శాశ్వత పరిష్కారం మాత్రం పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో ఏమాత్రం దొరకదు.

ప్రపంచీకరణతో లాభపడుతున్న ఫైనాన్స్, ఐటి కంపెనీలు ట్రంప్ విధానాలను హర్షించలేకపోతున్నాయి. అమెరికాలో ప్రస్తుత పరిణామాలు కార్పొరేట్ మీడియాను సైతం ఆందోళనలో పడేస్తుండడం గమనార్హం. గూగుల్, మైక్రోసాఫ్ట్, ఫేస్‌బుక్ వంటి సాంకేతిక సమాచార దిగ్గజ కంపెనీలు డొనాల్డ్ ట్రంప్ విధానాలను తప్పుబడుతున్నాయంటే అది వలస జీవులపై ప్రేమతోనూ, దయతోనూ కాదు. సాంకేతిక నిపుణుల కొరతతో తమ లాభాలు ఎక్కడ క్షీణిస్తాయోననే ఆందోళనతోనే ఆ కంపెనీలు వలస ప్రజానీకపు పక్షాన గొంతు కలుపుతున్నాయి. మరోవైపు ప్రపంచీకరణ విధానాల వల్ల నష్టపోతున్న స్థానిక ప్రజల్లో తీవ్ర అసంతృప్తి పెరుగుతున్నది. ముఖ్యంగా తెల్లజాతి కార్మికుల్లో నిస్పృహ వ్యాపిస్తున్నది. డిగ్రీ లోపు చదువుకొని, అంతగా ప్రత్యేక నైపుణంలేని యువతరానికి దాదాపు ఉపాధి లేదు. ఈ తరగతిలో నిరాశ, నిస్పృహలు ఎక్కువగా ఉన్నాయి. ఇలాంటి వారిలోనే కొందరు ఇలా తెగబడి దాడులకు పాల్పడుతున్నారు. 2011-12లో వాల్‌స్ట్రీట్ ముట్టడి కార్యక్రమంలోనే ఈ అసంతృప్తి ప్రతిబింబించింది.

ఇవాళ విద్వేష విషం అమెరికా సమాజానికి నిలువెల్లా పాకుతోంది. నిజానికి అమెరికా అధ్యక్ష ఎన్నికల బరిలో నిలిచిన నాటి నుంచి ట్రంప్ నమ్ముకున్న విధానం విద్వేషమే. జాతీయ అభిమానం మాటున జాత్యహంకారాన్ని నూరిపోస్తూ ఆయన చేసిన వ్యాఖ్యలు అమెరికాలోని శ్వేతజాతీయుల్లో నిద్రాణంగా ఉన్న విద్వేష భావాలకు ఇనుప రెక్కలు తొడిగాయి. ఫలితంగా ఇప్పుడు విదేశీయులు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని బతకాల్సిన పరిస్థితి. ఎప్పుడు తమను వెళ్లగొడతారో... అసలు ప్రాణాలతో వెళ్లనిస్తారో లేదో అన్నంత భయం ఇప్పుడు అమెరికాలోని ఇతర దేశస్థులందరినీ వెంటాడుతోంది. మొత్తంగా ట్రంప్ పాలన ఒక తీవ్ర అనారోగ్యానికి సంకేతం. ప్రజల నిరసనలను పక్కదోవ పట్టించ టానికి, యుద్ధానికి భావజాల ప్రాతిపదికను ఏర్పాటు చేయటానికి పాలక వర్గాలు ఇటువంటి పద్ధతులను అవలంభిస్తాయి. అంతిమ విశ్లేషణలో డొనాల్డ్ ట్రంప్ పాలన విసురుతున్న ఫాసిస్టు పంజా పెట్టుబడిదారీ వ్యవస్థలోని సంక్షోభానికి, దాని వైఫల్యానికి ప్రతిబింబం మాత్రమే! అలాగే ట్రంప్ సాధారణ ప్రజల, శ్రామిక వర్గ ప్రతినిధి ఏమాత్రం కాదన్నది అమెరికా సమాజం ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)*

# ఎచ్ 1 వీసాలపై అమెరికా ఆంక్షలు

***ఎన్నో ఆశలతో అమెరికాకు వలసపోతున్న భారతీయులకు అమెరికా ఆంక్షలు గొడ్డలి పెట్టు అనీ, మరోవైపు జాత్యహంకార దాడులతో అక్కడ నివసిస్తున్న వారికి కూడా రక్షణ లేకుండా పోయిందనీ అంటున్నారు జి. కిరణ్***

'అమెరికా ఫస్ట్' అనే నినాదంతో ముందుకెళ్తున్న ట్రంప్ ప్రభుత్వం ఇప్పుడు ఎచ్1బి వీసా సంస్కరణలపై దృష్టి సారించింది. అమెరికన్ సంస్థలు తమ వ్యాపార వృద్ధికి అవసరమైన నైపుణ్యం అందుబాటులో ఉన్న స్థానికులలో కొరవడినప్పుడు, ఆ నైపుణ్యం కలిగిన విదేశీయులను ఉపయోగించుకోవడానికి తాత్కాలికంగా అనుమతిచ్చే పథకమే ఎచ్1బి. ఎచ్1 వీసాల కాల పరిమితి సాధారణంగా ఒక సంవత్సరం నుంచి గరిష్టంగా ఆరు సంవత్సరాలు ఉంటుంది.

ప్రతి ఏటా 85,000 ఎచ్1 వీసాలను యుఎస్‌సిఐఎస్ అనుమతిస్తుంది. ఇందులో 20,000 మాస్టర్స్ పట్టా ఉన్నవాళ్లకు కేటాయిస్తుంది. అన్ని రంగాల్లోని నిపుణులు అర్హులు కాగా, మూడింట రెండు వంతులు సాంకేతిక రంగంలోని నిపుణులకే వెళ్తున్నాయి. గత సంవత్సరం 85,000 ఎచ్1 వీసాలకు గాను సుమారు రెండు లక్షల ముప్పై మూడు వేల దరఖాస్తులు యుఎస్‌సిఐఎస్‌కు సమర్పించబడ్డాయి. గరిష్ట పరిమితికి మించి దరఖాస్తులు వచ్చినప్పుడు లాటరీ పద్ధతిలో ఎంపిక జరుగుతుంది. పెద్ద ఎత్తున దరఖాస్తులు చేసి లాటరీలో తగిలే అవకాశాలను మెరుగు పరుచుకోవడం ద్వారా భారతీయ ఐటి దిగ్గజాలు ఎక్కువ సంఖ్యలో ఎచ్1 వీసాలను చేజిక్కించుకుంటున్నాయనే విమర్శ సర్వత్రా నెలకొని ఉంది. మొత్తం ఎచ్1 వీసాలలో 70 శాతం భారతీయులకే దక్కుతుందంటే దానికి కారణం ముఖ్యంగా మన ఐటి సంస్థలే.

నైపుణ్యం గల ఉద్యోగుల కోసం మొదలైన ఎచ్1 పథకం కాస్తా తక్కువ జీతాలకు పని చేసే ఉద్యోగులను తెచ్చుకోవడానికి ఉపయోగిస్తున్నారన్నది రిపబ్లికన్ల ప్రధాన ఆరోపణ. బడా అవుట్ సోర్సింగ్ సంస్థల ధాటికి చిన్న సంస్థలు ఎచ్1 వీసాలు పొందలేకపోతున్నాయనేది మరో ఆరోపణ.

ట్రంప్ నేతృత్వంలోని రిపబ్లికన్ ప్రభుత్వం ఎచ్1 పథకంలో సమూల మార్పులు తెచ్చే ఆలోచనలో ఉంది. లాటరీ పద్ధతి ఎత్తివేసి మెరిట్ ప్రకారం తీసుకోవాలని, ఎచ్1 ఉద్యోగుల కనీస వేతనం భారీగా పెంచడం ద్వారా, సంస్థలు మొదటి ప్రాధాన్యం అమెరికన్లకే ఇచ్చే పరిస్థితి వస్తుందని, ఇంకా అనేకానేక ప్రతిపాదనలు ముందుకు వస్తున్నాయి. వచ్చే కొద్ది నెలల్లో ఈ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఇదే జరిగితే భారతీయ ఐటి రంగంపై అది తీవ్ర ప్రభావం చూపనున్నది.

ఎచ్1 వీసా ఉండి గ్రీన్ కార్డ్‌కు దరఖాస్తు చేసుకున్న ఉద్యోగులు తిరిగి స్వంత దేశాలకు వెళ్తే యుఎస్‌ఎ వ్యాపారాలకు అంతరాయం కలుగుతుంది కాబట్టి, వారిని అమెరికాలోనే కొనసాగించడమే లక్ష్యంగా ఎచ్4 (డిపెండెంట్) వీసా కలిగిన వారి జీవిత భాగస్వాములకు ఉద్యోగం చేసుకునే అవకాశం 2015 మేలో ఒబామా ప్రభుత్వం కల్పించింది. కానీ రెండు సంవత్సరాలు కూడా గడవకముందే ఈ చట్టాన్ని వెనక్కు తీసుకునే సూచనలు కనిపిస్తున్నాయి. మరో రెండు నెలల్లో దీనిపై ట్రంప్ ప్రభుత్వం ఒక నిర్ణయం తీసుకోనుంది. ఈ నిర్ణయం వ్యతిరేకంగా వస్తే సుమారు 50 వేల మంది ఉద్యోగాలు కోల్పోవల్సి వస్తుంది. నేను వృత్తిపరంగా చేసే టెక్నికల్ జాబ్ ఇంటర్వ్యూస్‌లో భాగంగా ఇటీవల ఎచ్1 వీసా కలిగిన కొద్ది మందితో మాట్లాడగా వాళ్లలో చాలా ఆందోళన కనబడింది. ఈ మధ్య వాళ్లకు వచ్చే ఇంటర్వ్యూ కాల్స్ సంఖ్య తగ్గిపోయిందని, అవన్నీ గ్రీన్‌కార్డ్ హోల్డర్స్‌కి, యుఎస్ సిటిజెన్స్‌కే వెళ్తున్నాయని వాపోయారు. ఒకప్పుడు లొకేషన్ ప్రిఫరెన్స్ కోరుకునేవాళ్లు, ఇప్పుడు ఉద్యోగం దొరికితే చాలు ఎక్కడైనా పని చేయడానికి సిద్ధంగా ఉన్నామని చెపుతున్నారు.

ఎఫ్1 వీసా ద్వారా అమెరికా కాలేజీల్లో, యూనివర్సిటీల్లో ఉన్నత విద్య (ముఖ్యంగా మాస్టర్స్) కోసం వచ్చే భారతీయ విద్యార్థుల సంఖ్య నానాటికీ పెరుగుతూ ఉంది. 2005–06లో 76,503 మంది విద్యార్థులు కాగా 2015–16 నాటికి ఆ సంఖ్య 165,918కి పెరిగింది. గత ఏడాది అమెరికాలో విద్యనభ్యసించడానికి వచ్చిన మొత్తం అంతర్జాతీయ విద్యార్థుల్లో అత్యధికంగా 31.5 శాతం చైనా నుండి రాగా, 15.9 శాతంతో రెండవ స్థానంలో భారతీయ విద్యార్థులున్నారు. డాలర్ ప్రపంచంలో తమ అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు వచ్చే భారతీయ విద్యార్థుల ఆశలపై ఈ సంవత్సరం నుండి ట్రంప్ ప్రభుత్వం గండి కొట్టేలా కనబడుతుంది.

ఉన్నత చదువులకు భారతీయ బ్యాంకులు రుణాలు ఇస్తున్నప్పటికీ అది మొదటి సంవత్సరానికే సరిపోతుంది. చాలా కొద్ది మంది విద్యార్థులకు స్కాలర్‌షిప్ రూపంలో ఫీజు భారం తొలగిపోగా, ధనవంతుల పిల్లలు మినహా మిగిలిన విద్యార్థులందరూ వారు చదివే కాలేజీల్లోనో, కుదరకపోతే బయట పెట్రోల్ బంకుల్లోనో, ఇతర షాపుల్లోనో పార్ట్ టైం ఉద్యోగాలు చేసుకుని కాలేజీ ఫీజులు, ఇతర ఖర్చులు వెళ్లదీసుకుంటున్నారు.

చదువు పూర్తయిన తర్వాత వారి చదువుకు సంబంధించిన రంగంలో ఉద్యోగం చేసుకోవడానికి 12 నెలల సమయం (దీనినే ఆప్షనల్ ప్రాక్టికల్ ట్రెయినింగ్ – ఒపిటి అంటారు) ఉంటుంది. ఎస్‌టిఇఎం (సైన్స్, టెక్నాలజీ, ఇంజనీరింగ్ అండ్ మాథమెటిక్స్) విద్యార్థులకు మరో 17 నెలల కొనసాగింపు (ఒపిటి ఇంటర్వ్యూస్)కు అవకాశం ఉంటుంది. ఒపిటి సమయంలో మూడు నెలలు ఖాళీగా ఉన్నా, ఒపిటి సమయం

# తమిళ తంబి చెవిలో పూలు

***దక్షిణాదిలోనే పెద్ద రాష్ట్రమైన తమిళనాడులో జయలలిత మరణంతో రాజకీయ పరిస్థితులు అనిశ్చిత స్థితికి వెళ్లాయనీ, అన్నా డిఎంకె పార్టీలో ముఖ్యమంత్రి పీఠం కోసం జరిగిన పోరులో అంతిమంగా ప్రజాస్వామ్యం ఓడిందనీ అంటున్నారు*** **రాజేంద్రబాబు అర్విణి**

పొలిటీషియన్స్ బిహేవ్ లైక్ పోలిటీషియన్స్ అన్నది ఆంగ్లంలో ఒక నానుడి. రాజకీయ నాయకులు రాజకీయ నాయకుల్లా కాకుండా బుద్ధిమంతుల్లా ప్రవర్తిస్తారా అన్నది భారత దేశంలో సామాన్యుని భావన. రాజకీయాల్లో సూటిగా, స్పష్టంగా ఏదీ ఉండదు అన్నంతగా మన దేశంలో రాజకీయాలు నడుస్తూ ఉంటాయి. అది అరాజకీయమే. కానీ మనకు రాజకీయం లాగా కనిపిస్తుంది. ఈ విషయం ఫిబ్రవరి (2017)లో తమిళనాడులో జరిగిన రాజకీయ ప్రహసనంలో, మార్చి నెలలో జరిగిన ఎన్నికల తతంగంలో మరొక్కసారి రుజువయ్యింది. మార్చి నెలలో అయిదు రాష్ట్రాలలో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో హిమాలయ మంత ఎత్తున విజయశిఖరాలను బిజేపి చేరుకుందని శ్లాఘిస్తూ నరేంద్ర మోడీ నాయకత్వాన్ని మేఘాలను దాటి ఆకాశంలో కూర్చొనబెట్టే ప్రయత్నం చేసింది మీడియా. నిజానికి అయిదు రాష్ట్రాలలో ఎన్నికలు జరిగితే, రెండు రాష్ట్రాలలో (ఉత్తర ప్రదేశ్, ఉత్తరాఖండ్) మాత్రమే బిజేపికి స్పష్టమయిన మెజారిటీ వచ్చింది. అదే స్థాయిలో కాంగ్రెస్‌కు ఒక రాష్ట్రంలో (పంజాబ్)లో మెజారిటీ వచ్చింది. మిగతా రెండు రాష్ట్రాలు గోవా, మణిపూర్‌లలో కాంగ్రెస్ అత్యధిక సీట్లు గెలుచుకోగా, రెండవ స్తానంలో ఉన్న బిజెపి అన్ని ప్రజాస్వామిక సాంప్రదాయాలను, సర్కారియా కమీషన్ సిఫారస్ లను ప్రక్కన పెట్టి, కాంగ్రెస్ లోని బలహీన కేంద్ర నాయకత్వాన్ని ఆసరా చేసుకొని, తమ గవర్నర్‌లు తమ వాళ్ళకే పట్టం కట్టేలా పాచికలు కదిపారు. గోవాలో భారతీయ జనతా పార్టీకి మొత్తం 36 సీట్లలో 13 మాత్రమే వచ్చాయి. ఎన్నికలలో వోటర్ల చూపుడు వేళ్ళపై రుద్దిన సిరా చుక్క తడి ఆరక ముందే, ప్రచారంలో తమను తూర్పారబట్టిన పార్టీలతో జత కట్టి ప్రభుత్వం ఏర్పాటు చేసింది. మణిపూర్ లోనూ అలాగే అయ్యింది. మొత్తం 60 అసెంబ్లీ నియోజకవర్గాలు ఉంటే బిజెపి గెలిచింది 21 సీట్లలోనే. అయినా ఓట్ల సమరంలో తనపై కారాలు మిరియాలు నూరిన వైరిపక్షాలతో జోడీ కట్టి ప్రభుత్వం ఏర్పాటు చేసింది. సర్కారియా కమీషన్ తన నివేదికలో ఇలాంటి పరిస్థితిని కూలంకషంగా చర్చించింది. ఎన్నికల సమయంలో ఒకరి విధానాలను ఒకరు విమర్శించుకొని, ఎవరి మేనిఫెస్టో వారు ప్రకటించి ఓట్లు వేయించుకొని ఎన్నికల తర్వాత అధికారం కోసం వెంటనే చేతులు కలపడం ప్రజాస్వామ్యంలో ఆచరించాల్సిన పద్ధతి కాదని స్పష్టంగా చెప్పింది. అందుకని అత్యధిక సీట్లు గెలిచిన పార్టీకి ప్రభుత్వం ఏర్పాటు చేసే

---

పూర్తయ్యే సరికి ఎచ్1 వీసా తెచ్చుకోలేకపోయినా ఇంటి దారి పట్టాల్సిందే. సరిగ్గా ఇక్కడే కన్సల్టెన్సీ కంపెనీలకు ఒక పెద్ద వ్యాపార వస్తువు దొరికింది. తల్లిదండ్రులతో లక్షలు ఖర్చు పెట్టించి లేదా అప్పు చేయించి మూడు నెలలు ఉద్యోగం లేదనే కారణంగా వెనక్కి వెళ్లడం ఇష్టం లేని విద్యార్థులే పెట్టుబడిగా కుప్పలు తెప్పలుగా కన్సల్టెన్సీలు వెలిశాయి. మరొకరితో ఉద్యోగ ఇంటర్వ్యూ చేయించడం దగ్గరి నుండి, నకిలీ ఎచ్1 వీసాతో విద్యార్థుల భవిష్యత్తుతో ఆడుకోవడం వరకు వీరు తొక్కని, విద్యార్థులతో తొక్కించని అడ్డదారులు లేవు.

ఒపిటి – ఎచ్1 వీసాలపై ట్రంప్ ప్రభుత్వం ప్రత్యేక దృష్టి పెట్టడంతో తాత్కాలికంగానైనా ఈ కన్సల్టెన్సీల ఆగడాలకు చెక్ పెట్టినట్టయింది. వచ్చే నెల మొదలయ్యే ఎచ్1 దరఖాస్తుల స్వీకరణకు ముందుకొచ్చే కన్సల్టెన్సీలు కరువయ్యాయంటేనే పరిస్థితి ఎలా ఉందో అర్థం చేసుకోవచ్చు. ఈ సంవత్సరం జరగబోయే పరిణామాలతో వచ్చే సంవత్సరం రాబోయే విద్యార్థుల సంఖ్య గణనీయంగా తగ్గే అవకాశాలున్నాయి.

ఫిబ్రవరి 22న 32 సంవత్సరాల శ్రీనివాస్ కూచిబొట్ల అనే తెలుగు యువకుడిపై జరిగిన జాత్యహంకార కాల్పుల ఉదంతం అమెరికాలో నివాసమున్న యావత్ భారతీయులను, మన దేశంలో ఉన్న వారి సంబంధీకులను కుదిపివేసింది. ఇది జరిగి రెండు వారాలు గడవకముందే 39 సంవత్సరాల దీప్‌రాయ్ అనే మరో భారతీయుడిపై కాల్పులు జరిపి గాయపరిచిన సంఘటన సర్వత్రా ఆందోళనలు రేపుతోంది.

అడపా దడపా స్కూళ్లలో, బహిరంగ ప్రదేశాలలో జరిగిన కాల్పుల ఘటనలు భయాందోళనలు కలిగించినా అవి ఉన్మాదుల దాడులుగా భావించి తేరుకున్నారు. కానీ ఇప్పుడు జరిగిన జాత్యహంకార దాడులతో భారతీయుల్లో తీవ్ర అభద్రతా భావం నెలకొని ఉంది. ఇంతకు ముందు రాత్రుళ్లు స్వేచ్ఛగా తిరిగే ప్రదేశానికి అత్యవసరమైతే తప్ప వెళ్లే పరిస్థితి లేదు. బయట తారసపడే అమెరికన్లను అనుమానంతో చూడాల్సి వస్తుంది. నాకు తెలిసిన మిత్రులతో చర్చించినప్పుడు, మేమున్న ప్రదేశంలో రిటైర్డ్ మిలిటరీ (వెటరన్స్) వాళ్లు ఎక్కువని, బయట తిరగడం అంత శ్రేయస్కరం కాదని హెచ్చరించారు. నాకున్న చనువుతో నా సహోద్యోగులైన అమెరికన్లతో చర్చించగా, వారిలో భిన్న రాజకీయ దృక్పథాలున్నప్పటికీ ఇతర దేశస్తులపై జరిగే విద్వేష దాడులను ముక్తకంఠంతో ఖండించారు. అమెరికా భిన్న సంస్కృతులను తనలో ఇమడ్చు కుంటుందని, అదే అమెరికా స్వభావమని ట్రంప్‌ని వ్యతిరేకించే ఒక అమెరికన్ సహోద్యోగి చెప్పాడు. ఎచ్1 ప్రీమియం వీసాల రద్దుతో మొదలైన భారతీయుల కష్టాలు రాబోయే కాలంలో ఇంకా దయనీయంగా మారే పరిస్థితులు కనిపిస్తున్నాయి.

*(రచయిత అమెరికాలో సాఫ్ట్‌వేర్ నిపుణులు)* వీ

అవకాశం ఇచ్చి మెజారిటీ నిరూపించుకొనే సమయం ఇవ్వాలని సిఫారసు చేసింది. మెజారిటీ నిరూపించుకోవడం కొత్తగా ఎన్నికైన ముఖ్యమంత్రి సమర్థత, అందరినీ కలుపుకుపోయే తత్వం పై ఆధారపడి ఉంటుంది. ఈ ప్రజాస్వామిక సాంప్రదాయాన్ని ఆయా రాష్ట్రాల గవర్నర్లు గాలికి వదిలేసారు. గవర్నర్ తీర్థం పుచ్చుకోవడానికి ముందు వారు బీజేపిలో క్రియాశీలక సభ్యులేగా! తొండో మొండో పాతి ముట్టినవాడిదే కరెక్టు అన్న చందంగా ప్రవర్తించింది బిజెపి. ఈ పార్టీ గెలిచిన రాష్ట్రాలలో అంతకు ముందు ఉన్న ప్రభుత్వాలపై వ్యతిరేకత అన్న అంశం బాగా పనిచేసిందన్న విషయం ఇక్కడ గమనార్హం. ప్రభుత్వ వ్యతిరేకతను బాగా ఉపయోగించు కోగలిగే నేర్పు, ఎన్నికల యంత్రాంగం బిజేపికి ఉండడం ఓ సానుకూల అంశం.

తమిళనాడులో మరో విధంగా ప్రహసనం నడిచింది. గవర్నర్ విద్యాసాగర్ రావుది మరో కథ. ఒక రాష్ట్రానికి ఆయన గవర్నర్. ఆయన గవర్నర్‌గా ఉన్న రాష్ట్రంలో ఏ రాజకీయ అనిశ్చితి లేదు. అంతా ప్రశాంతంగా ఉంది. అత్యవసరంగా గవర్నర్ చేపట్టాల్సిన పనులేమీ లేవు. ఆయనకు తమిళనాడు రాష్ట్రానికి గవర్నర్‌గా అదనపు బాధ్యతలు అప్పగించారు. ఆ రాష్ట్రంలో ప్రజాస్వామ్యంగా ఎన్నికయిన ముఖ్యమంత్రి అనారోగ్య కారణంగా మరణించారు. మరణించిన రెండు గంటల్లోనే మరొకరిని ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు. అంతవరకు బాగానే ఉంది. కొత్త ముఖ్య మంత్రి పదవి చేపట్టిన వారం రోజుల్లోనే వార్ధా తుఫాను చెన్నై నగరాన్ని, తమిళనాడు తీర ప్రాంతాలను గడగడ లాడించింది. ఆ తర్వాత డెల్టా ప్రాంతంలో రైతుల ఆత్మహత్యలు రాష్ట్రం మొత్తం కలకలం రేపాయి. కొద్ది రోజులకే జనవరి మాసంలో తమిళ సంస్కృతీ పరిరక్షణ ఉద్యమం జల్లికట్టు రూపంలో ఉప్పెన లాగావచ్చింది. మెరీనా బీచ్ జనసంద్రమే అయ్యింది. ఆ ఉద్యమం సద్దుమణిగిందోలేదో అధికార పార్టీ శాసనపక్ష నేతను మారుస్తున్నట్టు ఏకగ్రీవ తీర్మానం చేసింది. ముఖ్యమంత్రి రాజీనామా లేఖను సమర్పించాడు. ఇంకో ముఖ్యమంత్రిని నియమించాల్సిన అత్యవసర పరిస్థితి ఏర్పడింది. ఇంచార్జ్ గవర్నర్ విద్యాసాగర్ రావ్ మాత్రం తీరిగ్గ మూడవ రోజు గాని ఆ రాష్ట్ర రాజధాని చేరుకోలేదు. ఈ మూడు రోజుల్లో ఆయన చేసిన రాచకార్యా లేమిటంటే న్యూ ఢిల్లీలో ఓ పెళ్ళికి హాజరవడం, ఓ కేంద్ర మంత్రితో భేటీ, ముంబాయ్‌లో నోబుల్ బహుమతి గ్రహీతలతో మీటింగ్. ఇలాంటి రాచకార్యాలను తీరిగ్గా ముగించుకొని ఆయన ఫిబ్రవరి 9కి గాని చెన్నై చేరుకోలేదు. (పన్నీర్ సెల్వం రాజీనామా చేసింది ఫిబ్రవరి 5 న). సంక్షోభం వస్తే పరిష్కరించాల్సిన గవర్నర్, అధికార పార్టీలో సంక్షోభం మొలకెత్తడానికి తన వంతు క్రుషిగా తగిన సమయం ఇచ్చాడు. కొన్ని గంటలలో జరగాల్సిన అధికార మార్పిడి జరగకుండా కొన్ని రోజులు, వారాలు నిలువరించాడు. ఆ తర్వాత ఆయన ఇచ్చిన సంకేతం ఏమిటంటే, మరణించిన ముఖ్యమంత్రికి సంభందించి ఆదాయానికి మించి ఆస్తులు పోగుచేసుకున్న వ్యాజ్యంలో సుప్రీం కోర్టు తీర్పు ఇవ్వబోతుందని, అందుకోసం కొత్త ముఖ్యమంత్రిని నియమించడంలో ఆలస్యం అవుతుందని. ఆ కేసులో నూతనంగా ఎన్నికయిన శాసన సభాపక్ష నేత కూడా సహ ముద్దాయి. ఆ తీర్పు ఫలానా విధంగా రాబోతుందని గవర్నర్‌కు ముందే తెలుసా? అవతలి వ్యక్తి శశికళ కావడం, శశికళ కళంకిత చరిత, అవినీతి పోకడలు ప్రజల దృష్టిలో ఉంది కాబట్టి, ఆమెకు ప్రజా బాహుళ్యం నుండి నైతిక మద్దతు ఏ కోశానా లేదు కాబట్టి, గవర్నర్ చర్య పై పెద్ద చర్చ జరగలేదు. శశికళ స్థానంలో మరొకరు ఉండి ఉండుంటే విద్యాసాగర్ రావు అప్రజాస్వామిక పోకడ చాలా విమర్శకు గురయ్యేది. చరిత్రలో గర్హించ దగ్గ పనిగా మిగిలి పోయేది. సుప్రీంకోర్టు తీర్పు కూడా గవర్నర్ పథకానికి అనుకూలంగా వచ్చింది కాని, న్యాయ వ్యవస్థ కు, రాజకీయ వ్యవస్థకు మధ్య అనంగీకారమైన సంబంధం ఉన్నదన్న అనుమానం రేకెత్తించింది.

ఈ సందర్భంగా అత్యున్నత న్యాయస్థానం తీర్పు ఇచ్చిన ఆ వ్యాజ్యాన్ని గురించి కొంత చర్చించడం అవసరం. నిజానికి అది చరిత్రాత్మకమయిన తీర్పు. చాలా ఉత్కంఠ రేపిన తమిళనాడు రాజకీయ పరిమాణాలు సంభవిస్తున్న తరుణంలో వెలువడిన తీర్పు కాబట్టి, పెద్దగా ఫోకస్ కాలేదు కాని, అది ఈ దేశంలో రాజకీయ నాయకుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తేవిధంగా వెలువడ్డ తీర్పు. మన దేశంలో రాజకీయ నాయకుల ఆదాయం పదవి లోకి రాగానే అనూహ్యంగా పెరిగిపోవడం, దోచుకున్న ఆ సొమ్మును దాచుకోవడానికి వివిధ మార్గాలు అవలంబించడం పరిపాటి. 1991లో రూ: 2.1 కోట్లుగా ఉన్న జయలలిత ఆదాయం 1996 కల్లా రూ: 64.44 కోట్లకు పెరిగింది. ఆ ఆదాయం దాచుకోవడానికి శశికళ, ఆమె బంధువులు ఇద్దరి సహకారంతో 34 కుహనా కంపినీలు తెరిచింది. వాటిల్లో పదింటిని ఒకే రోజు, మరో ఆరింటిని మరో రోజు రిజిస్టర్ చేసారు. ఈ కంపెనీల కోసం 50 బాంక్ ఖాతాలు తెరిచారు. వాటిల్లో 47 ఖాతాలు ఒకే బాంకులోనే ఉన్నాయి. ఈ కంపినీలకు మార్కెట్ ధర కంటే తక్కువ ధరకు ఆస్తులు కొనటం తప్ప మరో వ్యాపకం లేదు. తమవైపు చూసే ధైర్యం ఎవరికి ఉంటుందిలే అన్న ధీమాతో దబ్బు దాచుకోవడానికి అనేక వక్ర మార్గాలు అవలంబించారు. ఈ కేసును మొదట ట్రయల్ కోర్ట్ విచారించింది. ఈ అక్రమార్జనను కోర్ట్ దృష్టికి తీసుకెళ్ళిన ఫిర్యాదు దారుదు సుబ్రమణ్యస్వామి అభ్యర్థన మేరకు ఈ విచారణను తమిళనాడులో కాకుండా బయటి రాష్ట్రమయిన కర్నాటకలో చేపట్టారు. అది మంచి ఫలితాన్నే ఇచ్చింది. ప్రత్యేక ట్రయల్ కోర్టు జడ్జి జాన్ మైఖేల్ డి కునహ శ్లాఘనీయమయిన తీర్పు వెలువరించాడు. ఆదాయాన్ని మించి ఆస్థి ఉందని నిర్ధారిస్తూ, జయలలితతో పాటు దోషు లందరికి నాలుగు సంవత్సరాల జైలు శిక్ష, పెద్ద ఎత్తున జరిమానా విధించాడు. పలుకుబడి గల అతి శక్తివంతమైన రాజకీయ నాయకురాలు జయలలిత ప్రభావానికి లోబడకుండా ట్రయల్ కోర్టు జడ్జ్ చరిత్రలో నిలిచిపోయే న్యాయ నిర్ణయం చేసాడు. కానీ కర్నాటక హైకోర్టు న్యాయమూర్తి సి ఆర్ కుమారస్వామి 'కూడికలు సరిగ్గా లేవని' తప్పుబట్టి ఆ తీర్పును కొట్టి వేసాడు. సుప్రీంకోర్ట్ ట్రయల్ జడ్జి తీర్పునే సమర్థించింది. ఈ వ్యాజ్యాన్ని పరిశీలిస్తే, మన న్యాయవ్యవస్థ లో ఉన్న లోపాలు కూడా మనం గమనించవచ్చు. ఈ కేసులో తుది తీర్పు వెలువడడానికి 18 సంవత్సరాలు పట్టింది. ఈ పద్దెనిమిది సంవత్సరాల కాలంలో జయలలిత మూడు సార్లు ముఖ్యమంత్రిగా ఎన్నికయి (మూడవ సారి ఎన్నికయిన ఆరు నెలలకే మరణించింది) తమిళనాడును తన గుప్పిట్లో ఉంచుకుంది. జయలలితను నిర్దోషిగా కితాబునిచ్చిన కర్నాటక హైకోర్టు జడ్జికి ఎలాంటి శిక్ష లేదు. శశికళ కూడా పన్నీర్ సెల్వం లాగా తనకు అణిగిమణిగి ఉంటుందని కేంద్ర ప్రభుత్వానికి నమ్మకం కలిగిఉంటే తీర్పు ఇప్పుడు వచ్చి ఉండేదా, ఇలాగే వచ్చిఉండేదా అన్న అనుమానం కలుగక మానదు. అలాంటి అనుమానం కలగడానికి ఆస్కారం ఉంది, అలా అనుమానం వచ్చేలా గవర్నర్, కేంద్రం ప్రవర్తించారు.

కేంద్రంలోని భారతీయ జనతాపార్టీకి తమిళనాడులో పెద్దగా స్థానం లేదు. హిందీ వ్యతిరేకోద్యమంతో ఉత్తరాది ఆధిపత్య రాజకీయాలను ససేమిరా ఒప్పుకోమని తేల్చి చెప్పిన జాతి తమిళ జాతి. తమిళులు రావణుణ్ణి బ్రహ్మగా పూసిస్తే, బిజెపి రామ మందిర నిర్మాణాన్ని సదా జపిస్తుంది. అయినా తన రాజకీయాలకు తమిళనాడులో కూడా బలమయిన స్థానం ఏర్పాటు చేసుకోవాలని బిజెపి ప్రయత్నిస్తూనే ఉంది. జయలలిత మరణంతో ఏర్పడ్డ ఖాళీని తన మనిషితో భర్తీ చేసుకొని మెల్లమెల్లగా తమిళనాడులో స్థిరపడదామని, రాజ్యసభలో మెజారిటీలేని లోపాన్ని పూరించుకుందామని ఆశపడింది. ఒక రాజకీయ పార్టీ కొత్త ప్రాంతాలకు విస్తరించాలనుకోవడం, బలపడాలనుకోవడంలో తప్పులేదు. కాని, అది ప్రజల మధ్య జీవిస్తూ, ప్రజల సమస్యలే కేంద్రంగా పోరాడుతూ ప్రజలతో మమేకం చెందుతూ ఎదగాలి. కాని బిజెపి మరో మార్గం ఎంచుకుంది. అణుకువగా ఉండే పన్నీర్ సెల్వంను (తన రాజీనామా పత్రంతో ప్రధాన మంత్రి నరేంద్రమోడీకి ధన్యవాదాలు తెలియజేశాడు పన్నీర్ సెల్వం) ముఖ్యమంత్రిగా కొనసాగించి తమిళనాడు ప్రభుత్వాన్ని తన కనుకూలంగా మార్చుకుందామనుకుంది. కాని అన్నా డిఎంకెలో పరిస్థితులు వేరేలా ఉన్నాయి. పార్టీ రహస్యాలన్నీ శశికలకు మాత్రమే తెలుసు. పార్టీ ఆర్థిక వనరులన్ని ఆమె గుప్పెట్లోనే ఉన్నాయి. పార్టీలో సీనియర్లకు, యువ ఎంఎల్ఏలకు ఆమె అవసరం ఉంది. జనరల్ కౌన్సిల్ ఆమెను జనరల్ సెక్రెటరిగా నామినేట్ చేసింది. ప్రధాన కార్యదర్శి అయిన శశికళకు అధికారాన్ని ఇంకొకరితో పంచుకోవడం ఇష్టం లేకపోయింది. దాంతో కేంద్రం తన అధికార దర్పంతో పన్నీర్ సెల్వం వ్యతిరేక వర్గాన్ని బెదిరించడానికి పూనుకొంది.

శశికళ ముఖ్యమంత్రి కావాలన్ని డిమాండ్ డిసెంబర్ 17న ....మొదలయ్యింది. వెనువెంటనే డిసెంబర్ 21 ఉదయం 5:30 గంటలకు ఆదివారం పన్నుశాఖ అధికారులు తమిళనాడు రాష్ట్ర ఛీఫ్ సెక్రెటరి జయలలిత నమ్మిన బంటు, శశికళకు వావాల్సిన వ్యక్తి రాంమోహన్ రావు ఇంటి తలుపులు తట్టారు. సచివాలయంలో అధికార కేంద్రమయిన ఛీఫ్ సెక్రెటరీ కార్యాలయాన్ని సోదా చేశారు. నిజానికి సెర్చ్ వారంట్ ఉన్నది రాంమోహన్ రావు కుమారుడు వివేక్ పేరుమీద. వివేక్ నివాసం కూడా అధికాదు. అంతకు కొద్ది రోజుల ముందు ఆంధ్రప్రదేశ్‌లోని తిరుపతి తిరుమల దేవస్థానం బోర్డ్ మెంబర్ జి. శేఖర్ రెడ్డి జయలలితకు సన్నిహితుడు. తమిళనాడు ప్రజా సంబంధపనుల శాఖలో కాంట్రాక్టరు. ఆ శాఖకు సంబంధించిన అన్ని పనులకు తన పేరు మీదో, బినామీల పేరుమీదో ఆయనే కాంట్రక్టరు. తమిళనాడు రాష్ట్రం మొత్తం మీద ఎక్కడయినా ఇసుక తవ్వి తీసుకెళ్లడానికి జయలలిత ప్రభుత్వం నుండి లైసన్స్ తీసుకున్నాడు. శేఖర్ రెడ్డి దగ్గర పట్టుబడిన మొత్తం కరెన్సీ రు. 132 కోట్లు, 177 కిలోల బంగారం. అందులో కొత్తగా వచ్చిన రు. 2000 నోట్లు ర. 34 కోట్ల విలువగలవి. ఆ మొత్తం ఎక్కనుంచి ఎలా వచ్చింది. అన్ని కోట్ల కొత్త కరెన్సీ నోట్లు శేఖర్ రెడ్డి దగ్గరకు ఎలా చేరాయి. అందులో రిజర్వు బ్యాంక్ పాత్ర ఏమిటి అన్న విషయాలు ఎవరికీ పట్టకుండా పోయాయి. సర్జికల్ స్ట్రైక్ లాగా రాంమోహన్ రావు, శేఖర్ రెడ్డి ఇళ్లలో సోదాలు జరిపారు. రాజకీయ ఉద్దేశాలకే పరిమితం కాకపోతే ఈ కేసులో పెద్దపెద్ద తిమింగలాలు బయటపడే అవకాశం ఉండేది. కాని అంతటితో గప్ చుప్ అయిపోయింది.

తమిళ ప్రజల మనోభావాలతో ఆడుకునే ప్రయత్నం చేసిన మరో వికృత శక్తి శశికళ. ఒక ముఖ్యమంత్రితో చాలా సన్నిహితంగా మెలిగినంత మాత్రాన ఆ ముఖ్యమంత్రి తర్వాత ముఖ్యమంత్రి పదవి అధిష్టించే అర్హత సహజ సిద్ధంగా ఉంటుందనుకోవడం అర్థరహితం. ఒక రాష్ట్రానికి ముఖ్యమంత్రి కావాలంటే తగినంత రాజకీయ అనుభవం ఉండాలి. ప్రజాభిప్రాయం అనుకూలంగా ఉండాలి. వర్తమానలో జరుగుతున్న పరిణామాల గురించి విషయ పరిజ్ఞానం పరిపుష్టిగా ఉండాలి. మరీ ముఖ్యంగా ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి తన వంతు కృషి చేసిన చరిత్ర కలిగి ఉండాలి. ఇవేవి శశికళకు లేవు. శశికళకు ఉన్నదల్లా జయలలితతో 33 ఏళ్ల అనుబంధం. ఆమెను అంటిపెట్టుకొని "కంటికి రెప్పలా కాపాడింది అని చెప్పుకోవడం తప్ప ఆమెకు ఏ అర్హతాలేదు. అన్నా డిఎంకె పార్టీలో జరిగే పరిణామాలను గత నాలుగు దశాబ్దాలుగా సూక్ష్మస్థాయిలో పరిశీలిస్తున్న సీనియర్ జర్నలిస్టు దురై కరుణానిధి అభిప్రాయం ప్రకారం పార్టీ సభ్యులు, అభిమానులు 95 శాతం మంది సామాన్య ప్రజలు 100 శాతం శశికళను ముఖ్యమంత్రిగా ససేమిరా ఒప్పుకోరు. అయితే, ఆ పార్టీలో ఆమెపట్ల ఉన్న వ్యతిరేకతను సమన్వయపరిచి, శశికళ వ్యతిరేక పోరాటాన్ని ముందుకు తీసుకుపోగలిగే సత్తా ఉన్న నాయకుడు ప్రస్తుతం లేదు అని ఆయన తేల్చిచెప్పాడు.

1980లలో ఆల్ ఇండియా అన్నా డిఎంకె ప్రచార కార్యదర్శిగా జయలలిత నియమింపబడ్డ సమయంలో కడలూర్‌లో శశికళ "వినోద్ వీడియో విజన్" అన్న ఒక వీడియో షాప్ నడుపుతూ ఉండేది. ఆమె భర్త నటరాజన్ కడలూర్‌లో ప్రభుత్వ పౌర సంబంధాల అధికారి. ఆ రకంగా ఆమెకు కడలూర్‌లో జరుగుతున్న ఎఐడిఎంకె పార్టీ సర్వసభ్య సమావేశాలకు వీడియో తేసేపని లభించింది. ఆ సమావేశాలలో జయలలిత మొట్టమొదటిసారి ప్రచార కార్యదర్శి హోదాలో ప్రసంగించింది. అలా జయలలితతో పరిచయం చివరికి పోయస్ గార్డెన్ (జయలలిత నివాసం)లో తిష్టవేయడం మాత్రమే కాకుండా ముఖ్యమంత్రి పదవికి వారసురాలిననే దాకా ఎదిగింది. జయలలిత తమిళనాడు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో (1991 నుండి 1996 దాకా) శశికళ రాజ్యాంగేతర శక్తిగా అపరిమితమైన అధికారం అనుభవించింది. 2001 నుండి 2006 వరకు తిరిగి 2011 నుండి 2016 వరకు జయలలిత మళ్లీ ముఖ్యమంత్రిగా కొనసాగిన కాలంలో ప్రభుత్వంలో, పార్టీలో తెరవెనుక భాగోతం నడపడంలో కీలక పాత్ర వహించింది. 1996 ఎన్నికలలో అన్నా డిఎంకె పార్టీ ఘోర పరాజయం పాలయ్యింది. అందుకు కారణం శశికళ విచ్చల విడి సంపాదన, అధికార దురహంకార ప్రవర్తన కారణమని, జయలలిత ఆమెతో సన్నిహితంగా ఉండడం ప్రజలకు నచ్చలేదని అన్నాడిఎంకె సర్వసభ్య సమావేశం శశికళను అభిశంసించింది. శశికళను శశికళ కుటుంబాన్ని దూరం చేసుకొమ్మని జయలలితపై ఒత్తిడి తీసుకువచ్చింది. ఒత్తిడికి తలొగ్గి జయలలిత శశికళను పార్టీ నుండి, ఇంటి నుండి జయటికి గెంటివేసింది. కొద్దికాలం తర్వాత తాను భవిష్యత్తులో సరిగ్గా నడుచుకుంటానని, రాజకీయాలలో తలదూర్చనని క్షమాపణ పత్రం రాసి ఇచ్చి శశికళ జయలలిత పంచన చేరింది. తదనంతర కాలంలో ఇంతింతై వటుడింతై అన్నట్లుగా పార్టీ మొత్తం ఆక్రమించింది. ఆమె వ్యక్తిగత జీవితంలో గాని, రాజకీయ జీవితంలో గాని సామాన్య ప్రజలు, వారి సమస్యలు, ఆ సమస్యలు తీరటం కోసం ఆరాటపడడం ఎక్కడా కన్పించదు.

మొదట పన్నీరు సెల్వంను ముఖ్యమంత్రిగా శశికళ అంగీకరించింది. జయలలిత మరణించిన కొద్ది సేపట్లోనే పార్టీ ముఖ్యులంతా సమావేశమై పన్నీరు సెల్వంను ముఖ్యమంత్రిగా నిర్ణయించారు. ఆ భేటీలో శశికళనే ప్రధాన పాత్ర వహించింది. శాసనసభ పదవీకాలం పూర్తయ్యే వరకు అంటే ఇంకా నాలుగున్నరేళ్లు తనను ముఖ్యమంత్రిగా కొనసాగనిస్తే తాను ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తానని, మాటమాటకి ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా ఉండనంటే ఉండనని పన్నీరు సెల్వం మొరాయించాడు. ఆయన పెట్టిన నాలుగున్నర ఏళ్లు ముఖ్యమంత్రిగా అవకాశం ఉంటుందన్న 'షరతు'కు ఒప్పుకొని పన్నీరు సెల్వంను ముఖ్యమంత్రిగా చేశారు. కాని రెన్నెళ్ల కాలంలో పన్నీరు సెల్వం అటు కేంద్రంతో బాగుంటూ ఏమీ ఆర్భాటం లేకుండా పరిపాలన సాగిస్తుంటే ఆయన్ను స్థిరపడనిస్తే తన పని అవుటేననుకొని తన వంధిమాగధులతో పార్టీ ప్రధాన కార్యదర్శి, ముఖ్యమంత్రి ఒక్కరే ఉండాలన్న డిమాండ్ పెట్టించింది. ఖచ్చితమైన కారణాలు ఇదమిద్ధమని రుజువు కాలేదు కాని నరేంద్ర మోడీకి శశికళ అంటే వ్యతిరేక భావం ఏర్పడింది. తాను చేసిన అక్రమ ధనార్జన, రాజ్యాంగేతర శక్తిగా చూపిన ప్రవర్తన మూలంగా ఇప్పుడు జైలు చువ్వలు లెక్కపెడుతుంది.

ఇటీవల దేశం వీక్షించిన రాజకీయ చదరంగంలో ముఖ్యమయిన పావు పన్నీరు సెల్వం. పన్నీరు సెల్వంకు సాత్వికుడనే పేరుంది. పెరియాకులం పట్టణంలో టీ కొట్టు నడుపుకుంటున్న తనకు రాజకీయ జీవితం ప్రసాదించిందని, మొదటి మున్సిపల్ చైర్మన్‌గా, తరువాత ఎంఎల్ఏగా, తదుపరి మంత్రిగా, ఆ తర్వాత ఏకంగా ముఖ్యమంత్రిగా చేసిందన్న విశ్వాసంతో జయలలితకు నమ్మిన బంటుగా ఉన్నాడు. కాని జయలలిత చేసిన అక్రమ ధనార్జన, అప్రజాస్వామిక చర్యలకన్నింటికి పన్నీరు సెల్వం మౌన సాక్షిగా ఉన్నాడు కాని అదేమని ప్రశ్నించలేదు. తమిళనాడు ఇసుక కాంట్రాక్టర్, ప్రజాసంబంధమయిన పనులకు ఏకైక గుత్తేదారు, వందల కోట్ల నల్లడబ్బు అధిపతిగా అరెస్టయిన జి. శేఖర్ రెడ్డి కాంట్రాక్టర్‌గా ఎదిగింది పన్నీరు సెల్వం పబ్లిక్ వర్క్స్ శాఖ మంత్రిగా ఉన్న కాలంలోనే. అన్నా డిఎంకె అభిమానులు 'అమ్మ'గా పిలుచుకునే జయలలిత 2000లో అవినీతి నిరోధక చట్టం కింద ఒక సంవత్సరంపాటు కఠిన కారాగార శిక్ష అనుభవించిన మొట్టమొదటి ముఖ్యమంత్రి. బహుళ అంతస్తుల హోటల్ ప్లెజెంట్ యాజమాన్యం అక్రమంగా నిర్మించిన 5 అంతస్తులను ముఖ్యమంత్రి హోదాలో క్రమబద్ధీకరించిన అక్రమానికి ఆమె జైలు పాలయ్యింది. మళ్లీ 2014లో ఆదాయానికి మించి ఆస్తులు కలిగి ఉందని రుజువయి మళ్లీ జైలు పాలయ్యింది. ఇట్లాంటి జయలలితకు నమ్మకస్థుడు, కుడిభుజం అయిన పన్నీరు సెల్వం సచ్ఛీలుడంటే ఎవరు నమ్ముతారు!

జయలలిత మరణం తర్వాత పన్నీరు సెల్వం ముఖ్యమంత్రిగా పదవి చేపట్టాడు. అప్పట్నించి ఆయన పరిస్థితి ఆడకత్తెరలో పోకచెక్కలాగా అయిపోయింది. ఒక వైపు ముఖ్యమంత్రి పదవి నుండి దిగిపోవాలని శశికళ వర్గం, మరో వైపు ముఖ్యమంత్రిగా కొనసాగాలని కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం. ఏం చేయ్యాలో తోచని స్థితిలో సతమతమయ్యాడు పన్నీరు సెల్వం. చివరికి రాజీనామా చేసి శశికళనే శాసనసభా పక్ష నేతగా తాను ప్రతిపాదించి ఆమె ఏకగ్రీవంగా ఎన్నిక కావడానికి మార్గం సుగమం చేశాడు. ఆ తర్వాత నన్ను బలవంతపెట్టి రాజీనామా చేయించారని వాపోయాడు. ఇది హాస్యాస్పదం. ముఖ్యమంత్రిగా ఉన్న వ్యక్తి ఒకరు బలవంతపెడితే లొంగడమేమిటి?

జయలలిత అధికారాన్ని ఉపయోగించుకొని లెక్కకు మించిన ఆదాయాన్ని వెనకేసుకుంటున్నా ఆమెకు నమ్మకంగా గొడుగుపట్టి 'నీ బాంచను దొరసాని' అన్న రీతిలో సేవచేసినా, శశికళ పట్ల ఉన్న తిరస్కార భావంతో తమిళ ప్రజలు పన్నీరుసెల్వం పక్షమే వహించారు. సానుభూతి తోనో, రాజకీయ అనుభవం ఉన్నవాడు. నలభై ఏళ్ల నుండి (పన్నీర్‌సెల్వం పార్టీలో చేరింది 1977లో) కార్యకర్తలతో ప్రజల మధ్య ఉన్నాడనో పన్నీర్ సెల్వం ముఖ్యమంత్రిగా కొనసాగాలని ప్రజలు కోరుకున్నారు. శశికళతో విభేదించి పన్నీర్ సెల్వం బయటికి వచ్చిన సందర్భంలో 'నేను ఒపిఎస్‌ను బలపరుస్తున్నాను' అన్న ఒక ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. ఒక టెలిఫోన్ నంబర్ ఇచ్చి, సెల్వంను సమర్థిస్తున్నట్టయితే ఆనంబర్‌కు ఒక మిస్డ్‌కాల్ ఇవ్వమని ప్రజలను కోరారు. ఈ ప్రచార కార్యక్రమానికి అనూహ్య స్పందన వచ్చింది. మొదటి 3 గంటలలోనే 1.2 లక్షల ఫోన్ కాల్స్ నమోదు అయ్యాయి. అందులో 3 శాతం మంది దేశంబయట ఉన్నవాళ్లయితే 6.5 శాతం తమిళనాడు కాక బయటి రాష్ట్రాల్లో ఉన్నవారు. మిగతా 90 శాతం మంది తమిళనాడు ప్రజలే!

తమిళ ప్రజలలో బాగా పాదుకొని ఉన్న పార్టీ అన్నాడిఎంకె. ఆ పార్టీ చెపుతున్న దాని ప్రకారం 1.72 కోట్ల మంది సాధారణ సభ్యులు ఉన్నారు. గ్రామ, పట్టణ స్థాయిలో పార్టీకి ఒక లక్ష శాఖలు ఉన్నాయి. యువజన విభాగం, మహిళా విభాగం, విద్యార్థి విభాగం, మత్స్యకారుల విభాగం, రైతు విభాగం లాంటివి 14 పార్టీ విభాగాలు ఉన్నాయి. ఈ 14 విభాగాలకు సంబంధించి ప్రతి గ్రామంలో 10 శాఖలు పని చేస్తుంటాయి. ప్రతి గ్రామంలో ఒక్కో శాఖకు 9 మంది కార్యవర్గ సభ్యులు ఉంటారు. అంటే అన్ని విభాగాలకు సంబంధించి రాష్ట్రం మొత్తం గ్రామ, పట్టణ శాఖలలో 90 లక్షల మంది కార్యవర్గ సభ్యులు ఉంటారు. అంత యంత్రాంగం ఉన్న పార్టీకి మకుటం లేని మహరాణిలా వెలుగొందాలను కుంది శశికళ. కాని విధిలేని పరిస్థితులలో ఇప్పుడు పళని స్వామిని ముఖ్యమంత్రిని చెయ్యాల్సి వచ్చింది. అయినా శశికళనే పార్టీ ప్రధాన కార్యదర్శిగా కొనసాగుతూనే ఉంది. తాను జైల్లో ఉందిగాబట్టి పార్టీ వ్యవహారాలు చూడడానికి తన సమీప బంధువు టిటివి దినకరన్‌ను పార్టీ డిప్యూటీ జనరల్ సెక్రటరీగా నియమించింది. అంతేకాకుండా జయలలిత మరణం వల్ల ఏర్పడిన ఖాళీలో దినకరణ్‌నే ఎంఎల్ఏగా పోటీ చేయిస్తుంది. పార్టీ వ్యవస్థాపక సభ్యుడు, సీనియర్ సభ్యుడయిన మధుసూదన్ పన్నీర్ సెల్వం తరఫున పోటీలో ఉన్నాడు. జయలలిత మేనకోడలు దీప కూడా జయలలిత వారసురాలిని తనేనని చెపుతూ అదే స్థానానికి పోటీ చేస్తున్నాం. ఏమైనా ఏప్రిల్ 12న జరగబోయే ఈ ఉప ఎన్నిక అత్యంత రసవత్తరంగా ఉంటుంది.

పెరియార్ లాంటి సంఘ సంస్కరణోద్యమాలు నిర్మించిన చారిత్రక వ్యక్తులు జన్మించిన గడ్డ తమిళనాడు. రాజాజి, కామరాజ్ నాడార్, అన్నాదురై లాంటి జాతీయ నాయకులు తమిళనాడు దేశంలోనే ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించారు. తమిళుల ఆత్మగౌరవాన్ని నిలిపిన ఆ రాజకీయ నాయకులకు తలవంపు తెచ్చే విధంగా ఈ తరం నాయకులు ప్రవర్తించారు. తమిళ ప్రజలు వర్తమానంలో భవిష్యత్తును కోల్పోయారు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం)*

వీ

# దేశ పునర్నిర్మాణమే అంబేడ్కర్ స్ఫూర్తి

***హిందూ మతం కుల నిర్మూలనకు అడ్డంకి అని, కుల నిర్మూలన, సంపద పంపిణీ రాజ్యాంగ సారమని, సమసమాజ నిర్మాణం కోసం అంబేడ్కర్ ఆలోచనా విధానం వెలుగులో భారతదేశాన్ని పునర్నిర్మాణం చేయాలని అంటున్నారు*** **డా. కత్తి పద్మారావు**

**డా.** బి.ఆర్.అంబేడ్కర్ ప్రపంచ దార్శనికుడు, మానవ హక్కుల పోరాటయోధుడు. మహోన్నతమైన హేతువాద భావజాల తాత్వికుడు. భారత రాజ్యాంగ నిర్మాత. ఆయన మరణించి 2016 డిసెంబర్ 6కు అరవై ఏండ్లు అవుతుంది. ఆయన భారత రాజ్యాంగాన్ని పార్లమెంట్‌కు సమర్పించి అరవై ఏడు ఏండ్లు అవుతుంది. ఆయన నిర్మించిన సిద్ధాంతాలు, ఆయన చేసిన ఆలోచనలు, ఆయన ప్రజ్వలమైన బోధనలు ఈనాటి భారతదేశ పునర్నిర్మాణానికి ఉపకరణాలు.

డా. బి.ఆర్.అంబేడ్కర్‌ది ఒక యుద్ధ జీవితం. ఆయన అధ్యయనం, ఆయన అవగాహన, ఆయన మేధోసంపన్నత శాస్త్రబద్ధమైంది. సత్యనిష్టమైంది. అంబేడ్కర్ తాత్విక మూలం సామాజిక వ్యథ. చీకటి కుహరాల్లో వేల సంవత్సరాలుగా జీవిస్తున్న అణగారిన సామాజిక జీవుల వేదనాస్వరాన్ని ఆయన మొక్కవోని దీక్షతో ప్రపంచానికి వినిపించారు. సామాజిక న్యాయం కోసం సమర భేరి మ్రోగించారు. ఆయన అధ్యయన శీలి, ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్రం వ్యక్తిత్వ నిరూపణకు చెప్తున్న అంశాలు శీలం, అంకితభావం, నిబద్ధత, కరుణ, ధైర్యం ఆయన జీవితంలో పెనవేసుకొని ఉన్నాయి. ఆయన గొప్ప చదవరి.

1891 ఏప్రిల్ 14న ఆయన పుట్టారు. 1912లో బి.ఎ. పూర్తి చేశారు. 1913లో అంబేడ్కర్ ఉన్నత చదువుల కోసం యునైటెడ్ స్టేట్స్‌కి వెళ్లాడు. న్యూయార్క్‌లో ఉన్న కొలంబియా యూనివర్సిటీలో ఆయన చేరాడు. "ప్రొవిన్షియల్ 'ఫైనాన్స్' ఇన్ బ్రిటిష్ ఇండియా" అనే అంశం మీద ఆయన పరిశోధన పత్రాన్ని సమర్పించాడు. ఈయన పరిశోధనను ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త ఇ.ఆర్.ఎ. సెలిగ్‌మన్ పర్యవేక్షించారు. ప్రసిద్ధ తాత్వికులు జాన్ డ్యూయి ప్రభావం అంబేడ్కర్ మీద బలంగా పడింది. అమెరికా విశ్వవిద్యాలయంలో ఉన్న స్వేచ్ఛా, సౌభ్రాతృతకు ఆయన ఉత్తేజితమయ్యాడు. కులం పునాదుల మీద అప్పుడే ఆయన పరిశోధన ప్రారంభించాడు.

1916లో మరో డాక్టరేట్ కోసం లండన్ వెళ్లాడు. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌లో ఆయన తన పరిశోధనను ప్రారంభించాడు. అది ముగియకుండానే బరోడా సంస్థానం నుంచి ఆయనకు ఉపకార వేతనం ఆగిపోయింది. అందుకు ఆయన చాలా బాధపడ్డాడు. ఆయన బరోడా సంస్థానంలో మిలటరీ సెక్రటరీగా చేరి అక్కడ అవమానాల్ని చవిచూసి, బరోడా నుంచి ఉద్యోగాన్ని నిరాకరించి బొంబాయి వచ్చి 1920 కల్లా ఆయన చదవుల కోసం మళ్లీ లండన్ వెళ్లడంలో ఆయన పట్టుదల దాగుంది. ఎక్కడ ఆయనకు ఆటంకాలు వస్తున్నాయో అక్కడ ఆయన ఎదురు తిరిగి పోరాడి విజయాన్ని సాధించాడు. కృంగిపోవడం, నిర్రాణం అయిపోవడం, అయ్యో అశక్తులమే అని ఆలోచించడం ఆయనకు లేదు. ఈనాడు ప్రజలు ఆయన నుంచి నేర్చుకోవలసింది ఈ సంకల్ప బలమే.

అంబేడ్కర్ లండన్‌లో చేసిన పరిశోధనా పత్రం పేరు "ప్రాబ్లమ్ ఆఫ్ ది రుపీ". ఇది 1923కి పూర్తి అయ్యింది. అప్పటికి ఆయనకు 32 ఏళ్లు. ఈ డి.ఎస్.సి డిగ్రీ ద్వారా ప్రపంచంలో ప్రమాణబద్ధమైన ఆర్థిక వేత్తగా మారాడు. లండన్ విశ్వవిద్యాలయాలలో పరిశోధనా పత్రాలను సమర్పించడం అంత తేలికైన విషయం కాదు. భారతదేశంలో ఆ స్థాయికి ఎదిగిన వాళ్లు అప్పటికీ ఇప్పటికీ ఎవరూ లేరు. అంబేడ్కర్ ఈ అధ్యయనం పునాదితోనే రాజ్యాంగం రచించారు. అంబేడ్కర్ విద్యావంతుడైన తాత్వికుడు. తాత్వికుడు కారణాన్ని అన్వేషించడానికి ఎంతో సమయం పట్టవచ్చును. అయితే దుఃఖితుడు తన తాత్కాలిక అన్వేషణ నుండి ఒక్కొక్కసారి మరల్చుకోలేడు. చాలా సుదీర్ఘ పరిశీలన నుండి గాని కారణం అనుభూతం కాదు. కారణాలు కొన్నిసార్లు వైయక్తికాలు, కొన్నిసార్లు సామాజికాలు. వైయక్తిక దుఃఖానికి ఉపశమనం ఉంది. సామాజిక దుఃఖం కొన్నిసార్లు నివారింప శక్యంకాదు. అది ఎక్కడ జనించిందో ఆ జనన కారణం అనేకసార్లు అనుభూతం కాదు. జనన కారణం తెలియక దుఃఖం జీవన విధానమైపోతుంది. సమాజంలో అస్పృశ్యత అలాంటిది. అస్పృశ్యులు తాము ఎందుకు అస్పృశ్యం చేయబడ్డారో తెలియక అదే దుఃఖంలో కొట్టు మిట్టాడుతుంటారు. బుద్ధుని మార్గంలో ఈ దుఃఖ కారణాన్ని అంబేడ్కర్ కనుగొన్నారు. దీనికి మూలాన్ని అంబేడ్కర్ వెదికారు. మనిషిని గూర్చి తెలుసుకొన్నారు.

జంతు ప్రవర్తన నుండి మానవుని వేరుచేస్తున్న ప్రధాన అంశం సామాజిక జీవితాచరణ. దీనిని మానవుడు సంఘ జీవనం నుండి నేర్చుకున్నాడు. అంతేకాక అతని జీవిత ఔన్నత్యానికి మూలభూతమైన మరొక ప్రధానాంశం ప్రకృతి అవగాహనలో అతనికున్న నేర్పు. ఈ నేర్పును, అవగాహనను సామాజిక జీవితానికి అన్వయించడం ద్వారా అతడు ఉత్పత్తి శక్తిగా ఆవిర్భవించాడు. ఈ సామాజిక జీవి తనను గురించి విశ్లేషించుకోవడం మానవ శాస్త్రం. అయితే ప్రకృతిపై అతని వ్యాఖ్యానం, నిర్ధారణలు ప్రకృతి జీవశాస్త్రాలయితే, అతని ఉత్పత్తి సంబంధాలను విశ్లేషించేది ఆర్థికంగా రూపొందింది. ఈ పరిశోధన నుండే అంబేడ్కర్ అస్పృశ్యత, కులం, రెండు మనుష్యులపై రుద్దబడినవని తెలుసుకొన్నారు. ఈ అవగాహన నుండి మానవ హక్కుల పోరాట యోధునిగా అంబేడ్కర్ అవతరించాడు. మనుస్మృతి దహనానికి పూనుకొన్నాడు.

1927 డిసెంబర్ 25న 36 సంవత్సరాల దళిత మేధావి ఏ గ్రంథాన్ని తగలపెట్టాలో, ఏ గ్రంథాన్ని చేతబూనాలో తేల్చివేశాడు. మనుస్మృతి 12 అధ్యాయాలు. మొదటి అధ్యాయంలో 119 శ్లోకాలు. మునులు

జగత్‌సృష్టి ఎలా జరిగిందని, కాలం ఎలా సృష్టించబడిందని, బ్రాహ్మణులు, స్త్రీలు ఎలా సృష్టించబడ్డారని, వేదములు ఎలా సృష్టించబడ్డాయని వేసిన ప్రశ్నలకు మనువు చెప్పిన సమాధానమే మనుస్మృతి. హిందూ ధర్మశాస్త్రాలు వేదాలు, వేదాంగాలు, మీమాంస, పురాణాలు, చతుర్దశ విద్యలు, ధర్మశాస్త్రాల్లో ప్రధానమైనవి వర్ణ ధర్మాలు, ఆశ్రమ ధర్మం. ఈ రెండింటిని కలిపి వర్ణాశ్రమ ధర్మాలు అంటారు. మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు ధర్మ శాస్త్రాలు రాశారు. వర్ణధర్మాన్ని మరింత పటిష్టం చేయడం కోసం మనుధర్మాన్ని మనువు కూర్చాడు.

మనువు ఒక వ్యక్తా లేక హిందూ పీఠమా? అనేది ఒక చర్చ. అయితే భారతదేశంలో అసమ సమాజానికి రూపకల్పన ఈ మనువే చేశాడని, మనుస్మృతిని బహిరంగ దహనం చేయడం కర్తవ్యం అని అంబేడ్కర్ ఆచరించారు. అంబేడ్కర్ అందుకే ఇలా అన్నారు: "చాతుర్వర్ణ సిద్ధాంతం నశించాలి. హిందూ సమాజంలో నిమ్న జాతులు సమానత్వంతో పరిగణించబడాలి. సవర్ణులు సకల భోగాలను అనుభవించడం, నిమ్నజాతివారు పరమ దరిద్రులుగా నశించి పోవడం నేను సహించను.. ఈ చాతుర్వర్ణ వ్యవస్థ పురాతనమైన సిద్ధాంతాలతో సమాజాన్ని వెనుకకు మళ్లిస్తున్నందున దీనిని నేను వ్యతిరేకిస్తున్నాను. ఈ చాతుర్వర్ణ వ్యవస్థకంటే హీనమైన సాంఘిక వ్యవస్థ మరొకటి ఈ భూమండలంపై లేదు, ఉండదు. ఈ విధానం మానవులను నిష్ప్రయోజకులుగా, దుర్బలులుగా, అవిటివారుగా మార్చివేస్తోంది".

ఈ స్ఫూర్తితోనే అంబేడ్కర్ రాజ్యాంగ రచన చేశారు. అంబేడ్కర్ గొప్ప ఆత్మవిశ్వాసపరుడు. అటు పాశ్చాత్య గ్రంథాలను, ఇటు హిందూ ప్రాచీన గ్రంథాలను చదవడం ద్వారానే ఆయన తన సత్యాలను ప్రకటించ గలిగారు. "పాశ్చాత్యులు కులాన్ని కేవలం భారతదేశ సమస్యగానే తీసుకోకూడదు. కుల సంకుచితత్వం వల్ల ప్రపంచ మానవవాదానికి అడ్డుగోడలు ఏర్పడుతాయి" అని ఆయన ఆనాడే హెచ్చరించారు.

ప్రపంచంలో రెండవ అతి పెద్ద జనాభా కలిగిన భారతదేశాన్ని, దాని కుల స్వభావాన్ని అలానే వదిలివేసినట్లైతే అది ప్రపంచ మానవ సమైక్యతకే గొడ్డలిపెట్టు అవుతుందని ఆయన ఆనాడే పసికట్టారు. అందుకు ఆయన కేట్‌కర్ అభిప్రాయాన్ని తన అభిప్రాయంతో పాటు ఇలా జోడించారు. "ఈ కులం సమస్య సిద్ధాంత పరంగానూ, ఆచరణ రూపంలోనూ ఎంతో విస్తృతమైనది. ఆచరణరీత్యా అతి భయంకరమైన పరిణామాలను సూచించే వ్యవస్థ ఇది. ఇది ఒక స్థానిక సమస్యగానే కనిపించినా, పరిధికి మించి నష్టం చేయగల సత్తా దీనికి ఉంది, ఎందుకంటే భారతదేశంలో కులం ఉన్నంతకాలం హిందువులు కులాంతర వివాహాలు చేసుకోరు. బయటివారితో ఎలాంటి సామాజిక సంబంధాలు పెట్టుకోరు. ప్రపంచంలో వేరే ప్రాంతాలలోకి హిందువులు వలసపోతే భారతీయ కులం ప్రపంచ సమస్య అవుతుంది".

ఈ కులతత్వ భావాజాలాన్ని రాజ్యాధికారంలో భాగంగా నిర్మూలించడానికి తన రిపబ్లికన్ పార్టీ మ్యానిఫెస్టోలో ప్రజాస్వామిక సూత్రాలని ఇలా ముందుకు తెచ్చారు. 1) భారతీయులందరికి హక్కుల సమానత్వం. 2) ప్రతి పౌరుడు తనను తాను అభివృద్ధి చేసుకోవడానికి ప్రభుత్వం సోపానం కావాలి. 3) మత, ఆర్థిక, రాజకీయ, స్వాతంత్ర్యాలు ప్రతి భారతీయుడి హక్కు. 4) సమాన అవకాశాలు ప్రతి భారతీయుడి హక్కు. మనిషిని మరో మనిషి, ఒక వర్గాన్ని మరో వర్గం, ఒక దేశాన్ని మరో దేశం దోచుకోవడం, అణచివేయడాన్ని ప్రణాళిక వ్యతిరేకిస్తూ ఉంది. మొత్తం ప్రజానీకం శ్రేయస్సుకు, వ్యక్తి శ్రేయస్సుకు పార్లమెంటరీ ప్రభుత్వమే ఉత్తమమైనదని ప్రణాళిక ప్రతిపాదించింది.

అంబేడ్కర్ తన సిద్ధాంతాల్ని ప్రజాస్వామ్య లౌకికవాద దృక్పథంతో ముందుకు తీసుకెళ్లాడు. ఆయన రాజ్యాధికారం అంటే సమతావాదాన్ని ముందుకు తీసుకెళ్లేదే అని చెప్పాడు. అంబేడ్కర్ రాజ్యాంగ పరిషత్తులో స్వతంత్ర భారత రాజ్యాంగాన్ని ఆయన ప్రవేశపెట్టేందుకే చేసిన అవిరళ కృషికి దేశం ఘనంగా కొనియాడింది. ఆ సమయంలో అంబేడ్కర్ ఇలా చెప్పారు. "ఎటువంటి రక్తపాతం లేకుండా ప్రజల ఆర్థిక, సామాజిక జీవనంలో విప్లవాత్మక మార్పులు తీసుకువచ్చే స్వరూపం, పాలనా వ్యవస్థే ప్రజాస్వామ్యం. అది విజయవంతంగా పనిచేసేందుకు ముందుగా ఈ కింది జాగ్రత్తలు తీసుకోవాలన్నారు. 1. సమాజంలో పైకి వ్యక్తమయ్యే విధంగా అసమానతలు ఉండరాదు. ఒక వర్గం వారికి అదనపు సదుపాయాలు కల్పించరాదు. 2. ప్రతిపక్షం ఉండాలి. 3. చట్టం, పాలనా యంత్రాంగంలో సమానత్వం ఉండాలి. 4. రాజ్యాంగపరమైన నైతిక నియమాలు పాటించాలి. 5. మెజారిటీ వర్గం నియంతృత్వం వహించరాదు. 6. సమాజంలో నైతిక నియమాలు పాటించే వ్యవస్థ ఉండాలి. 7. ప్రజాచైతన్యం ఉండాలి.

అంబేడ్కర్ ఈ రాజకీయ ప్రజాస్వామ్యం నాలుగు ప్రధాన అంశాల మీద ఆధారపడి ఉంటుందని చెప్పారు. 1. మనిషి తనకు తాను పరిమితమవుతాడు. 2. ప్రతి వ్యక్తీ రాజ్యాంగం హామీ ఇచ్చిన కొన్ని బదిలీ చేసుకోవడానికి వీలులేని హక్కులు కలిగి ఉంటాడు. 3. ప్రత్యేక సదుపాయం లేదా రక్షణ పొందేందుకు రాజ్యాంగబద్ధంగా తనకు సంక్రమించిన హక్కులను వదుకోవాల్సిన అవసరం ఏ వ్యక్తికీ ఉండదు. 4. ఇతరులను పరిపాలించేందుకు ప్రైవేటు వ్యక్తులకు ప్రభుత్వం అధికారాన్ని దత్తం చెయ్యలేదు.

ప్రజాస్వామ్యంలో ప్రతి పార్టీకి విమర్శించే హక్కు, అధికారాన్ని చేజిక్కించుకునే హక్కు ఉంటాయి. అధికారంలో ఉన్న పార్టీ దానిని కాపాడుకునేందుకు ప్రయత్నిస్తుంది. ప్రభుత్వాధికారం అధికార పార్టీ నుండి ఇతర రాజకీయ పార్టీ లేదా పార్టీలకు బదలాయింపు అయినపుడు పార్టీ వ్యవస్థ నిజమైన పరీక్షను ఎదుర్కొంటుంది. రాజ్యాధికారం ఉన్నవారి చేతుల్లోనే రాజ్యాంగాన్ని అమలు జరిపే కార్యక్రమానికి వీలుంటుంది. అందుకే ఆయన జీవితంలో రాజ్యాధికారాన్ని ప్రజల దగ్గరకు తీసుకెళ్లడం కూడా ఒక విప్లవంగా జరిగింది. అందుకే ఆయన ఓటుపట్ల చైతన్యవంతంగా ఉండమని తన ప్రజల్ని హెచ్చరించాడు. ఓటుని బడా పెట్టుబడిదారులకు, అగ్రకుల పెత్తందార్లకు అమ్ముకున్న తరువాత మీరు శూన్యహస్తులు అవుతారని ఆయన ముందే చెప్పాడు. రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక పోరాటాలన్నీ భారతదేశంలో అంతసంబంధితంగా ఉంటాయని రాజకీయ పోరాటాన్ని విస్మరిస్తే ప్రజలు నిరంతరం బానిసలుగా జీవించాల్సి వస్తుందని ఆయన హెచ్చరించాడు.

అంబేడ్కర్ రాజకీయ పార్టీలను నిర్మించాడు. 1942 జూలైలో ఆల్ ఇండియా షెడ్యూల్డ్ క్యాస్ట్ ఫెడరేషన్ (ఎ.ఐ.ఎస్.సి.ఎఫ్) స్థాపించాడు. ఈ సందర్భంగా ఆయన దళితుల సాంఘిక, ఆర్థిక హక్కులను సాధించడానికి వారికి రాజకీయ అధికారం ముఖ్యమైన సాధనమని చెప్పారు. ఆయన ఆల్ ఇండియా షెడ్యూల్డ్ క్యాస్ట్ ఫెడరేషన్ క్యాస్ట్‌లో షెడ్యూల్డ్ జాతుల ఆర్థిక, సాంఘిక హక్కుల సాధనకై రాజకీయ అధికారం ఎలా ఉపయుక్తం అవుతుందో, దళితులు మిగిలిన బడుగు వర్గాలతో

# ప్రైవేట్ ట్రావెల్స్ ప్రమాదాలు

***ఆర్‌టిసిని దెబ్బతీసి ప్రైవేట్ ట్రావెల్స్‌ను పెంచి పోషిస్తున్న పాలకవర్గాల విధానాలను విమర్శిస్తూ, రోడ్డు ప్రమాద సంఘటనల్లో సామాన్య పౌరులు ప్రాణాలు కోల్పోతున్నారని, కుటుంబాలు తీవ్రంగా నష్టపోతున్నాయని అంటున్నారు ఎం.కె. కుమార్***

ట్రావెల్స్ మాఫియాను ఏకంగా ప్రభుత్వమే పోషించడం చూస్తుంటే సామాన్య ప్రజలు విస్తుపోతున్నారు. దివాకర్ ట్రావెల్స్ బస్సు ప్రమాదంలో మరణించిన ప్రయాణికుల గురించి రాజకీయపార్టీలు, ప్రభుత్వం పట్టించుకోవడం మానేశాయి. స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం అన్ని పార్టీలవారు బాధ్యతారాహిత్యంగా ప్రవర్తించారు. ట్రావెల్స్ మాఫియాకు ఏమాత్రం ఇబ్బంది కలుగకుండా ప్రవర్తించారు. అతివేగం, నిర్వాహకుల ధనదాహం, కనీసమైన భద్రతా ప్రమాణాలు పాటించక పోవడం లాంటి అంశాలను ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. ప్రమాదం జరిగిన ఘటనలో దివాకర్ ట్రావెల్స్‌పై కేసు నమోదు చేయకుండా డ్రైవర్‌ను ఎఫ్ఐఆర్‌లో మొదటి నిందితుడిగా చూపారు. డ్రైవర్ సంఘటనలో చనిపోయాడు. అతని మృతదేహానికి కనీసం పోస్ట్‌మార్టం కూడా నిర్వహించలేదు. అతను చనిపోయేనాటికి ఎటువంటి పరిస్థితుల్లో ఉన్నాడో అనే అంశాన్ని ప్రభుత్వం కావాలనే దాచి పెట్టడానికి ప్రయత్నం చేసింది. శాసనసభా సమావేశాలలో కూడా పార్టీలు బాధ్యతాయుతంగా ప్రవర్తించలేదు. ఇటువంటి సంఘటనలు పునరావృతం కాకుండా ఎటువంటి చర్యలు చేపట్టాలి అనే అంశాన్ని నిర్దిష్టంగా చర్చించలేదు. బస్సు అతివేగంగా వచ్చి రోడ్డు డివైడర్‌ను ఢీకొట్టి, 20 అడుగుల ఎత్తు నుండి వేగంగా కల్వర్ట్‌లోకి పడిపోయిందంటే మితిమీరిన వేగం, డ్రైవర్ నిర్లక్ష్యం వల్లే సంఘటన జరిగిందని తెలుస్తోంది. తుది నివేదిక డ్రైవర్ యాక్సిడెంట్ సమయంలో నిద్రపోతున్నాడని తేల్చింది.

జెసి సోదరులకు చెందిన దివాకర్ ట్రావెల్స్ బస్సు ముండ్లపాడు వద్ద ప్రమాదానికి గురైనప్పుడు పదిమంది చనిపోయారు. వారిని కనీసం పరామర్శించని జెసి సోదరులు తీవ్రమైన పదజాలంతో రాజకీయ పార్టీలను ధూషించడం మొదలుపెట్టారు. జెసి ప్రభాకర్‌రెడ్డి వాడిన పరుష పదజాలం కొన్ని లక్షలమంది టివీలలో చూసి ముక్కున వేలేసు కున్నారు. జెసి బ్రదర్స్ నాలుక చీరేస్తామని ప్రతిపక్షం పత్రికా ముఖంగా ప్రకటించింది. జెసి సోదరులను వెనుకేసుకు రావడానికి ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నించింది. చనిపోయిన ప్రయాణికుల కుటుంబాలు ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న ట్రావెల్స్ మాఫియాపై ప్రభుత్వం ఎటువంటి చర్యలను చేపట్టడంలేదని నిరసన తెలిపారు. ప్రైవేట్ బస్సులకు ఇష్టారీతిన అనుమతులివ్వడం, ప్రైవేట్ ట్రావెల్స్‌పై ప్రభుత్వం ఆజమాయిషీ లేకపోవడం ప్రజల్ని మరింత విస్మయానికి గురిచేసింది.

మార్చి రెండవ వారంలో మరో ప్రైవేట్ బస్సు కనిగిరి దగ్గర 30 అడుగుల గుంతలో పడింది. 78 మంది విద్యార్థులు ప్రయాణిస్తున్న ఆ బస్సు డ్రైవర్ తాగి ఉన్నాడని ప్రయాణికులు ఫిర్యాదు చేశారు. 47 మంది విద్యార్థులకు తీవ్ర గాయాలయ్యాయి. సాధారణంగా బస్సు ప్రమాద ఘటనలో ఐపిసి సెక్షన్ 337, 338, 308, 109 లతో పాటు మోటార్ వెహికల్ యాక్ట్ 184, 185, 192ఏ ల కింద కేసులు నమోదు చేస్తారు.

---

కలిసి ఈ రాజకీయ అధికారాన్ని ఎలా సాధించాలో ప్రణాళికలో పేర్కొన్నారు.

1952 ఎలక్షన్లకు సన్నద్ధమైయే సందర్భంలో 1951 డిసెంబర్‌లోనే వామపక్ష పార్టీలను పొత్తుకోసం ఆహ్వానించారు. మొదటి జనరల్ ఎలక్షన్‌లో ప్రజా సోషలిస్ట్ పార్టీతో ఎన్నికల పొత్తుపెట్టుకున్నారు. కమ్యూనిస్ట్‌లు కుల నిర్మూలన కోసం ప్రధానంగా పోరాడాలని ఆయన పిలుపునిచ్చారు. 1952లో విడుదల చేసిన ప్రణాళికలోనే తన వామపక్ష భావాలను ఆనాడే ప్రకటించారు. భారతీయుడైన ప్రతివాడు ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యాలను పొందాలని నొక్కి వక్కాణించారు. ప్రతి మనిషికి నిర్భయంతో కూడిన స్వేచ్ఛను సాధించడం ప్రభుత్వ బాధ్యత అని ఆయన ప్రతిపాదించారు. స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలను ప్రముఖంగా ప్రస్తావించారు. ఈ ప్రణాళిక అణగదొక్కబడ్డ వారి సాంఘిక సమానత్వాన్ని నొక్కి చెప్పింది. ప్రభుత్వ ఉద్యోగస్తులకు భీమా పథకాన్ని తప్పనిసరిగా అమలు జరపాలని ఆయన కోరారు.

వామపక్షాలతో పొత్తు పెట్టుకునే విషయంలో కొన్ని సూత్రాలను ముందుకు తెచ్చారు. ముఖ్యంగా 1. హిందూ మహాసభ, ఆర్.ఎస్.ఎస్.లతో పొత్తు పెట్టుకోకూడదు. 2. వెనుకబడిన సంఘాలతో సంబంధం ముఖ్యం అని ప్రతిపాదించారు. ఆయన ఆల్ ఇండియా లేబర్ పార్టీ స్థాపించిన నాటి నుండి భారతదేశంలో దళిత జాతులకు రాజకీయ అధికారాన్ని సాధించే కృషిలో అద్వితీయమైన పాత్రను పోషించారు. సమర్థవంతమైన ప్రతిపక్షాన్ని రూపొందించే క్రమంలో ఆయన రిపబ్లిక్ పార్టీ ఆఫ్ ఇండియా అవసరాన్ని నొక్కి వక్కాణించారు. దళిత జాతులకు రాజకీయ అధికారం రానిదే వారి సమస్యలు ఎన్నటికీ పరిష్కారం కావు. దళితులు బడుగు వర్గాలతోనూ సెక్యులరిస్టులతోనూ కలిసి రాజ్యాధికారాన్ని సాధించాలని ఆయన పిలుపునిచ్చారు. స్వేచ్ఛ, సమానత, సౌభ్రాతృత్వాలను డా. బి.ఆర్.అంబేద్కర్ సిద్ధాంతాల స్ఫూర్తితో సాధించుకోవడానికి మొక్కవోని దీక్షతో ముందుకు నడవడమే ఆయన నుండి మనం పొందే నిజమైన స్ఫూర్తి. కుల నిర్మూలన, సంపద పంపిణీ ఆయన రాజ్యాంగ సారం. భారతదేశ పునర్నిర్మాణం ఆయన మనకిచ్చిన ప్రణాళిక. ఇది రాజ్యాధికారంతోనే సాధ్యం. ఈ సందర్భంగా ఆయన జీవితాన్ని ఆలోచనలు పునచ్ఛరణ చేసుకొని ఆయన బాటలో నడవడం సమసమాజ నిర్మాణ కర్తలందరి కర్తవ్యం.

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)*

వీ

2013 అక్టోబర్ 30న మహబూబ్‌నగర్ జిల్లా పాలెం గ్రామ శివారులో దివాకర్ ట్రావెల్స్‌కే చెందిన బస్సు ప్రమాదంలో 45 మంది నిండు ప్రాణాలను కోల్పోయారు. 11 కుటుంబాలు తీవ్ర ఇబ్బందులకు గురయ్యారు. ఇప్పటికీ వీరికి ఎటువంటి న్యాయం జరుగలేదు. ప్రైవేట్ ట్రావెల్స్ మాఫియా వ్యతిరేక పోరాట సమితిని ఏర్పాటు చేసి ప్రమాద బాధితులు పోరాటం చేస్తున్నప్పటికీ ప్రభుత్వం పట్టించుకోలేదు. దివాకర్ ట్రావెల్స్‌ను మూసివేయడమే లక్ష్యంగా వీరు పోరాటం చేస్తున్నారు. రెండు తెలుగు రాష్ట్రాలకు ప్రతి ఏడాదికి సుమారు 2 వేల కోట్ల రూపాయల నష్టాన్ని ప్రైవేట్ ట్రావెల్స్ కలిగిస్తున్నప్పటికీ ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఇంత జరిగినా 2 కోట్ల విలువైన బస్సు కాలిపోయిందని జెసి బ్రదర్స్ వాపోతున్నారు.

రెండు రాష్ట్రాల్లో 40 శాతం ప్రైవేట్ ట్రావెల్స్ వాహనాలు కాలం చెల్లినవి, కండీషన్ లేనివి నడుస్తున్నాయి. బ్రేక్ ఇన్‌స్పెక్టర్ల విధులను సైతం స్థానిక రాజకీయ నాయకులు శాసిస్తున్నారు. చాలామంది బ్రేక్ ఇన్‌స్పెక్టర్లు విఐపిలు వచ్చినపుడు కాన్వాయ్‌కు వందల సంఖ్యలో వాహనాలను ఉచితంగా సమకూర్చాల్సి ఉంటుంది. ఇందువల్ల వారు సక్రమంగా తమ విధులను నిర్వర్తించలేక పోతున్నారు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి రాజధాని విషయంలో వేలమంది రైతుల్ని వంచించి భూముల్ని లాక్కొన్నాడు. ప్రపంచబ్యాంక్ చెప్పినట్టు నడుచుకునే వినయ విధేయతలు గల ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా చంద్రబాబు ప్రభుత్వరంగ సంస్థ అయిన ఆర్‌టిసిని ప్రైవేట్‌పరం చేయాలను కుంటున్నాడు. ఇప్పటికే 8 వేల ప్రభుత్వ పాఠశాలలను రేషనలైజేషన్ పేరుతో మూసి, వాటిని మంత్రి నారాయణ చేతిలో పెట్టబోతున్నాడు.

కేశినేని, దివాకర్ లాంటి అధికారపార్టీ నేతలు ట్రావెల్స్ ఆర్‌టిసిని నష్టాల్లో ముంచుతున్నాయి. నిబంధనలను పాటించకుండా ఆర్‌టిసి బస్టాండ్‌ల ముందరే బస్సులు ఆపి ప్రయాణికులను ఎక్కించుకుంటున్నా పోలీసులు చేష్టలుడిగి ఉంటున్నారు. అధికారపార్టీ అండదండలతోనే ఇది జరుగుతున్నదనేది జగమెరిగిన సత్యం. దీనివల్ల నష్టాల్లో కూరకపోయిన ఆర్‌టిసిని ఉద్ధరిస్తామని చెప్పుకుంటూ ఛార్జీలు పెంచుతున్నారు. ఏడాదిలో రెండుసార్లకి పైగా ట్రూ అప్ చార్జీల పేరుతో బస్సుచార్జీలు పెంచారు.

సంక్షేమ పథకాలను ఉచితంగా ఇస్తానని 600 వాగ్దానాలు చేసిన చంద్రబాబు ఒక్కటి సంపూర్ణంగా అమలు చేయలేకపోయారు. ఆర్‌టిసి వినియోగిస్తున్న డీజిల్‌పై వ్యాట్, సర్‌ఛార్జీ, మోటార్ వెహికల్, టోల్ ట్యాక్స్‌లను రద్దు చేయాలని, రాయితీ కల్పించాలని ఆర్‌టిసి కార్మికులు కోరినా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ప్రైవేట్ అక్రమ రవాణాను అరికడితే ఆర్‌టిసి బాగుపడుతుందని నిపుణులు చెప్పినా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. పైపెచ్చు ప్రైవేట్ ట్రావెల్స్‌కు లబ్ధి చేకూర్చేందుకు ప్రయత్నిస్తోంది. డీజిల్ ధర తగ్గుతున్నప్పటికీ గత ఏడాది రు.350 కోట్ల భారాన్ని ప్రజలపై ఛార్జీల రూపేణా పెంచారు.

2008లో వచ్చిన ఆర్థిక మాంద్యం నుండి గట్టెక్కడానికి ఎంచుకున్న విధానాలు దేశాలను మరింత ఆర్థిక సంక్షోభంలోకి నెట్టాయి. పొదుపుచర్యల పేరుతో కార్మికుల జీతాలను తగ్గించడం, సంక్షేమ పథకాలకు గండి కొట్టడం, ప్రభుత్వాలు పూర్తిగా సంక్షేమ రాజ్యం నుండి తప్పుకుంటున్నాయి. ప్రజలకు కల్పించాల్సిన మౌలిక సదుపాయాలను ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోంది. ప్రజలను మరింతగా దోపిడీ చేయడానికి ప్రయత్నించాలని ప్రపంచ బ్యాంకు సూచించింది.

ప్రపంచ వ్యాప్తంగానే సగటున 50 శాతం ప్రజల ఆదాయాలను తగ్గించడానికి ప్రయత్నించాలని ద్రవ్య పెట్టుడిదారులు ఆదేశిస్తున్నారు. ఇది ప్రజల కొనుగోలు శక్తిని తగ్గిస్తోంది. ప్రభుత్వం తన బాధ్యతల నుండి తప్పుకోవడంలో భాగంగానే విద్య, వైద్యంతో పాటు రవాణా సదుపాయాల నుండి తప్పుకుంటున్నాయి. 2016లో ప్రపంచ వృద్ధి రేటును 2.4 శాతానికి తగ్గించి ఐఎంఎఫ్ ఆర్థిక సంక్షోభ తీవ్రతను తెలియజేసింది. ఐఎంఎఫ్ 2017లో వృద్ధి రేటు 3.4 శాతానికి అంచనా వేసింది. ప్రైవేటీకరణనే ప్రధాన సాధనంగా పాలకులు ఉపయోగిస్తు న్నారు. వృద్ధి రేటు తగ్గడం, ఆర్థిక సంక్షోభం కొనసాగడం నిరుద్యోగ సమస్యను తీవ్రతరం చేస్తుంది. పెట్టుబడిదారీ దేశాల్లో నిరుద్యోగ సమస్యను కేంద్రంగా చేసుకునే ఎన్నికలు జరుగుతున్నాయంటే సంక్షోభ తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

కార్పొరేట్ల మొండి బకాయిలు బ్యాంకింగ్ వ్యవస్థను బలహీనం చేస్తున్నాయి. ఇది బ్యాంకింగ్ రంగం సర్వీసు ఛార్జీలను మరింత పెంచడానికి అవకాశం కల్పిస్తోంది. దేశీయ వృద్ధి రేటు పేరుకు 7.1 శాతం ఉందని చెపుతున్నా, నిజానికి అది 4.3 శాతం అనేది నిపుణుల వాదన. సర్వీసింగ్ ప్రెస్ పేరుతో ఆర్‌టిసి 90 శాతం చార్జీలను ప్రభుత్వం పెంచింది. దేశీయంగా ఏడాదికి 2 కోట్ల మంది యువత మార్కెట్‌లోకి ఉద్యోగాల కోసం వస్తున్నారు. కాని ఉపాధి కల్పన పట్టణాలలో 11.24 శాతం ఉంటే గ్రామాలలో 9.18 శాతంగా ఉంది. నిత్యావసర ధరలు 40 శాతానికి మించి పెరిగాయి. పాలకుల విధానవల్లే ప్రైవేటీకరణ ఊపందుకుంటోంది. ట్రావెల్స్ మాఫియాను ప్రభుత్వ అండదండలతోనే పెంచి పోషిస్తున్నారు. ఏకంగా అధికారపార్టీకి చెందిన వారే ట్రావెల్స్‌ను నిబంధనలకు విరుద్ధంగా నడుపుతున్నారు.

2015లో దేశంలో ఉత్తరప్రదేశ్, తమిళనాడు తర్వాత రోడ్డు ప్రమాదాల వల్ల చనిపోయినవారి సంఖ్య తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలోనే ఎక్కువగా నమోదయింది. 9 శాతం రోడ్డు ప్రమాదాలు ఈ రెండు రాష్ట్రాల్లో జరిగాయి. తమిళనాడులో 13.8 శాతం, మహారాష్ట్రలో 13.8 శాతం, మధ్యప్రదేశ్‌లో 12.7 శాతం రోడ్డు ప్రమాదాలు జరిగినట్టు గణాంకాలు చెప్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో 2014లో 7,908 మంది రోడ్డు ప్రమాదాల్లో చనిపోతే, 2015 నాటికి అది 8,297కి పెరిగింది. అదే కాలంలో తెలంగాణలో 6,906 నుండి 7,110కి పెరిగింది.

2015లోను రోడ్డు ప్రమాదాలు ఎక్కువగా జరిగిన 13 రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ (24,258) 7వ స్థానంలోను, తెలంగాణ (21,252) పదవస్థానంలోను నిలిచింది. దేశంలోని 50 ప్రముఖ నగరాల్లో 22.1 శాతం రోడ్డు ప్రమాదాలు జరిగి 11.3 శాతం మరణాలు సంభవిస్తే, 16.4 శాతం తీవ్రగాయాలతో కూడిన ప్రమాదాలు జరిగాయి. 2015లో కేంద్ర రోడ్డు ట్రాన్స్‌పోర్టు శాఖ సర్వే ప్రకారం 77.1 రోడ్డు ప్రమాదాలకు కారణం డ్రైవర్ల నిర్లక్షమే అని తేలింది. అదే 2014లో డ్రైవర్ల నిర్లక్ష్యం వల్ల జరిగిన రోడ్డు ప్రమాదాలు 78.8 శాతం సంభవించాయి. అతివేగంవల్ల జరిగిన ప్రమాదాలే ప్రధాన కారణంగా ఉన్నాయి. డ్రైవర్లు వాహనాలను అతివేగంగా నడపడం వల్ల 62.2 శాతం ప్రాణనష్టం సంభవిస్తే, 61 శాతం తీవ్రమైన గాయాలతో బాధితులు బయటపడ్డారు.

స్వచ్ఛంద సంస్థల నివేదిక ప్రకారం రెండు తెలుగు రాష్ట్రాల్లో సంభవిస్తున్న మరణాలకు డ్రైవర్ల నిర్లక్ష్యం ప్రధాన కారణంగా ఉంది. 65 శాతం డ్రైవర్ల నిర్లక్ష్యం ప్రధాన కారణంగా ఉంది. ఇందులో 20.5 శాతం డ్రైవర్లు సరిగా వాహనాలు నడపకపోతే, 34 శాతం డ్రైవర్లు తమ వాహనాలపై అదుపు కోల్పోవడం, 12 శాతం సరిగా రోడ్డు టర్నింగ్ పాయింట్లను గుర్తించక పోవడం, 11.6 శాతం రోడ్డుపై దాటే వారిని సరిగా గుర్తించకపోవడం కారణాలుగా ఉన్నాయి.

రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థను ప్రైవేటైజేషన్ చేయడానికి ప్రభుత్వం చెపుతున్న కారణాలు సహేతుకంగా లేవు. గతంలో ఆర్‌టిసి తీసుకున్న అప్పులు సంస్థకు గుదిబండగా మారడం, ఎక్కువమంది కార్మికులు, సిబ్బంది ఉండడం, వారి వేతనాలు ఎక్కువగా ఉండడం, తెలుగు వెలుగు బస్సులు నడుపుతున్న 80శాతం రూట్లలో ఆకుపెన్సీ తక్కువగా ఉండడం లాంటి కారణాలను చూపుతున్నారు. నిజానికి ఆర్‌టిసీ చార్జీలు ఇప్పటికే ప్రజలకు భారంగా పరిగణించాయి. యూనియన్ మినిష్టర్ గోపీనాథ్ ముండే జూన్ 2014లో రోడ్డు ప్రమాదంలో చనిపోయినపుడు, రోడ్డు ట్రాన్స్‌పోర్ట్ సేఫ్టీ బిల్ 2014 ను తీసుకురావాలని హైవే మినిష్టర్ నితిన్ గడ్కరీ పార్లమెంట్‌కు సమర్పించడానికి సిద్ధం చేశారు. 2030 నాటికి రోడ్డు ప్రమాదాలను 50 శాతం తగ్గించడానికి యుఎన్ జనరల్ అసెంబ్లీ కొన్ని లక్ష్యాలను నిర్దేశించింది. యునైటెడ్ స్టేట్స్, కెనడా, సింగపూర్, జపాన్, జర్మనీ, యునైటెడ్ కింగ్‌డమ్ దేశాలలో తయారుచేసిన చట్టాలను ఆధారంగా చేసుకుని ఈ బిల్లును రూపొందిచడం జరిగినట్టు కేంద్రం చెప్పుకుంది. సాధారణ ఫైన్‌ను రు.5 వేలనుండి రు.50 వేలకి పెంచడం, జైలు శిక్షను 7 సంవత్సరాల వరకు పెంచడం ఇందులో ప్రధానమైనవి.

ప్రణాళికా సంఘం తన నివేదికలో జిడిపిలో 3 శాతం రోడ్డు ప్రమాదాల వల్ల ఖర్చు అయిపోతుందని, దీని ఖర్చు 3.8 లక్షల కోట్ల రూపాయలని అభిప్రాయపడింది. రోడ్లు రిపేర్లు, బీమా సౌకర్యం, వాహనాల ధ్వంసం, థర్డ్‌పార్టీ ఇన్స్యూరెన్స్ తదితర అంశాల ప్రాతిపదికగా ఈ నివేదికను తయారుచేసింది. 28 సంవత్సరాల క్రితం తయారుచేసిన మోటర్ వెహికల్ యాక్ట్ 1988నే ఇప్పటికీ ఆచరణలో ఉండడం వల్లే 300 శాతం రోడ్డు ప్రమాదాలు ఎక్కువైనట్టు బిజెపి ఎంపిలు అభిప్రాయపడుతున్నారు.

రహదారులు ఎగుడుదిగుడుగా ఉండడం వల్లనే 75 వేలమంది రోడ్డు ప్రమాదంలో మరణించినట్టు కేంద్ర రవాణాశాఖ తన రిపోర్టులే తెలిపింది. అలాగే అధిక వేగం వల్ల 41 శాతం మరణాలు, వాహనాల సామర్థ్యం కన్నా ఎక్కువగా ప్రయాణికులను ఎక్కించుకోవడం వల్ల 2015లో 36,543 మరణాలు సంభవించినట్టు కేంద్రం ప్రకటించింది. డ్రైవర్లు తాగి నడపడం వల్ల ప్రమాదాలు 38 శాతం సంభవించినట్టు గణాంకాలు పేర్కుంటున్నాయి. ద్విచక్రవాహన దారులు హెల్మెట్ ధరించకపోవడం వల్ల రోడ్డు ప్రమాదాలలో 72 శాతం మరణించినట్టు కేంద్రం 2015 వెలువరించిన రిపోర్టులో పేర్కొంది.

2000 సంవత్సరం నుండి చేపట్టిన చతుర్భుజ రహదారుల డిజైనింగ్ లోపల వల్ల మరణాలు ఎక్కువగా సంభవించినట్టు కేంద్రం అభిప్రాయ పడుతోంది. దీనిపై పార్లమెంట్‌లో నితిన్ గడ్కరీ సమాధానం చెప్తూ, 11 వేల కోట్ల రూపాయలు కేటాయించినట్టు చెప్పారు. దేశంలో మొత్తం 726 బ్లాక్ స్పాట్స్‌ను గుర్తించినట్టు, ఈ ప్రాంతంలో ప్రమాదాలు జరగకుండా ఉండడానికి తగు చర్యలు కేంద్రం చేపట్టినట్టు తెలిపాడు. 3000 కి.మీకు ఒక సేఫ్టీ ఆడిట్ కమిటీ ఏర్పాటు చేసినట్టు వీరు రోడ్డు ప్రమాదాలకు గల సహేతుక కారణాలను కేంద్రానికి ఎప్పటికప్పుడు నివేదిస్తారని, వాటిపై తక్షణపై రవాణా శాఖ చర్యలు చేపడుతున్నట్టు గడ్కరీ పార్లమెంట్ సాక్షిగా పేర్కొన్నాడు. అయినప్పటికీ రోడ్డు ప్రమాదంలో మరణించిన వారిసంఖ్య ఏటా పెరుగుతూనే ఉంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆచరణలో ఎటువంటి చర్యలు చేపట్టకపోవడంలో రోడ్డు ప్రమాదాలు అధికంగా సంభవిస్తున్నాయి.

ముఖ్యమంత్రి 250 కోట్ల రూపాయలను కోర్ గ్రాంట్‌గా ఆర్‌టిసి ఇస్తానని మాట ఇచ్చాడు. 500 కొత్త ఏసి బస్సులను జవహర్‌లాల్ నెహ్రూ నేషనల్ అర్బన్ రెనెవల్ మిషన్ కింద తీసుకోవాలని, అలాగే 1500 కొత్త బస్సులను తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. అయితే రెంటెడ్ బస్సులనే ఆర్‌టిసికి ప్రభుత్వం ఎక్కువగా కేటాయిస్తూ, ప్రైవేట్ వ్యక్తులకు ప్రజల సొమ్మును దోచిపెడుతోంది.

32 బస్ స్టేషన్లకు సంబంధించిన ఆన్‌లైన్ రిజర్వేషన్‌ను అభిబస్ అనే ప్రైవేట్ సంస్థకు అప్పగించడం ప్రైవేటైజేషన్‌లో భాగమే. దీన్ని ఆర్‌టిసి సిబ్బంది వ్యతిరేకిస్తున్నారు. డిపోల వారిగా ప్రైవేటైజేషన్‌ను ప్రవేశపెట్టాలని ప్రభుత్వం భావిస్తోంది. ఇందులో భాగంగానే ఆర్‌టిసికి నష్టం వచ్చే రూట్లలో బస్సులను ఆపివేస్తూ, ప్రైవేట్ ట్రావెల్స్‌కు ఆ రూట్లను అప్పగిస్తోంది. ఆకుపెన్సీ రేషియోను పెంచడానికి ప్రభుత్వ పరంగా అనేక చర్యలను చేపట్టకుండా, ప్రైవేట్‌పరం చేయడం వెనుక అధికారపార్టీకి చెందిన ట్రావెల్స్ మాఫియా హస్తం ఉంది.

తెలుగు రాష్ట్రాలలో తిరుగుతున్న బస్సుల్లో 80 శాతం పర్మిట్లను ఇతర రాష్ట్రాల్లో పొందినవే. పర్మిట్లు తీసుకున్న రాష్ట్రాల్లో బస్సులు తిరగడం లేదు. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో ఒక్క బస్సు కూడా పర్మిట్ పొందిన రాష్ట్రం నుండి తిరగడం లేదు. వీటిని సీజ్ చేయాలని భావించిన రవాణాశాఖ అధికారులపై అధికార పార్టీ నేతలు తీవ్ర వత్తిడులకు గురిచేస్తున్నారు. ప్రైవేట్ బస్సు ఆపరేటర్లు అరుణాచలప్రదేశ్, పాండిచ్చేరిలలోనే అధికంగా రిజిస్ట్రేషన్లు జరిగాయి. ఈ రెండు రాష్ట్రాల్లో రిజిష్టరైన సుమారు 500 బస్సులు ఆంధ్రప్రదేశ్‌లో తిప్పుతున్నారు. ఆ రాష్ట్రాలు టూరిస్ట్ ప్రాంతాలు కావడం వల్ల ఏడాదికి రు.17వేలు చెల్లిస్తే సరిపోతుంది. అదే తెలుగు రాష్ట్రాలలో ఒక్కో బస్సు సీటుకు మూడు నెలలకు గాను రు.3.750 కట్టాలి. అందుకే ప్రైవేట్ బస్సు ఆపరేటర్లు ఆ రాష్ట్రాల్లో రిజిస్ట్రేషన్లు చేయిస్తున్నారు.

ట్రావెల్స్ మాఫియాను నాశనం చేయాలంటే ఆర్‌టిసీని పటిష్ట పరచాలి. ప్రైవేట్ ట్రావెల్స్ బస్సులను రద్దు చేయాలి. ముందుగా నిబంధనలను పాటించని ప్రైవేట్ బస్సుల పర్మిట్లను రద్దు చేసి యాజమాన్యాన్ని అరెస్ట్ చేయాలి. బస్సుల జాతీయీకరణ 1950లో జరిగింది. దీనికోసం ప్రత్యేకంగా రోడ్డు రవాణా సంస్థ చట్టం తీసుకొచ్చారు. 1958లో ఎపిఎస్‌ఆర్‌టిసిని స్థాపించారు. పేరుకు 71 సంస్థలు కేంద్రం అధీనంలో పనిచేస్తున్నప్పటికీ, వాటిలో 25శాతం సంస్థలను ప్రైవేట్‌పరం చేయడానికి సన్నాహాలను ఆరంభించారు. ఉమ్మడి తెలుగురాష్ట్రంలో 22,460 గ్రామాలకు బస్సు సౌకర్యం కల్పించినట్టుగా ప్రభుత్వం చెప్పుకుంది. మిగిలిన రాష్ట్రాలతో పోల్చుకుంటే ఆర్‌టిసి 2010 నాటి 21,469 బస్సులను కలిగి ప్రథమస్థానంలో నిలిచింది. అదే సంవత్సరం 1,15,898 మంది ఉద్యోగులకు ఆర్‌టిసి ఉపాధినిచ్చింది.

అప్పుల ద్వారానే సంస్థను నడిపిస్తున్నారు. ఇప్పటికీ ఆర్‌టిసి రుణాల మీదనే ఆధారపడి ఉంది. రాష్ట్ర ప్రభుత్వం ఏటా ఇచ్చే సుమారు 500 కోట్ల రూపాయల సబ్సిడీని 40 శాతానికి తగ్గించివేసింది. ఏటా 6 వేల కోట్ల రూపాయల ఆదాయం ఉండే ఆర్‌టిసి, రాష్ట్ర విభజన తర్వాత ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో నష్టాల్లోనే నడుస్తోంది.

ప్రభుత్వం ఆర్‌టిసిని ఆదుకోవడం మానేసింది. అద్దె బస్సులకే ఆర్‌టిసి రెండు రాష్ట్రాల్లో కలిపి 1000 కోట్లకు పైగా ఏటా చెల్లించాల్సి వస్తోంది. 2010 నాటికే ఆర్‌టిసి 4,045 అద్దె బస్సులను వాడుతోంది. అప్పటికీ స్వంత బస్సులు 17,351 మాత్రమే ఉండేవి. ఒక బస్సుకు ఉండాల్సిన ఉద్యోగుల శాతం 6.31 నుండి 3.76కి ప్రభుత్వం తగ్గించి వేసింది. ఒక్కో బస్సుకు రోజుకు సగటున కి.మీ. కి 4 రూపాయల వరకు నష్టం వస్తోందని ప్రభుత్వం వాదిస్తోంది. ట్రావెల్స్ మాఫియాను అడ్డుకుని, ప్రభుత్వం ఇవ్వాల్సిన సబ్సిడీనే ఇస్తే ఆర్‌టిసి లాభాలను ఆర్జిస్తుందని సిబ్బంది వాదిస్తున్నారు.

# మళ్లీ పెరుగుతున్న మార్క్స్ ప్రాధాన్యత

***ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక సంక్షోభాలు తీవ్రతరమవుతున్న దశలో మళ్లీ ఒకసారి మార్క్స్ విధానాలే నేటి సంక్షోభాలకు పరిష్కారంగా అర్థశాస్త్ర వేత్తలు అభిప్రాయపడుతున్నారని అంటున్నారు ఇ.ఎస్. బ్రహ్మాచారి***

'**మార్క్స్** సహస్రాబ్ది మహామేధావి' అని 1999లో బి బి సి సర్వే ప్రథమస్థానం ఇచ్చింది. లిబరల్ ఆర్థికవేత్తలు 'మార్క్స్ మళ్లీ వచ్చాడు' అంటున్నారు. ఆర్థిక వృద్ధి బాగా ఉన్న వికాసకాలం (బూం)లో ఆర్థికవేత్తలకు మార్క్స్ గుర్తురాడు. ఎవరైనా గుర్తుచేసినా తేలిగ్గా తీసేస్తారు. ఆయన చెప్పినవి తప్పని తోసేస్తారు. అయితే ఆ వృద్ధి అంతలోనే అంతమై, క్షీణకాలం (బస్ట్) వెంటబడుతుంది. అలా ఆర్థిక సంక్షోభం వచ్చినప్పుడల్లా వారికి మార్క్స్ గుర్తొస్తాడు ఇది ప్రతిసారీ జరుగుతున్నదే వాస్తవాన్ని అప్పుడైనా, అంతవరకైనా అంగీకరించడం సంతోషించదగిందే కాని, వాళ్ల అంగీకారం ఎంతలోతైనదో తప్పక పరిశీలించాలి.

1990 దశకంలో అమెరికా మంచి వృద్ధి సాధించింది 2.2 కోట్ల కొత్త ఉద్యోగాలు వచ్చాయి. దేశ దేశాల నుంచి పనుల కోసం అక్కడికి ఎగబడడం అందరికీ తెలిసిందే. ఐ.టి. రంగం చూపుకు అందనంత వేగంగా దూసుకుపోయింది. ఈ ఆర్థిక వృద్ధిని చూసి పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు ఉప్పొంగిపోయారు. ఎంతగానంటే దానికి సరికొత్త ఎకానమీ (న్యూ ఎకానమీ) అని నామకరణం చేశారు. ఐ.టి. దీన్ని ముందుకు లాక్కుపోతుందనీ, అదే ఎకనామీకి చోదకశక్తి అనీ సగర్వంగా ప్రకటించారు. ఉత్పాదకత పెరుగుతూనే పోతుందన్నారు. కనుక కంపెనీలు సరుకుల ధరలు పెంచకుండానే కార్మికులకు వేతనాలు పెంచుతాయనీ, తమ లాభాలు కూడా పెంచుకుంటాయనీ చెప్పారు. అంటే అందరి ఆదాయాలు పెరుగుతూ ఉంటాయి. చేతుల్లో డబ్బులు ఆడుతుంటాయి కనుక సరుకులు ఎక్కువగా కొంటారు. దానికి తగినట్టు సరుకుల ఉత్పత్తి కూడా పెరుగుతుంది. కంపెనీలు పెట్టుబడులు పెంచుతాయి. దాంతో ఎక్కువమందికి పనులు దొరుకుతాయి. నిరుద్యోగం తగ్గుతూ పోతుంది. ఉత్పత్తయిన సరుకులన్నీ అమ్ముడవు తుంటాయి కనుక ఎకానమీ గతంలో లాగా అప్పుడప్పుడు వెనుకడుగు వేయదు. మాంద్యాలు వచ్చే అవకాశాలు ఉండవు. వర్తక వలయాలకు ఇంతటితో మంగళం పాడినట్టే పెట్టుబడిదారీ విధానంలోనే

---

ప్రతి బస్సు 98 శాతం ఉపయోగపు విలువను ఇస్తుందని రోజుకు సగటున 350 కి.మీ తిరుగుతుందని కార్మికులు పేర్కొంటున్నారు. ప్రయాణికులు సగటున ప్రతి బస్సుకు 70శాతం ఆకుపెన్సీ ఉంటుందని, మిగిలిన 30 శాతం ప్రయాణికులు ఆర్‌టిసి బస్సుల సంఖ్య తక్కువుగా ఉండడం వల్ల ప్రైవైట్ ట్రావెల్స్‌కు ఆకర్షితులవుతున్నారు. ఆర్‌టిసి అప్పులు రెండు తెలుగు రాష్ట్రాల్లో 5 వేల కోట్లకు పైమాటే. మూలధనం కేవలం 250 కోట్లకు మించకపోవడం ఆర్‌టిసికి గుదిబండగా మారింది. దీన్ని 2 వేల కోట్లకు చేయాలని ఆర్‌టిసి కార్మిక సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి. ఆర్‌టిసికి మొండిబకాయిలు ఏటా పెరుగుతున్నాయి. ఇవి వెయ్యికోట్లకు పైగా ఉన్నాయి. ఇందులో ప్రభుత్వం నించి రావాలసిన వాటానే 55 శాతం ఉంది. దానికితోడు ప్రభుత్వాలు రెండు తెలుగురాష్ట్రాలకు వివిధ వర్గాల ప్రయాణికులకు 700 కోట్లకు పైగా రాయితీలను ప్రకటిస్తోంది. దీన్ని ప్రభుత్వం పూడ్చడం లేదు. కేంద్రం అవలంభిస్తున్న ఆర్థిక విధానాలు ప్రైవేటీకరణను పెంచుతున్నాయి. రూట్లను పెంచకుండా ప్రభుత్వాలు ఆంక్షలు విధిస్తున్నాయి. మోటారు వాహన చట్టం 1988ని సవరించాలని, ఆర్‌టిసి లాంటి ప్రభుత్వ సంస్థలను బలోపేతం చేసే విధంగా నూతన చట్టాన్ని తీసుకురావాల్సిన అవసరం ఉంది.

2017-18 బడ్జెట్‌లోను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రహదారుల నిర్మాణానికి రు.4,041 కోట్లు కేటాయించారు. అయితే రోడ్డు ప్రమాదాల వల్ల ప్రజలు ఎక్కువుగా చనిపోతున్నా రహదారుల భద్రతకు ఒక్క రూపాయి కేటాయించలేదు. రోడ్డు భద్రతకు సుమారు 3 వేల కోట్లు అవసరమని, దానికోసం ప్రత్యేకంగా ఒక ప్రాజెక్టును ఏర్పాటు చేయాలని రహదారులు, భవనాల శాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపినప్పటికీ ప్రభుత్వం పట్టించుకోలేదు.

ఆర్‌టిసిని పటిష్టపరచాల్సిన ప్రభుత్వం కేవలం 470 కోట్లు మాత్రమే కేటాయించింది. బస్సులు కొనుగోలుకు రు.230 కోట్లు, రాయితీల రీయింబర్స్‌కు రు.121 కోట్లు, రుణాల చెల్లింపునకు 119 కోట్లు చెల్లించాలని ప్రభుత్వం నిర్ణయించింది. నిజానికి ఆర్‌టిసి యాజమాన్యం వెయ్యికోట్లు కావాలని ప్రతిపాదనలు పంపింది. గత సంవత్సరం రు.341 కోట్లు కేటాయించారు. బ్యాంకు రుణాల చెల్లింపుకే ఆర్‌టిసికి వెయ్యికోట్లు ఖర్చు అవుతుంది. 2015-16 ఆర్‌టిసి రుణాల చెల్లింపునకు 161 కోట్లు, 2016-17 కు రు.123 కోట్లు ప్రభుత్వం ఆర్‌టిసికి ఇచ్చింది. ఈసారి రు. 119 కోట్లు మాత్రమే ఇచ్చారు.

విభజన తర్వాత ఆంధ్రప్రదేశ్ ఆర్‌టిసి తీవ్ర నష్టాల్లో ఉంది. రు. 4 వేల కోట్లు అప్పులున్న ఆర్‌టిసి గట్టెక్కాలంటే ప్రభుత్వం విదిలించే బడ్జెట్ సరిపోదు. రుణాల వడ్డీకే రు.700 కోట్లు ఆర్‌టిసి ఏటా చెల్లించాలి. దానికి తోడు ఈ ఏడాది ఆర్‌టిసి రు.750 కోట్ల నష్టాల్లో ఉంది. ఆర్‌టిసిని కార్పొరేట్ శక్తులకు అందించాలని ప్రభుత్వం కంకణం కట్టుకుంది. అందులో భాగంగానే బడ్జెట్‌లో దానికి తగినంత నిధులు కేటాయించ లేదు. రోడ్డు ప్రమాదాల నివారణకు ప్రభుత్వం కనీసమైన చర్యలు సైతం తీసుకోవడం లేదు. రోడ్డు ప్రమాదాలు మానవహక్కుల ఉల్లంఘన కిందకే వస్తుందని ఐరాస ఘంటాపథంగా చెపుతున్నా ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్టు ఉంటోంది. రోడ్డు ప్రమాదాల్లో అధిక శాతం ప్రైవేట్ వాహనాల వల్లే జరుగుతున్నాయి. దీనికి ప్రభుత్వ విధానాలే కారణంగా ఉన్నాయి. ఆర్‌టిసి లాంటి సంస్థలను పటిష్టపరిచి, ట్రావెల్స్ మాఫియాకు అడ్డుకట్టవేసి, పటిష్టమైన చర్యలు తీసుకోగలిగినపుడే ప్రమాదాలను నివారించగలం. ప్రయాణికుల భద్రతకు భరోసా ఇవ్వగలం.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)*

ఈ వలయాలు తప్పుకుంటాయి. ఈ సరికొత్త ఎకానమీ తిరుగులేనిది. వృద్ధి ఉరుకు తీయడమే కాని వెనకంజ వెయ్యదు......ఇదీ ప్రచారం..!

ఈ ప్రచారం సాగుతుండగానే, 200 లో వృద్ధి ముగిసి డాట్ కాం సంక్షోభం చుట్టుకుంది. దాన్నుంచి పూర్తిగా తేరుకోకముందే 2007 చివరలో మహా సంక్షోభం వెంటబడింది. ఇప్పటికీ ఎంతోకొంత పీడిస్తూనే ఉంది. మాంద్యం రాకముందు ఏమన్నారో చూద్దాం.

◆ ◆ ◆

1997-2007 కాలంలో టోనీ బ్లెయిర్ ప్రభుత్వంలో ఆర్థిక మంత్రి హెరాల్డ్ విల్సన్ తన విధానాలతో మాంద్యాలు నిలువరిస్తాను అన్నాడు. వికాసమూ, పతనమూ అనే వ్యతిరేక దశలు ఉండనే ఉండవు. ఉండేదంతా వృద్ధే, వికాసమే అని ఢంకా బజాయించాడు. ఏటా ఇదే సందేశం ఇచ్చేవాడు. వర్తక వలయాలను నిలువరించాననే చెప్పేవాడు.

ఇంతలోనే 2008 మహామాంద్యం ఇంగ్లండ్‌ని కూడా కాటేసింది. అప్పటికి విల్సన్ ప్రధానమంత్రి (2007-10) అయ్యాడు. తీవ్రవిమర్శకు గురయ్యాడు. చెప్పింది చెయ్యలేకపోయావు గదా అన్నప్పుడు గొంతులో వెలక్కాయ పడ్డది నిజమేనని ఒప్పుకోక తప్పలేదు. "రాజకీయ నాయకులు పొరపాట్లు చేస్తారు. మేమూ చేశామని ఒప్పుకుంటున్నాను" అన్నాడు. కాని, చూడండి ప్రతిదేశమూ ఇదే స్థితిలో ఉంది అని తప్పుకోచూశాడు. అలాకొంత నింద ప్రపంచ ఆర్థిక విధానం మీదికి నెట్టాడు. కాని మాంద్యాన్ని ఆపలేకపోయాడు.

అక్టోబరు 2000లో ఒక ఐఎంఎఫ్ అధికారి అమెరికాలో వృద్ధి కొనసాగుతుందనీ, ఐరోపా ఎకానమీ విస్తరిస్తుందనీ అన్నాడు. అయితే, అమెరికా మాన్యుఫాక్చరింగ్ రంగం - ముఖ్యంగా టెలికమ్యూనికేషన్స్ రంగం, కంప్యూటర్ రంగం వెనుకడుగు వేసింది 2000 సెప్టెంబరులోనే. 2001 ఫిబ్రవరిలో కాంగ్రెస్‌లో 'మనం మాంద్యంలో పడుతున్నామా?' అని అడిగితే గ్రీన్ స్పాన్ ముక్తసరిగా 'లేదు' అన్నాడు. అన్నాడో, లేదో మాంద్యం పట్టుకుంది. ఇదే ప్రశ్నకు 1990 సెప్టెంబరులోనూ ఇదే జవాబు చెప్పారు. అప్పటికే దేశం మాంద్యంలో ఇరుక్కుని ఉంది. వాళ్లంతా మందగింపు నుంచి బయటపడుతున్నది అంటున్నారో లేదో ఎకానమీ దిగబడి పోతున్నది. మాంద్యంలోకి జారుకుంటున్నది. ఆగస్టు చివరిలో పాల్ కాబ్రియేల్ అనే ఆర్థికవేత్త "మనం మాంద్యంలో లేం" అని అన్నాడు. అంతటితో ఆగకుండా మాంద్యంలో పడబోం అని ధీమా వ్యక్తం చేశాడు. అయితే, మార్చి 2001 నుంచి అమెరికా మాంద్యంలో ఉంది అని నవంబర్‌లో ఎన్‌బిఇఆర్ అధికారికంగా ప్రకటించింది. ఎన్‌బిఇఆర్‌కి ఇక ముందు అలా ప్రకటించే పని ఉండదు అని శామ్యూల్‌సన్ అన్నా దానికి ఆ పని చేయక తప్పలేదు.

ఆర్థికవేత్తలు ఇలా చెప్పడం, అలా మాంద్యాలు పట్టుకోవడం మొదటిసారేమీ కాదు. వృద్ధి ఊపుగా ఉన్నప్పుడల్లా ఇదే దరువు 1920 దశకం చివరిలో ఇలాంటి మాటలే చెప్పారు. అలా చెపుతూ ఉండగానే ప్రపంచం ఎన్నడూ ఎరుగని మహా సంక్షోభంలో చిక్కుకుంది. అలాగే, అభివృద్ధి ఎక్కువకాలం సాగిన 60లలోనూ, 80లలోనూ అదే పాట పాడారు. వాళ్లలా అనడానికీ, ఎకానమీ దిగబడటానికీ ఆట్టే కాలం పట్టలేదు. ఈ ప్రచారాలు సాగించిన వాళ్లలో ఆర్థికవేత్తలుగా పేరుపొంది నోబెల్ బహుమతులు తీసుకున్న రాబర్ట్ సోలే, పాల్ శామ్యూల్‌సన్ కూడా ఉన్నారు. వర్తక వలయాలు ఉండవు కనుక అవి ఎప్పుడు మొదలైందీ, ఎప్పుడు ముగిసిందీ తేల్చి చెప్పే పని ఎన్‌బిఇఆర్ సంస్థకిక ఉండదని శామ్యూల్‌సన్ చమత్కరించేదాకా పోయాడు. ఇక కెనడీకి, జాన్సన్‌కు సలహాదారుగా ఉన్న ఆర్థర్ ఓకున్ మాంద్యాలు రాకుండా చేయవచ్చనీ, వ్యాపార ఒడిదుడుకులు పాతకాలం మాటలనీ తన పుస్తకం 'ది పొలిటికల్ ఎకానమీ ఆఫ్ ప్రాస్పరిటీ'లో రాశాడు. ఆ పుస్తకం 1969 నవంబర్‌లో పూర్తయింది. సిరా కూడా సరిగా ఆరిందో లేదో డిసెంబర్‌లో మాంద్యం మొదలయింది. ఫలానా జాగ్రత్తలు తీసుకుంటే మాంద్యం రాదనీ, ఫలానా చర్యలు తీసుకుంటే వచ్చిన మాంద్యం పోతుందనీ పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు చెబుతుంటారు. కాని ఆ చిట్కాలేవీ ఆర్థిక సంక్షోభాల్ని నిరోధించిన దాఖలాలు లేవు.

కారణం, పెట్టుబడిదారీ ఆర్థికవిధానం సంక్షోభాలతో ముడిబడి ఉంటుంది. ఆ విధానాన్ని అవలంబించే దేశాలు సంక్షోభాల్లో పడి తీరవలసిందే. అందుకు ఏ దేశమూ మినహాయింపు కాదు. ఏ నమూనా మినహాయింపు కాదు. 1980వ దశకంలో జపాన్ అద్భుతం. ఆ జపాన్ నమూనా మినహాయింపు అని అన్నారు. 1990 దశకంలో అది కూలిపోయింది. 1990 దశకంలో అమెరికా వెలిగింది. అంతే, అమెరికా నమూనా అన్నారు. ఆ నమూనాను అన్ని దేశాలు సరిగా అమలుపరిస్తే ప్రపంచం సర్వతోముఖాభివృద్ధి సాధిస్తుంది అన్నారు. ఇంతలో ఐటి బుడగపేలి మాంద్యంలో పడింది. పూర్తిగా కోలుకోకముందే 2007 చివరలో మహామాంద్యం బారినపడింది.

దీన్నిబట్టి, ఈ విధాన సమర్థకులు, ఆర్థికవేత్తలు ఎన్ని కథలు, కబుర్లు చెప్పినా పెట్టుబడిదారీ విధానంలో సంక్షోభాలు పదే పదే వస్తూనే ఉన్నాయి. అవి ఆగేవి కావు. ఆపడం ఎవరివల్లా కాదు అని మార్క్స్ అంటాడు. వచ్చినవాటిని బట్టి ఇంకావస్తాయి అనడం కాదు సిద్ధాంతరీత్యా ఎలావచ్చి తీరతాయో చెప్పాడు.

దానిపాటికి దాన్ని వదిలేస్తే, మార్కెట్ సరఫరానూ గిరాకీనీ సమానం చేసి, అన్ని సమస్యల్నీ పరిష్కరిస్తుందనీ, అధికోత్పత్తి సంక్షోభాలు చరిత్ర చెత్తడబ్బాలో పడ్డాయనీ పెట్టుబడిదారీ సమర్థకులు ప్రచారం చేశారు. పెట్టుబడిదారీ విధానంలో ఉన్న వైరుధ్యాలవల్ల అది కుప్పకూలుతుందని అనేవాళ్లు అతిగాళ్ల (cranks) నీ విమర్శించారు.

వాణిజ్యం మీద ఇంకొన్ని ఆంక్షలు తొలగించి, పన్నులు తగ్గిస్తే ఎకానమీ మరింత వృద్ధి అవుతుందన్నారు. సంపన్నులకి పన్నులు తగ్గిస్తే, ఎకానమీ బలపడుతుందనీ, కిందివాళ్లకి ఉద్యోగాలొస్తాయనీ చెప్పారు. దీన్నే ట్రికిల్ డౌన్ థియరీ (అభివృద్ధి పైనుంచి కిందికి బొట్లుబొట్లుగా రాలిపడుతుందనే సిద్ధాంతం) అని ఆ విధానాన్ని అనుసరించారు.

2000లో బిల్ క్లింటన్ ఇలా చెప్పాడు: జీవన ప్రమాణాల్ని పెంచడానికీ, పర్యావరణ విధ్వంసాన్ని తగ్గించడానికీ, సంపద పంపిణీకి మంచి చోదకశక్తి స్వేచ్ఛా మార్కెట్లూ, నిబంధనల ఆధారిత వర్తకమూ అని నిర్ద్వంద్వంగా మనం పునరుద్ఘాటించాలి.

**మరి, స్వేచ్ఛా మార్కెట్ సమస్యల్ని పరిష్కరించిందా?**

లేదు అని ఒబామాయే చెప్పాడు. అది రీగన్ హత్తుకున్న సిద్ధాంతం అనీ, అనుకున్న ఫలితం రాలేదనీ అన్నాడు. అందుకు వ్యతిరేక ఫలితాలొచ్చాయి. అసమానతకీ, కార్పొరేట్ల అత్యాశకీ వ్యతిరేకంగా వాల్ స్ట్రీట్ ఆక్రమణ జరిగాక 2011 డిసెంబర్లో ఒసావాటొమీలో ఇచ్చిన ఆర్థికోపన్యాసంలో "ఇది ఏనాడూ పనిచెయ్యలేదు" అన్నాడు. "అది పనిచెయ్యదు. మహా సంక్షోభం ముందు దశకంలో ప్రయత్నించినప్పుడు పనిచెయ్యలేదు. 50,60 దశకాల్లో యుద్ధానంతర వికాసాన్ని తెచ్చింది అదికాదు. అలాగే పోయిన దశాబ్దంలో ప్రయత్నించినప్పుడూ ఫలితాన్నివ్వలేదు" అన్నాడు.

స్వేచ్ఛా వాణిజ్యానికి పట్టం కట్టారు. దేశదేశాలు కలిసి ఒప్పందాలు చేసుకున్నారు. వాటివల్ల పరస్పరం ప్రయోజనం లభిస్తుంది అన్నారు. అది అప్పటి మాట. ఇప్పుడు ఐరోపా సంఘటన నుంచి బ్రిటన్ తప్పుకోవాలని నిర్ణయించింది. పార్లమెంట్ ఆమోదించడమూ అయిపోయింది. యూనియన్లో ఉన్నందువల్ల తమదేశానికి నష్టం వాటిల్లుతున్నదని తేల్చింది.

అలాగే ఇప్పుడు ట్రంప్ నాఫ్తా ఒప్పందంవల్ల అమెరికా ఉద్యోగాలు మెక్సికోకి పోయాయని విమర్శించాడు. ఆ ఒప్పందాన్ని పునస్సమీక్షిస్తానన్నాడు. ట్రాన్స్ పసిఫిక్ పార్ట్‌నర్‌షిప్ వాణిజ్య ఒడంబడికనుంచి తప్పుకుంటానన్నాడు. పసిఫిక్ సముద్రతీరంలో ఉన్న 12 దేశాలకు చెందిన ఒప్పందం. ఒబామా దీనికోసం కృషిచేశాడు. ఈ ఒప్పందం ఫలితంగా చివరకి ఈ దేశాలన్నీ ఒకే మార్కెట్‌గా అవతరించాలని ఉద్దేశం. అంటే ఐరోపా యునియన్ లాగా. అయితే బ్రిటన్ యూనియన్ నించి తప్పుకోవాలని ప్రజాభిప్రాయం వచ్చింది. ట్రంప్ మొదట్నించీ అందుకు మద్దతిచ్చాడు. అందుకే బ్రిటన్ ప్రధాని థెరెసా మే శ్వేత సౌధానికి వెళ్లి ట్రంప్‌ని అభినందించింది.

నాఫ్తాని పునస్సమీక్షిస్తానన్నాడు. 'నాఫ్తా' 1994లో అమెరికా, మెక్సికో, కెనడాలు చేసుకున్న స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం. దానివల్ల అమెరికాలో చాలా ఉద్యోగాలు వస్తాయన్నారు. కాని 7 లక్షల ఉద్యోగాలు పోయాయని తేలింది. మెక్సికోలో కూలీ చౌక కనక అమెరికా కంపెనీలు అక్కడకు వెళ్లాయి. అమెరికన్లకు ఉద్యోగాలు పోయాయి. మాంద్యం వచ్చాక 2000 దశకంలో అమెరికాలో దీనికి వ్యతిరేకత పెరిగింది.

మెక్సికో చైనాలతో వాణిజ్యం మధ్యతరగతి ఉద్యోగాల్ని కొల్లగొడుతున్నది అన్నాడు. ఆ దేశ సరుకుల మీద దిగుమతి సుంకం పెంచుతానన్నాడు. అమెరికాలో ఉద్యోగాల్ని విదేశీయులు పొందు తున్నారు, ఆ ఉద్యోగాలు అమెరికన్లకే దక్కాలి అంటున్నాడు. అందుకు, ఇప్పటికే ఎచ్ 1 బి వీసా బిల్లు ప్రవేశపెట్టాడు. 1,30,000 డాలర్ల వేతనం పొందితేనే విదేశీయులు ఉద్యోగార్హులవుతారు. ఇంతకుముందు ఆ పరిమితి 60,000 డాలర్లు కఠినమైన నిబంధనలు విధించి విదేశీయులు అమెరికాలో ఉద్యోగాలు పొందడం కష్టతరం చేస్తున్నాడు. నిన్నటిదాకా సమర్థించిన ప్రపంచీకరణకి భిన్నంగా ఇప్పుడు జాతీయ వాదాన్ని ముందుకు తెస్తున్నాడు. కారణం, అది చెప్పిన ఫలితాల్ని రాబట్టలేకపోవడమే. ఈ జాతీయవాద విధానాలూ విఫలమయ్యేవే. ఎందుకంటే, ఒకప్పుడు ఆచరించి, విఫలమైనవే కనక.

1990లలో చైనాని పెట్టుబడిదారీ విధానం కాపాడిందన్నారు. 2008 మాంద్యం వచ్చాక పారిశ్రామిక దేశాలన్నీ వరసగా దిగబడ్డాయి. అప్పుడు చైనాయే పెట్టుబడిదారీ విధానాన్ని కాపాడాలి అన్నారు. అప్పట్లో చైనా ఊపుగా ఉండడమే అలా అనడానికి కారణం. వృద్ధిరేటు 2007లో 14.2 శాతం, 2008లో 9.5కి పడింది. 2016లో 6.7 శాతానికి దిగింది. ఆదాయ అంతారాలు పెరిగి, నిరుద్యోగం ఎక్కువయి ఎన్నో సమస్యలతో చైనా సతమతమవుతున్నది. తన్నుతాను కాపాడుకోలేక కొట్టుమిట్టాడుతున్నది. సోషలిస్ట్ మార్కెట్ ఎకానమీ అనే పేరు పెట్టుకున్నా అది పెట్టుబడి దారీ విధానమే. అందుకే చైనా ఆ విధానంలో వచ్చే ఆటుపోట్లకు గురవుతున్నది.

ఈ వాస్తవాలు గ్రహించి కొందరు మార్క్సిస్టులు కానివారు కూడా 'మార్క్స్ తిరిగి వచ్చాడు' అనడం మొదలుబెట్టారు.

1997 అక్టోబర్ 13న న్యూయార్క్‌లో జాన్ కాసిడీ 'ది రిటర్న్ ఆఫ్ కార్ల్ మార్క్స్' అనే వ్యాసం రాశాడు. ప్రపంచీకరణ అనే మాట ఇటీవల ప్రాచుర్యంలోకి వచ్చింది. దీని గురించి మార్క్స్ 150 ఏళ్లనాడే చెప్పాడు. పెట్టుబడిదారీ విధానం గుత్తాధిపత్యం వైపు పోతుందని చెప్పాడు. ఆయన కాలానికి అది ఎంతోదూరంలో ఉన్న విషయం. 21వ శతాబ్దంలో ఇదే అతి పెద్ద సమస్య కాబోతున్నది అన్నాడు. కాసిడీ మార్క్స్ వేతనాలకంటే లాభాలు వేగంగా పెరుగుతాయనీ, అందువల్ల కార్మికులు కాలం గడిచేకొద్దీ పెట్టుబడిదారులతో పోలిస్తే మరింత పేదలవుతారనీ చెప్పాడనీ, గత రెండు దశాబ్దాలుగా ఇదే జరిగిందనీ కాసిడీ తన వ్యాసంలో రాశాడు. ద్రవ్యోల్బణాన్ని లెక్కించి చూస్తే కార్మికుల వేతనాలు 1973 స్థాయికంటే తక్కువలో ఉన్నాయి. లాభాలు పైపైకి పోయాయి అన్నాడు.

అయితే శ్రమే విలువకి ఏకైక వనరు అనే దాని మీద నిర్మించిన ఆయన సిద్ధాంతం అంతర్గత అసంబద్ధతలతో కూడి ఉందన్నాడు. కాసిడీ లోపాలున్నాయంటూనే, పెట్టుబడిదారీ విధానం ఉన్నంతవరకూ ఆయన పుస్తకాలు చదవదగినవి అని ముగించాడు.

కార్ల్ మార్క్స్ తిరిగి వచ్చాడని బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకుడు జాన్ మెక్‌డొన్నెల్ అన్నాడు. మార్క్స్ సిద్ధాంతాలు ఇప్పుడు మళ్లీ ప్రధాన స్రవంతి ఆలోచనలుగా మారాయి. ఆయన నిర్ధారణలతో కొందరు ఏకీభవించక పోవచ్చు కానీ ఆయన విశ్లేషణలు చాలా ఆసక్తికరమైనవి అనీ బ్రిటిష్ షాడో ఛాన్సలర్‌గా వ్యవహరిస్తున్న మెడ్‌డొన్నెల్ లేబర్ పార్టీ మహాసభలో ఆర్థికరంగంపై కీలకోపన్యాసం చేస్తూ అన్నాడు. సోషలిస్టు ఆర్థిక శాస్త్ర నిర్మాత అయిన కారల్ మార్క్స్ చనిపోయిన 130 సంవత్సరాల తరువాత కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ ఎలా పనిచేస్తుందో చెప్పే అత్యుత్తమ విశ్లేషణ ఆయనది మినహా మరెవరిదీ లేదని మెక్‌డొన్నెల్ అన్నాడు. వ్యవస్థను మార్చడానికి మార్క్స్ చేసిన సూచనలతో అంగీకరించవచ్చు, లేకపోవచ్చు కానీ ఆయన సిద్ధాంతాలు ఇప్పటికీ ఆసక్తికరమైన విశ్లేషణలే. అందుకే అవి ప్రధాన స్రవంతి ఆలోచనలుగా మారాయి అని చెప్పాడు.

వాటికన్ అధికార పత్రిక 2009లో ఆదాయ అసమానతల గురించి మార్క్స్ చెప్పినదాన్ని మెచ్చుకున్న వ్యాసాన్ని ప్రచురించింది.

యుబిఎస్ బాంక్ ఆర్థికవేత్త జార్జ్ మాగ్నస్ మార్క్స్ విశ్లేషణలో చాలా లోపాలున్నాయి అంటూనే, కంపెనీల లాభతృష్ణ, ఉత్పాదకత, పనివాళ్లు తగ్గిపోతూ, నిరుద్యోగ సైన్యం ఏర్పడుతుందని మార్క్స్ రాసినదాన్ని ఒప్పుకుంటాడు. అభివృద్ధి చెందిన దేశాలన్నిటిలో ఇదే పరిస్థితి అంటాడు. "సంపద సమీకరణ ఒకవైపు, అందువల్ల పేదరికం మరొకవైపు" అనేదాన్ని అంగీకరిస్తాడు.

2008 మాంద్యాన్ని ముందుగానే పసిగట్టిన రూబినీ ప్రపంచీకరణ అదుపు తప్పిందని మార్క్స్ సరిగానే వాదించాడు అన్నాడు. సంస్థలు ఉద్యోగాలు కోతపెడుతున్నాయనీ, దాంతో శ్రామికుల ఆదాయాలు పడిపోయి, సరుకులకు సరైన గిరాకీ లేదనీ చెప్పాడు. దీన్ని అధిగమించడానికి ప్రభుత్వాలు చేసిన ప్రయత్నాలకు ఫలితం దక్కలేదని అన్నాడు. అయితే మార్క్స్ చెప్పిన ప్రత్యామ్నాయం సోషలిజం మెరుగైనది కాదు అని అభిప్రాయపడ్డాడు.

మార్క్స్ కమ్యునిజాన్ని గురించి చెప్పినవి కరెక్ట్ కాదు, కాని కాపిటలిజాన్ని గురించి చెప్పిన విషయాలు కరెక్టే అన్నాడు. జాన్ గ్రే అనే రాజనీతి తత్వవేత్త ఫాల్స్ డాన్ : 'ది డెల్యూజన్స్ ఆఫ్ గ్లోబల్ కాపిటలిజం' అనే పుస్తకంలో ద్రవ్య సంక్షోభం వచ్చాక, మార్క్స్ చెప్పింది రైటా అని ఆలోచించేవారు పెరిగారు అన్నాడు. 19వ శతాబ్దంలో ఎక్కువమంది జనానికి ఏమీలేదు. శ్రమని అమ్మి బతికేవారు. పెట్టుబడిదారీ విధాన సమర్థకులు ముందు ముందు వాళ్లకీ ప్రయోజనం కలుగుతుందనీ, ప్రతివాళ్లూ మధ్యతరతికి చేరుకుంటారనీ చెప్పేవారన్నాడు. అయితే గత 20, 30 ఏళ్లుగా అందుకు వ్యతిరేకంగా జరుగుతున్నదన్నాడు. పెట్టుబడిదారీ విధానం అస్థిరమైనదని, ప్రజావిప్లవం ద్వారా కమ్యునిస్ట్ విధానం వస్తుందనీ మార్క్స్ నమ్మాడు. అది మాత్రం తప్పు అన్నాడు.

◆ ◆ ◆

వీళ్లందరూ నిరుద్యోగం పెరిగిందనీ, అసమానతలు అధికమయ్యాయనీ అనడం వరకే పరిమితం. పెట్టుబడిదారీ విధానంలోనే సమస్యలు పరిష్కరించవచ్చునంటారు. అంతేగాని అవి ఈ విధానపు అనివార్య పర్యవసానాలు అని ఒప్పుకోరు. మార్క్స్ పేరెత్తుతారు గాని మార్క్సిజాన్ని ఒప్పుకోరు.

ఈ సమస్యలకు కారణం పెట్టుబడిదారీ ఆర్థిక విధానం అని గానీ,

అసమానతలు పోవాలంటే ఈ ఆర్థిక విధానం స్థానంలో సోషలిస్ట్, కమ్యూనిస్ట్ విధానం రావాలనీ అంగీకరించరు. ఇదే విధానం అంతిమం అనీ, దీనికి సవరణలు చెయ్యడం మినహా చెయ్యగలిగిందేమీ లేదనీ చెబుతుంటారు. మరొక మెరుగైన విధానం అంటూ ఏదీ లేదనీ, రాదనీ, సాధ్యం కాదనీ వాదిస్తారు.

పెట్టుబడిదారీ విధానమే చివరది. పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయం లేదు అంటారు. "ప్రత్యామ్నాయం లేదు" అనే మాట మొదట వాడినవాడు తత్వవేత్త హెర్ బర్ట్ స్పెన్సర్. ఆయన స్వేచ్ఛా వాణిజ్యాన్ని సమర్థించేవాడు. పెట్టుబడిదారీ విధానాన్నీ, స్వేచ్ఛా మార్కెట్లనీ విమర్శించే వాళ్లకి దీనికి (పెట్టుబడిదారీ విధానానికి) "ప్రత్యామ్నాయం లేదు" అని చెప్పేవాడు. 1980లలో బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్ (1979–1991) దాన్నొక నినాదం చేసింది. నయా ఉదారవాద విధానాలు తప్ప గత్యంతరం లేదు అని ప్రచారం చేసింది. సంక్షేమ కార్యక్రమాల్ని తగ్గించి, కొన్ని పరిశ్రమల్ని ప్రైవేటీకరించింది. కార్మిక సంఘాల్ని బలహీనపరిచే ప్రయత్నాలు చేసింది.

రాజనీతి శాస్త్రవేత్త ఫ్రాన్సిస్ ఫుకుయామా పెట్టుబడిదారీ విధానంతో పోటీ చెయ్యగల సిద్ధాంతం ఏదీలేదన్నాడు. 1989లో 'ది ఎండ్ ఆఫ్ హిస్టరీ?' అనే వ్యాసం రాశాడు. పోరాటంలో పశ్చిమ ఉదార ప్రజాస్వామ్యం విజయం సాధించిందని ఉద్ఘాటించాడు. జాన్ గ్రే ఆయన్ని ప్రపంచ పెట్టుబడిదారీ విధాన తత్వవేత్త అంటూ కొనియాడాడు. దాన్ని విస్తరించి 'ది ఎండ్ ఆఫ్ హిస్టరీ అండ్ ది లాస్ట్ మాన్' పేరుతో 1992లో పుస్తకం ప్రచురించాడు. 1992లో పుస్తకం వచ్చినప్పుడు, వ్యాసానికున్న ప్రశ్నార్థకం లేదు. ఫుకుయామా ప్రపంచ పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం చరిత్రకు చివరి దశ అన్నాడు.

వీళ్లందరూ కూడా గణాంకాలను బట్టి మాట్లాడతారు. సిద్ధాంతం ఉండదు. తలెత్తిన సమస్యలకి మూలకారణాలేమిటో చర్చించరు. నిరుద్యోగం పెరిగితే ఎందుకు పెరిగిందని కాకుండా, ఉద్యోగాలు రావాలి అంటారు. పెట్టుబడులు పెరిగితే, ఉద్యోగాలొస్తాయి అంటారు. తయారైన సరుకులు అమ్ముడవుతుంటే, తిరిగి ఉత్పత్తి అవసరమవుతుంది. ఉద్యోగాలు పోయాక కొనడం తగ్గుతుంది. దాంతో ఉత్పత్తీ తగ్గుతుంది. ఉన్న పరిశ్రమలకే పూర్తిగా పని ఉండదు. కొత్త పెట్టుబడులతో అవసరం ఉండదు. కనక ఇది సమస్యను తీర్చదు.

మళ్లీ మార్క్స్ అనే వాళ్లంతా పెరుగుతున్న అసమానతల సమాచారాన్ని బట్టి మాట్లాడుతున్నారు. ఎందుకు పెరుగుతున్నాయో మార్క్స్ చెప్పాడు. అవి ఎలా పోతాయో కూడా చెప్పాడు. గణాంకాలు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి కాబట్టి ఒప్పుకుంటున్నారు.

**నెమ్మదించిన ప్రపంచ ఆర్థికవృద్ధి:** ప్రపంచ ఆర్థికవృద్ధి 2016లో 3.1 శాతం. గడిచిన ఆరేళ్లలో ఇదే తక్కువ. అమెరికా వృద్ధి 2016లో 1.6 శాతం మాత్రమే. 5 ఏళ్లలో ఇదే అతి తక్కువ. 2015లో 2.6శాతం.

**పెరుగుతున్న అప్పు:** అన్నిదేశాలూ అప్పులతో సతమతమవు తున్నాయి. 2016 డిసెంబర్ 30న అమెరికా అప్పు దాదాపు 20 (19.98) లక్షల కోట్ల డాలర్లు. ఒబామా వచ్చేటప్పటికి 10.6 లక్షల కోట్ల డాలర్లు. 9.3 లక్షల కోట్లు కొత్త అప్పు కలిపాడు. ఇంచుమించు రెట్టింపు చేశాడు. ఇంత అప్పు ఎవరి కాలంలోనూ పెరగలేదు. ఏపార్టీ అధికారంలో ఉన్నా, ఎవ్వరు అధ్యక్షుడుగా ఉన్నా, అప్పు పెరుగుతూనే ఉంది.

**పెరుగుతున్న నిరుద్యోగం:** 2016లో 19 కోట్ల 77 లక్షల మంది నిరుద్యోగులున్నారు. 2017లో 34 లక్షలమంది పెరిగి, మొత్తం 20 కోట్ల 11 లక్షల మంది అవుతారు. పోనీ 2018లో తగ్గుతారా అంటే అదీలేదు. 20 కోట్ల 38 లక్షలవుతారని అంచనా.

పనులు ఉన్నవాళ్లు కూడ చాలామంది తక్కువస్థాయి చెయ్యాల్సి వస్తుంది భద్రతలేని ఉద్యోగులు 140 కోట్ల మంది ఈ సంఖ్య ఏటా 1కోటి 10 లక్షలు పెరుగుతుందని అంతర్జాతీయ కార్మికసంస్థ తన 2017 నివేదికలో చెప్పింది. పైగా ఏటా కోట్లాది కొత్తవాళ్లు పనియాడుకి వస్తున్నారు. వాళ్లందరికీ మంచి ఉద్యోగాలు కల్పించడం ఒక సవాలు మంచి ఉద్యోగాలు అవునా కాదా తరవాత, అసలు అవసరమైనన్ని ఉద్యోగాలు రావడం గురించి కార్మికసంస్థ ఆందోళనలో ఉంది.

**పెరుగుతున్న ఆదాయ అసమానతలు:** కాపిటల్ ఇన్ ది ట్వంటీ ఫస్ట్ సెంచురీ (2013) అనే పుస్తకంలో థామస్ పికెటీ గడచిన 250 ఏళ్లలో సంపద కేంద్రీకరణ గురించీ, పంపిణీ గురించీ రాశాడు. అసమానతలు అధికమవుతున్నాయనీ, ఇంకా అవుతాయనీ చెప్పాడు. సంపద పెరిగేకొద్దీ మరింతపన్ను వెయ్యడం ద్వారా సమస్యని ఎదుర్కోవాలని సూచించాడు. పెట్టుబడిదారీ విధానానికి కట్టుబడిన పికెటీ సోషల్ డెమాక్రట్ మార్క్సిస్టు ముద్రని ఒప్పుకోడు.

ఎనిమిది మంది అత్యంత సంపన్నుల ఆస్తి అడుగునవున్న 360 కోట్ల మందికున్న మొత్తం ఆస్తికి సమానం– అని దావోస్ సమావేశం సందర్భంగా ఆక్స్ ఫాం 2017 జనవరి 16న విడుదలచేసిన నివేదిక యాన్ ఎకానమీ ఫర్ ది 99 పర్సెంట్ తేల్చి చెప్పింది ధనికులకీ, పేదలకీ వ్యత్యాసం అనుకునే దానికన్నా చాలా ఎక్కువగా ఉందన్నది బడా వ్యాపారులూ, మహా ధనికులూ పన్నులు ఎగ్గొట్టీ, వేతనాలు తగ్గించీ, రాజకీయాల్ని తమ శక్తితో ప్రభావితం చేసీ ఈ అసమానతల్ని ఎలా పెంచుతున్నారో వివరించింది. ఇండియాలో దేశ ఆస్తిలో సగానికి పైగా పై ఒక్క శాతం మందిదే.

రాబోయే 20 ఏళ్లలో 500 మంది తమ వారసులకి 2.1 లక్షల కోట్ల డాలర్లు ఇస్తారు. ఈ మొత్తం 130 కోట్ల జనాభా ఉన్న ఇండియా స్థూల జాతీయోత్పత్తి కన్నా ఎక్కువ.

1988–2011 కాలంలో అడుగున ఉన్న 10 శాతం మందికి ఆదాయం సంవత్సరానికి 3 డాలర్లకి తక్కువ పెరిగింది. పై ఒక్క శాతానికి అంతకు 182 రెట్లు పెరిగింది. బంగ్లాదేశ్ లో ఎఫ్ టి ఎస్ ఇ – 100 సి.ఇ.ఓకు దుస్తుల ఫాక్టరీలో పనిచేసే 10 వేల మంది పనివాళ్లకంటే ఎక్కువ వస్తుంది.

అమెరికాలో పోయిన 30 ఏళ్లలో అడుగు 50 శాతం మందికి ఆదాయం ఏమీ పెరగలేదు. అదే కాలంలో పై ఒక్క శాతం మందికి 300 శాతం పెరిగింది.

జాతీయాదాయంలో అడుగు 50 శాతం మంది ఆదాయం 1980లో 20 శాతం ఉండేది. 2014కి 12 శాతానికి పడిపోయింది. పై ఒక్క శాతం మందికీ రెట్టింపయింది. అప్పుడు 10 శాతమయితే ఇప్పుడు 20 శాతం. వాళ్ల సంపద మొత్తం కుటుంబ సంపదలో 37 శాతం అడుగు 50 మందికీ, అంటే 16 కోట్లమందికి ఏమీలేనట్లే (0 1 శాతం)

2013లో సగం సంపాదన 360 మంది చేతుల్లో ఉండగా, 2016లో 62 మంది చేతుల్లోకి చేరింది రానురాను సంపదంతా కొద్దిమంది చేతుల్లోకే పయనిస్తున్నదని దీన్నిబట్టి స్పష్టంగా అర్థమౌతోంది 1970లో అమెరికా సి.ఇ.ఓ జీతం సగటు కార్మికుని జీతానికి 30 రెట్లు 2012లో 263 రెట్లు.

2014లో పూర్తికాలం పనిచేసే ఉద్యోగి 50,383 డాలర్లు పొందేవాడు. అయితే అది ద్రవ్యోల్బణాన్ని బట్టి చూస్తే, 1973లో సంపాదించిన దానికన్నా 2900 డాలర్లు తక్కువ.

**చెదిరిన అమెరికా కల:** పేదరికంలో పుట్టినా, కష్టపడి పనిచేస్తే అమెరికాలో సంపన్నులుగా ఎదుగుతారు – ఇది అమెరికా స్వప్నం సారాంశం కేంద్రబిందువు .

ఈ ఏటికంటే వచ్చే ఏడు ఎక్కువ ఆదాయం ఉంటుందనీ మెరుగైన జీవనం అందుతుందనే అమెరికా కల అనేది శ్రామికులకి పగటికలే ప్రతి కుటుంబానికి సొంత ఇల్లు అనేది అమెరికా కలలో భాగం. 2008 మహామాంద్యంలో 70 లక్షల మంది ఇళ్లు పోగొట్టు కున్నారు.

1940లలో పుట్టిన అమెరికన్లలో నూటికి 90 మంది 30 ఏళ్ల వయసొచ్చేసరికి వాళ్ల తలిదండ్రులకన్నా ఎక్కువ సంపాదించేవారు. అయితే 1980లలో పుట్టిన వాళ్లలో నూటికి 50 మంది మాత్రమే తలిదండ్రులకన్నా మెరుగ్గా ఉన్నారు. తమ తల్లిదండ్రుల కంటే తక్కువ ఆదాయాలతో గడపాల్సి వస్తున్నదని అర్థమవుతోంది. నూటికి 43 మంది పిల్లలు తక్కువ ఆదాయం ఉన్న కుటుంబాలలో ఉన్నారు. ఈ కుటుంబాలకు దారిద్ర్య రేఖకు రెట్టింపు లోపు ఆదాయం ఉంటుంది. నలుగురున్న కుటుంబానికి దారిద్ర్య రేఖ 24,036 డాలర్లు. తక్కువ ఆదాయ కుటుంబానికి 48,000 డాలర్లు. ఇటువంటి పిల్లలు రికవరీ మొదలైన 2009లో కంటే 2015 కి ఒక శాతం పెరిగారు. మొత్తం 3 కోట్ల పైచిలుకుగా ఉన్నారు. రికవరీ అన్నాక పరిస్థితి ఇది అని నేషనల్ సెంటర్ ఫర్ చిల్డ్రన్ ఇన్ పావర్టీ జనవరిలో వెల్లడించింది.

**ప్రజా ఉద్యమాలు**

మహామాంద్యం నేపథ్యంలో చాలాదేశాలు ప్రభుత్వ వ్యయం తగ్గించాయి. సంక్షేమ చర్యలకు కోతపెట్టాయి. పెన్షన్లనూ వదలలేదు. ఈ చర్యలకు వ్యతిరేకంగా ఐరోపా దేశాలలో నిరసనోద్యమాలు వెల్లువెత్తాయి.

2010 చివరలోనూ, 2011 మొదట్లోనూ అరబ్ ప్రపంచం వరస నిరసన ప్రదర్శనలతో అట్టుడికింది. అరబ్ వసంతంగా పేరుపొందింది. అరబ్ ప్రజలు ఎందుకు తిరగబడ్డారు? 1848లో యూరప్ లో ఉన్న క్లిష్ట పరిస్థితుల్ని గుర్తుకుతెచ్చే ఆర్థిక, సామాజిక పరిస్థితులు నెలకొన్నాయి. పేదరికం, పెరుగుతున్న ఆహార ధరలు, ద్రవ్యోల్బణం, మానవహక్కుల ఉల్లంఘన, అధిక నిరుద్యోగం– ప్రధాన కారణాలు అమెరికాలో మొదలై ఎన్నో దేశాలకు పాకిన ఆక్రమణ ఉద్యమాలు అలాంటివే.

2011లో నూరుగురిలో మీరు ఒక్కరు, మేము 99 మందిమి అని నినదించారు. 2011 సెప్టెంబర్ 11న న్యూయార్క్ నగరంలో జుకొట్టి పార్క్‌లో వాల్ స్ట్రీట్ ఆక్రమణ పేరుతో మొదలైంది. వెంట వెంటనే అమెరికాలో 600 కమ్యూనిటిలకు పాకింది. దేశదేశాలకీ వ్యాపించింది. అక్టోబర్ 9 కల్లా 82 దేశాల్లో 951 నగరాల్లో ఆక్రమణ పోరాటాలు మార్మోగాయి. బడా కార్పొరేషన్లూ, ప్రపంచ ద్రవ్య విధానమూ కలిసి ఆదాయాల్ని అతి కొద్దిమందికి చేర్చటం ప్రజాస్వామ్య స్ఫూర్తికి వ్యతిరేకం అనే వాదన మొదట్లో ప్రభుత్వం పెద్దగా పట్టించుకోలేదు. ఉద్యమం ఉధృతమయ్యే కొద్దీ అక్టోబర్ 25 నించీ పాలకులు అణచివేతకు పూనుకున్నారు. ఆక్రమించిన ప్రాంతాల్ని బలవంతంగా ఖాళీ చేయించారు. 2011 చివరకి అన్నిచోట్ల నించీ నెట్టివేశారు. 2012 ఫిబ్రవరిలో వాషింగ్టన్ డిసిలోనూ లండన్ లోనూ వాటిని స్వాధీనంలోకి తెచ్చుకున్నారు.

అయితే కాలం గడిచేకొద్దీ అసమానతలు అధికమవుతున్నాయి. అభివృద్ధి చెందిన చాలా దేశాల్లో ఈపరిస్థితులు ఒక కొసకు చేరాయి. వీటిని పరిష్కరించేందుకు వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ ఇంక్లూజివ్ గ్రోత్ అండ్ డెవలప్ మెంట్ రిపోర్ట్ 2017లో మార్గాలు సూచించింది. సమ్మిళిత అభివృద్ధికి మంచి ఉద్యోగాలు కావాలి. మధ్యతరగతి జీవన ప్రమాణాలు పైస్థాయికి ఎదగాలి. మంచివాటి సంగతి తరవాత, అసలు ఉద్యోగాలు ఏవి? ఎక్కడ?

ఏమి కావాలో చెప్పడమే కాని, అందుకు ఏమి చెయ్యాలో అగమ్య గోచరంగా ఉంది. ఎందుకంటే అన్ని ప్రయత్నాలూ ఎప్పుడో అయిపోయాయి. మళ్లీ మళ్లీ అవే చేస్తే కోరుకున్న ఫలితాలు రావు అనేది స్పష్టమే.

**వీరు కోరేదల్లా:** ఉత్పత్తి సంబంధాలు చెక్కుచెదరకుండా, వీటి మీదనే ఆధారపడిన సంస్కరణలు; అనగా పెట్టుబడికీ వేతన శ్రమకీ మధ్యగల సంబంధాలను యేమాత్రమూ తాకని సంస్కరణలు.

**మార్క్స్ ఏం చెప్పాడు?**

ఉత్పత్తిలో వేతనాలవాటా తగ్గిపోతుందని చెప్పాడు. అసమానతలు పెరుగుతాయని చెప్పాడు. ఎందుకు పెరుగుతాయో చెప్పాడు.

"బూర్జువాలలో పోటీ పెరగడం వల్లా, తత్ఫలితంగా యేర్పడే వాణిజ్య సంక్షోభాలవల్లా కార్మికుల వేతనాలు మరింత యెగుడు దిగుడులకు గురవుతాయి. యంత్రాలలో అంతకంతకూ వేగంగా జరిగే నిరంతరాభివృద్ధివల్ల, వాళ్ల జీవనాధారాలు అంతకంతకూ నమ్మకం లేనివౌతాయి" –సంకలిత రచనలు1 54–55

"ఉత్పాదక పెట్టుబడి పెరిగేకొద్దీ, శ్రమ విభజనా, యంత్రాల వినియోగమూ విస్తరించేకొద్దీ, కార్మికుల మధ్య పోటీ విస్తరిస్తుంది, వాళ్ల వేతనాలు తగ్గుతాయి.

దీనికి తోడు, సమాజపు పై పొరలకు చెందినవాళ్లు కూడా వచ్చి కార్మికవర్గంలో చేరుతారు. చిన్న పారిశ్రామికులూ, చిన్న వడ్డీ జీవులూ బోలెడు మంది కార్మికవర్గ శ్రేణుల్లోకి దిగదోయబడతారు; కార్మికుల చేతుల పక్కన తొందరగా తమ చేతులు పైకి సాచడం కంటే వాళ్లకు చేయవలసిందేమీ లేదు. ఈ విధంగా, పనిని డిమాండు చేస్తూ పైకెత్తబడిన చేతుల అరణ్యం అంతకంతకూ దట్టమవుతుంది, ఆచేతులు మాత్రం అంతకంతకూ చిక్కిపోతాయి" వేతనశ్రమా– పెట్టుబడీ (సం ర 1 119)

పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందేకొద్దీ అప్పుడప్పుడు మాంద్యాలు వస్తాయని మార్క్స్ చెప్పాడు వాణిజ్య సంక్షోభాలు "వచ్చినప్పుడల్లా అంతకంతకూ మరింత ప్రమాదకరంగా, మొత్తం బూర్జువా సమాజానికే చావుబతుకుల సమస్య తెచ్చిపెడుతున్నాయి " (సం ర 1 51)

మరి ఈ సంక్షోభాలను బూర్జువావర్గం ఏవిధంగా అధిగమిస్తుంది. అని ప్రశ్నించి ఇలా చెబుతాడు: "ఒకవైపున ఉత్పాదక శక్తుల్లో కొంతభాగాన్ని విధిలేక ధ్వంసం చేయడం ద్వారానూ, మరొకవైపున పాతమార్కెట్లను మరింత కట్టుదిట్టంగా దోచుకోవడం ద్వారానూ, అంటే మరింత విస్తృతమైన, మరింత విధ్వంసకరమైన సంక్షోభాలకు బాటవేయడం ద్వారానూ, సంక్షోభ నివారణాంశాలను తగ్గించడం ద్వారానూ అన్నమాట" (సం ర 1 52)

ఈ సమస్యలు ఎలా తీరతాయో కూడా మార్క్స్ చెప్పాడు. వీటికి కారణం అయిన పెట్టుబడిదారీ విధానాన్ని అంతం చేస్తేనేగాని సమస్యలు పరిష్కారం కావు అన్నాడు.

మార్క్స్ గణాంకాలను బట్టి సిద్ధాంతం చెయ్యలేదు. పెట్టుబడిదారీ విధానాన్ని పరిశీలించాడు. శ్రమే విలువకి ఏకైక వనరు అని అప్పటికే స్థిరపడ్డ నియమాన్ని అనుసరించాడు. సరుకులో వైరుధ్యం ఉన్నదనీ, అదే ఈ విధానంలోని అన్ని వైరుధ్యాలకూ కారణమనీ ఈ విధానం కూలిపోక తప్పదనీ తేల్చాడు.

పెట్టుబడిదారీ వర్గం, అన్నిటినీ మించి, తనకే సమాధిని తవ్వే వాళ్లని తానే తయారు చేస్తుంది అంటాడు. "బూర్జువా వర్గ పతనమూ అనివార్యమే, కార్మికవర్గ విజయమూ అనివార్యమే" అని నిర్ధారించాడు. (సం. ర 1 58)

మార్క్స్ ఏమి చెప్పాడో వివరంగా, పూర్తిగా తెలుసుకోవడం అవసరం అందుకు కమ్యూనిస్ట్ ప్రణాళికతోపాటు, కాపిటల్‌ని చదవాలి.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# కులం-బహుజన ప్రజాస్వామిక విప్లవ దశ-2

*భారత సమాజం అర్ధ వలస, అర్ధ భూస్వామ్యం అని సూత్రీకరించడం వాస్తవ విరుద్ధమని వాదిస్తున్నారు*

**డా. పట్టా వెంకటేశ్వర్లు**

*(...గత సంచిక తరువాయి)*

ఇక ఉద్యోగులు భూమిని కొనే నూతన వర్గంగా తయారయ్యారు. ఇందువల్ల భూమి బంగారం కంటే విలువైన సంపదగా మారింది. ఈ పరిణామం భూమిలేని వ్యవసాయ కూలీలు, చిన్న రైతుల పాలిట శాపంగా మారింది. అలాగే కార్పొరేట్ వ్యవసాయం కూడా పెద్ద ఎత్తున పెరుగుతున్నది. ఈ పరిస్థితిలో భూ పంపిణీ జరగడం అటుంచితే రైతుల చేతుల్లో ఉన్న భూమిని రక్షించుకోవడమే అసలు సమస్యగా ముందుకు వచ్చింది. కానీ కమ్యూనిస్టులు ఈ విషయాలన్నింటిని పరిశీలిస్తున్నట్లు లేదు. వారు పరిశీలించి ఉన్నట్లయితే 1964లో రాసుకున్న "వ్యవసాయ విప్లవమే ఇరుసు" అనే కార్యక్రమాన్ని మార్చుకొని ఉండేవారు. వారికి మొదటి నుంచి రష్యా, చైనా నాయకులు చెప్పిన విషయాలనే వల్లెవేసే అలవాటు వల్ల ఈ పరిస్థితి దాపురించిందా? అనే సందేహం కలుగుతుంది. అసలు భారతదేశ నిర్దిష్ట లక్షణమైన వర్ణ సమాజం, ఆ తర్వాత కుల సమాజం. ఈ కులానికి ఉన్న ఆర్థిక రాజకీయ సంబంధాలనూ, నేడు అన్ని రంగాల్లో అది తిష్టవేసి ఉన్నదాన్నీ వారు అసలు పరిగణనలోకి తీసుకొన్నట్లు వారి రాజకీయ కార్యక్రమం తెలియజేయడం లేదు. కాబట్టి ఇక్కడ చర్చ అనేది మార్క్సిజం గొప్ప సిద్ధాంతం అవునా? కాదా! అనేది కాదు. రంగనాయకమ్మ అన్నట్లు దాన్ని సరిగ్గా అర్థం చేసుకొన్నామా? అర్థం చేసుకున్న దాన్ని నిర్దిష్ట పరిస్థితులకు సరిగ్గా అన్వయిస్తున్నామా? అనేదే అసలు ప్రశ్న.

ఇక ప్రతి దేశానికి విప్లవ దశలు ఉన్నట్లే మన దేశానికి కూడా విప్లవ దశలున్నాయి. ఈ దశను నిర్ధారించుకొనే ముందు మనం చర్చిస్తున్న కుల నిర్మూలన ఎలా జరుగుతుందో పరిశీలిద్దాం. అందుకని ముందుగా కులం అంటే ఏమిటో తెలిస్తే, దాని నిర్మూలించడం ఎలాగో తెలుస్తుంది. అంబేద్కర్ నిర్వచనం బట్టి "దడి కట్టుకున్న వర్గ సమూహమే కులం" అంటాడు. ఈ కులవ్యవస్థ ఉత్పత్తి సంబంధాలను నిర్ణయిస్తున్నది. ఉత్పత్తి సాధనాలను అగ్రకులాల వారికిచ్చి భౌతిక శ్రమను శూద్రులకు కేటాయించిందంటారు. ఈ విషయాన్ని గురించి రష్యన్ మార్క్సిస్టు విశ్లేషకులు కూడ ఏమంటారంటే "కులాలు మిక్కిలి వేరుపడిన అనువంశిక బృందాలు. అవి సాంఘిక నిర్మాణంలో ప్రత్యేక స్థానం కలిగి ఉన్నాయి. వాటి సభ్యులు సాంప్రదాయకమైన వృత్తుల్లో నిమగ్నులై ఉంటారు. వాళ్లకి కులాంతర సంబంధ బాంధవ్యాలు పెట్టుకొనే స్వేచ్ఛ లేదు. ఏదో విధంగా సమాజం కులాలుగా విభజితమవడం అనేక ప్రాచీన మధ్యయుగ రాజ్యాల సామాజిక వ్యవస్థలో కనిపిస్తుంది. అయితే కులాలుగా సమాజం వ్యవస్థీకరణ ఒక విలక్షణ సాంఘిక వ్యవస్థగా రూపొందినది ఒక భారతదేశంలో మాత్రమే." (ఎ. యెర్మకొవా, వి.రాత్నికోవ్, 'వర్గాలు, వర్గపోరాటం అంటే ఏమిటి?' ప్రగతి ప్రచురణాలయం, మాస్కో 1989, పేజీ 29)

దీన్ని సాధారణంగా పరిశీలిస్తే ఈ దడిలో మొదటి లింక్ వృత్తి. సహజంగానే గ్రామీణ ప్రాంతాల్లో వారి వృత్తిని బట్టి కులం చెప్పొచ్చు. మరి వృత్తులు అన్ని దేశాల్లో ఉన్నాయి కదా! అక్కడేందుకు కులం లేదనే ప్రశ్న వెంటనే వస్తుంది. ఇక రెండో విషయం స్వకుల వివాహం. మన ప్రత్యేకత ఏమంటే వృత్తి వారసత్వంగా కొనసాగబడడం. ఈ వృత్తులు వారస్వతంగా కొనసాగడం కోసమే హిందూ పురాణ సాహిత్యంలో విష్ణుమూర్తి వివిధ అవతారాలను ఎత్తుతుంటాడు. ఇక్కడ వృత్తిని బట్టే ఆదాయం (సంపద), హోదాలు లభిస్తుంటాయి. నిచ్చనమెట్ల కుల వ్యవస్థలో పైనున్న వారికి ఎక్కువ ఆదాయాలు, హోదాలు, దిగువన ఉన్నవారికి తక్కువ ఆదాయాలు, హోదాలు ఉంటాయి. పైకులంవారు పేదవారైనప్పటికి వారి గౌరవానికి లోటు ఏమి ఉండదు. అందుకే వారు కూటికి పేదనైనా, కులానికి కాదని అంటుంటారు.

ఇక శ్రామిక ఉత్పత్తి కులాలకు చదువుకునే అవకాశాన్ని నిషేధించడం ఇక్కడి మరో ప్రత్యేకత. ఇతర దేశాల్లో శ్రామికవర్గానికి వృత్తి మారే విషయంలో గానీ, కులాంతర పెండ్లి విషయంలో గానీ, చదువుకునే విషయంలో గానీ నిషేధించే ధర్మాలు (స్మృతులు) లేవు. అక్కడ మతమే విద్యను వ్యాప్తి చేసింది.

కాబట్టి కుల నిర్మూలన జరగాలంటే కులదడిలో ఉన్న వారసత్వ వృత్తి సంబంధం, వివాహం, చదువుకునే విషయంలో నిషేధాలు తొలగించబడాలి. ఇందులో అన్నిటికంటే ముఖ్యమైనది విద్య. అందుకే పూలే నుంచి నారాయణ గురు అంబేద్కర్ వరకు విద్య అనేది సామాజిక మార్పుకు అతి ముఖ్యమైన విషయంగా గుర్తించడమే కాకుండా దాన్ని కింది కులాలకు అందుబాటులోకి తేవడానికి తీవ్రంగానే కృషిచేశారు. ముఖ్యంగా నారాయణ గురువు (1885-1928) విద్యా ద్వారా స్వేచ్ఛ, సంఘటితమవడం ద్వారా శక్తి, పరిశ్రమించడం ద్వారా ప్రగతి అనే లక్ష్యాల ద్వారా కేరళ సమాజంలో గొప్ప సాంఘిక విప్లవ మార్పుకు పునాది వేశాడు. కింది కులాలు ఆర్థికంగా శక్తివంతులు కావాలంటే అందుకు పరిశ్రమలు, వాణిజ్యం ద్వారానే సాధ్యమవుతుందని ఇందు కోసం సంస్కృతం భాషని కాక ఇంగ్లీష్ భాషను నేర్చుకోవాలని అలాగే, యువకులను విదేశాలకు వెళ్లి పారిశ్రామిక శిక్షణ తీసుకోవాలని చెప్పారు.

ఈ విషయంలో ముందుగా మెకాలేకు కృతజ్ఞతలు తెలపాలి. అంతవరకు బ్రాహ్మణ క్షత్రియులకే పరిమితమై ఉన్నత విద్యను కింది కులాలకు అందుబాటులోకి తెచ్చింది మెకాలేనే. కాబట్టి విద్యా రంగంపై కేంద్రీకరణ పెరగాలి. మొత్తం విద్యా వ్యవస్థను రెసిడెన్షియల్ విద్యగా

మార్చాలి. వారి నైపుణ్యాలను పెంచేందుకు ప్రత్యేక శిక్షణా సంస్థలు ఏర్పాటు చేయాలి.

ఇక వృత్తి మార్చుకొనే విషయానికి వస్తే, దానికి ఇంతకు ముందే చెప్పినట్లు చదువుకునే అవకాశాలు పెరగాలి. దానివల్ల వ్యవసాయ శ్రమల నుంచి పారిశ్రామిక, సేవా శ్రమల్లోకి మారే అవకాశాలు పెరుగుతాయి. (అర్థర్.డబ్ల్యు. లెవిస్ "అపరిమిత శ్రామికుల సరఫరాతో ఆర్థికాభివృద్ధి" 1954) ఈ ప్రక్రియ బ్రిటిష్ కాలం నుండే ప్రారంభమైంది. అక్కడి నుండే భారతీయ తరహా వర్గ (కుల) సమాజం యూరప్ తరహా వర్గ సమాజంగా పరివర్తన చెందడంగా ప్రారంభమైంది. దీన్ని బట్టి తెలిసేదేమంటే మూడువేల సంవత్సరాల చరిత్ర కలిగిన వర్ణ, కుల సమాజానికి యూరప్ తరహా వర్గ సమాజంగా మారే ప్రక్రియకు మూడు వందల సంవత్సరాల చరిత్ర కూడా లేదని తెలుస్తోంది. ఈ విధంగా ఫ్యూడల్ వ్యవస్థకే పరిమితమైన కులం, బ్రిటిష్ వారి రాకతో పారిశ్రామిక, సేవా రంగాలకు కూడా వ్యాపించింది. కాని శ్రామిక వర్గపోరాటం గురించి చెప్పేవారు కులం కేవలం ఫ్యూడల్ వ్యవస్థకు పరిమితమై ఉన్నట్లు, పారిశ్రామిక, సేవా రంగాల్లో దాన్ని ప్రభావం లేనట్లుగా చెబుతారు. పైగా ఈ రంగాల అభివృద్ధి వల్ల కులంలో వర్గం - వర్గంలో కులం ఉన్నదనే విశ్లేషణలు చేస్తున్నారు.

అసలు వారి రాజకీయ కార్యక్రమంలో కులం అనేది సామాజిక సమస్యగా ఉంటుంది. ఫ్యూడల్ వ్యవస్థను బద్దలు చేస్తే కులం సమసిపోతుందనే వాదన ఉంటుంది. మరి వీరు ఆర్థిక రంగంలో (వ్యవసాయం, పరిశ్రమ, సేవ) కాని, రాజకీయ రంగంలో కాని కులం ప్రభావం మీద నిర్దిష్ట స్థితిపై ఏమైనా అధ్యయనాలు చేశారా? వర్గంలో కులం ఉంది, కులంలో వర్గం ఉన్నదని నిర్ధారణకు ఎలా వచ్చారు? అసలు కులానికి వర్గానికి తేడాలు ఏ స్థాయిలో ఉన్నాయి? కులం దోపిడీ కోసం నిర్మించబడింది కాదా? అటువంటప్పుడు కులం వర్గ సమస్య కాకుండా పోతుందా? ప్రస్తుత విప్లవదశ ఏది? ఈ విప్లవ దశ దోపిడీని పూర్తిగా నిర్మూలించే దశేనా? లేదా కులాలకు ఉన్న ఆర్థిక, రాజకీయ, సామాజిక మనువాద నిర్మాణాలను నిర్మూలించే దశేనా? ఇప్పుడున్న పరిస్థితుల్లో ఏలాంటి దశను ఎంచుకోవాలి? అందుకు కులాలు లేని ఇతర దేశాల అనుభావాలు ఏమి చెబుతున్నాయి? డైరెక్టుగా సోషలిస్టు దశలోకే ప్రవేశించవచ్చా? ఇంకా ముందుకెళ్లితే అసలు కమ్యూనిజంలోనికే పోవాలా? ఇలాంటి ప్రశ్నలు మన ముందున్నాయి. ఇందుకోసం సోవియట్ అనుభవాన్ని ముందుగా పరిశీలిద్దాం.

రష్యాలో 1917 ఫిబ్రవరి కంటే ముందు బూర్జువా ప్రజా తంత్రా విప్లవ దశని ఆ తర్వాత సోషలిస్టు విప్లవ దశని సిపిఎం కార్యక్రమం చెబుతుంది. (రాజకీయ తరగతులు-పాఠ్య ప్రణాళిక,పేజీ-275) అయితే లెనిన్ బోల్షివిక్ విప్లవానికి ఉన్న పరిమితులపై 'రాజ్యము - విప్లవము' అనే గ్రంథంలో 'అభివృద్ధికి నోచని ఆర్థిక వ్యవస్థ, ప్రజల సంస్కృతిక వెనుకబాటు వల్ల రష్యా నేరుగా సోషలిస్టు వ్యవస్థలోకి అడుగు పెట్టలేదని గ్రహించాడు. విప్లవం ద్వారా ప్రజలు సాధించుకున్న అధికారాన్ని ఉపయోగ పెట్టుకొని ఆర్థిక వ్యవస్థలో రాజ్య పెట్టుబడిదారి విధానాన్ని (స్టేట్ క్యాపిటలిజం), అలాగే కార్మిక వర్గం, రైతాంగానికి సాంస్కృతిక విద్య గరపడం ద్వారా వారి చైతన్య స్థాయి పెంచడం తక్షణ లక్ష్యాలుగా ఎంచుకున్నాడు. "పాశ్చాత్య ఐరోపా నాగరిక దేశంలోని సగటు పౌరుడి జీవన ప్రమాణాలు అందుకోవడానికి మనం తక్షణం విశాల ప్రాతిపదికన భారీ ఎత్తున కృషి చేయాల్సి ఉంటుందని ప్రకటించాడు. అర్థ ఆసియా అజ్ఞానం నుండి మనల్ని మనం విముక్తం చేసుకోలేదన్న వాస్తవాన్ని గమనంలో ఉంచుకోవాలని చెప్పాడు. లెనిన్ తరుచు "నేరుగా కమ్యూనిజాన్ని విత్తే పని చేయకండి" అని హెచ్చరిస్తూ ఉండేవాడు. "రష్యా గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనిస్టు సమాజ భావనను ప్రజల్లోకి ఇంకించడానికి అప్పుడే ఎట్టి పరిస్థితులలోనూ పూనుకోవద్దు. ఎందుకంటే గ్రామీణ ప్రాంతాల్లో కమ్యూనిజం స్థాపించడానికి అనువైన భౌతిక వనరుల పూనాది లేదు. ఇలాంటి పరిస్థితుల్లో కమ్యూనిస్టు సమాజ భావన మనకు మేలు కన్నా కీడు చేస్తుంది. సరిగా చెప్పాలంటే విపరీతానికి దారి తీస్తుందని' లెనిన్ తగు జాగ్రత్తలు చెబుతూ ఉండేవాడు. కాబట్టి బోల్షివిక్‌ల ముందున్న తక్షణ కర్తవ్యం అభ్యుదయకర బూర్జువా ప్రజాస్వామిక పాలనను సార్వజనీన విద్య, వైద్యం ఉండడానికి ఇళ్లు, తినడానికి తిండి, చేసేందుకు పని అందించడం అని లెనిన్ గ్రహింపులో ఉంది. ("లెనిన్ వారసత్వం ఈ రోజే దొరకబుచ్చుకోండి". సోవోజ్ జిజెక్, మార్క్సిస్టు పేజి.23 జనవరి, 2012).

ఇది రష్యా గురించి లెనిన్ అంచనా. మరీ ఈనాటికి కూడా రష్యాలో కంటే భిన్నమైన పరిస్థితులు మన దేశంలో ఉన్నాయా? అభివృద్ధి చెందిన కార్మిక వర్గం వుందా? ఇంకా ఎక్కువ మందికి వ్యవసాయ రంగమే ఉపాధిని కల్పిస్తుంది. పైగా 3 వేల సం॥రాల నాటి వర్ణ కుల వ్యవస్థ ఇంకా బలంగానే ఉంది. ఇప్పటికి దీనిపై చాలా అధ్యయనాలు జరుగుతున్నాయి. 2001లో కేంద్ర కార్మిక మంత్రిత్వ శాఖ రూపొందించిన నివేదికలో "అగ్ర వర్ణాలకు చెందిన వారు జనాభాలో 15శాతం మంది, అయితే వారు 66.5 శాతంగా రాజకీయ ప్రాతినిధ్యాన్ని పొందుతున్నారు. విద్యా రంగంలో 43 శాతం, ఉపాధిలో 87 శాతం, వ్యాపార వాణిజ్య రంగాల్లో 97 శాతం. భూములు కలిగి ఉన్న ఎస్టేట్ రంగంలో 94 శాతం ఆధిపత్యం కలిగి ఉన్నారు. (సీతారాం ఏచూరి, ప్రజాశక్తి, 05-10-2014) ఇంకా పి.ఎస్ వర్మ 'వై అల్టిమేట్లి రిజర్వేషన్స్' వ్యాసంగానీ, కార్పొరేట్ వ్యవస్థపై కెనడా యూనివర్సిటీ అధ్యాయనం మరిన్ని వివరాలను అందిస్తాయి.

ఈ వివరాలన్నీ ఒక్క వ్యవసాయ రంగంలో మాత్రమే కాక, పారిశ్రామిక సేవ, రాజకీయ రంగాలు ఎలా అగ్ర కుల ఏకస్వామ్యాలుగా ఉన్నాయో తెలియ జేస్తున్నాయి. అటువంటప్పుడు ఒక వ్యవసాయ రంగంలోనే భూపంపిణికి పరిమితం కావడం ఏమిటి? జనత ప్రజాస్వామిక విప్లవం లేదా నూతన వ్యవసాయ విప్లవంలో భాగంగా పారిశ్రామిక, సేవ, రాజకీయ రంగాల్లో ఉన్న అగ్రకులాల ఆధిపత్యాన్ని తొలిగించరా? తొలగించలేనప్పుడు ఏం జరుగుతుంది. వెనకబడ్డ వ్యవసాయ రంగమేమో కింది కులాలకు, అభివృద్ధికి అవకాశం ఉన్న పారిశ్రామిక, సేవ రంగాలేమో అగ్రకులాలకు రిజర్వ్ చేయబడతాయి. అంటే బ్రాహ్మణికల్ మనువాధం ఆధునిక రూపంలోకి మారుతుంది. అటువంటప్పుడు జనతా ప్రజాస్వామిక విప్లవం, నూతన వ్యవసాయక విప్లవాలు ప్రతిఘాత విప్లవాలుగానే మిగిలిపోతాయి కదా. ఇక అతిముఖ్యమైన రాజకీయ రంగాన్ని పరిశీలిస్తే, 15 శాతంగా ఉన్న అగ్రకులాలు 66.5 శాతం రాజకీయ ప్రాతినిధ్యం ఉన్నప్పుడు కింది కులాలకు అనుకూలమైన విధాన నిర్ణయాలు ఎలా తీసుకోనబడతాయి? ఈ కాంపోజిషన్ మారాలా? వద్దా? దీనిపట్ల కమ్యూనిస్టు పార్టీలకు వున్న కార్యక్రమం ఏమిటి?

ఎందుకు రాజకీయ రంగం గురించి ఎక్కువ మాట్లాడాల్సి వస్తుందంటే, విధాన నిర్ణయాలు తీసుకునేది ఈ రంగమే, ఈ విషయం కమ్యూనిస్టులకు బాగా తెలుసు. కాబట్టి ఈ వివరాల్ని పరిశీలించినపుడు రాజకీయ రంగం కూడా బ్రాహ్మణీయ మనువాద రూపాన్నే కలిగి ఉంది. మరీ ఈ మనువాద రాజకీయ రూపానికి భిన్నమైన రాజకీయ రూపాన్ని నిర్మించనవసరం లేదా? అలా నిర్మించకపోతే ఏమవుతుందో చూద్దాం. రాజకీయ రంగంలో రాజ్యాంగం ప్రకారం ఎస్.సి, ఎస్.టి.లకు పార్లమెంట్‌లో 120 సీట్లు ఉన్నాయి. ఇన్ని సీట్లు ఉన్నా కూడా అగ్రకులాల దయాదాక్షిణ్యంపై ఆధారపడి వారు ఎంపీలుగా కొనసాగుతున్నారు. అందువల్లనే వారిపై అవలింత వచ్చినప్పుడే పార్లమెంటులో నోరు తెరుస్తారనే ఛతురోక్తి ఉంది. గాంధీ కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా చేసిన కుట్రవల్ల వారికి ఈ పరిస్థితి దాపురించింది. ఈ పరిస్థితి మారాలంటే ఎన్నికల విధానంలో మార్పు రావాలి. అందుకు రెండు రకాల ప్రత్యామ్నాయాలు ఉన్నాయి. 1) అంబేద్కర్ బ్రిటిష్ వారితో వాదించి, సాధించి పెట్టిన కమ్యూనల్ అవార్డ్‌ను షెడ్యూల్ కులాలకు తిరిగి పునరుద్ధరించడం. 2) దమాషా ఎన్నికల పద్ధతి ప్రకారంగా ఎన్నికలు నిర్వహించడం.

ఈ పద్ధతి వల్ల వారికి ప్రాతినిధ్యం వహించే పార్టీకి లభించే ఓట్ల శాతాన్ని బట్టి ఎం.పి. లేదా అసెంబ్లి సీట్లు లభిస్తాయి. అందువల్ల స్వతంత్ర్య రాజకీయాలు చేయడానికి అవకాశం కలుగుతుంది. ఈ పద్ధతిని ఎందుకు డిమాండ్ చేయవలసి వస్తుదంటే, 2014 పార్లమెంట్ ఎన్నికల్లో ఉత్తరప్రదేశ్‌లో బి.ఎస్.పి.కి 22 శాతం ఓట్లు వచ్చాయి. కానీ ఒక్క సీటు కూడా ఆ పార్టీ గెలవలేదు. అంటే 22 శాతం ఓట్ల ప్రజల రాజకీయ అభిప్రాయం వృథా అయిపోయింది. ఇలా జరగడం బలహీన కులాలకు గొడ్డలిపెట్టు అవుతుంది. అసలు ప్రజాస్వామ్యానికే ప్రస్తుత ఎన్నికల విధానం ప్రమాదంగా ఉంది. ఈ రోజు దేశవ్యాప్తంగా అభ్యుదయ పార్టీలు చాలా బలహీనంగా ఉన్నాయి. వీటి గొంతు వినపడాలంటే దమాషా ఎన్నికల విధానమే సరైంది అవుతుంది.

ఇక దశ దిశను పరిశీలించడం కోసం మరల సి.పి.ఎం రాజకీయ కార్యక్రమాన్ని పరిశీలిస్తాను. "మనది అర్థ భూస్వామ్య, పెట్టుబడిదారీ సమాజం. భూస్వామ్య అవశేషాలు ఇంకా ఉన్నాయి. మనది కల్తీ వ్యవస్థ. ఫ్రెంచ్ విప్లవం 1779లో బూర్జువాలచే భూస్వామ్య వ్యవస్థ పూర్తిగా నాశనం చేయబడింది. కానీ ఇండియాలో రాజరికాన్ని రద్దు చేసి, భూస్వామ్య విధానంపైననే పెట్టుబడిదారీ విధానం ప్రవేశ పెట్టబడింది. భూస్వామ్య అవశేషాలలో పెట్టుబడిదారీ విధానం పెరగదు. మన సమాజంలో బానిస వ్యవస్థను తలపించే పద్ధతులు కూడా ఉన్నాయి. అలాగే భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానాలూ ఉన్నాయి. కాబట్టి భారత పరిణామ దశలో సోషలిజానికి కాక భూస్వామ్య విధానాన్ని నాశనం చేసి పెట్టుబడిదారీ విధానంలోనే ఒకడుగు ముందుకు వేసి జనతా ప్రజాతంత్ర విప్లవం సాగించాలని అంటాం". అంటే ఏమిటన్న మాట, ప్రస్తుత దశలో దోపిడీ పూర్తిగా అంతం కావాలని సిపిఎం భావించడం లేదని అర్థం అవుతుంది. ఇది సరైందే.

అయితే కొందరు అంబేద్కరిస్టులు మాత్రం బ్రాహ్మనిజం, పెట్టుబడిదారీ విధానం రెండూ శత్రువులే అన్న అంబేద్కర్ మాటల్ని ప్రస్తుత లక్ష్యంగా చెబుతుంటారు. బ్రాహ్మనిజం–పెట్టుబడిదారీ విధానం శత్రువులే. కానీ ఈవాళ్ల ఎదుర్కోవల్సింది బ్రాహ్మనిజాన్నే తప్ప పెట్టుబడిని కాదు. అలాగే కమ్యూనిస్టులు పెట్టుబడిదారీ వర్గం భూస్వాములతో రాజీపడిందంటారు. ఈ ఆరోపణ యూరప్ చరిత్ర ఆధారంగా పరిశీలించేవారికి సరైందిగానే కన్పిస్తుంది. కాని భారతదేశ చరిత్ర యూరప్‌కు భిన్నంగా ఉంది. అందుకే పెట్టుబడిదారులు రైతుల్నీ రెచ్చగొట్టడం చేయకుండా పెట్టుబడిని ముందుకు ఎగదోసే పనిని చేపట్టారు. అందువల్లనే బ్రిటిష్ కాలం నుండి వాణిజ్య పంటలు పెరగడం, వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ సంబంధాలు పెరగడం, వ్యవసాయ రంగం సంక్షోభం వంటివి దీని ఫలితాలే. అంబేద్కర్ కూడా గ్రామాల నాశనాన్నే కోరున్నారు. ఎందుకంటే గ్రామీణ వ్యవసాయ కులాల సంబంధాలు నాశనం కానిదే కుల వ్యవస్థ బలహీనపడదని ఆయనకు తెలుసు. నేటి ప్రపంచీకరణ ప్రక్రియ కూడా వ్యవసాయ సంక్షోభాన్ని మరింత వేగిరి పరుస్తున్నది. ఈవిధంగా పెట్టుబడి పాత ఉత్పత్తి పద్ధతులుని నాశనం చేస్తుంటే విప్లవ కారులేమో పల్లెకన్నీరు పెడుతుందో...అనే ఏడ్పులు పెడుతున్నారు. ఈ ఏడ్పులు ఏ రకమైన మార్పులకు దారితీస్తాయనేవి చెప్పితే మంచిది. (ప్రకాశ్ కారత్, మార్క్సిస్టు, సెప్టెంబరు 2016) కాబట్టి పెట్టుబడి లక్ష్యం లాభం. ఈ లాభం కోసం ఫ్యూడల్ అవశేషాల్ని అది నాశనం చేసి తీరుతుంది. ఇంతకు ముందు దీన్ని మార్క్స్ విశ్లేషణలో చూశాం. ఎందుకంటే పెట్టుబడి లాభం కోసం నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉత్పత్తి రంగంలో ప్రవేశ పెడుతుంది. ఇందువల్ల పాత ఫ్యూడల్ ఉత్పత్తి పద్ధతులు నాశనమై తీరుతాయి. దీన్ని బ్రిటిష్ కాలం నుండి చూస్తునే ఉన్నాం. దీన్ని బట్టి చూసినప్పుడు భారతదేశంలో మార్పు అనేది ఉత్పత్తి సంబంధాల్లో మార్పు కొరకు జరిగే పోరాటాల వల్ల కాక నూతన ఉత్పత్తి శక్తులు ప్రవేశపెట్టడం వల్లనే జరుగుతున్నాయని గత అనుభవాలు తెలియజేస్తున్నాయి, ఇది గతితార్కిక నియమమే.

ఇక ఫ్యూడల్ వ్యవస్థ నిర్మూలన కోసం ప్రస్తుత కమ్యూనిస్టులు ఏమి చేస్తారో చూద్దాం. "పెట్టుబడిదారీ పూర్వ సమాజాన్ని నాశనం చేయగోరే అభివృద్ధి శక్తులన్నింటినీ ఐక్యపరిచి, విప్లవ శక్తులను సంఘటిత పరిచి సోషలిజం వైపు పరివర్తన రంగాన్ని సిద్ధం చేయాల్సిన బాధ్యత కార్మిక వర్గం మీద ఉంది. కాబట్టి భూస్వాములు, గుత్త పెట్టుబడిదారులు, విదేశీ పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కార్మిక వర్గం, వ్యవసాయ కార్మికులు, రైతాంగం, మధ్యతరగతి, ఉద్యోగులు, వ్యాపారులు, పెట్టుబడిదారులతో ఐక్య సంఘటన రూపొందించ బడుతుంది. కాబట్టి ప్రస్తుత దశలో భూస్వామ్యానికి, రైతాంగానికి ఉన్న వైరుధ్యమే ప్రధానంగా ముందుకొచ్చింది. అంటే సమాజ పురోగమనానికి భూస్వామ్య సమాజమే ఆటంకంగా ఉంది. అందుకే ఈ దశలో విప్లవానికి "వ్యవసాయక విప్లవమే ఇరుసు లాంటిది" అంటున్నాం. ఇది మన విప్లవ స్వభావం".

ఈ కార్యక్రమంలో భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేక పోరాటం వల్ల కింది కులాలకు భూములు పంచబడతాయనే అనుకుందాం. కానీ పారిశ్రామిక రంగంలో ఏం జరుగుతుంది? "ప్రభుత్వ రంగం ఆధిపత్యంలో ఉంటుంది. ప్రైవేట్ రంగంతో సహా మొత్తం ఆర్థిక వ్యవస్థను నియంత్రించి మార్గదర్శకత్వం వహించే పాత్రను రాజ్యాంగ యంత్రం నిర్వహిస్తుంది". కాబట్టి దీన్ని బట్టి తెలుస్తుందేమంటే మొత్తం పారిశ్రామిక రంగం ప్రభుత్వ రంగంలో ఉండదన్న మాట. ప్రైవేట్ రంగం కూడా ఉంటుంది. ఈ ప్రైవేట్ రంగం ఇప్పటి వరకు అగ్రకులాల చేతుల్లోనే ఉంది. విప్లవం తరువాత కూడా అలాగే ఉంటుందా? ఇక సేవారంగ ఉద్యోగాలను ఎక్కువగా అగ్రకులాలే అనుభవిస్తున్నాయి కదా. మరి ఈ రంగంలో ఏం జరుగుతుంది? దీనికి వారి కార్యక్రమం ఏమిటి? ఇక అన్నిటికంటే

ముఖ్యమైంది రాజకీయ రంగం. కేంద్ర కార్మిక మంత్రిత్వ శాఖ నివేదికలో చూస్తే రాజకీయాల్లో అగ్రకులాల ఆధిపత్యం ఎలా వుందో ఇంతకు ముందే పరిశీలించాం. కాబట్టి నేటికి అన్ని రంగాలు బ్రాహ్మణికల్ మనువాద నిర్మాణాలకు అనుగుణంగానే ఉన్నాయి. ఇది భారతదేశం నిర్దిష్ట లక్షణం. కానీ కమ్యూనిస్టు గ్రూపులు, పార్టీలకు ఈ రకమైన అంచనా గానీ, పరిశీలన గానీ ఉన్నట్లు కనిపించడం లేదు. కాబట్టి అగ్రకుల ఆధిపత్యాన్ని అన్ని రంగాల్లో బద్దలు చేయడమే ప్రస్తుత దశగా ఉంటుంది. కాబట్టి మనం తీసుకువచ్చే మార్పులు మనువాద వ్యతిరేక లక్షణాలను కలిగి ఉండాల్సిన అవసరం ఉంది.

ఉదాహరణకి ఒక విప్లవ పార్టీ రాజకీయ నాయకత్వం అగ్రకులాలతో ఉంటే అది మనువాద లక్షణాలకు ప్రతీకగానే ఉంటుంది. మరి ఈ మనువాద లక్షణాన్ని ఏం చేస్తారు. పార్టీలో రిజర్వేషన్లు అమలు చేస్తారా? లేదా ప్రతిభ ఆధారంగా తీసుకుంటారా? కాబట్టి మనువాద రాజకీయ నిర్మాణాన్ని ఎలా మారుస్తారు అనేది అసలు ప్రశ్న. ఇక శ్రామిక కులాల వారిని ఏ రంగంలోకి ఎలా మారుస్తారో నిర్దిష్టంగా వివరించకుండా రంగనాయకమ్మ డైరెక్టుగా సోషలిస్టు శ్రమ సంబంధాల్లోకి లేదా కమ్యూనిస్టు శ్రమ సంబంధాల్లోకి మార్చే శ్రమ సంబంధాల మార్పు గురించి సైద్ధాంతిక చర్చ చేయడం గందరగోళానికే దారితీస్తోంది. పోని ఇంత వరకు సోషలిస్టు నిర్మాణాన్ని శాస్త్రీయంగా అమలు చేస్తున్న దేశం ఎదైనా ఉందా? లేదనే తెలుస్తుంది. ఈ సందర్భంగా నేషనల్ పీపుల్స్ పవర్‌లో ఫీడెల్ క్యాస్ట్రో అన్న మాటలు మననం చేసుకోవాల్సి ఉంది. "పెట్టుబడిదారీ దోపిడీ విధానం స్థానంలో కొత్త ఉత్పత్తి విధానాన్ని ప్రేరేపించడంలో సోషలిజం ఇప్పటి వరకు ఒక మార్గాన్ని కనుగొన లేకపోయింది". (మార్తాహార్నెకర్, వామపక్షం-నూతన ప్రపంచం, పేజి-192.) దీన్ని బట్టి అర్థమయ్యేదేమంటే సోషలిస్టు నిర్మాణం పద్ధతి గురించి ఇంతవరకు శాస్త్రీయ పద్ధతి అనే విషయంలో చాలా సమస్యలు ఉన్నట్లు తెలుస్తుంది. లెనిన్ అన్ని జాగ్రత్తలు తీసుకున్నా కూడా అక్కడ సోషలిజం కూలిపోయింది. చైనా 'మార్కెట్ సోషలిజాన్ని' అనుసరిస్తున్నది. మరి మనువాద కులవ్యవస్థ ఉన్న దేశంలో ఎలాంటి సోషలిజం నిర్మిస్తారో రంగనాయకమ్మ తెలపాలి.

ఈ విషయాలన్ని పరిశీలించినపుడు కులనిర్మూలకు బహుజన ప్రజాస్వామిక విప్లవ దశే సరైనది అవుతుంది. ఇందు కోసం కాన్షీరామ్ ఉత్తరప్రదేశ్‌లో బి.ఎస్.పి ప్రయోగాన్నీ చెప్పుకోవచ్చు. ఆయన అగ్రకుల హిందూత్వం బలంగా ఉన్న ఉత్తరప్రదేశ్‌లో షెడ్యుల్ కులాల నాయకత్వం లో రాజకీయ పార్టీని పెట్టడమే కాకుండా దళిత మహిళను సీ.ఎం.గా చేశాడు, అలాగే 10 లక్షల ఎకరాల భూములు పంచి, క్రీడల్లో, కాంట్రాక్ట్, వ్యాపారాల్లో రిజర్వేషన్లు అమలు చేయించాడు. రాజకీయ ఐక్య సంఘటనల్లో భాగంగా దళితులు పునాదిగా, గిరిజనులు, ఎంబిసిలు, మైనారిటీలను కలుపుకొని ఆయన ఈ ప్రయోగం చేశాడు. దీన్ని బట్టి బి.ఎస్.పి. అనేది ఒక కుల పార్టీ కాదని బలహీన కులాలతో నిర్మితమైన ఐక్య సంఘటన గల పార్టీ అని అర్థం అవుతుంది. బ్రహ్మణికల్ కుల పిరమిడ్‌కు పూర్తిగా భిన్నమైన రాజకీయ పిరిమిడ్ కలిగి వున్న పార్టీ బిఎస్‌పినే. అలాగే రిజర్వేషన్లు తీసుకొనే స్థాయి నుంచి ఇచ్చే స్థాయికి ఎస్.సీ.లు ఎదగాలనేది ఆయన లక్ష్యం. హిందూత్వానికి వ్యతిరేకంగా ఫూలే, పెరియార్ భావాజాలాన్ని వ్యాప్తి చేయటం. బుద్ధిజాన్ని ప్రత్యామ్నాయ మతంగా పరిగణించడం ఆయన లక్ష్యంగా ఉంది. అలాగని బిఎస్‌పికి అన్ని రంగాల్లో మార్పు తీసుకవచ్చే కార్యక్రమం సమగ్రంగా ఉన్నదని చెప్పడం లేదు, కాబట్టి ఇంతకు ముందు కుల నిర్మూలనంలో భాగంగా అన్ని రంగాల్లో ఎలాంటి మార్పులు తీసుకురావలసి ఉంటుందో అలాంటి ప్రయత్నాలన్నీ జరగాలి. ముఖ్యంగా పెట్టుబడిని ప్రజాస్వామీకరించే ప్రయత్నం జరగాలి, అంటే దళిత బూర్జువాలను ఎదిగించాలి. ఈ విషయంలో భోపాల్ డిక్లరేషన్ (2002) రాజకీయ విషయాలను మినహాయించి మిగత ఆర్థిక, సామాజిక అంశాల గురించి చాలా విస్తృత్తంగా చర్చించింది.

ఇక భావజాల సాంస్కృతిక రంగంలోని పోరాట విషయానికి వస్తే ప్రొ. కంచె ఐలయ్య హిందూత్వానికి వ్యతిరేకంగా చేస్తున్న వర్గపోరాటాన్ని మరింత విస్తృత పరచాల్సి ఉంది. కాబట్టి మనువాద కులవ్యవస్థ వ్యతిరేక కార్యక్రమం ఈ రకంగా ఉండాలి. అదే ప్రస్తుత దశ వర్గపోరాటం అవుతుంది. ఈ రకంగా లేకపోతే అవి పాక్షిక వర్గ పోరాటాలుగానే మిగిలిపోతాయి.

ఆఖరున మెక్సికోలోని జపాటిస్టా జాతీయ విముక్తి సైన్యం నాయకుడు మార్కోస్ మాటలతో ముగిస్తాను. "మార్పు ఏదో ఒక రకమైన కార్యచరణ వల్ల మాత్రమే రాదు. పూర్తిగా సాయుధ పోరాటం వల్ల, లేక మొత్తంగా సాయుధేతర మార్గాల ద్వారా మార్పు సాధించబడదని నా అవగాహన. భిన్నమైన అనేక రకాల పోరాటాలు, అంటే వైవిధ్యంగల పోరాట పంథాలు, రకరకాల సామాజిక రూపాలు, సాపేక్ష నిబద్ధతలు గల వ్యక్తుల భాగాస్వామ్యం అందుకు అవసరం. మార్పు కేవలం ఒక పార్టీ లేక కొన్ని విప్లవ సంకీర్ణాల నిర్మాణ క్రియాశీలతల ఫలితం కాబోదు. భిన్న రాజకీయ అవగాహన ఉన్న వ్యక్తులు, సంస్థలు, తమ సిద్ధాంతాలనూ, కార్యచరణనూ ప్రతిపాదించేందుకు, చర్చించేందుకు వీలుండే ఒక ప్రజాస్వామికమైన వెసులుబాటును ఏర్పరచినపుడు మాత్రమే మార్పు వస్తుందని మా అభిప్రాయం. ఆ వెసులుబాటు సౌకర్యాన్ని ఉపయోగించుకునేందుకు చారిత్రికంగా అవిభాజ్య నిరూపితమైన మూడు మౌళిక అవగాహనలు అతి ముఖ్యం. 1) అత్యధిక జనామోదం గల సామాజిక ప్రతిపాదన ఎదో తెల్సుకొనే ప్రజాస్వామికమైన హక్కు 2) ఉన్న ప్రతిపాదనల్లో ఎదో ఒక దాన్ని ఎంచుకొనే హక్కు 3) అన్ని ప్రతిపాదనలు ఖచ్చితంగా ధర్మ సమ్మతమైనవిగా ఉండాల్సిన బాధ్యత.

అలాగే విప్లవాత్మకమైన మార్పు చెప్పిరావడానికి పంచాంగం అంటూ ఏమీ లేదు. అవి పెనుతుఫానులా హఠాత్తుగా రావచ్చు. సామాజికంగా జరిగే అనేక పోరాటాలు, తిరుగుబాట్లు ముగిసిన నిశబ్దం నుండి కూడా మార్పు రావచ్చు. ఇదమిద్దత ఏమిలేదు. మార్పు దిశగా జరిగే ఈ అలజడులన్నింటినీ వ్యతిరేకించే శక్తులు క్రమేపి మట్టి కరుస్తాయి. ఇదంతా కేవలం నిర్దిష్ట పక్షమో లేక ఆ పక్షానికి నాయకత్వం వహించే వ్యక్తి ఆజ్ఞానుసర దిశల్లో సంభవించబోదు. నాయకత్వం ఎవరికి అవసరమో వాళ్లు దాన్ని వహించే పరిస్థితి ఉన్నప్పుడు, నాయకత్వం వహించే ఏ పక్షమైనా ప్రజాస్వామ్యం, స్వేచ్ఛా, సమానతల కోసం పాటుపడ్డప్పుడు మాత్రమే ఒక కొత్త సమాజం రూపొందగలదు. దీనిని బట్టి అర్థమైంది ఏమంటే మార్పు అనేది ఏ పార్టీ పేటెంట్‌గా లేదని గ్రహించాలి. కాబట్టి ఇప్పుడు విశ్లేషించిన అంశాల ఆధారంగా ప్రస్తుత పరిస్థితుల్లో కుల నిర్మూలన లక్ష్యంగా ఒక విశాల ఐక్య సంఘటన నిర్మించబడాలి. ఈ ఐక్య సంఘటనలో అభ్యుదయ శక్తులన్ని కలిసి పని చేయాల్సి ఉంటుందని గ్రహిస్తే మంచిది. అప్పుడే కుల నిర్మూలన సాధ్యమవుతుంది. అదే ప్రస్తుత విప్లవ దశ అవుతుంది.

*(రచయిత అర్థశాస్త్ర ఉపన్యాసకుడు)* వీ

# డచ్ రోగం - 'జనతన' వాక్సిన్ - 2

*భారత ఆర్థిక వ్యవస్థలో తీవ్రమైన ఎగుడు దిగుళ్లు రావడానికి కారణాలేమిటో, ఆ డచ్ రోగానికి పరిష్కారమేమిటో వివరిస్తున్నారు* **వెన్నెలకంటి రామారావు**

(...గత సంచిక తరువాయి)

ద్రవ్యపెట్టుబడి భూగోళమంతా విస్తరించడంతో కేంద్ర పారిశ్రామిక దేశాల ద్రవ్య పెట్టుబడికి అనుబంధ వ్యవస్థలుగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు, ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు పొలిమేర దేశాలుగా అవతరించాయి. దాంతో ప్రపంచ మార్కెట్లోని పరిణామాలకు అనుగుణంగా ఈ పొలిమేర దేశాల్లో శ్రమశక్తి వలసలు ఉంటాయి. పొలిమేర దేశాల్లో ఎఫ్‌డిఐ పునాదిగా స్థాపించే వస్తూత్పత్తి పరిశ్రమలలోకి (నాన్ బూమింగ్ రంగం) అదే రంగంలోని వ్యవసాయం నుంచి పరిమితంగా మాత్రమే శ్రమశక్తి వలసలు సంభవిస్తాయి. అయితే ప్రధానంగా ఆ శ్రమశక్తి వలసలు దేశీయ నాన్ బూమింగ్ రంగం (వ్యవసాయం, వస్తు సామగ్రి తయారీ రంగం) నుంచి బూమింగ్ రంగంలోకి, వాణిజ్యేతర రంగం (సేవలు, మౌలిక సదుపాయాల కల్పన) లోకి అధిక సంఖ్యలో ఉంటాయి. అయితే విదేశీ మారక ద్రవ్య ప్రవాహాలు పెరిగి, దేశీయ కరెన్సీ మారకపు విలువ పెరగడంతో అంతర్జాతీయంగా స్వదేశీ సరకుల ధరలు విపరీతంగా పెరుగుతాయి. ఇతర దేశాల వస్తు సామాగ్రి ధరలు చౌక కావడంతో దిగుమతులు వేగంగా పెరిగిపోతాయి. దాంతో మాన్యుఫ్యాక్చరింగ్, వ్యవసాయ రంగాలు క్షీణిస్తాయి. స్థానికంగా సేవల రంగ ఉత్పత్తుల డిమాండ్ పెరిగి, వాటి ధరలు కూడా భారీగా పెరుగుతాయి. దాంతో టూరిజం, హోటల్ తదితర రంగాలు బాగా వృద్ధిలోకి వస్తాయి. దేశ ఆర్థిక వ్యవస్థ వేగంగా వినిమయ ఆర్థిక వ్యవస్థగా తయారవుతుంది. పరోక్ష అపారిశ్రామికీకరణతో రెంటియర్ (వడ్డీ భుక్త) రాజ్యం అవతరించి, ఆర్థిక వ్యవస్థ క్రమంగా ఆర్థిక మాంద్యంలో కూరుకుపోతుంది. ఆర్థిక మాంద్యం సామాజిక, రాజకీయ సంక్షోభంగా ప్రతిఫలిస్తుంది. పర్యవసానంగా సమాజంలో అంతర్యుద్ధం తలెత్తుతుంది. లేదా ఫాసిస్టు రాజ్యం ఆవిర్భవిస్తుంది. డచ్ రోగం పర్యవసానంగా రాజ్యం ఫాసిస్టుగా మారుతుంది. సమాంతర మాఫియా రిపబ్లిక్‌లు ఏర్పడి అరాచకం విజ్రుంభిస్తుంది.

**దక్షిణార్ధగోళ వడ్డీ భుక్త రాజ్యాలు**

డచ్ రోగం అనే ఆర్థిక పరిణామాన్ని ప్రజా ఉద్యమాల ద్వారా అడ్డుకునేందుకు ప్రపంచవ్యాప్తంగా అనేక ప్రయత్నాలు జరిగాయి. ఆయిల్ గ్యాస్, ఖనిజాలు తదితర ప్రకృతి సంపదలున్న మధ్య ఆసియా, లాటిన్ అమెరికా దేశాల్లో సుదీర్ఘకాలం నిరంకుశ రాజ్యాలుగాను లేదా అంతర్యుద్ధంలోను 'నిక్షేపాల శాప'గ్రస్థ భౌగోళిక ప్రాంతాలుగా, చీకటి లేదా క్షుద్ర రాజ్యాలుగా అవతరించాయి. దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాల ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా ప్రకృతి వనరుల వాణిజ్యంపై ఆధారపడడం వల్ల వాటిలో మెజారిటీ డచ్ రోగ పీడిత సమాజాలుగా తయారయ్యాయి. శతాబ్దాలుగా వ్యవసాయ ప్రధాన ఆర్థిక వ్యవస్థగా కొనసాగుతున్న భారత సమాజం వడ్డీ భుక్త సమాజంగానే కొనసాగింది. దాంతో వస్తూత్పత్తి రంగం నామమాత్రపు అభివృద్ధికి మాత్రమే నోచుకుంది. ప్రధానంగా ప్రకృతి వనరుల ఎగుమతుల మీదా, వ్యవసాయం, చేతి వృత్తులతో కూడిన స్వయం సంపూర్ణ గ్రామీణ ఆర్థిక వ్యవస్థ (ఏషియాటిక్ ఉత్పత్తి విధానం) భారత్‌లో సుదీర్ఘకాలంగా కొనసాగుతూ వచ్చింది. యూరప్ లోని జర్మనీ ఆర్థిక వ్యవస్థలో వలె భారత్‌లో కూడా అధిక వడ్డీ వ్యాపారం (యుషరర్ కేపిటల్) ఆధిపత్యం వహిస్తున్నందున ఆర్థిక వ్యవస్థలోని చేతివృత్తుల గిల్డులు పెట్టుబడిదారీ స్వభావాన్ని సంతరించుకోలేక పోయాయి. నాటి వస్తూత్పత్తి రంగం అయిన పెట్టుబడిదారీ పూర్వ ఫ్యూడల్ పరిశ్రమలు, చేతివృత్తుల నుంచి రూపొందుతున్న అదనపు విలువ అధిక వడ్డీ వ్యాపార వర్గం సొంతమైంది.

వస్తు సామాగ్రి ఉత్పత్తి రంగంలో పోగుపడిన అదనపు విలువ అదే రంగంలోకి విస్తృత పునరుత్పత్తి రూపంలో వినియోగంలోకి వస్తే సంబంధిత రంగంలోని ఉత్పత్తి శక్తులు వృద్ధి చెంది, ఒకానొక దశలో విప్లవాత్మక మార్పుకు దారి తీస్తుంది. అలా కాక అదనపు విలువ పునరుత్పత్తిలోకి ప్రవేశించకుండా, దాన్ని అంటిపెట్టుకున్న వడ్డీ వ్యాపార రంగంలోకి తరలిపోతే సదరు ఆర్థిక వ్యవస్థ గిడసబారి పోతుంది. రాజ్యం ఒక ఆర్థిక సాధనంగా క్రియాశీలంగా ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో జోక్యం చేసుకోనంతవరకు ఆ సమాజం చారిత్రకంగా కదంతాల్ తొక్కుతున్న (సాపేక్షంగా స్థిరత్వంలో కొనసాగే) పరిస్థితిలోకి జారిపోతుంది. మన దేశంలో గతం నుంచి వస్తూత్పత్తి రంగంపై వడ్డీ వ్యాపారం ఆధిపత్యం వహించడం వలన ఉత్పత్తి శక్తుల అభివృద్ధి గిడసబారింది. ఇలాంటి ఆర్థిక వ్యవస్థలు వస్తూత్పత్తి రంగంపై గాక, ప్రధానంగా సహజ వనరుల వాణిజ్యంపై ఆధారపడి మనుగడ సాగిస్తుంటాయి. దాంతో సహజ వనరుల వాణిజ్యం నుంచి సమకూరే విదేశీ మారక ద్రవ్యంపై ఆధారపడి బతికే వినిమయ ఆర్థిక వ్యవస్థలుగా, వడ్డీభుక్త రాజ్యాలుగా మారి సంక్షోభం అంచుల్లోకి జారిపోతుంటాయి. వస్తూత్పత్తి రంగానికి చెందిన వస్త్రాలు, వజ్రాలు, ఇంజనీరింగ్ వస్తువులు, బంగారు ఆభరణాలు, ప్రస్తుతం మందులు వంటివి మన దేశం ఎగుమతి చేస్తోంది.

ప్రపంచీకరణతో ఎగుమతుల కంటే దిగుమతుల పరిమాణం పెరిగిపోవడంతో వాణిజ్య లోటు పెద్ద ఎత్తున ఏర్పడింది. దీన్ని పూరించేందుకు పాలకులు 2000లో అంతర్జాతీయ మార్కెట్లో ఖనిజ వాణిజ్య బూమ్‌ను వినియోగించుకునేందుకు ప్రయత్నించారు. దాంతో దేశ ఆర్థిక వ్యవస్థ కేంద్రీకరణ ఖనిజాల మైనింగ్, ఎగుమతులపైకి మళ్లింది. పర్యవసానంగా యావత్ సామాజిక మౌలిక వైరుధ్యాల కంపన కేంద్రం (ఎపిసెంటర్) ఖనిజ నిక్షేప ప్రాంతాలు, సంబంధిత, అనుబంధిత ప్రాంతాల వైపు మళ్లడం సహజం. గంభీరమైన సామాజిక విప్లవ శక్తులు సైతం వారి కార్యాచరణను ఎక్కడ ప్రారంభించినా అనివార్యంగా గానీ లేదా స్పాంటేనియస్(అప్రయత్నం)గా కానీ లేదా పథకం ప్రకారంగా కానీ (డెలిబరేట్) ఆ ఎపిసెంటర్ పైనే కేంద్రీకరించక తప్పదు. ఇదొక

వస్తుగత చారిత్రక చలన సూత్రం. దాంతో విప్లవ శక్తుల కేంద్రీకరణ ఆర్థిక కార్యకలాపాల అభికేంద్రంలోనే కొనసాగడం అనేది ఆ శక్తుల చారిత్రక పరిమితిగా కాక, చారిత్రక ప్రాథమ్యంగా పరిగణించాలి. అయితే ఇలాంటి కేంద్రీకరణ ఎంత అనివార్యమో, విస్తారమైన గ్రామీణ, పట్టణ, నగర ప్రాంతాలకు విస్తరించే ప్రయత్నాలు చేయకుండా యథాస్థితిలో దీర్ఘకాలం కొనసాగితే చరిత్ర క్షమించదు. ప్రకృతి వరణం (నేచురల్ సెలక్షన్) అనే డార్విన్ సూత్రం లాగానే చారిత్రక సామాజిక వరణం (హిస్టారికల్ సోషల్ సెలక్షన్) నియమం తమ బలహీనతలను అధిగమించలేని విప్లవ శక్తుల కార్యాచరణకు కూడా వర్తిస్తుంది.

**విదేశీ మదుపులు పరిష్కారమా?**

ఆయిల్, గ్యాస్, నూనె గింజలు, ఎరువులు, బొగ్గు సహా అనేక పారిశ్రామిక వస్తువుల దిగుమతులు, యంత్ర సామాగ్రి వంటి పెట్టుబడి దిగుమతుల కోసం భారీగా పెరుగుతున్న వాణిజ్య లోటు భర్తీ మన దేశానికి సవాలుగా మారింది. అందుకోసం మన పాలకులు ప్రధానంగా ప్రాథమ్య క్రమంలో పెట్రోలియం ఉత్పత్తులు, విలువైన రాళ్ళు, ఆటోమొబైల్, యంత్రాలు, జీవ రసాయనాలు, మందులు, ధాన్యం, ఇనుము, ఉక్కు, టెక్స్ టైల్స్, ఎలక్ట్రానిక్స్, సాఫ్ట్ వేర్ సేవలు, వగైరాల వాణిజ్య లోటును పూరించేందుకు విఫల ప్రయత్నం చేశారు. దాంతో విదేశీ ప్రత్యక్ష మదుపులను ఆకర్షించేందుకు మన పాలకులు విశ్వప్రయత్నం చేస్తున్నారు. ప్రపంచీకరణతో మన ఆర్థిక వ్యవస్థలోకి ప్రవహిస్తున్న విదేశీ ప్రత్యక్ష మదుపులు, పెట్రో ఉత్పత్తులు, విలువైన రాళ్లు, ఖనిజాల వాణిజ్యం, సాఫ్ట్‌వేర్ సేవలు వంటి ఆకస్మిక ఆర్థికాభివృద్ధి రంగం (బూమింగ్ సెక్టార్) ద్వారా ఆదాయాలు పెరిగాయి. 2000లో ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఆహారోత్పత్తులు, ఆయిల్, లోహాలు, రసాయనిక పదార్థాలు తదితర సరకుల ఆకస్మిక అభివృద్ధి కొనసాగింది.

19వ శతాబ్దం ద్వితీయార్థంలో వచ్చిన రెండవ పారిశ్రామిక విప్లవం, 20వ శతాబ్దపు తొలినాళ్లలోను, రెండవ ప్రపంచయుద్ధానంతరం తలెత్తిన సరకుల డిమాండ్ తరహాలోనే 2000లోనూ కొన్ని సరుకుల డిమాండ్ అంతర్జాతీయంగా అనూహ్యంగా పెరిగింది. ఈ నేపథ్యంలోనే భారత ప్రభుత్వం ఖనిజాల ఉత్పత్తి, వాణిజ్యాల విధానాన్ని రూపొందించి, ఖనిజ వాణిజ్యాభివృద్ధికి ప్రణాళికల్ని సిద్ధం చేసింది. అయితే దేశవ్యాప్తంగా ఖనిజ నిల్వలున్న అనేక ప్రాంతాల్లోనూ, ప్రధానంగా మెజారిటీ ఖనిజ నిల్వలున్న దండకారణ్య ప్రాంతంలోనూ మైనింగ్ కార్యక్రమాలకు అవరోధం ఎదురవడంతో, ఖనిజాల వాణిజ్యం ఇతర సరకుల వాణిజ్యంతో పోలిస్తే బాగా తగ్గిపోయింది. ఎఫ్‌డిఐ పునాదిగా నడిచే ఆటోమొబైల్, యంత్రాలు, తదితర వస్తు సామాగ్రి ఉత్పత్తి రంగంలో వృద్ధి ఉన్నప్పటికీ, స్వదేశీ నైపుణ్యాలు, పెట్టుబడులపై ఆధారపడి నడిచే వస్తూత్పత్తి రంగం బాగా క్షీణించింది. 2007 నుంచి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో కొనసాగు తున్న ఆర్థిక సంక్షోభం కారణంగా ఖనిజాల వాణిజ్యం బాగా క్షీణించింది. ఈ అస్తవ్యస్థత కారణంగా దేశీయ కార్పొరేట్ దిగ్గజాలు ఆయిల్, గ్యాస్, ఉక్కు తదితర బూమింగ్ సెక్టార్ వైపు మొగ్గారు. ఖనిజాల ఉత్పత్తి, వాణిజ్యంలో తగ్గుదల ఉన్నప్పటికీ, అపారమైన ఖనిజ సంపదలున్న కారణంగా మైనింగ్ ప్రాథమ్యత మాత్రం ఏ మాత్రం తగ్గలేదు. అందుకోసం ప్రకృతి సంపదలున్న ప్రాంతాలను స్వాధీనం చేసుకునేందుకు ప్రభుత్వం చేస్తున్న సాయుధ ప్రయత్నాలు మరింత ముమ్మరమయ్యాయి.

ఆర్థిక వ్యవస్థలోని ఏదో ఒక రంగం ఆకస్మికంగా పెరగడంతో, లభించే ఆదాయాల రూపంలోగానీ, విదేశీ రుణాలు, మదుపులు రూపంలో స్వదేశీ ఆర్థిక వ్యవస్థలోకి వచ్చే ద్రవ్య ప్రవాహం గానీ వివిధ ఆర్థిక రంగాల సమతుల్యతను దెబ్బతీస్తుంది. పర్యవసానంగా దేశీయ మార్కెట్ సమీకరణాలలో అనేక మార్పులు చోటు చేసుకుంటాయి. శ్రమశక్తి మార్కెట్ ఒడిదుడుకులకులోనై దిశ మార్చుకుంటుంది. దాంతో ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాల్లో శ్రమశక్తి వలసల బాట పడుతుంది. దేశంలోకి ప్రవహించిన ద్రవ్య ప్రవాహం కారణంగా తీవ్ర సంక్షోభంలో ఉన్న వాణిజ్యపర సరుకుల మందకొడి ఆర్థికాభివృద్ధి రంగం (నాన్ బూమింగ్ సెక్టార్... వస్తు సామగ్రి ఉత్పత్తి, వ్యవసాయం వగైరా) నుంచి సేవలు, రోడ్ల నిర్మాణం, ప్రాజెక్టులు, రియల్ ఎస్టేట్ వంటి వాణిజ్యేతర ఆకస్మికాభివృద్ధి రంగాలకు శ్రమ శక్తి పెద్ద ఎత్తున తరలిపోయింది. పర్యవసానంగా పట్టణీకరణ పెరిగింది. ఆర్థికాభివృద్ధి రంగంలోని వివిధ రంగాల మధ్య ఆదాన ప్రదానాల సహజ వృద్ధి ప్రక్రియ దెబ్బతింటుంది. కేవలం వాణిజ్యేతర సరుకుల మందకొడి ఆర్థికాభివృద్ధి రంగమైన సేవల రంగం మాత్రమే వేగంగా వృద్ధి చెందింది.

ఈ పరిణామం పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్నట్టుగా పైకి కనిపిస్తుంది. వాస్తవంలో అప్పటికే ప్రాథమిక స్థాయిలో సహజ అభివృద్ధి క్రమంలో ఉన్న పెట్టుబడిదారీ సంబంధాల సంతులిత పురోగమనం దారి తప్పినట్లవుతుంది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని పొలిమేర ప్రాంతాలకు చెందిన బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ విధానంలోని శ్రమశక్తి వలసల్ని చూసి పెట్టుబడిదారీ సంబంధాలు సంఘటితమవుతున్నట్లుగా కొందరు మేధావులు భ్రమపడుతున్నారు. భ్రమల పునాదిగా భారత్‌లో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానం ఇప్పటికే ఏర్పడి ఉందని ఆ మేధావులు తొందరపాటుగా నిర్ధారణకు వచ్చారు. ఆయిల్ ఉత్పత్తులు, కమ్యూనికేషన్స్ రంగానికి చెందిన స్పెక్ట్రమ్ వంటి సహజవనరుల వ్యాపారం ద్వారా ప్రధానంగాను; ప్రభుత్వ రంగాన్ని ప్రైవేటీకరించడం; విదేశీ మదుపులను వివిధ రూపాల్లో ఆకర్షించి 'మేక్ ఇన్ ఇండియా' స్వప్నం సాకారం పునాదిగా నిర్మితమయ్యే ఎగుమతి ఆధారిత ఆర్థిక వ్యవస్థ ద్వారా సంక్షోభం నుంచి బయటపడాలని పాలకులు కలలు కంటున్నారు. అందుకోసం క్లీన్ ఎనర్జీ ప్రణాళికల్లో భాగంగా ప్రాణాంతక అణు విద్యుత్ కేంద్రాల వంటి పర్యావరణ, ప్రజారోగ్య విధ్వంసకర ప్రాజెక్టుల ఏర్పాటు కోసం విదేశీ మదుపులను ఆకర్షించే ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నాయి.

**పర్యావరణ విధ్వంసం...ప్రతిఘటన**

ప్రపంచవ్యాప్తంగా ప్రకృతి సంపదల వాణిజ్యాలపైన, ఏదో ఒక రంగంలో బూమ్‌పై ఆధారపడ్డ దేశాలన్నీ ఇంచుమించుగా 'డచ్ రోగం' బారిన పడ్డాయి. అలాంటి దేశాలను 'బనానా' దేశాలని కూడా పిలుస్తారు. అవి తరచూ అంతర్యుద్ధాల్లోనో లేదా కార్పొరేట్ శక్తుల ప్రాయోజిత మైనింగ్ మాఫియా ముఠాల అరాచకాల్లోనో, లేదా నిరంకుశ రాజ్యాల క్రూర అణచివేత పాలనలోనో కూరుకుపోయాయి. అలాంటి సందర్భాల్లో అక్కడి సహజ సంపదలు దేశ ప్రజలకు ప్రకృతి వరంగా కాక, వాణిజ్య శాపంగా పరిణమిస్తాయి. ప్రకృతి వనరుల వాణిజ్యం కోసం అభివృద్ధి పేరుతో ప్రజల జీవనాన్ని, ఆరోగ్యాన్ని, పర్యావరణాన్ని విధ్వంసం చేసే పారిశ్రామిక, వాణిజ్య విధానాలను ప్రభుత్వాలు బలవంతంగా అమలు చేసేందుకు ప్రయత్నిస్తున్నాయి.

విధ్వంసకర రాజకీయార్థిక విధానాలను ప్రతిఘటించిన ప్రజలు, ప్రజాస్వామిక వాదులు తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నారు. ప్రపంచవ్యాప్తంగా కార్పొరేట్ శక్తుల, బడా భూస్వాముల ప్రాయోజిత మైనింగ్ లేదా భూ మాఫియా శక్తుల చేతుల్లో వారానికి దాదాపు ముగ్గురు చొప్పున పర్యావరణ ఉద్యమకారులు హత్యకు గురవుతున్నారు. హైడ్రో పవర్ ప్రాజెక్టులు, మైనింగ్, వ్యవసాయ వాణిజ్యం సహా వివిధ అభివృద్ధి ప్రాజెక్టుల కోసం సేకరించే భూ సేకరణ, నష్ట పరిహారం వగైరా వివాదాల

నేపథ్యంలో పర్యావరణ వేత్తలు ఇలా హత్యలకు గురవుతున్నారు. మన దేశంలో బొగ్గు మైనింగ్ మాఫియా అక్రమాలను అడ్డుకున్నందుకు వల్సా జాన్ ను; జంతు చర్మాలతో అక్రమ వ్యాపారం సాగించే అటవీ మాఫియా చేతిలో పర్యావరణ ఉద్యమకారిణి షెహ్లా మసూద్‌లను కార్పొరేట్ శక్తులు హత్య చేయించాయి. అదే విధంగా మైనింగ్ కార్పొరేట్ దిగ్గజాలను ఎదుర్కొని అంగవైకల్యానికి గురైన 'గోల్డ్ మాన్ వాతావరణ పురస్కార' (గ్రీన్ నోబెల్ గా పేరొందిన) గ్రహీత రమేష్ అగర్వాల్ పై జరిగిన దాడులు వంటివి దేశంలో ఎన్నో జరుగుతున్నాయి.

గత పుష్కర కాలంలో ఇండియాలో ఏడుగురు పర్యావరణ ఉద్యమకారులు అమరులయ్యారు. బొగ్గు, అల్యూమినియం (బాక్సైట్), ఇనుము తదితర ప్రకృతి వనరుల మైనింగ్ కార్యకలాపాలు సహా వివిధ అభివృద్ధి ప్రాజెక్టుల కోసం భూ సేకరణకు వ్యతిరేకంగా దండకారణ్యం, ఈశాన్య భారతం, సహ్యాద్రి కనుమలు, నియాంగిరి, పోస్కో వ్యతిరేక ఉద్యమం ఇలా... దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో ప్రజలు ఉద్యమిస్తున్నారు. అలాగే తమిళనాడులోని కూడంకుళం, జైతాపూర్, సోంపేట, కొవ్వాడ తదితర ప్రాంతాల్లో ఏర్పాటు చేసిన, చేయబోతున్న వివిధ విధ్వంసకర అభివృద్ధి ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ఉద్యమాలు వచ్చాయి. వీటన్నిటి అనుభవాలను సమీక్షిస్తే ఈ ఉద్యమాలు శుద్ధ పర్యావరణ ఉద్యమాలుగా పైకి కనిపిస్తున్నప్పటికీ, వాస్తవంలో అవి పర్యావరణ వర్గపోరాట ఉద్యమాలుగానే అభివ్యక్తమవుతున్నాయి.

**ఖనిజాల కాణాచి దండకారణ్యంపై పట్టు**

అపారమైన ఖనిజ నిక్షేపాలున్న దండకారణ్యం దేశ మైనింగ్ కార్యకలాపాల కేంద్ర బిందువుగా నిలుస్తుంది. దేశ పారిశ్రామిక ప్రగతికి అదొక స్ప్రింగ్ బోర్డులా ఉపకరించనుండడంతో ఆ ప్రాంతాన్ని కార్పొరేట్ శక్తుల స్వర్గంగా మార్చడం కోసం రాజ్యం తన సర్వశక్తుల్ని కేంద్రీకరిస్తోంది. దేశ ఆర్థిక జీవనాడిగా ఉన్న దండకారణ్య ప్రాంతం కార్పొరేట్ సంస్థల ఖనిజ వాణిజ్యానికి అడ్డాగా మారి ఉంటే, అక్కడ భారత రిపబ్లిక్‌కు సమాంతరంగా 'బళ్లారి రిపబ్లిక్' తరహా మైనింగ్ మాఫియా సామ్రాజ్యాలు లేదా రిపబ్లిక్‌లు అవతరించి ఉండేవి. అయితే బలహీనమైన వస్తూత్పత్తి రంగ వాణిజ్యం, దివాళా తీసిన వ్యవసాయ రంగాలున్న దేశ ఆర్థిక వ్యవస్థ 'డచ్ రోగం' బారిన పడి ఉండేది.

1990లలో ప్రపంచీకరణ ప్రారంభమైన నాటి నుంచి అమలవుతున్న తీవ్ర ప్రభుత్వ నిర్బంధం వల్ల, మరోవైపు దేశ సామాజిక మౌలిక వైరుధ్యాల కేంద్రీకరణ సహజ సంపదలున్న ప్రాంతాలవైపు మళ్లడం వల్ల, ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ అటవీ, మైదాన ప్రాంతాల కేంద్రంగా నడుస్తున్న విప్లవోద్యమం దండకారణ్య ఆదివాసీ ప్రాంతాలకు విస్తరించింది. ఆ ప్రాంతాలలో అటవీ ఉత్పత్తులు, ఆహార సేకరణపై ఆధారపడి శతాబ్దాలుగా గిడసబారిన కొనసాగుతున్న ఆదివాసీ సమాజాల్ని సహకార, సమిష్టి వ్యవసాయ సమాజాలుగా పరివర్తన చెందించడంలో విప్లవోద్యమం ఒకమేరకు విజయవంతమయింది. పర్యవసానంగా ఆ ప్రాంత ఆదివాసుల సంస్కృతిలోను, సగటు చైతన్యంలోను గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి. సాయుధ పోరాటం ద్వారా నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని, రిపబ్లిక్‌ను సాధించాలనే లక్ష్యంతో సాగుతున్న విప్లవోద్యమం విశాల గ్రామీణ, పట్టణ, నగర ప్రాంతాలలోకి తిరిగి అవసరమైనంత స్థాయిలో విస్తరించలేకపోయింది.

ప్రపంచీకరణ మూలంగా దేశ ఆర్థిక వ్యవస్థలో 'డచ్ రోగం' లక్షణాలు అప్పుడప్పుడే ప్రారంభమయ్యాయి. ప్రపంచ మార్కెట్లో ఖనిజాల వాణిజ్యం డిమాండ్ పెరగడంతో విప్లవోద్యమాన్ని తుడిచిపెట్టకుండా దండకారణ్యంలో అక్రమ మైనింగ్ కార్యకలాపాలను పెద్ద ఎత్తున నిర్వహించలేని పరిస్థితి. దండకారణ్యంలో విప్లవోద్యమాన్ని తుడిచిపెట్టడంలో భాగంగా కార్పొరేట్ శక్తుల ప్రాయోజిత రాజ్యం ఆదివాసులపై పెద్ద ఎత్తున విరుచుకుపడింది. ఆదివాసుల్లోని తెగల నుంచి 'సల్వా జుడుం' వంటి సాయుధ మూకల్ని తయారు చేసి ఆ ప్రాంతంలో ఆదివాసుల మధ్య అంతర్యుద్ధాన్ని సృష్టించింది. కార్పొరేట్ శక్తుల చేతిలో ఒక ఆర్థిక సాధనంగా మారిన రాజ్యానికి, మైనింగ్ మాఫియాలకు వ్యతిరేకంగా తమ అస్తిత్వం కోసం ఆదివాసులు ప్రతిఘటిస్తున్నారు. విప్లవకారుల సారథ్యంలో 'జనతన సర్కార్' లేదా 'జనతన రిపబ్లిక్'లలో అక్కడి ఆదివాసులు సంఘటితమై మైనింగ్ కార్యకలాపాలకు వ్యతిరేకంగా గట్టిగా పోరాడుతున్నారు. మైనింగ్ మాఫియా కార్యకలాపాల నుంచి 'బళ్లారి రిపబ్లిక్' ఏర్పడగా, మైనింగ్ వ్యతిరేక పోరాటాల నుంచి 'జనతన రిపబ్లిక్' ఉనికిలోకి వచ్చింది.

**రిపబ్లిక్ బళ్లారి - 'జనతన సర్కార్'**

దండకారణ్య ఆదివాసులు విప్లవకారుల నేతృత్వంలో మైనింగ్ వ్యతిరేక పోరాటాలకు సిద్ధపడకుండా ఉన్నట్లయితే దండకారణ్యంలో 'బళ్లారి రిపబ్లిక్'లు ప్రాంతాల వారీగా అనేకం పుట్టుకొచ్చేవి. పర్యవసానంగా బళ్లారి ప్రాంతంలో జరిగిన సామాజికార్థిక, పర్యావరణ, వ్యవసాయ, సాంస్కృతిక జీవనం, ఆరోగ్యం తదితర విధ్వంసాలు దండకారణ్య ప్రాంతంలోనూ చోటు చేసుకొని ఉండేవి. పర్యవసానంగా దేశమంతా బళ్లారి రిపబ్లిక్‌లు ఉనికిలోకి వచ్చేవి. దాని వెన్నంటే దేశ ఆర్థిక వ్యవస్థకు డచ్ రోగం తగులుకొని ఉండేది. ఆర్థిక వ్యవస్థలో ఏర్పడే డచ్ రోగం గురించిన స్పృహ విప్లవోద్యమ రాజకీయ కార్యాచరణలో, ప్రణాళికలోను లేకపోయినా, దండకారణ్య ఆదివాసులను మైనింగ్ వ్యతిరేక ఉద్యమాల ద్వారా సంఘటితం చేసి జనతన రిపబ్లిక్‌లను వారు ఏర్పాటు చేశారు. దాంతో దేశ ఆర్థిక వ్యవస్థపై బలమైన ప్రభావం వేయగల దండకారణ్యంలోకి రాబోయే అక్రమ మైనింగ్ కార్యకలాపాలను విప్లవకారుల సారథ్యంలో ఆదివాసులు సమర్థంగా అడ్డుకోగలిగారు. ఖనిజ నిల్వలున్న ప్రాంతాలను విప్లవోద్యమం పట్టు నుంచి తప్పించాలని కేంద్ర సర్కార్ 'గ్రీన్ హంట్' పేరుతో అప్రకటిత యుద్ధాన్ని చేస్తోంది. అయితే దండకారణ్యంలో మైనింగ్ మాఫియాల బళ్లారి రిపబ్లిక్ లు ఏర్పడకుండా 'జనతన సర్కార్'లు శక్తివంతంగా అడ్డుకున్నాయి.

స్వదేశీ, విదేశీ కార్పొరేట్ శక్తులు తలపెట్టిన విధ్వంసకర మైనింగ్ కార్యకలాపాలకు వ్యతిరేకంగా ఆదివాసులు, సాధారణ ప్రజలు, వివిధ ప్రజాసంఘాలు చేసిన ప్రతిఘటన, చిందించిన రక్తం, త్యాగాలు, బలిదానాలు, దేశ ఆర్థిక వ్యవస్థను 'డచ్ రోగం' వంటి ప్రమాదకరమైన ఆర్థిక తెగులు బారిన పడి సంక్షోభంలో చిక్కుకోకుండా అడ్డుకుంది. 'డచ్ రోగానికి' కారణమైన బళ్లారి రిపబ్లిక్ తరహా మాఫియా రాజ్యాలను నివారించడం ద్వారా 120 కోట్లకు పై చిలుకు జనాభా మనుగడను ప్రశ్నార్థకంగా మార్చబోయే పెను ఆర్థిక విపత్తు నుంచి 'జనతన సర్కార్' సామాజిక ప్రయోగం పరిరక్షించగలిగింది. 'జనతన సర్కార్' లేదా 'జనతన రిపబ్లిక్' సామాజిక ప్రయోగం విజయవంతం అవుతుందా మంచిదా చెడ్డదా అనేది చర్చనీయాంశం కాదు. 'డచ్ రోగం' కలిగించే 'బళ్లారి రిపబ్లిక్' తరహా మాఫియా రాజ్యాలు ఏర్పడకుండా దేశ ప్రజల్ని రక్షించిన ఒక ఆర్థిక వ్యాక్సిన్‌గా 'జనతన రిపబ్లిక్'లు ఉపకరించాయన్నది ఒక చారిత్రక సత్యం. జనతన రిపబ్లిక్‌ల లక్ష్యం ఏమైనప్పటికీ, దానితో మనకు ఏకీభావం ఉన్నా, లేకపోయినా అలాంటి ప్రయత్నాల వల్ల దేశ ప్రజలకు ఒనగూడిన మహా ప్రయోజనం గురించి 'నాగరికులందరూ' ఆలోచించవలసిన తరుణమిది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

### కృష్ణా జిల్లాలో బస్సు ప్రమాదం

కటక్ నుండి హైదరాబాద్‌కు వస్తున్న దివాకర్ ట్రావెల్స్‌కు చెందిన బస్సు (నెం. ఎపి02, టిసి 7146) ఫిబ్రవరి 28న ప్రమాదానికి గురైంది. క్రిష్ణా జిల్లా ముల్లపాడు గ్రామం వద్ద డివైడర్‌కు గుద్దుకొని కల్వర్టులో పడిపోయింది. ఈ ఘటనలో డ్రైవర్‌తో సహ 11 మంది మృతిచెందగా 31 మంది గాయపడ్డారు. ఈ ప్రమాదానికి బస్సు డ్రైవర్ నిద్రమత్తే కారణమని డిజిపి సాంబశివరావు తెలిపారు.

### తెలంగాణ బడ్జెట్ 2017-18

తెలంగాణ రాష్ట్ర బడ్జెట్ 2017-18ను ఆర్థిక మంత్రి ఈటెల రాజేందర్ మార్చ్ 13న శాసనసభలో సమర్పించారు. మొత్తం రూ. 1,49,646 కోట్లతో బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. ఇందులో ప్రగతి పద్దుకు రూ. 88,038.80 కోట్లు, నిర్వహన వ్యయం కింద రూ. 61,607.20 కోట్లను కేటాయించారు. అత్యధికంగా సంక్షేమ రంగానికి 42.60 శాతం కేటాయించగా, వ్యవసాయం, అనుబంధ రంగాలకు, గ్రామీణాభివృద్ధికి 16.21 శాతం కేటాయించారు. విద్యుత్‌కు 0.37 శాతం, నీటిపారుదలకు 29 శాతం, రవాణాకు 6.92 శాతం, ఇతరాలకు 4.81 శాతం కేటాయించారు.

### ఆంధ్రప్రదేశ్ బడ్జెట్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బడ్జెట్ 2017-18ను ఆర్థిక మంత్రి యనమల రామకృష్ణుడు మార్చ్ 15న శాసనసభకు సమర్పించారు. ఈ ఏడాది బడ్జెట్ పద్దు రూ. 1,56,999 కోట్లు. అభివృద్ధి వ్యయానికి రూ. 86,602.74 కోట్లు, రుణ సేవలకు రు. 15,471.52 కోట్లు, పాలనా సేవలకు రు. 7,179.16 కోట్లు, పన్ను వసూలు రుసుము రూ. 1,233.52 కోట్లు, ఇతర వ్యయానికి రు. 15,422.68 కోట్లు కేటాయించారు. అభివృద్ధి వ్యయంలో వ్యవసాయం, అనుబంధ రంగాలకు రు. 9,090.91 కోట్లు కేటాయించగా, గ్రామీణాభివృద్ధికి రూ. 19,565 కోట్లు కేటాయించారు. నీటి పారుదలకు రు. 12,770 కోట్లు, రుణమాఫీకి రు. 3,600 కోట్లు, పరిశ్రమల శాఖకు రు. 2,086 కోట్లు కేటాయించారు.

### సిపిఎం బహిరంగ సభ

సామాజిక తెలంగాణ నినాదంతో తెలంగాణ రాష్ట్రమంతటా సాగిన సిపిఎం నేత తమ్మినేని వీరభద్రం పాదయాత్ర మార్చ్ 19న ముగిసింది. ఈ సందర్భంగా సిపిఎం హైదరాబాద్‌లోని సరూర్‌నగర్‌లో వేలాది మందితో బహిరంగ సభ నిర్వహించింది. సిపిఎం కమ్యూనిజానికి దళితవాదాన్ని జోడిస్తూ తన పంథాను ప్రకటించింది. 60 శాతం ప్రజలు వ్యతిరేకంగా ఓటేసినా ఉత్తరప్రదేశ్‌లో ఫాసిస్టు, మతతత్వ శక్తులు అధికారంలోకి వచ్చాయని, దీన్ని అడ్డుకోవడం కోసం కమ్యూనిస్టు పార్టీలు, దళిత పార్టీలు చేతులు కలపాలని పిలుపునిచ్చింది. జై భీం, లాల్ సలాం నినాదాలు ఒక్కటవ్వాలి. కమ్యూనిస్టులు, దళిత శక్తులు కలిసి నడవాలని కోరింది. దేశంలో ప్రభుత్వాలు ప్రజాసమూహాలపై అణిచివేత కొనసాగిస్తున్నాయి, దౌర్జన్యాలకు పాల్పడుతున్నాయి, వీటిని సమర్థంగా ఎదుర్కోవాలంటే విశాల ఐక్య సంఘటనగా ఏర్పడడం అవసరమని, ఇందుకు సమయం ఆసన్నమయిందని సభలో వక్తలు ఉద్ఘాటించారు.

### కాలుష్య కారకాలైన రొయ్యల చెరువులు

తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం మండలం, వేగాయమ్మపేట గ్రామంలోని రెవెన్యూలో గల 150 ఉప్పునీటి రొయ్యల చెరువులను వెంటనే తొలగించి, ప్రజలకు జీవనాధారమైన సాగునీరు, తాగునీరు అందించాలని కోరుతూ అఖిల భారత రైతుకూలీ సంఘం ఆధ్వర్యంలో ద్రాక్షరామ బోసుబొమ్మ సెంటర్ వద్ద 700 మందితో మార్చ్ 21న రాస్తారోకో చేశారు. రాస్తారోకోను ఉద్దేశించి వక్తలు వేగాయమ్మపేట గ్రామంలో భూగర్భ జలాలు కలుషితమై కనీసం స్నానానికి కూడా ఉపయోగపడకుండా పోయాయని, రైతు కూలీలకు ఉపాధి లేకుండా అయిందన్నారు. ప్రభుత్వం ఆక్వా హబ్, ఆక్వా జోన్‌ల పేరుతో ఉప్పునీటి రొయ్యల సాగును రాయితీలు ఇచ్చి పెంచేస్తూ ప్రజలకు కలుషిత నీరు, అనారోగ్యం మిగులుస్తోందని అన్నారు. యానం సెంటర్ నుండి వేగాయమ్మ పేట వరకు ర్యాలీ నిర్వహించారు. చెరువులు నిర్మూలించే వరకు పోరాడతామన్నారు.

### మక్కా మసీదు పేలుడు కేసులో అసీమానందకు బెయిల్

మక్కా మసీదు పేలుడు కేసులో స్వామి అసీమానందకు షరతులతో కూడిన బెయిల్ లభించింది. ఈ మేరకు నాంపల్లి ప్రత్యేక కోర్టు మార్చ్ 23న ఆదేశాలిచ్చింది. ఈ కేసులో మరో నిందితుడు భరత్‌బాయ్ కూడా బెయిల్ పొందాడు. మక్కా మసీదు వద్ద 2007 మే 18న జరిగిన బాంబు పేలుడులో 16 మంది చనిపోయారు. ఆర్ఎస్ఎస్ మాజీ కార్యకర్త అయిన అసీమానందను కేసు దర్యాప్తు చేపట్టిన సిబిఐ 2010 నవంబర్‌లో అరెస్టు చేసింది. అనంతరం కేసును ఎన్ఐఏకు అప్పగించింది. మాలేగాం, సంఝౌతా ఎక్స్‌ప్రెస్ పేలుడు కేసుల్లో కూడా అసీమానంద నిందితుడుగా ఉన్నారు.

### ఎపిలో విఆర్ఎల ఆందోళన

తమ సమస్యల పరిష్కారం కోరుతూ గ్రామ రెవెన్యూ సహాయకులు (విఆర్ఎ) ఎపి గ్రామ రెవెన్యూ సహాయకుల సంఘం ఇచ్చిన పిలుపు మేరకు మార్చ్ 24న చలో విజయవాడకు రాష్ట్ర నలుమూలల నుండి వేలాది మంది తరలివచ్చారు. విజయవాడ రైల్వే స్టేషన్ నుండి గాంధీనగర్‌లోని అలాంకార్ సెంటర్ వద్ద గల ధర్నా చౌక్‌కు ప్రదర్శన నిర్వహించారు. విఆర్ఎలు రు. 6,400 వేతనంతో పనిచేస్తున్నారని, వేతన పెంచుతానన్న వాగ్దానాన్ని చంద్రబాబునాయుడు విస్మరించారని విమర్శించారు. అనంతరం సిఎం క్యాంపు కార్యాలయం ముట్టడికి ప్రయత్నింగా పోలీసులు వారిని అడ్డుకుని బలవంతంగా అరెస్ట్ చేసి విజయవాడ పరిధిలోని స్టేషన్‌లకు తరలించారు.

### ధర్నా చౌక్‌ను కాపాడుకుందాం

హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్ వద్ద గల ధర్నా చౌక్‌ను ఎత్తివేయాలనే ప్రభుత్వ నిర్ణయాన్ని విరమించుకోవాలని కమ్యూనిస్టు పార్టీలు, ప్రజా సంఘాలు మార్చ్ 26న 2కె రన్‌ని నిర్వహించ తలపెట్టాయి. సుందరయ్య విజ్ఞాన కేంద్రం నుంచి తలపెట్టిన 2కె రన్‌ను పోలీసులు దిగ్బంధించారు. 2కె రన్‌లో పాల్గొనడానికి వచ్చిన కమ్యూనిస్టు పార్టీల నాయకులను, ప్రజా సంఘాల నాయకులను, కార్యకర్తలను, ప్రజాస్వామిక వాదులను పోలీసులు అరెస్ట్ చేశారు. ప్రజాస్వామ్యబద్ధంగా నిరసన తెలిపే హక్కును కాలరాస్తోందని పలువురు నాయకులు విమర్శించారు.

### తెలంగాణ రాష్ట్రంలో 2,709 రైతు ఆత్మహత్యలు

తెలంగాణలో 2014 జూన్ 1 నుండి ఫిబ్రవరి 2017 వరకు 2,709 మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నట్లు రైతు స్వరాజ్య వేదిక ఫిబ్రవరి 28న వెల్లడించింది. ఇందులో 144 మంది మహిళా రైతులు ఉన్నారని తెలిపింది. ఈ నివేదిక ప్రకారం నల్లగొండ జిల్లాలో అత్యధికంగా 286 మంది రైతుల ఆత్మహత్యలు చేసుకున్నారు. సిద్దిపేటలో-233, వరంగల్ రూరల్-147, మెదక్-138, శంషాబాద్-రంగారెడ్డి, నాగర్ కర్నూల్, ఆదిలాబాద్ జిల్లాల్లో 124 చొప్పున, వికారాబాద్-117, సంగారెడ్డి-105, భూపాల్‌పల్లి జయశంకర్-103, నిర్మల్-95, కరీంనగర్-92, జనగాం- 88, మహబూబ్‌నగర్-78, కామారెడ్డి-75, యాదాద్రి-74, సిరిసిల్ల రాజన్న జిల్లా-72, వనపర్తి-71, ఖమ్మం-68, జగిత్యాల-67, మహబూబాబాద్-63, కొత్తగూడెం బద్రాద్రి-60, వరంగల్-56, నిజామాబాద్-55, పెద్దపల్లి-54, సూర్యాపేట- 51, గద్వాల-జోగులాంబ-39, మంచిర్యాల-31, కొమురం భీం-21, మేడ్చల్-మల్కాజిగిరి-8 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారని వేదిక తెలిపింది. వీ

## జమ్ము కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు మృతి

జమ్మూ కశ్మీర్‌లో పుల్వామా జిల్లా ట్రాల్ అటవీ ప్రాంతంలో మార్చ్ 5 ఉదయం భద్రతా బలగాలు, కాశ్మీరీ మిలిటెంట్ల మధ్య జరిగిన కాల్పులు జరిగాయి. ఈ కాల్పుల్లో ఓ పోలీసు మృతిచెందగా.. ఇద్దరు మిలిటెంట్లు మృతిచెందారు. మరో ముగ్గురు భద్రతా సిబ్బంది గాయపడ్డారు.

## ప్రజాస్వామికవాదులకు జీవిత ఖైదు

ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ జి.ఎన్. సాయిబాబాతో పాటు మరో నలుగురికి యావజ్జీవం, మరొకరికి పదేళ్ల జైలు శిక్ష విధిస్తూ మహారాష్ట్రలోని గడ్చిరోలి సెషన్స్ కోర్టు మార్చ్ 7న తీర్పునిచ్చింది. సమాజంలో విధ్వంసం సృష్టించేందుకు, అశాంతికి కారణం అవుతున్నారని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పట్ల వ్యతిరేకతను పెంచేందుకు కుట్రపన్నారని తీర్పులో పొర్కొంది. సాయిబాబాకు మావోయిస్టులతో సంబంధాలున్నాయని మే, 2014 గడ్చిరోలి పోలీసులు ఢిల్లీలో అరెస్ట్ చేశారు. నిందితుడి నుంచి నక్సల్స్ సాహిత్యమే సాక్ష్యమని, ఆ సాహిత్యాన్ని మవోయిస్టులు, ఆర్‌డిఎఫ్ (రెవల్యూషనరీ డెమోక్రటిక్ ఫ్రంట్)తో పాటు ఇతరులకు సాయిబాబా అందజేశారని న్యాయమూర్తి షిండే తీర్పులో పేర్కొన్నారు. ఈ కేసులో సాయిబాబాతో పాటు ఢిల్లీ యూనివర్సిటీ విద్యార్థి హేమ్ మిశ్రా, మాజీ జర్నలిస్ట్ ప్రశాంత్ రాయ్, ఆదివాసులు ఉన్నారు.

## ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

మార్చ్ 11న వెలువడిన ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాల్లో 403 అసెంబ్లీ స్థానాలున్న ఉత్తరప్రదేశ్‌లో బిజెపి 325, ఎస్‌పి, కాంగ్రెస్ కూటమి 54, బిఎస్‌పి 19, ఎడి(ఎస్) 9, ఇతరులు 9 స్థానాలు గెలుపొందారు. బిజెపి పూర్తి మెజారిటి సాధించింది. ఉత్తరాఖండ్‌లో 70 అసెంబ్లీ స్థానాల్లో బిజెపి 57, కాంగ్రెస్ 11, ఇతరులు 2 స్థానాల్లో గెలుపొందారు. అధికారంలో ఉన్న కాంగ్రెస్ అధికారం కోల్పోయి బిజెపి పూర్తి మెజారిటీని సాధించింది. 117 అసెంబ్లీ స్థానాలున్న పంజాబ్‌లో కాంగ్రెస్ 77, బిజెపి 3, ఆమ్ ఆద్మీ 20, ఎస్‌ఎడి15, ఇతరులు 2 స్థానాల్లో గెలుపొందారు. అకాళిదల్–బిజెపి కూటమి ఓడిపోయి కాంగ్రెస్ పూర్తి మెజారిటీని సాధించింది. 60 అసెంబ్లీ స్థానాలున్న మణిపూర్‌లో కాంగ్రెస్ 28, బిజెపి 21, ఎన్‌పిఎఫ్ 4, ఎన్‌పిపి 4, ఇతరులు 3 స్థానాల్లో గెలుపొందాయి. ఏ పార్టీకి పూర్తి మెజారిటీ రాలేదు. 40 అసెంబ్లీ స్థానాలున్న గోవాలో కాంగ్రెస్ 17, బిజెపి 13, జిఎఫ్‌పి 3, ఎజిపి 3, ఎన్‌సిపి 1, ఇతరులు 3 స్థానాలు గెలిచారు.

## ఐదు రాష్ట్రాల ముఖ్యమంత్రులు

ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాల అనంతరం గోవా సిఎంగా మనోహర్ పారికర్‌చేత రాజ్ భవన్‌లో గవర్నర్ మదులా సిన్హా మార్చ్ 14న ప్రమాణ స్వీకారం చేయించారు. మణిపూర్ సిఎంగా బిజెపి నేత నాంగ్‌తొంబం బీరేన్ సింగ్‌తో గవర్నర్ నజ్మా హెప్తుల్లా మార్చ్ 15న ఇంపాల్‌లోని రాజ్‌భవన్‌లో ప్రమాణస్వీకారం చేయించారు. పంజాబ్ సిఎంగా కాంగ్రెస్ నేత అమరిందర్ సింగ్ చేత గవర్నర్ విపి సింగ్ బద్నోరే మార్చ్ 16న రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం చేయించారు.(గోవాలో మనోహర్ పార్రీకర్ ప్రభుత్వం మార్చ్ 16న నిర్వహించిన విశ్వాస పరీక్షలో నెగ్గింది. 40 మంది సభ్యులున్న అసెంబ్లీలో పర్రీకర్ నేతృత్వంలోని సంకీర్ణ ప్రభుత్వానికి అనుకూలంగా 22 మంది ఓటు వేశారు. బిజెపి 12, ఎంజిపి నుంచి ముగ్గురు, జిఎఫ్‌పి నుంచి ముగ్గురు, ఎన్‌సిపి సభ్యుడు ఒకరు, ముగ్గురు స్వతంత్రులు పర్రీకర్ ప్రభుత్వానికి మద్దతు పలికారు. ఉత్తరాఖండ్ సిఎంగా త్రివేంద్ర సింగ్ రావత్‌తో డెహ్రాడూన్‌లోని పెరేడ్ గ్రౌండ్స్‌లో జరిగిన కార్యక్రమంలో మార్చ్ 18 గవర్నర్ కెకె పాల్ ప్రమాణ స్వీకారం చేయించారు. ఉత్తరప్రదేశ్ సిఎంగా యోగి ఆదిత్యానాథ్‌తో లఖ్నవ్‌లోని కాన్షీరాం స్మృతి ఉపవన్ మైదానంలో గవర్నర్ రామ్‌నాయక్ మార్చ్ 19న ప్రమాణ స్వీకారం చేయించారు.

## 13 మంది మారుతి కార్మికులకు జీవిత ఖైదు

మారుతి సుజుకి ఇండియా లిమిటెడ్‌కు చెందిన 13 మంది కార్మికులకు హత్య కేసులో న్యాయస్థానం జీవితఖైదు విధించింది. 2012లో మనేసర్ కర్మాగారంలో కార్మికుల యాజమాణ్యం మధ్య జరిగిన ఘటనల్లో సీనియర్ అధికారి అవనీశ్‌కుమార్ దేవ్ మరణించారు. ఈ కేసులో మొత్తం 148 మంది ముద్దాయిలలో 117 మందిని నిర్దోషులుగా నిర్ధారించింది. 31 మందిని ముద్దాయిలుగా నిర్ధారించింది. 13 మంది కార్మికులను దోషులుగా తేల్చిన గురుగ్రామ్ అదనపు జిల్లా, సెషన్స్ జడ్జి ఆర్.పి. గోయల్ జీవితఖైదు విధిస్తూ మార్చ్ 18న తీర్పునిచ్చారు. హింస, అల్లర్లు, హత్యాయత్నం ఆరోపణలు ఎదుర్కొన్న 18 మంది కార్మికుల్లో నలుగురికి ఐదేళ్ల శిక్ష వేశారు. రు.2500 జరిమానాతో మరో 14 మంది నిందితుల్ని విడిచిపెట్టింది. వీరు ఇప్పటికే నాలుగున్నరేళ్లు జైలులో గడిపారని కోర్టు వెల్లడించింది. నిర్దోషులని రుజువైన 117 మందికి బెయిల్ లేకుండా రెండున్నర ఏళ్ల నుంచి నాలుగున్నర ఏళ్ల వరకూ జైలు జీవితం సాగించారు. కోర్టు తీర్పునకు వ్యతిరేకంగా హైకోర్టును ఆశ్రయిస్తామని డిఫెన్స్ న్యాయవాది రెబెక్కా జాన్ పేర్కొన్నారు.

## అవినీతిలో భారత్ మొదటి స్థానం

అవినీతి విషయంలో ఆసియా పసిఫిక్ దేశాల్లో భారతదేశం మొదటి స్థానంలో ఉందని ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ సంస్థ తెలిపింది. గతేడాదితో పోల్చితే భారత్‌లో 41 శాతం అవినీతి పెరిగిందని మార్చ్ 7న తెలిపింది. ప్రభుత్వ సేవలు పొందేందుకు మూడింట రెండొంతుల మంది భారతీయులు తెలిపారు. భారత్‌లో పోలీసులు లంచం తీసుకుంటున్నారని సర్వేలో పాల్గొన్న 85 శాతం మంది భారతీయులు అభిప్రాయపడగా, ప్రభుత్వాధికారులు 84 శాతం, బిజినెస్ ఎగ్జిక్యూటివ్స్ 79 శాతం, స్థానిక కౌన్సిలర్లు 78 శాతం, ఎం.పిలు 76 శాతం, పన్ను అధికారులు 74 శాతం, మత పెద్దల్లో 71 శాతం అవినీతి పరులేనని తేల్చిచెప్పారు.

## ఉద్యమ ప్రాంతాల్లో మోగుతున్న మృత్యు ఘంటికలు

చత్తీస్‌గఢ్‌లోని సుకుమా జిల్లాలో బెజ్జీ–కొత్తచెరు రోడ్డు నిర్మాణానికి 112 మందితో కూడిన సిఆర్‌పిఎఫ్ జవాన్లు పహారా కాస్తున్నారు. మార్చ్ 11న బెజ్జీ–కొత్తచెరు అటవీ మార్గంలో జవాన్లు వెళుతుండగా మావోయిస్టులు మందుపాతర పేల్చి కాల్పులు జరిపారని ఈ ఘటనలో 12 మంది జవాన్లు మృతిచెందగా, నలుగురు గాయపడ్డారని పోలీసుల ఉన్నతాధికారి తెలిపారు. చత్తీస్‌గఢ్‌లోని దంతెవాడ జిల్లా బుర్గుమ్ అటవీ ప్రాంతంలో సిఆర్‌పిఎఫ్, డిస్ట్రిక్ రిజర్వు గ్రూప్ జవాన్లు మార్చ్ 18న మావోయిస్టులకోసం కూంబింగ్ చేపట్టారు. ఈ క్రమంలో మావోయిస్టులు తారసపడడంతో ఎదురుకాల్పులు జరిగాయని అందులో ఐదుగురు మావోయిస్టులు, ఇద్దరు జవాన్లు మృతిచెందారని పోలీసు అధికారులు తెలిపారు.

## ఉత్తరప్రదేశ్‌లో మాంసం దుకాణాలకు నిప్పు

ఉత్తరప్రదేశ్‌లోని హత్రాస్ జిల్లాలో గుర్తుతెలియని వ్యక్తులు మార్చ్ 22న రాత్రి మూడు మాంసం దుకాణాలకు నిప్పుపెట్టారు. ఆ దుకాణాలు పూర్తిగా కాలి బూడిదయ్యాయి. ఈ ఘటనకు సంబంధించి కేసు నమోదు చేశామని, దర్యాప్తు జరుగుతోందని పోలీసు అధికారి తెలిపారు. గో సంరక్షణ దళాలే ఈ ఘటనకు పాల్పడినట్లు అనుమానిస్తున్నారు.

## జమ్ముకశ్మీర్‌లో 37 మంది జవాన్ల ఆత్మహత్య

జమ్మూకశ్మీర్‌లో గత మూడేండ్ల కాలంలో కేంద్ర సాయుధ పోలీసు బలగాలకు (సిపిఎఫ్) చెందిన 37 మంది జవాన్లు ఆత్మహత్యకు పాల్పడ్డారు. సగటున నెలకు ఒక జవాను ఆత్మహత్య చేసుకున్నట్లు మార్చ్ 23న రాజ్యసభలో కేంద్ర ప్రభుత్వం వెల్లడించింది. గృహ సమస్యలతో పాటు నిరాశ, మానసిక అనారోగ్యం, వైవాహిక, పని ఒత్తిడి సమస్యలతో జవాన్లు ఆత్మహత్యలకు పాల్పడుతున్నట్లు గుర్తించామన్నారు. వీ

### ఈక్వెడార్ అధ్యక్ష ఎన్నికలు

ఈక్వెడార్‌లో అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. ఫిబ్రవరి 19న జరిగిన తొలి విడత ఎన్నికల ఫలితాలు ఫిబ్రవరి 27న వెల్లడించారు. పైస్ అలియన్స్ (ప్రౌడ్ అండ్ సావరిన్ ఫాదర్‌ల్యాండ్ పార్టీ అభ్యర్థి లెనన్ మోరెనో విజయం సాధించారు. ఆయనకు 39.35 శాతం (37,12,258) ఓట్లు రాగా, ఆయన ప్రత్యర్థి క్రియేటింగ్ ఆపర్చునిటీస్ పార్టీ అభ్యర్థి గులెర్మో లాసోకు 28.1 శాతం (26,50,754) ఓట్లు వచ్చాయి. రెండో విడత ఎన్నికలు ఏప్రిల్ 2న నిర్వహించనున్నారు.

### కాబుల్ సైనిక ఆస్పత్రిపై దాడి

అఫ్ఘనిస్తాన్ రాజధాని కాబుల్‌లోని సర్దార్‌దౌడ్ ఖాన్ సైనిక ఆస్పత్రిపై మార్చ్ 8న ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో ముప్పై మంది చనిపోగా, మరో అరవై మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. సైనిక ఆస్పత్రి గేటు దగ్గర ఒక ఇస్లామిక్ స్టేట్ ఉగ్రవాది తనను తాను పేల్చుకున్నాడు. అనంతరం ముగ్గురు ఐఎస్ ఉగ్రవాదులు వైద్యుల దుస్తుల్లో ఆస్పత్రిలోకి చొరబడి ఆస్పత్రి సిబ్బందిపై, రోగులపై తుపాకులతో విచక్షణా రహితంగా కాల్పులు జరపడంతో ప్రాణనష్టం అధికంగా సంభవించింది.

### ఇరాక్‌లో పేలుళ్లు

ఇరాక్ రాజధాని బాగ్దాద్ బాంబు పేలుళ్లతో దద్దరిల్లింది. మార్చ్ 9న తిక్రిత్ పట్టణానికి సమీపంలో ఓ ఇంట్లో వివాహం జరుగుతున్న సమయంలో జంట పేలుళ్లు జరిగాయి. ఈ పేలుళ్లలో 26 మంది మరణించారు. మరో ఇరవై మంది వరకు తీవ్రంగా గాయపడ్డారు. ఇస్లామిక్ స్టేట్ దళాలు ఈ దాడికి పాల్పడ్డారు.

### దక్షిణ కొరియా అధ్యక్షురాలి తొలగింపు

దక్షిణ కొరియా తొలి మహిళా అధ్యక్షురాలిగా చరిత్ర సృష్టించిన పార్క్ గ్వాయిన్ హైని పదవి నుంచి తొలగించారు. అవినీతి కుంభకోణాలకు పాల్పడ్డారని, చట్టాలను, రాజ్యాంగాన్ని ఉల్లంఘించారని, దేశ భద్రతకు సంబంధించి అజాగ్రత్తగా వ్యవహరించారని పార్లమెంట్‌లో ఆమెపై డిసెంబర్ 2016లో అభిశంసన తీర్మానాన్ని దక్షిణ కొరియా సుప్రీంకోర్టు మార్చ్ 10న ఆమోదించింది. దీంతో ఆమె తన పదవి నుంచి తప్పుకోవాల్సి ఉంది. దేశంలోని మెజారిటీ ప్రజలు అధ్యక్షురాలికి వ్యతిరేకంగా నిరసనలు తెలియజేస్తూ వీధుల్లో నిరసనలు చేశారు. ఈ నేపథ్యంలో దేశంలో కొన్ని నెలలుగా రాజకీయ అనిశ్చితి నెలకొంది. అరవై రోజుల్లో కొత్త అధ్యక్షున్ని ఎన్నుకోవాల్సి ఉంది. ఈ కుంభకోణంలో ప్రముఖ ఎలక్ట్రానిక్ ఉత్పత్తుల సంస్థ సాంసంగ్ చీఫ్ లీ జే యాంగ్‌కు కూడా సంబంధం ఉందన్న అభియోగంతో ఆయనను అరెస్టు చేశారు.

### సిరియాలో మానవ హక్కుల హననం

సిరియాలో అంతర్యుద్ధం కారణంగా సామాన్య ప్రజల పరిస్థితి రోజురోజుకూ క్షీణిస్తోంది. ముఖ్యంగా పిల్లలు ఈ యుద్ధ పరిస్థితి వల్ల తీవ్రంగా నష్టపోతున్నారు. మృతుల్లో కూడా పిల్లలు అధికంగా చనిపోతున్నారు. యూనిసెఫ్ ప్రకటించిన నివేదికలో 2016లో 652 మంది పిల్లలు మరణించారని తెలిపింది. ఇందులో 255 మంది పిల్లలు పాఠశాలలకు సమీపంలో చోటుచేసుకున్న బాంబు దాడుల్లో చనిపోయారని యూనిసెఫ్ తెలిపింది. అయితే అనధికార లెక్కల ప్రకారం మరణించిన వారి సంఖ్య ఇంకా ఎక్కువే ఉంటుంది. సిరియాలో ప్రస్తుతం 59 లక్షల మంది చిన్నారులు ఉన్నారు. 23 లక్షల మంది చిన్నారులు దేశంలో అంతర్గతంగా వలస వెళ్లారు. ముఖ్యంగా అమెరికా చేస్తున్న వైమానిక దాడుల్లో మృతులు ఎక్కువగా ఉంటున్నారు. మార్చ్ 17న అలెప్పో ప్రావిన్స్‌లో జరిగిన వైమానిక దాడిలో నలభై రెండు మంది మరణించారు. వంద మందికి పైగా గాయపడ్డారు. మసీదు సమీపంలో ప్రార్థనలు చేస్తుండగా వైమానిక దాడి జరిగింది. మార్చ్ 22న ఉత్తర సిరియాలో అమెరికా సంకీర్ణ దళాలు చేసిన మరో వైమానిక దాడిలో 33 మంది మరణించారు.

### యెమెన్‌లో పడవపై దాడి

యెమెన్ తీర ప్రాంతంలో సోమాలియా శరణార్థులు ప్రయాణిస్తున్న పడవపై వైమానిక దాడి జరపడంతో అందులో ప్రయాణిస్తున్న వారిలో ముప్పై మందికి పైగా మరణించారు. యెమెన్ అంతర్యుద్ధంతో అట్టుడికిపోతోంది. ఒకవైపు హుతీ తిరుగుబాటుదారులు, మరోవైపు ఇస్లామిక్ స్టేట్ దళాలు కొన్ని ప్రాంతాలను అదుపులోకి తీసుకొన్నాయి. వీరిని నిర్మూలించడానికి సౌదీ అరేబియా సంకీర్ణ సేనలు వైమానిక దాడులు చేస్తున్నాయి. ఈ నేపథ్యంలోనే మార్చ్ 17న జరిగిన ఈ దాడిలో వలసపోతున్న శరణార్థులపై దాడి జరగడంతో సామాన్య ప్రజలు మరణించారు. చనిపోయిన వారిలో మహిళలు, పిల్లలు ఎక్కువగా ఉన్నారు.

### ట్రంప్ 'అమెరికా హెల్త్‌కేర్' ఉపసంహరణ

'ఒబామా కేర్' స్థానంలో ప్రవేశపెట్టదల్చుకున్న నూతన ఆరోగ్య పాలసీ 'అమెరికా హెల్త్ కేర్ యాక్ట్'ను అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఉపసంహరించుకున్నారు. తన స్వంత పార్టీ సభ్యుల నుంచి మద్దతు లభించకపోవడంతో ప్రతినిధుల సభలో ఓటింగ్‌కు పెట్టలేదు. ఈ అమెరికా హెల్త్ కేర్ ముసాయిదా బిల్లు కోట్లాది అమెరికా ప్రజలను బీమా కవరేజ్ నుంచి దూరం చేస్తుందనీ, లక్షల కోట్ల విలువైన వైద్య వ్యవస్థ కుప్పకూలిపోతుందని ప్రతిపక్ష డెమోక్రాట్ పార్టీ విమర్శించింది. ఈ బిల్లులోని ప్రతిపాదనలు, వృద్ధులు, చిన్నారులు, స్వల్పాదాయ వర్గాలకు అందే 'మెడికెయిర్' కార్యక్రమాన్ని కుదించడం, మెడికల్ బిల్లులు చెల్లించిన వారికి పన్ను తగ్గింపు, హెల్త్ కవరేజ్ పాలసీలను కొనుగోలు చేయనివారిపై పెనాల్టీలు వేయరాదు, వృద్ధుల ప్రీమియం రేట్లను పెంచుకోవడానికి ఇన్సూరెన్స్ కంపెనీలకు అనుమతి, ఎమర్జెన్సీ సేవలు, మెంటల్ హెల్త్, మెటర్నటీ కేర్ వంటి వాటిపై ఇన్సూరెన్స్ కంపెనీలకు అనుకూలమైన నిర్ణయాలు తీసుకోవడానికి అవకాశం ఇస్తుంది. దీనికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున నిరసన రావడంతో ట్రంప్ ఈ బిల్లును ఉపసంహరించుకోవాల్సి వచ్చింది.

### టర్కీలో కుర్దులపై దాడులు

టర్కీలో కుర్దులు నివసిస్తున్న ప్రాంతాలపై టర్కీ సైనిక బలగాలు చేస్తున్న దాడుల వల్ల సామాన్య పౌరులు అధిక సంఖ్యలో మరణిస్తున్నారు. గత 18 నెలల కాలంలో ఇటువంటి దాడిలో రెండు వేలకు పైగా సామాన్య ప్రజలు చనిపోయారని ఐక్యరాజ్య సమితి తన నివేదికలో తెలిపింది. కుర్దిస్తాన్ వర్కర్స్ పార్టీని దెబ్బతీయడానికి టర్కీ సైన్యం దారుణమైన చర్యలకు పాల్పడుతున్నది. ఆగ్నేయ టర్కీలో కుర్దుల ప్రాబల్యమెక్కువ. ఇక్కడ టర్కీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం నడుస్తున్నది. కుర్దులకు ప్రత్యేకంగా ఒక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని వీరు ఉద్యమిస్తున్నారు. ఈ ఉద్యమాన్ని దెబ్బతీయడం కోసం సైన్యం పెద్ద ఎత్తున కిడ్నాపింగ్‌లు, హత్యలు, వేధింపులకు పాల్పడుతున్నది. ఈ చర్యలపై అధ్యక్షుడు ఎర్డోగన్ ఎటువంటి స్పందన చూపకపోవడంతో సైన్యం దుర్మార్గమైన దాడులకు పూనుకుంటోంది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఫిబ్రవరి 1 నుండి ఫిబ్రవరి 28, 2017 వరకు తెలంగాణలోని 9 జిల్లాలు (966), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (737) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1703)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 19 | 21 | 8 | 9 | 5 | 2 | 3 | 2 | 1 | – | 2 | 24 | 35 | – | – | – | 2 | 2 |
| హైదరాబాద్ | – | – | – | 7 | 10 | 8 | 4 | 1 | 1 | – | 2 | 4 | 7 | 1 | 13 | 14 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 4 | – | 11 | 5 | 1 | – | 1 | – | – | 2 | 1 | – | – | 13 | 6 | – | – | – | – | – |
| ఖమ్మం | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | |
| మహబూబ్‌నగర్ | – | 2 | – | 9 | 7 | 3 | 1 | 2 | – | 2 | 5 | 7 | 10 | 6 | 30 | 1 | – | – | – | – | – |
| మెదక్ | 2 | 19 | 3 | 12 | 9 | 25 | 9 | 1 | 32 | 12 | 14 | 4 | 72 | 69 | 119 | 13 | – | – | – | 21 | 2 |
| నల్గొండ | – | 4 | – | 5 | 6 | – | 3 | 1 | – | 1 | – | 1 | 1 | 3 | 21 | 14 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 2 | 1 | 1 | 3 | – | – | 2 | 1 | 1 | 4 | 17 | 8 | – | – | – | – | – |
| వరంగల్ | – | 3 | – | 2 | 6 | 2 | 8 | – | – | 1 | – | 3 | 2 | 3 | 12 | 12 | – | – | – | – | – |
| వికారాబాద్ | – | 2 | – | 1 | 2 | – | 2 | 1 | – | 1 | – | 1 | 1 | 2 | 12 | 6 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **3** | **36** | **3** | **70** | **68** | **48** | **37** | **15** | **35** | **20** | **27** | **23** | **94** | **90** | **261** | **109** | **-** | **-** | **-** | **23** | **4** |
| అనంతపురం | – | 4 | 1 | 16 | 19 | – | 1 | – | – | 1 | 1 | 8 | 8 | 6 | 28 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 3 | 8 | 3 | 5 | – | 1 | 2 | 3 | 3 | 5 | 1 | 27 | – | – | – | – | – | – |
| కడప | – | 1 | – | 2 | 4 | – | – | – | – | – | – | 1 | – | 1 | 20 | 1 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 3 | 3 | 2 | 1 | – | – | 1 | 1 | 6 | – | 1 | 14 | 16 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 2 | 2 | 1 | 3 | – | – | 1 | – | 1 | 2 | 1 | 23 | 7 | – | – | – | – | – |
| కర్నూలు | – | 2 | – | 4 | 2 | 5 | 3 | 6 | 4 | 1 | 2 | 2 | 6 | 5 | 18 | 15 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 1 | 6 | 1 | 14 | 1 | 2 | 4 | 2 | 2 | 2 | 1 | 33 | 23 | – | 1 | – | 1 | – |
| ప్రకాశం | – | 1 | – | 6 | 3 | – | 3 | 2 | 1 | 1 | 2 | 3 | – | 3 | 16 | 7 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 4 | 2 | 3 | 3 | 1 | 2 | 1 | 1 | 1 | – | 1 | 25 | 11 | – | – | – | – | 3 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 5 | 5 | 1 | 6 | – | 1 | 2 | – | 1 | – | 1 | 11 | 9 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 1 | 3 | – | 2 | – | 1 | 4 | – | 3 | – | 2 | 18 | 11 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 5 | – | 6 | 1 | 1 | 5 | 1 | 2 | – | 2 | 9 | 5 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 3 | 7 | – | 2 | – | – | 1 | 1 | 2 | – | 1 | 24 | 14 | – | – | – | 5 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **9** | **1** | **52** | **69** | **16** | **49** | **11** | **13** | **24** | **14** | **35** | **23** | **26** | **266** | **119** | **-** | **1** | **-** | **6** | **3** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం–ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| గుజరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం–1 | విరసం ప్రచురణ | 270 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | రు. 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం–విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

## కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు – రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

## డివిడి

| | | |
|---|---|---|
| వీక్షణం (2003 – 2012) | | 200 |
| సృజన (1966–1992) | | 240 |
| అరుణతార (1970–2013) | | 125 |
| 'ఒయు'ద్ధకాండ | | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 189 - April 2017 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/03/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

## వీక్షణంను గ్రంథాలయాలకు చేర్చండి!
## వీక్షణం పాఠకులను పెంచడానికి తోడ్పడండి!
## వీక్షణం ఆర్థిక పరిపుష్టికి చేయి అందించండి!

నానాటికీ మారుతున్న సామాజిక, రాజకీయార్థిక పరిస్థితులలో వీక్షణం, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వంటి సమాచార వాహికల, చర్చావేదికల అవసరం పెరుగుతున్నది. సమాజంలోని ఆలోచనాపరులందరికీ వీక్షణం అందవలసిన అవసరం రోజురోజుకూ పెరుగుతున్నది. ఈ స్థితిలో వీక్షణం పాఠక లోకంలోకి అంతకంతకూ ఎక్కువమందిని చేర్చే బాధ్యత తీసుకోవలసినది ప్రస్తుత వీక్షణం పాఠకులు, అభిమానులే.

- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరూ మరొకరికి వీక్షణం పరిచయం చేయండి.
- ప్రతి ఒక్కరూ కనీసం ఒక్కరినైనా కొత్త చందాదారుగా చేర్చండి.
- ఒక ప్రతి చాల ఎక్కువమంది చదివే అవకాశం ఉన్న కళాశాలలకు, గ్రంథాలయాలకు వీక్షణం చేరేలా చూడండి.
- తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో ప్రతి జిల్లా లోనూ 50 నుంచి 80 వరకూ జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలున్నాయి. ఒక జిల్లాలోని గ్రంథాలయాలన్నిటికీ కలిపినా సంవత్సర చందా రు. 10,000 – రు. 16,000 ఉంటుంది. ఎవరికి వారు వారి జిల్లాలోని దాతలను సంప్రదించి ఈ మొత్తాన్ని విరాళంగా సేకరించవచ్చు. లేదా నలుగురైదుగురు శ్రేయోభిలాషులు కలిసి ఈ చందా చెల్లించవచ్చు. అలా విరాళం ఇచ్చినవారి కానుకగా ప్రతి నెలా గ్రంథాలయాలకు పత్రిక పంపిస్తాం. గ్రంథాలయాల్లో ఒక మాసపత్రిక ప్రతికి కనీసం 100 మంది పాఠకులు ఉంటారని అంచనా. అంటే మీరు విరాళం ఇచ్చే ఒక్కొక్క చందా వంద మంది వీక్షణం పాఠకులను తయారు చేస్తుంది. ఆ పాఠకులందరూ పత్రిక మీద దాతలుగా మీ పేరు చూసి మీకు కృతజ్ఞతలు చెపుతారు.

**వీక్షణం మీ పత్రిక. వీక్షణం ప్రజల పత్రిక.**
**వీక్షణం మరింతగా ప్రజలకు చేరువ చేసే అవకాశం తీసుకోండి.**
**తద్వారా వీక్షణం ఆర్థిక వనరులు పెరిగేందుకు తోడ్పడండి.**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao